వెలువడినది!    త్వరపడుడు!!    వెలువడినది!!!

# జీవన ప్రభాతము

ఆంధ్ర గ్రంథమాలయందలి పదునైదవ గ్రంథము

అనువాదకులు: శ్రీ పోలవరపు రామబ్రహ్మముగారు B. A., Murugan the Tiller (మురుగన్ ది టిల్లరు) అను పేరను శ్రీ కే. యస్. వెంకటరమణిగారు ఆంగ్లభాషను రచించిన సుప్రసిద్ధనవల కిది యనువాదము. ఇది రమణీయమయిన సాంఘిక నవల. పాశ్చాత్య విద్యావిధానము, పాశ్చాత్య సంస్కారము, పాశ్చాత్యాదర్శములు మొదలగువానివలన గలుగు కష్టములు ఇందు చక్కగ వర్ణితములయినవి. ఆంధ్రవాఙ్మయమున నిట్టి కథావిధానము గల యీ నవల క్రొత్తది. ఆంధ్రులెల్లరు చదువవలసినది. క్రౌను ౪౭౬ పుటలు. వెల రు. ౧—౮—౦ మాత్రము.

తపాలా ఖర్చు ప్రత్యేకము.

త్వరపడుడు!    వెలువడినది    త్వరపడుడు!

# భారతీయ చిత్రకళ

గ్రంథకర్త: తలిశెట్టి రామారావుగారు, బి, ఏ., బి. యల్.

ఇది ఆంధ్ర గ్రంథమాలయందు పదుమూడవ గ్రంథము. ప్రాచీనకాలము నుండి భారతదేశమున చిత్రకళ పొందుచువచ్చిన మార్పులు, అభివృద్ధి మొదలయిన విషయములు, హైందవ చిత్రలేఖనోదయము, బౌద్ధకాలమునాటి చిత్రకళ, అజంత విధానము, బాఘ్‌విహారములందలి చిత్రకళ, మొగలు చిత్రకళావిధానము, రాజపుత్ర-చిత్రములపై ఖరి, నేటిచిత్రములు మొదలయినవానిని గూర్చిన చరిత్రాదులు వివరముగా నీ గ్రంథమున చర్చింపబడినవి. ఆయాకాలపు చిత్రవిధానమును దెలుపు నట్టి త్రివర్ణ ఏకవర్ణచిత్రములు నలువది ఇందు గలవు. చిత్రకారులు, చిత్రకళాజిజ్ఞాసువులు, చిత్రకళాభిమానులు నగు నాంధ్రులెల్లరు తప్పక చదువవలసిన గ్రంథము. వెల రు. ౧-౦-౦.    తపాలా ఖర్చు ప్రత్యేకము

మేనేజరు, ఆంధ్ర గ్రంథమాల,

7, తంబుశెట్టివీధి, మద్రాసు.

# దానిని మీకొరకే వినియోగింపుడు

ఉదారమైన స్త్రీ అభిమానులకు

మీరు నిలువచేయగలిగిన స్త్రీధనము—మీ తండ్రి—సోదరుడు—భర్త—పుత్రుడు—వీరిలో నెవరివద్ద మీ రుంచినను సరే, దానిని మీకొరకే వినియోగింపుడు.



ఆధనముతో నగలుకొని వానిని మీరు ధరింపుడు.

పురుషు లెల్లపుడును......... ఈసంగతి మీకు బాగుగా తెలిసియే యున్నది. కావున మీకు హక్కుగల స్త్రీధనము బాంకిలోను నమ్మకము లేని వాటాలక్రిందను నిలువబడి యుండగూడదు.

ఆధనము యెల్లపుడును మీకంటి యెదుటనే మీ వంటిమీదనే యుండ వీలగునట్లు, దానితో మీ కొరకు సొగసైన నగలను కొనుడు.

మేముతయారుచేయించిన నగల విలువ యెన్నటికిని తగ్గిపోదు. నగలను అందముగా చేయించుటయే ప్రత్యేకాభిమతము. ఈవిషయమున మేము అగ్రగణ్యుల మనిగూడ సవినయముగ తెలుపుచున్నాము.

మీరు మొదట మావద్ద కొనునట్టి అలంకారము మీకు మిక్కిలి సంతృప్తికరముగా నుండుటకే మేము ప్రయత్నించెదము. అటుపిమ్మట మీ రెల్లప్పుడును మావద్దనే కొనుచుందురు. మీ మిత్రులకు గూడ సిఫార్సు చేయుచుందురు.

# మీ జీవితపర్యంతము మీ శిరోజములను కాపాడుకొనుడు

శిరోజములు మిక్కిలి సున్నితమైనవి. వాటిని మీరు సరిగా పోషించిన అది చక్కగా పెరిగి, అందముగా నుండును. లేనిచో వాటిని అలక్ష్యముచేసినట్టి చిహ్నములు ప్రారంభమగును. మీ శిరోజములు యే విషయమునందైనను ఆశాభంగమును గలిగించిన వాటిని భయపరచునట్టి అపాయము లన్నిటినుండి రక్షింపుడు.



## సు సా మ

ప్రాగ్దేశమునందు శిరోజముల నభివృద్ధిపరచునది

కొన్ని యేండ్లనుండి వాటిని లక్ష్యముచేసి యుండకున్నను, లేక సరిగా వాటిని పోషించకయుండినను మీ శిరోజముల కిది తప్పక ఆరోగ్యము నొసగును. గడచిన 50 సంవత్సరములనుండి దేశమంతటను వాడుకలో నున్నది.

ప్రతిచోటను అమ్మబడుచున్నది.

**P. SETT & Co.,**
**Perfumers, Calcutta.**

# లివరు వ్యాధికి అమోఘమైన చికిత్స

మాదిరి ఔషధములు బయలుదేరినవి. మోసపోకుడు.

వీరి ఔషధరాజము అనేకమంది ప్రజలచేతను, గొప్పగొప్ప డాక్టర్లచేతను, ఆమోదింపబడి వేలకువేలు యోగ్యతాపత్రములు పొందియున్నది. గొప్ప గొప్ప డాక్టర్లుకూడ వదలివేసిన లివరు వ్యాధులను వీరు అతి జయప్రదముగా గ్యారంటీగా నివారణచేయుచున్నారు.

ఎప్పటను యీ లివరువ్యాధికి తగిన ఔషధము లేకపోవుటచే వీరి ఔషధముకే అనేకమంది డాక్టర్లు ప్రతిదినము పోస్టుద్వారా తెప్పించుకొనుచు, వారి వారి రోగులకు వాడి వారి సంతృప్తుల దెలిపియున్నారు.

పరా:—మా ఔషధమును చూచి అనేక మాదిరిఔషధములు బయలుదేరినవి, గాన మోసపోకుండగలందులకై ప్రజలను హెచ్చరించుచున్నాము.

☞ అన్నిచోట్లను వీరి ఔషధరాజములనమ్ముటకు పలుకుబడిగల ఏజంట్లు గావలయును. వివరములకు;

విజయనగరవాస్తవ్యులగు;

## డాక్టర్ జమ్మి వెంకట రమణయ్యగారు,

లివరు అండ్ స్ప్లీను వ్యాధులకు ప్రత్యేకవైద్యులు.
8, సాలెవీధి, మైలాపూరు, మదరాసు.

# భారతి

సచిత్ర మాసపత్రిక

సంపాదకుడు

కా. నాగేశ్వరరావు

**M.S.V. GANGARAJU,**
M.A, M. Com, C.A.I.I.B, LL. B.
ADVOCATE
Road. No-5, " SADANAND VIHAR "
GOSANINUAGAOM
BERHAMPUR-760 03, ☎: 214309

సంపుటము ౮. సంచిక ౬.

ఆంధ్రపత్రికా ముద్రాలయము _ మద్రాసు.

౧౯౩౧




శ్రీసూక్తిసుధానిధి—వేంకటపార్వతీశ్వర కవులు ... ... ౬౯౩-౬౯౫

సజ్జనుల కెప్పుడీవియె నైసర్గికములు—పురాణం సూర్యనారాయణతీర్థులుగారు ౬౯౫

నాగశబ్దార్థవిచారము—కొంపెల్ల సుబ్బారాయశాస్త్రి గారు ... ౬౯౬-౭౦౨

భాస్కరా!—పండితారాధ్యుల నాగభూషణముగారు ... ... ౭౦౩-౭౦౪

కతిపయశబ్దార్థశబ్దస్వరూపవిచారము—వేదము వేంకటాచలముగారు ... ౭౦౫-౭౧౭

సముద్రము—మిన్నికంటి గురునాథశర్మగారు ... ... ... ౭౧౭-౭౧౮

ధ్వనికర్త యెవ్వరు?—బులుసు వేంకటరమణయ్యగారు ... ... ౭౧౯-౭౩౦

మాతృవందనము—కల్లూరి వెంకటసుబ్రహ్మణ్యదీక్షితులుగారు ... ౭౩౦

ఇద్దరుకవులు: కృష్ణశాస్త్రి, నాయని సుబ్బారావు—ముద్దుకృష్ణగారు ... ౭౩౧-౭౩౨

విరహగోపి—పాటిబండ మాధవశర్మగారు ... ... ... ౭౩౩-౭౩౬

పెలియాజ్-మెలిజాండాలు—దేశరాజు రామదాసుగారు ... ... ౭౩౭-౭౪౧

వసంతము—పెమ్మరాజు లక్ష్మీపతిగారు ... ... ... ౭౪౨-౭౪౪

బాలానందం:—సూరీ, సీతీ, వెంకీ: పొడుపుముకథలు—చింతా దీక్షితులుగారు ౭౪౫-౭౬౧

నీరాజనము—కొడాలి ఆంజనేయులుగారు ... ... ... ౭౬౧

కన్యాదానఫలం దక్కుతుందా?—అక్కరాజు ఆంజనేయులుగారు ... ౭౬౨-౭౭౦

అశోకుడు: కళింగయుద్ధము—డి. వి. అవధానిగారు ... ... ౭౭౧-౭౭౩

కాసీకత—నండూరి వెంకటసుబ్బారావుగారు ... ... ౭౭౩

ఎవరి దదృష్టం?—బసవరాజు వేంకటరాజ్యలక్ష్మిగారు ... ... ౭౭౪-౭౮౦

చాటువులు—ఆచంట వేంకటరాయసాంఖ్యాయనశర్మగారు... ... ౭౮౧-౭౮౨

పిట్టకథలు: అన్నపాలపక్షి—మాస్టరు అంజి ... ... ౭౮౩

అత్తగారి గంగాప్రవేశం—పాలంకిపాటి లక్ష్మీబాయమ్మగారు ... ౭౮౩-౭౮౪

చెవుడుగోడవ—కనుపర్తి వరలక్ష్మమ్మగారు ... ... ౭౮౫-౭౮౬

పిల్లలపాటలు—గోపరాజు రాజన్నగారు ... ... ... ౭౮౭-౭౮౮

వినోదశిల్పము: చిట్టిలుక—కొ. నరసింహాచారిగారు ... ... ౭౮౯-౭౯౦

పరీక్షలు—భమిడిపాటి కామేశ్వరరావుగారు ... ... ౭౯౧-౭౯౮

జానకీనాథ యేల దర్శనము నీవు?—అధికార్ల సూర్యనారాయణరావుగారు ... ౯౮
త్యాగుడు—పెద్దిభొట్ల వీరయ్యగారు ... ... ... ౯౯-౧౦౨
కపోతదాంపత్యము—శేషాద్రిరమణకవులు ... ... ... ౧౦౩-౧౦౪
ద్వంద్వసంబంధము—విక్రమదేవవర్మగారు ... ... ... ౧౦౪
చిత్రకళ:—కాంచీపుర కైలాసనాథాలయము—క. రామ్మోహనశాస్త్రిగారు ౧౦౫-౧౦౬
పాతపాటలు: చందమామా!—యండమూరి సత్యనారాయణరావుగారు ౧౦౭-౧౦౯
రౌండుటేబిల్ రెండవసమావేశము-హిందూమహమ్మదీయసమస్య—శంకర
వేంకటరావుగారు ... ... ... ... ౧౧౦-౧౧౨
సెలయేటి గీతి—కె. అన్నమరాజశర్మగారు ... ... ... ౧౧౨
ద్రావిడవాఙ్మయము: తిరుపతి వేంకటేశ్వరప్రశంస—అమరవాది
హనుమచ్ఛాస్త్రిగారు ... ... ... ... ౧౧౩-౧౧౬
దైవమహిమ—కీ. శే. వేదము వేంకటరాయశాస్త్రిగారు ... ౧౧౬
కర్షకా—పరుచూరి భువనేశ్వరిగారు ... ... ... ... ౧౨౨ త.
ఉరిశిక్ష పోవలెను—దేశిభట్ల లక్ష్మీనరసింహాంగారు ... ... ౧౧౯-౧౨౧
కరాచీకాంగ్రెసుతీర్మానములు—ప్రతివాదిభయంకరం రంగాచార్యులుగారు ౧౨౩-౧౩౩
సమయరంగము—కాశీభట్ల కృష్ణరాయశాస్త్రిగారు ... ... ౧౩౩
భారతీయమహిళామండలి ... ... ... ... ౧౩౪
కలగూరగంప—కీ. శే. గణేశశంకర విద్యార్థి ... ... ... ౧౩౫-౧౩౬
నాట్యకళ:—శ్రీమతిహాథీసింగునాట్యము; నేటిభారతీయ నాట్యరంగము ౧౩౯-౧౪౦
విరహము—నాదెళ్ల వెంకట్రావుగారు ... ... ... ౧౪౦
విమర్శనము ... ... ... ... ... ౧౪౧-౧౪౯
సాభిప్రాయ విశేషములు ... ... ... ... ౧౫౧-౧౫౬

# చిత్రములు

త్రివర్ణచిత్రములు—ఆదిశంకరులు; గోడమల్లార (రాగిణి)

సాధారణచిత్రములు—కరాచీకాంగ్రెసు దృశ్యములు ౨; గానకళాప్రవీణ మధుశునకము; న్యూయార్కునగరపు సాయంసమయదృశ్యము; జర్మనుదొంగ; నీటిపయి మోటారుకారు నడచుట; ప్రాచ్యనాట్యకళోజ్జీవనము: పి. హాథీసింగునాట్యచిత్రములు ౬; మృచ్ఛకటిక సినిమా చిత్రములు ౩; ఛాయాచిత్రము; చేమకూర సత్యనారాయణగారు; పున్నమచంద్రుడు; కాంచీపుర కైలాసనాథాలయ చిత్రములు ౨; విశాఖపట్టణదృశ్యములు ౩; ఇతరచిత్రములును.

---

---




చెన్నపట్టణము, మే ౧౯౩౧

సంపుటము ౮ ప్రజోత్పత్తి సంవత్సరము వైశాఖమాసము సంఖ్య ౫

# శ్రీసూక్తి సుధానిధి

(శ్రుతివీథి) నిరాశాతరంగము

౧

ఉబుసైన లేదాయె నూరెల్ల నిద్దురమబ్బులోఁ బడి మాటుమణఁగిపోయె
సందడైన లేదాయె జగమెల్లఁ జీఁకటిమూఁతలోఁ బడి ముచ్చుమణిఁగిపోయె
కదలైన లేదాయె నదులెల్ల నిశ్శబ్దవీథిలోఁ బడి వెల్లివిరిసిపోయె
తఱుఁగైన లేదాయెఁ దమియెల్ల నశ్రాంతిసరణిలోఁ బడి పెచ్చుపెఁగిపోయె
ముజ్జగము లిట్టితఱిఁ దనబొజ్జఁ దాల్చి- పాముపైఁ బవ్వళించెనో యేమొ ! స్వామి
లేచి రాఁడాయె; నామొఱాలింపఁడాయె- నేది గతి యింక? నాకుఁ బ్రాపెవ్వ రింక?

౨

కడలినిఁ బూఁడ్చి, భూతలముఁ గప్పి, వియత్తల మాక్రమించి, న
ల్గడలను గ్రమ్మి, భీకరవికారనిశాకృతి నంధకార మా

గడ మొనరించుచుఁ గరకుఁ ఘనగాత్రుఁడు గానఁగ రాఁడు; నీపురుం
గడచని యుంటి వింక ననుఁ గావఁగ దిక్కెవరమ్మ చిత్తమా!

౩

ఎక్కడి కేఁగితో మనస! యిక్కడ రేయి యుగంబు వోలి మి
న్నెక్కి కలంచుచుండె, హృదయేశుఁడు రాఁడు; వియోగవేదనల్
వెక్కస మాయెఁ; బ్రాణములు వీడుద మన్న నుపాయ మేదియుం
జిక్కకపోయెఁ; జింత లెడఁ జేయఁగ నెవ్వరు దిక్కు నాకిఁకన్?

౪

తరుణీలోకవియోగశోకజలధిం దాఁటంగ లే కేము సు
స్థిర తేజోనిధి, లోకబంధుఁ డుదయాద్రిం జేరకున్నాఁడు; సుం
దరబింబాధరుఁ డబ్జనేత్రుఁడు, జగన్నాథుండు నాస్వామి యుర్
గరుణం జూడఁగ రాఁడు నేఁడు బ్రదుకంగా శక్యమే నాకిఁకన్.

౫

చెలులును బంధులుర్ విరతిఁ జెందని యీ నడురేయి నావెతల్
దెలియక నిద్రలో మునిఁగి తేలుచు నుండిరి; నీలవర్ణుఁడో
తెలిసియు రాకపోయె; నిటఁ దెంపరినై మరణింత మన్న నా
కలుషపుఁబేరు ధాత్రిఁ గలకాలము నిల్చునె కాని మాయునే?

౬

వెనుకను నిల్చి చిత్తమును వేఁచుచు నున్నది యాస దోసమై;
మునుమునఁ జేరి కన్నులను మూయుచు నున్నది రేయి మాయిదై;
తన సిరిసొంపుఁ జూచుకొని దర్శన మీయఁడు చక్రి వక్రియై;
ననుఁ గరుణింతు రెవ్వ రిఁక? నా కెవ రూఱటఁ గూర్చువా రిఁకన్?

౭

చినుకులతోడ మబ్బుఁ జెనుచీఁకటితోడఁ గరాళరాత్రియుర్
బెనుపడి నన్నుఁ బెన్వెతలఁ బెట్టుచు నుండ జగత్ప్రభుండు నా
యునికిఁ దలంచెనో తలఁపఁడో? దయసేయకపోయెఁ; బాదదా
సిని గరుణించుటే భరమొ? శ్రీపతి కో సురలార! చెప్పరే!

౮

యుగమయిపోయి రేయి నను నొంచుచు నున్నది; శీతవాత మా
శుగ మయిపోయి నాతనువు సోలుచు నున్నది; యార్తిఁ బిల్చుటే
యగ మయిపోయె నేమొ! యభయం బిడ రాఁడు రథాంగపాణి నే
నగ మయిపోయితిన్ విరహసాగర మిం కెటు లీఁద నేర్తునో?

౯

ముసురులఁ దోఁగి చీఁకటుల మూఁగి నిశీథిని దావకీలల
న్విసరుచు నేఁచుచున్నయది; నింగి వెలుంగు మెఱుంగుఁదేరు తోల్
దెసఁ బొడసూప కున్నయది; దీనశరణ్యుఁడు రాఁడు ప్రోవఁగా;
నుసురుచు నిల్వ నీ రగుచు నుండుటయే బ్రదుకయ్యె నాకిఁకన్.

౧౦

పిలిచినపాటునన్ నిలువు నీరగు నగ్గనలేక చింతచేఁ
గలఁచినపాటునన్ ముసురు కంటఁ గరంగెడు నీనిశీథినిం
దలఁచినపాటునన్ విభుఁడు తప్పక వచ్చునొ రాఁడొ తెల్పకే
మలఁచినపాటునన్ నిదుర మైకొనె లోక మిఁ కేమి సేయుదున్.

---

# సజ్జనుల కెప్పు డివియె నైసర్గికములు

పురాణం సూర్యనారాయణతీర్థులుగారు

శ్రమకుఁ గష్టమ్మంచుఁ దలపోయ కేవేళఁ బరులతుష్టికిఁ బాటుపడుట యొకటి
పాపమ్ము పాటిల్లుపనులపట్టునఁ బోలె నాత్మస్తుతికి సిగ్గు నందు టొకటి
చదువు కులమ్ము రో మొదలైనవానిచేఁ గ్రమముగా నణఁకువ గాంచు టొకటి
పరుల దోషంబులపట్లఁ జూడంబోక యెంచి మంచియె స్వీకరించు టొకటి
సజ్జనుల కెప్పు డివియె నైసర్గికంబు-లివ్వియే కావు సుమ యింక నెన్నియేని
మంచిగుణములు గలవు వీక్షించు వారి-యంతరంగంబు మంచిదై యమరెనేని.

---

వాగర్థా విచ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే,
జగతః పితరౌ వన్దే పార్వతీపరమేశ్వరౌ.
—రఘువంశము.

కాళిదాస మహాకవి ప్రణీత మగు నభిజ్ఞానశాకున్తల నాటకము ద్వితీయాంకమున, మూలము—

"సేనాపతిః—(రాజాన మవలోక్య) దృష్టదోషాపి స్వామిని మృగయా కేవలం గుణాయైవ సంవృత్తా; తథాహి; దేవః,
అనవరతధనుర్జ్యాస్ఫాలన క్రూరపూర్వం
రవికిరణసహిష్ణు స్వేదలేశై రభిన్నమ్;
అపచితమపి గాత్రం వ్యాయతత్వా దలక్ష్యం
గిరిచరఇవ నాగః ప్రాణసారం బిభర్తి."

అని యున్నది. ఈ నాటక ప్రత్యంతరములయందు సేనాపతివాక్యమున నించించుక పాఠభేదము లున్నను "అనవరతే"త్యాదిపద్య మేకపాఠముగనే కనఁబడుచున్నది. ఇట "దేవః గాత్రం బిభర్తి" అని వాక్యప్రయోగము. ఇందలి "గాత్రమ్" అనుదానికి "అనవరత ధనుర్జ్యాస్ఫాలన క్రూరపూర్వమ్" ఇత్యాదులు విశేషణములు. "గిరిచర ఇవ నాగః" అనునది యుపమానము. ఇందలి నాగశబ్దమున కర్థము గజమా? సర్పవిశేషమా? అనునది ప్రస్తుత విచారణీయాంశము.

ఈనాటకమున కనేకవ్యాఖ్యానములును, భాషాంతరీకృతములునుఁ గలవు. అందు సంస్కృతవ్యాఖ్యానములలో—

(౧) అర్థద్యోతనికా వ్యాఖ్య యందు రాఘవభట్టు "గిరిచరః పర్వతచరో, నాగో హస్తీవ, దేవో రాజా" ఇత్యాదికము వ్రాసినాఁడు. మఱియు "హస్తిగాత్రపక్షేపి విశేషణాని యోజ్యాని. అనవరతం, ధనుర్జ్యాయాం ప్రియాలద్రుమభూమౌ, య దాస్ఫాలన మర్థాత్ ప్రియాలద్రుమాణామేవ తేన కఠిన పూర్వభాగమ్; 'ధను స్సంజ్ఞా ప్రియాలద్రౌ రాశిభేదే శరాసనే' ఇతి విశ్వః; 'జ్యా మౌర్వీ చ వసుంధరా' ఇతి ధరణిః; అన్యాని విశేషణాని స్పష్టాని" అని వ్రాసి గాత్ర విశేషణములను హస్తిపక్షమునఁ గూడ సమర్థింపఁ జూచినాఁడు. "పరికరాలంకారః శ్లేష ఉపమాచ" అనికూడ వ్రాసినాఁడు.

(౨) జీవానంద విద్యాసాగర భట్టాచార్యుఁడు రచించిన వ్యాఖ్యం జూడఁ గొంచెము మార్పుల నొందిన యర్థద్యోతనికా ప్రతిరూపమనఁదగి యున్నది. ఈతఁడు రాఘవభట్ట మార్గమునే యనుగమించెను.

(౩) శంకరపండిత కృత వ్యాఖ్యానము జీవానంద వ్యాఖ్యాన ప్రతిబింబమే యనవచ్చును.

(౪) వైఖానస కులతిలక శ్రీనివాసాచార్యుఁడు తనవ్యాఖ్యయం దీపట్టున నుపమేయదుష్యంత పక్షమున విస్తరించి వ్రాసియు నుప

మానపత్రమున "గిరిచర ఇవ నాగః" అను దానికి వ్యాఖ్య వ్రాయవలసి వచ్చినప్పుడు "నాగో గజః" అనిమాత్రమే వ్రాసినాఁడు.

(౯) నిశ్శంకమృత్యుంజయ భూపాల విరచితవ్యాఖ్య యించుమించుగా వైఖానసవ్యాఖ్య ననుగమించుచున్నది.

ఇఁక నాంధ్రీకరించిన కవులలో "గిరిచర ఇవ నాగః" అనుదానికి—

(౧) శ్రీమతి విద్వత్కవితిలక కాంచనపల్లి కనకాంబగారు "కొండయేన్గువలె" అనియును,

(౨) కళాప్రపూర్ణ మహోపధ్యాయ వేదం వేంకటరాయశాస్త్రి గారు "ఉరుగిరి భ్రామ్యన్మదేభాకృతిన్" అనియును,

(౩) నిడమర్తి జలదుర్గాప్రసాదరాయఁడుగారు "అద్రిసంచరన్మనోహర సామజంబు వోలె" అనియును,

(౪) పండిత దాసు శ్రీరాములు గారు "మలల్ పొడిచెడిహస్తి నాన్" అనియును,

(౫) రాజా మంత్రిప్రెగడ భుజంగరావు బహదూర్ జమీందారుగారు "మహీధర సంచరత్కరీంద్రునిబలె" ననియును,

(౬) చెన్నపురీ క్రైస్తవ సర్వకళాశాలాంధ్ర పండితులగు రాయదుర్గం నరసయ్యశాస్త్రులుగారు "మహాద్రిఁ జరించెడి హస్తి చాడ్పునన్" అనియును,

(౭) రావుబహద్దూర్ కందుకూరి వీరేశలింగము పంతులుగారు "శైలచరద్ద్విపంబనన్" అనియును,

(౮) కవిశేఖర వడ్డాది సుబ్బారాయఁడుగారు "అచలప్రచర ద్విపాకృతిన్" అనియును నాంధ్రీకరించిరి.

మఱియు నింగ్లీషున యమ్. ఆర్. కేలే, బి. యే. ప్రభృతులును నాగశబ్దమునకు నేనుఁగనియే యర్థము వ్రాసిరి.

ఇట్లు నాకుఁ దెలిసినంతవఱకు నందఱును నేనుఁగనియే చెప్పుచున్నారు. నేనును గొంతకాలమువఱకు నవిమర్శముగా నట్లే యనుకొనుచుంటిని. నాకు గంజాం విశాఖపట్టణ మండలములలోఁ బరంపరగా బంధువులును బరిచితులునుఁ గలరు. మాకుటుంబమునకు విశాఖపట్టణ మండలమున నొక యగ్రహారముకూడఁ గలదు. అందువలన నాప్రాంతములకు నేను చిరకాలమునుండి తఱచుగా వెడలి యచ్చట సామాన్యముగా నందఱితోడనుఁ గలసి ముచ్చటించుచుఁ గాలక్షేపముఁ జేయుచు వచ్చుటయుం గలదు. వనగిరిప్రాయములగు జయపురాది ప్రదేశముల కేఁగి వీక్షించుచు వచ్చితిని. మన మిచ్చట "త్రాఁచుపాములు" అని వాడెడు సర్పముల నాప్రాంతములందు "నాగుఁబాములు" అని వాడుదురు. అక్కడ గోష్ఠులలో నీనాగుఁబాముల ప్రసంగము వచ్చినప్పుడచ్చటివారు "నాగజాతు లనేకములు కలవు. వెల్లడి భూమియం

దుండెడు సామాన్యజాతులకంటె నటవీప్రదేశమం దెక్కువ విశేషజాతు లుండును. అన్నిటికంటెనుఁ గొండలయందు మిక్కిలి తీవ్రములగు నాగజాతులు కలవు. వానిలో 'గిరినాగు' అను నొక సర్పజాతి కలదు. అది మిక్కిలి సన్నముగను, దీర్ఘముగను నుండును. అది యెక్కువ బలశౌర్యములు కలిగి మిక్కిలి తీవ్రముగాఁ బోవుచుండును. అది పరుగెత్తునపుడుఁగూడఁ బడగ యెత్తి యిటు నటు విసరుచు నెగిరి యెగిరి పడుచునే పోవును. దాని కలజడి కలిగెనేని నిలువెత్తుకంటెఁ బయికి లేచును. అది తఱచుగా నడునెత్తినే కఱచును. దానివిష మతితీవ్ర మైనది. అది కఱచినయెడఁ దత్క్షణముననే మృతి నొందుదురు కాని మంత్రౌషధాదు లేమియుఁ బని చేయవు. అది యెవ్వరికినిఁ బట్టుటకుఁ గాని, కొట్టుటకుఁ గాని శక్యము కాదు. అది సామాన్యముగాఁ గనఁబడుటయే యరుదు. కనఁబడఁగానే మెఱపుఁదీఁగవలె నెగిరిపోయి యంతర్ధాన మగును. అది యెట్లు పోయినదియుఁ గనిపట్టుటకూడ దుర్లభము." అని యి ట్లత్యద్భుతముగాఁ జెప్పుచువచ్చిరి. ఇ ట్లనేకులవలనఁ బలుమాఱు వినియున్నాను. కాని నే నెన్నఁడునుఁ జూచి యుండలేదు. అయినను నీయైతిహ్య మచ్చట సార్వజనీన మగుటవలన నేనది కేవలకల్పిత మని యనుకొనఁజాలను. అదియునుం గాక, కవు లైతిహ్యముల నంగీకరించువారే కదా?

ఇట్లు కొంతకాల మరిగినపిమ్మట నొక సమయమున శాకుంతలము పాఠము చెప్పనప్పుడు "గిరిచర ఇవ నాగః" అని చదువుచుండఁగా శబ్దసామ్యమువలన నసకృచ్ఛ్రుత పూర్వమగు నాగిరినాగవృత్తాంతము స్మృతిగోచర మైనది. అప్పు డిందలి నాగశబ్దమున కర్థ మీసర్పవిశేషము కాదు కదా? యని సందేహము పొడమి విచారింప నారంభించితిని. ఈపద్యమందలి "అపచిత మపి గాత్రం వ్యాయతత్వా దలక్ష్యం గిరిచర ఇవనాగః ప్రాణసారం బిభర్తి" అనునుత్తరార్థముం జూడ లోకజ్ఞ శిఖామణి యగు కాళిదాసు గిరినాగు నుపమించు నాశయముతోడనే యిట్లు ప్రయోగించి యుండవచ్చు నని యాసందేహము ప్రబల మయినది. క్రమక్రమముగా విచారించిన కొలఁదిఁ బ్రబలతరమగుచు వచ్చినది. ఏ మనిన—నాగశబ్దము గజమునకును, సర్పమునకునుఁగూడ వాచకమై యున్నను, సర్ప మనునర్థమందు విశేషరూఢ మగుటవలన నాశబ్దము వినినతోడనే సర్పమనునర్థము మొట్టమొదట స్ఫురింపక మానదు. అది కానిచో గజ మనునర్థముఁ గాని, పర్వత మనునర్థముఁ గాని, మఱియొకయర్థముఁ గాని గ్రహింపవలసి యుండును. లోకవ్యవహారమందు నాగులు, నాగకన్యలు, నాగలోకము, నాగచతుర్థి, నాగులచవితి, నాగపంచమి, నాగబంధము, నాగాస్త్రము, నాగాంతకుఁడు, నాగభూషణుఁడు, నాగయజ్ఞోపవీతి, నాగరాజు, నాగేంద్రుఁడు, నాగానందము, నాగాభరణము, నాగపూద

ఇత్యాదిపదము లనేకములు వాడుకలో నున్నవి. వానియందలి నాగశబ్దము సర్పపర మగునర్థమునే చెప్పును గాని గజాదిపర మగు నర్థమునుఁ జెప్పుటలేదు. ఇంత విస్తారముగా గజాదిపర మగునర్థమును జెప్పు నాగశబ్దముతోఁ గూడినపదములు వాడుకలో లేవు. అందును నాగశబ్ద ముత్తమజాతి సర్పవాచకము. కావుననే అమరసింహుఁడు నామలింగానుశాసనమున భోగివర్గమును "నాగాః కాద్రవేయాః" అని యారంభించినాఁడు. కద్రూసంతతి సర్పములు నాగశబ్దవాచ్యములని చెప్పి పిమ్మట, "తదీశ్వర శ్శేషో ఽనంతః"— అనంతుఁ డనునామాంతరము గల శేషుఁడు నాగాధీశ్వరుఁ డని చెప్పినాఁడు. భగవద్గీతా విభూతి యోగాధ్యాయమున "అనంత శ్చాస్మి నాగానామ్" అని యున్నది. మంత్రశాస్త్రమందును దక్షిణ సర్పజాతులకంటె నాగజాతి యగ్రగణ్యముగాఁ జెప్పఁబడినది. చరకాది వైద్యశాస్త్రములయందు విషప్రకరణమున దర్వీకరాది సర్పభేదములును, దత్తద్విషావస్థా చికిత్సాదులును వ్రాయఁబడినవి. అందసంకీర్ణ సర్పజాతుల విషప్రభావాదు లుత్కృష్టములుగను, సంకీర్ణ సర్పజాతుల విషప్రభావాదులు నికృష్టములుగను వ్రాయఁబడినవి. జాతిసాంకర్యము వలన నుత్కృష్ట జాతుల గుణస్వభావాదులు నికృష్టము లగుచుండుట లోకమున మన కనుభవసిద్ధమే కదా? కాద్రవేయులలో నెనమండ్రు నాగులు సుప్రసిద్ధులు: శేషుఁడు, వాసుకి, తక్షకుఁడు, శంఖపాలుఁడు, కుళికుఁడు, పద్ముఁడు, మహాపద్ముఁడు, కర్కోటకుఁడు నని. వీనినే అష్టనాగము లందురు. వీని సంతతియే నాగజాతి. పిమ్మటం గ్రమక్రమముగా సంకీర్ణసంకర సర్పజాతు లనేకములు బయలుదేఱినవి. వాని నటుండనిండు. ఈ గిరినాగము అసంకీర్ణ పరిశుద్ధ నాగజాతిలోనిదై యుండవచ్చును. దీనినే కవి యుపమానముగా గ్రహించి యుండవచ్చును. ఆ జయపురాది ప్రాంతములయందు దురుసువానిని "గిరినాగువలె నెగిరిపడుచున్నాఁడు" అందురు. ఈగోదావరీ ప్రాంతమున గిరినాగను వాడుక యంతగా లేదు కాని "మిన్నాగులవలె మిడిసి పడుచున్నాఁడు" అనుట కలదు. ఈ గిరినాగునే మిన్నాగు లందురేమో? శబ్దరత్నాకరమున, "మిడినాగు=ఎగిరి యెగిరిపడు సర్పవిశేషము" అని యున్నది ఈ "మిడినాగు" వాడుకలో "మిన్నాగులు" కావచ్చును. కావున నిం నాగశబ్దము సర్పవిశేషపర మగుటయే యుచితమని తోఁచుచున్నది. 'పోనిండు! ఇచ్చట గజపర మగునర్థము కాక సర్పపర మగునర్థమే కాళిదాసోద్దిష్ట మని యంగీకరించునప్పుడు గిరినాగశబ్దమున కర్థవిచారము చేయునెడ నింత శ్రమ చేయ నేల? గిరి=కొండ, నాగము=చిలువ. కావున గిరినాగ మనఁగాఁ గొండ చిలువ యని వాడుకలో నున్న పదమే స్వీకరింపరాదా?' యనిన, శబ్దస్వరూపముంబట్టి స్వీకరింపవచ్చును గాని యాంధ్రమున వాడుకలో నున్న "కొండచిలువ" అనుపదము "అజగరము" అను సర్పజాతి విశేషమందు రూఢ

మయి యున్నది. అయ్యాజగరము పెద్దశరీరము కలదియు, మందస్వభావము గలదియుఁగాఁ దోఁచుచున్నది. లోకమున మందుని నజగరముతోఁ బోల్చుచుందురు. ఇచ్చట శరీర లాఘవము, జాగరూకత మొదలగుగుణములు గలదానినే యుపమానముగాఁ జెప్పుట యుచితమని తోఁచుచున్నది. విశేషజ్ఞులు నిర్ణయింతురు గాక.

మఱియు నీ "నాగః" అనుదానికి "గిరిచరః" అని యొక విశేషణము కలదు. ఇది యేనుఁగునకును, సర్పవిశేషమునకునుఁ గూడ సామాన్యముగాఁ జెప్పవచ్చును. కాని యేనుఁగునకు గిరిచరత్వము నిత్యము కాదు. ఇది వృక్షభక్షక మగుటచే దీనికి వనచరత్వము నిత్యము. వనప్రియత్వము వలననే గిరిచరత్వముఁగూడఁ గలుగును. వనశూన్యగిరిచరత్వము గజమున కసంభవము. వనగజము, అడవియేనుఁగు అనుట కలదు కాని గిరిగజము, కొండయేనుఁగు అనుట నే నెన్నఁడును వినియుండలేదు. నాగజాతి సర్పవిశేష మట్లు కాదు. దానికి గిరిచరత్వము నిత్యము. నిర్జనప్రదేశ మైనచో వనమందును సంచరించుఁ గాక. దానికిఁ గేవలవనముతోఁ బ్రయోజనము లేదు. స్వభావముచేఁ బవనాశనము కావున నది గిరిచరము. అందువలననే దానికి గిరినాగ మను పేరు వచ్చినది. కావున నీవిశేషణము గిరినాగునకే యుచిత మని చెప్పవచ్చును.

ఇఁక గాత్రవిశేషణము లేపక్షమున కనుకూలములో చూడుఁడు.——

(౧) "ప్రాణసారమ్" అనుదానికి రాజగజపక్షములు రెండిటియందును రాఘవభట్టు "ప్రాణో బలమేవ, సారః స్థిరాంశో, యత్ర తత్; 'ప్రాణో ఽనిలే బలే' ఇతి హైమః; 'సారో బలే స్థిరాంశేచ' ఇత్యమరః" అని వ్యాఖ్యానము వ్రాసినాఁడు. జీవానంద విద్యాసాగరుఁడును దీనినే యనువదించినాఁడు. అట్లు కాక ఉపమానపక్షమున గిరినాగు వాయుభక్షక మగుటవలన "ప్రాణః అనిల ఏవ, సారో బలం, యత్ర తత్." అని చెప్పిన నుచితతరముగ నుండును.

(౨) "అపచిత మపి వ్యాయతత్వా దలక్ష్యమ్" అనుదానికి రాఘవభట్టు "అపచితం కృశమపి, వ్యాయతత్వా త్ప్రికాండత్వా దలక్ష్యం కృశత్వేన న లక్ష్యత ఇత్యర్థః; అనేన మహాపురుషచిహ్నం సాల్ప్రాంశుత్వాద; హస్తిగాత్రపక్షేఽపి విశేషణాని యోజ్యాని" అనియును, జీవానంద విద్యాసాగర భట్టాచార్యుఁడు "అపచితమపి కృశమపి, వ్యాయతత్వా దీర్ఘత్వాత్, అలక్ష్యం కృశత్వే నావిర్భావ్యం; హస్తిగాత్రపక్షేఽప్యేతాని విశేషణాని సమానార్థకాని" అనియును వ్యాఖ్యానము లొనరించిరి. కాని యివి సందర్భశూన్యములుగాఁ గనఁబడుచున్నవి. స్వభావముచేఁ గుఱుచగా నుండు గజగాత్రమందు దీర్ఘత్వమును, దీర్ఘగాత్రమునఁ గృశత్వము గనఁబడకుండుటయు ననుభవ విరుద్ధములు. గజగాత్రమున నపచితత్వము సందర్భశూన్యము. "గిరిచరపదేన స్వాతంత్ర్యం సూచితం" అని రాఘవభట్ట

వ్యాఖ్యానమున నున్నది. స్వేచ్ఛగా సంచరించు నేనుఁగు కృశించుటకు హేతువు లేదు. ఆహారాదులు చాలక కృశించె నందురా? అట్టియెడ నాపర్వతము నాశ్రయించి యుండవలె ననునిర్బంధ మాయేనుఁగునకు లేదు. కృశించుటకుఁ దగినశ్రమ కలిగిన దందురా? అట్టిశ్రమకు సహించి యచ్చటనే యెట్లుండును? దానికి నేవ్యసనమును లేదు కదా? ఎచ్చట నశ్రమ నుగసుఖము గలుగునో అట్టి యేదట్టమగు నట్టడవికైనం బోవును. నిర్యంత్రితమగు నేనుఁగు కృశించుట యసంభవము. కృశించినయెడ మఱియంత బడుగుగాఁ గనఁబడును. అంతియ కాని కార్శ్యము గానరాకుండు టెట్లు? శ్రీనివాసవ్యాఖ్యయందు "అపచితమపి కృశమపి, వ్యాయతత్వా ద్దృఢత్వాత్; 'వ్యాయతో దీర్ఘదృఢయో' రితి వైజయంతీ; అలత్యంలఘు" అని యున్నది. కావున గిరినాగపక్షమందు కృశ మైనను (లేక కృశ మగుటయే కాక), దీర్ఘమును, దృఢము నగుటవలన లఘువై నది అనఁగా నుత్పతనాదియోగ్య మైనది. అని చెప్పవచ్చును. ఎట్లయినను నీవిశేషణము గిరినాగపక్షమున నిరాక్షేపము.

(౩) "అనవరత ధనుర్జ్యాస్ఫాలనక్రూరపూర్వమ్" అనువిశేషణమునకు రాఘవభట్టాదివ్యాఖ్యాతలు ధనుఃపదము ప్రియాలద్రుమమందు వర్తించు నను నిఘంటుమాత్రము నాధారముగాఁ జేసికొని యట నిరర్థకముగాఁ జేరియున్న జ్యాశబ్దమున కెట్లో సమాధానపడి గజపరముగా నర్థమును వ్రాసిరి. కాని ప్రియాలద్రుమ విశేషమునకును, గజమునకును సంబంధము కానరాదు. ఈప్రియాళువు సుకుమారమగు పూలచెట్టు గాని, గజాస్ఫాలనార్హము కాదు. కావుననే వసుచరిత్రములో "పికగీతి పాడి చూపె ప్రియాళులత" అని రామరాజభూషణుఁడు వ్రాసి యున్నాఁడు. పుష్పవృక్షదోహదములలో "గీత్యా ప్రియాళుః" అని ప్రేంకణమునకు గానము దోహదమని కవిసమయము. కవిసమయములఁ గవులు మన్నింపకపోరు. ఈమొరటచెట్టు కుంజరాశనమగు నశ్వత్థమును గాదు; గజభక్ష్య యగు సల్లకియునుఁ గాదు. ఈమోరటి నిట నేల చెప్పవలయునో తెలియుటలేదు. ఉద్యానవనమం దుండఁదగిన యీప్రేంకణమును దమ యిచ్ఛవచ్చిన ట్లేనుఁగుతోఁ గూడఁ గొండ యెక్కించిరి. గిరినాగ పక్షముగా నర్థముఁ జేయునెడ "ధనుః" పదమునకు ధనురాకారమని కాని, ధనుఃప్రమాణమని కాని యర్థముఁ జేసినచో స్వభావసిద్ధమగువిశేషణ మగును. లేదా, ధనుఃపదమునకు మోరటి యర్థ మనుకొనినను నది పుష్పవృక్ష మగుటవలన గిరినాగపక్షమం దనౌచిత్యము లేదు సరియే కదా, భూమ్యాస్ఫాలనము గిరినాగమునకు స్వభావసిద్ధ మగుటవలన జ్యాశబ్దార్థము నపలపింప నవసరము లేదు. కావున నీవిశేషణంబును గిరినాగపక్షమునకే సరళముగా నర్థమగుచున్నది.

(౮) "రవికిరణసహిష్ణు" అను విశేషణమునకు (సహిష్ణు, సోఢుం శీల మస్య, సహనశీలమ్; 'అలంకృఞ్ నిరాకృఞ్ ప్రజనోత్పచోత్పతోన్మదరుచ్యప త్రపవృతువృధుసహాచర ఇష్ణుచ్.' పాణి. అ. ౩, పా. ౨, సూ. ౧౩౬) సూర్యకిరణములను సహించుస్వభావము కలది యని యర్థము కావున నీవిశేషణము గజగాత్రమునకు విరుద్ధము. గజమహిష వరాహాదు లెప్పుడును స్వభావముచేత నెండ నెంతమాత్రమును సహింపఁజాలవు. కావున నే యివి తఱచుగా జలాశయములం బ్రవేశింప నుత్సహించుచుండును. సర్ప మట్లు కాదు. కావున నిదియును గిరినాగగాత్రమునకే యుచితము.

(౯) "స్వేద లేశై రభిన్నమ్" అను విశేషణమును నట్లే గిరినాగపక్షమునకే యనుకూలము.

కావున నిట నాగశబ్దమునకు గజ మని యర్థము చేయుట తగదు. ఇదియునుం గాక,

"శ్లో. స్వతస్సిద్ధేన భిన్నేన
సమ్మతేనచ ధర్మతః,
సామ్య మన్యేన వర్ణ్యస్య
వాచ్యం చే దేకధోపమా."

అనునది యుపమాలంకార లక్షణముకదా? ఇప్పు డిచ్చట నాగశబ్దమునకు గజ మని యర్థము చెప్పు నెడ నియ్యుపమానము స్వతస్సిద్ధమా? కవిసమ్మతమా? అను సంశయము పొడముచున్నయది. "ఉపమా కాళిదాసస్య" అని పెద్దపేరు పొందిన మహాకవి కాళిదాసుఁ డప్రసిద్ధము నుపమానముగా నంగీకరించునా? దీని కెందైనఁ బ్రసిద్ధి కలదా? కావున సర్వజ్ఞుఁడగు కాళిదాసు "గిరినాగు" అను సర్పవిశేషమునే యుపమానముగా హృదయమందుంచుకొని యిట్లు "గిరిచర ఇవ నాగః" అని ప్రయోగించె నని నేను విశ్వసించుచున్నాఁడను. సహృదయులగు పాఠక మహాశయులు విమర్శింతురుగాక.

కాళిదాసగిరాం సారం
కాళిదాస స్సరస్వతీ,
చతుర్ముఖోఽథవా సాక్షా
ద్విదు ర్నాన్యేతు మాదృశాః.

—సంజీవని.

# కరాచి కాంగ్రెసు దృశ్యములు



౧. మహాత్ము డుపన్యసించుట. శబ్దాతిశయీకరణయంత్రము ముందు గలదు




౨. విడిదిలో మహాత్ముడు, మిత్రులు




3. జాతీయపతాకోత్సవము కాంగ్రెసుమహాసభాధ్యక్షులు జరుపుట

పండితారాధ్యుల నాగభూషణముగారు

శ్రీకమలావిభుండు సరసీజభవుండు, భవుండు మువ్వురున్
నీకమనీయరూపమున నిల్తురటంచుఁ ద్రికాలముల్ బుధా
నీకము చెప్పుచుండు నిఁక నిన్ను భజించిన సర్వదేవతా
లోకనమస్క్రియాఫలములున్ సమకూరునుగాదె భాస్కరా!

నీ వుదయాచలేంద్రమున నిల్వఁగఁ దెల్వి గనున్ సమస్తజీ
వావళి, నీవు పశ్చిమదిశావనిభృత్తటి విశ్రమించినన్
జేవ దొఱంగి డీల్పడు నశేషజగంబు సుషుప్తిమగ్నమై
నీవకదయ్య కారణము నిల్వ జగం బఖిలంబు భాస్కరా!

నీమముతోడ జన్మము లనేక మొనర్చిన వైదికుల్ సమి
ద్భూమిఁ బరాక్రమం బెసఁగఁ బోరి గతాసువులైనవారు స్వ
ర్ధామముఁ జేరునట్టి సుకరంబగుమార్గము నీవ కావె! దే
వా! మహితప్రభావ; వృజినాంధతమోవనదావ; భాస్కరా!

ఊరులు లేవు సారథికి, నొక్కటె చక్రము, బేసి సంఖ్య దై
వారఁ దురంగముల్, ఫణులు పగ్గము లిట్టిరథంబుపై నిరా
ధారపథంబునందుఁ గడుదవ్వులఁ బైన మొనర్చుచుండు వె
వ్వారు గణింపనేర్తురు భవన్మహిమాతిశయంబు భాస్కరా!

వెలుఁగులపుట్టినిల్లు వినువీథికి రత్నవిభూషణం బహం
బుల మొలపించుపాదు జగము న్వెలిఁగించెడిదివ్వె పద్మినీ
లలనతపఃఫలంబు లిరుల న్విదళించుకుఠార మాత్తపు
ణ్యులు దివికేగుత్రోవ భవదుజ్జ్వలమూర్తి తలంప భాస్కరా!

పవలును, రేయి, వారములు పక్షములున్ నెలలున్ సమంబులున్
భువి భవదీయయానగతిఁ బుట్టినమార్పులు లోకయాత్రకుం
బ్రవిమల సాధనంబులు నపార సుఖావహముల్ సమస్తధ
ర్మవిధివిధాప్రబోధనకరంబు లహీనమహస్క! భాస్కరా!

పాఁడియుఁ బంట గల్గి నిరపాయగతిం జగమెల్ల నిల్వఁగా
వేఁడిమియున్ బలంబులును వెల్గును గారణము ల్దలంప నీ
మూఁడును మాకు నీవలనఁ బుట్టు నిఁక న్నినుఁ బోలు దైవమె
వ్వాఁడు గలాఁడు? నిర్భరకృపాపరిపాలితలోక! భాస్కరా!

ఉప్పరవీథియందు జలదోత్కరముల్ గలయంగఁ బర్వి ని
న్గప్పిన నెన్నఁడేని భువనంబున కయ్యది దుర్దినంబుగాఁ
జెప్పఁబడుం జరాచరవిశిష్టజగం బఖిలంబు దెల్వికిం
దప్పును లోకబాంధవఘనప్రథ నీక పొసంగు భాస్కరా!

నీమముతోడ నీయెదుట నిల్చి నమస్కృతు లాచరించినన్
నీ మహనీయ మంత్రమును నిశ్చలభక్తి జపించినన్ సమ
స్తామయము ల్దొలంగు వృజినౌఘ మడంగుఁ బొసంగు సుస్థిర
క్షేమ సుఖాయురున్నతులుఁ, జేకురు ముక్తిపదంబు భాస్కరా!

దురితవనీదవానలము, దుర్భరదుఃఖనివారకంబు; దు
స్తరభవసాగరోత్తరణసాధన మాశ్రితసాధుభక్త ని
ర్జరధరణీరుహంబు సురసంస్తవనీయము మోక్షదాయకం
బరయ భవన్మహామను వహర్నిశమున్ జపియింతు భాస్కరా!

పావనవేదగాత్ర! యఘభారవనీదవవీతిహోత్ర! ఛా
యావనితాకళత్ర! ప్రబలాంధతమఃప్రతతీలవిత్ర రా!
జీవభవాండనేత్ర! సరసీరుహమిత్ర! సమస్తదేవసం
భావితసచ్చరిత్ర! వినమద్విపదస్త్రితనుత్ర! భాస్కరా!

మున్నతిహృద్యపద్యసుమపుంజముల న్నినుఁ బూజచేసి వి
ద్వన్నుతుఁడౌ మయూరకవి త్వత్కృపకుం గడుఁ బాత్రుఁడయ్యె నా
తెన్నున నిన్ను నేను బరితృప్తునిఁ జేయఁగఁజాల మూఢభ
క్తి న్నుతియింతుఁ బ్రోవఁగదె! కిల్బిషముల్ హరియించి భాస్కరా!

---

# కతిపయశబ్దార్థ శబ్దస్వరూప విచారము

వేదము వేంకటాచలముగారు, B. A., B. L.

## ౧-వ యుపన్యాసము

"దేవీం వాచ ముపాసతే హిబహవ స్సారన్తు సారస్వతం
జానీతే నితరా మసౌ గురుకులక్లిష్టో మురారిః కవిః."

ఈలోకమునందు మనుష్యజాతు లెన్ని కలవో అన్ని భాషలసంఖ్యలును ఏర్పడియున్నవి. ఒకరిభాష మరియొకరికి సహజముగా తెలియుటలేదు. చదివి కష్టించి తెలిసికొనవలసినదే. ఈయన్ని భాషలకును సామాన్యము లగు లక్షణములు కొన్ని గలవు. ౧. ఏభాషయందు గానికలశబ్దస్తోమ మంతయు ఆభాషకు స్వతస్సిద్ధము కాదు ౨. ఇతరభాషలయందుండి బహుసందర్భముల వలన వచ్చి చేరినపదములు పెక్కులు. ౩. ఇతరభాషల నుండి గ్రహింపబడినపదములు సాధారణముగ స్వభాషకు గల వ్యాకరణపద్ధతులను, ఉచ్చారణభేదములను, లౌకుల వాడుకలను అనుసరించి వైరూప్యమును జెందును. ౪. ఏభాషయందుగాని యథార్థమయిన వ్యుత్పత్తి తెలియరానిపదములు [అనగా ఆభాషయందు ప్రసిద్ధి గాంచిన పండితులకుకూడ తెలియనివి] అనేకములు గలవు. ౫. ఒక్కొక్కభాషయందును స్వదేశపదములు అనేకములు ఆభాసరూపములను పొంది నిజస్వరూప మిట్టిది యని తెలియరాక యుండును. ౬. ఒక్కొక్కభాషయందును పారిభాషికపదములు తఱచుగ నుండును. ౭. ఒక్కొక్క భాషయెడలను-గ్రాంథిక మయినభాషకును జనము వాడుచుండెడి భాషకును మిక్కిలి భేద ముండును. ౮. ఒక్కొక్కభాషయందును ప్రశస్తమైన యర్థముగల మాటలు కొన్ని నీచార్థములో వాడబడుచుండుటయును తద్విపరీతమును చూడగలము.

౯. ఇతరభాషలనుండి స్వీకరింపబడినపదముల సంఖ్యలో కొన్ని అన్యదేశీయము లని తెలియును గాని, అట్టివి ఏదేశమునుండి ఏభాషనుండి, వచ్చినవి అని తెలియకుండుట కలదు. మరికొన్ని పదములు అన్యదేశీయము లనియే తెలియదు. స్వభాషలోనివే యని భావన.

ఈలక్షణము లన్నియు మనసంస్కృతభాష యందుగూడ కలవు. మనవిద్వాంసులకు పరంపరాగతమయిన దుర్భ్రమ యొకటి గలదు. ఈభూగోళములో నుండు భాషల కన్నిటికిని మనసంస్కృతభాష మాతృభాష యనియు, ఇది దేవతలు వాడుచుండెడుభాష యనియు, నమ్ముచుందురు. కావుననే దీనిని గీర్వాణభాష యని పేర్కొనుట కలదు. ఇదియునుంగాక ఈవల, వణిజులవాడుకలో వ్యాపృత మయి యిపుడు ఉత్తరదేశములో సంస్కృతమును వ్రాయుటకు స్థిరపడిన, నాగర మనులిభికి దేవనాగర మనికూడ నామకరణము చేసిరి. ఇట్టిదుర్భ్రమ క్రీస్తుశకము ౧౮-వ శతాబ్దిలో యూరోపుదేశము నందలి విద్వాంసులకు హీబ్రూభాషనుగుఱించి కలిగియుండినది. కాలక్రమమున అధికవిద్యావ్యాసంగముచేత ఆదురభిప్రాయము అడుగంటిపోయినది. ఇప్పటికిని మనదేశమునందు సంస్కృతమునకు సంబంధించినయీపొరపాటు సవగణ కాలేదు. పయిచెప్పినలక్షణములు మనగీర్వాణమునందు గల వనుటకు నిదర్శనములు వందలకొలది చూపవచ్చును. వాటిని గూర్చి వేలుగ్రంథము వ్రాయవలసియున్నది. సద్యఃసులభసాధ్యములగు కొన్ని శబ్దములనుమాత్రము దిక్ప్రదర్శనన్యాయముగ సూచింతుము—హయవాచకమగు బడబా శబ్ద మొకటి గలదు.

"వామ్యశ్వాబడబా—బాడబం గణే" ఇత్యమరః.

### ౧. బడబా

ఈశబ్దము గీర్వాణులు వాడుచుండు బృందారక భాషలోనిదేనా? లేక మనసంస్కృతభాషయందు ఎక్కడనుండియో వచ్చి చేరినదా?

మనపూర్వపద్ధతుల ప్రకారము సంస్కృతములో నుండెడు వీశబ్దము గాని సంస్కృతమే అని చెప్పవలయును. దానికి సంస్కృతములో నుండుసాధనసంపద వలననే వ్యుత్పత్తి కల్పింపవలయును. యాథార్థ్యముతో పని లేదు. ఈశబ్దమునకు ప్రసిద్ధము లయిననామలింగానుశాసనవ్యాఖ్యానములలో చెప్పబడినవివరణమును చూడ నగును.

క్షీరస్వామి—

'బడం బలం హయం వా, వాతీతి, బడబా.'

భానుజీదీక్షితుడు—

సుప్రసిద్ధు డగుభట్టోజీదీక్షితునికుమారుడు.

'బలం సామర్థ్య మతిశయిత మస్యాః,
బలం వాతి వా, బలేన వ్రజ తి వా.'

గురుబాలప్రబోధిక—

'వలతే ఇతి బడబా, వల సంచలనే,
వబయోర్లడయో రైకత్వమ్.'

క్రీస్తుశకమునకు అయిదువందల సంవత్సరములకు ముందు పారసీకదేశమునందు చాయమాన (Achaemenes) వంశసంభూతులు, సామ్రాజ్యపదము నధిష్ఠించిన చక్రవర్తులు ఏలుచుండిరి. వారికాలమందు భరతఖండములో సింధునదికి పశ్చిమభాగ మంతయు వారిప్రభుత్వమునకు లోబడి యుండినది. పారసీకదేశమునందలి హయములు దేహమునందు ఉన్నతములును—కష్టమునకు ఓర్చినవిగ నుండును. అరబ్బీగుఱ్ఱములు కులుచలును, అందమైనవియు, జవాధికములు నయి యుండును. ఈ ప్రాచీనచక్రవర్తులలో నొకరు- ఈ రెండు జాతులను కలయదోలినయెడల నొకప్రశస్తమయిన సంకరజాతి ఉత్పన్న మగు నని యెంచి అట్లు గావించిరి. అట్లు పుట్టిన అశ్వములు అరబ్బీగుఱ్ఱములవలె జవనములుగను,పారసీకహయములవలె బలిష్ఠములుగను వెలువడినవి. వీటిలో స్త్రీప్రకృతికి ప్రాశస్త్యము కలిగినది. వీటిలో శ్రేష్ఠమయినవాటిని సామంతులకును ఇతరదేశాధిపతులకును బహుమానముగా నొసంగుచుండిరి. క్రమేణ వాణిజ్యవాహినికూడ ఏర్పడినది.

ఈ యుత్తమహయములు మిక్కిలి వేగవంతములని సూచించుచు వీనికి 'బాద్‌పా' అని పేరు పెట్టిరి. ఇయ్యది అన్వర్థనామము. పాణినీయప్రక్రియలతో నవసరములేనివ్యుత్పత్తి.—బాద్ అనగా వాయువు.[సంస్కృతములోని 'వాత' శబ్దము]—పా అనగా పాదము. బాద్ పా అనగా 'గాలిని కాళ్లుగా గలది'. వాయువేగ మని యర్థము. ఈ యర్థముగలశబ్దమును గుఱ్ఱములనుగుఱించియు నొకదేవదూతనుగుఱించియు జగద్విదితుడు, యవనకవీశ్వరుడు, హోమరు, గ్రీకుభాషలో 'పోడేనెమొస్' అని ప్రయోగించియున్నాడు.

ఆశబ్దమునకు అర్థము 'గాలిని కాళ్లుగా గలది.' యని. ఈహోమరుకవి ఈచెప్పిన చక్రవర్తులకన్న మున్నూరు సంవత్సరములకాలము ముందువాడు. ఈ 'బాద్ పా' అనునది వాయువేగముగల దైనందున స్వర్గాదిలోకములకు పోయి అక్కడివారిని మెప్పించిన పిదప ఆగీర్వాణులవాణియందు బడబా అనునామముతో పరిణమించినది. మఱియొకశబ్దమును ఉదాహరింతుము.

౨. కకుప్-కకుభః

'దిశస్తు కకుభః కాష్ఠాః' అని అమరుడు—దిక్కు అని యర్థము. ఈశబ్దమునకుకూడ వ్యాఖ్యాతలు పయిన చూపినపద్ధతిన వ్యుత్పత్తి వ్రాసియున్నారు

ఈపదము (అసురుల) అస్సిరియనులభాషలో నిది—బాబిలోనియనులు అనువారు ఈయస్సిరియనులవంశపూర్వులు. ఈవ్యాసమునందు అస్సిరియను లని ప్రస్తావము కలచోటులు బాబిలోనియనులనుకూడ కలిపి అన్వయింతురుగాక! ఆభాషయందు 'కక్కబు'—'కకబు' అని రూపము. ఈశబ్దమునకు నక్షత్ర మని యర్థము. అస్సిరియనులగణములో చేరినఅరబ్బులభాషలో ఈమాట ఇంచుక రూపభేదముతో స్థిరపడియున్నది. 'కౌకబ్—' అనగా నక్షత్రము. ఈఅస్సిరియనులు పూర్వదేవగణము. వీరు సురలకన్న బహుకాలము ముందుగా అనేకవిద్యలను నేర్చినవారు. వారివలన దేవతలును మనుష్యజాతులును అనేకవిషయములను తెలిసికొని వారివారిప్రతిభావిశేషమువలన ఆజ్ఞానమును వృద్ధిపఱచుకొనుచుండినారు. ఇట్టి

విషయములలో చేరినది జ్యోతిశ్శాస్త్రజ్ఞాన మొకటి. నక్షత్రములు-రాసులు-మేషాదిస్థానములు, ప్రథమమున కనిపట్టి యీభూమియందు వ్యాపింపజేసినవారు ఈ అస్సిరియను లని చెప్పదగియున్నది. పూర్వకాలములలో చీకటిరాత్రులయందు, కొండగుఱుతులు లేని ఎడారి ప్రదేశములయందు, క్రొత్తతావులయందు—నడిసముద్రములోను, దిక్కులు తెలియుట యెట్లు—దిక్కులు తెలియక సాగుట యెట్లు—అందుచేతనే ఇప్పటికిని 'వాడు కేవలం దిక్కులేనివాడు' అని జనసామాన్యమయినవాడుకమాట కలదు. దానియర్థము ఏముఖముగ గాని పోవుటకు లే దనుట. అట్టిసందర్భములలో నక్షత్రములవలన దిక్కులను గుర్తించుచు వచ్చిరి. ఆయా దిక్కులకు ప్రకాశవంతములగు నక్షత్రములను గుఱుతు చేసి యాత్రలు సాగించుచువచ్చిరి. నావికాయాత్ర చేయువారికి ఇది దైనందినవిషయముగా నుండినది. వారు బాల్యాదారభ్య ఈనక్షత్రములను, వాటినిబట్టి దిక్కులను, గుర్తించుటను అలవర్చుకొనుచుందురు. ఈ కారణమువలన దిక్కులకును నక్షత్రములకును అభేదాధ్యవసాయము కలిగి దీనిపేరు దానిపే రయినది.

ఇంకొకపదము—

### ౩. ఋక్షము-నక్షత్రవాచకము

'ఋక్షాచ్ఛభల్లభాలుకాః' అని అమరుడు-భల్లాకము [ఎలుగుగొడ్డు-ఎలుగుబంటి]నకు ఋక్ష మని పేరు గదా.

'నక్షత్ర మృక్షం భమ్......'

ఈవాక్యములో ఋక్షశబ్దము నక్షత్రనామపర్యాయముగ పఠింపబడినది. ఏమి కారణము? కృష్ణాష్టమికిని పీర్ల పండుగకును ఏమి సంబంధము అన్నట్లు ఎలుగునకును నక్షత్రమునకును ఏమి సంబంధము?—ఈసంబంధము సంస్కృతభాషాప్రపంచములో తెలియదు.

జ్యోతిశ్శాస్త్రజ్ఞు లని చెప్పబడిన అసురుల పూర్వులు ఇపుడు మనము 'సప్తర్షులు' అని చెప్పుచుండు నక్షత్రకూటమునకు ఎలుగుగొడ్డు అని పేరు పెట్టిరి. నక్షత్రకూటముల కంతయు ఒక్కొకదానికిని ఒక్కొక ఆకారసామ్యమును భావించి, మీనము, మేషము-ఇత్యాదిపేళ్లు ఈప్రాచీనులు పెట్టుచుండిరి. వారు ఈ 'సప్తర్షిమండలమునకు' భల్లూకనామము పెట్టినారు. దేవతలు ఈవిషయమును బోధ చేసికొనినవా రయి ఆనక్షత్రరాశికి మొదట భల్లూకనామముతో ఋక్ష మని పేరు పెట్టిరి. ఈవల కొంత కాలమునకు మనసప్తర్షులకు వియన్మండలములో తావు కల్పించుట అవసరము. కాగా వారికి ఒకరొకరికి ఈ ఋక్షరాశియందలి ఒక్కొకనక్షత్రమును ఇచ్చివేసి ఆ ఋషులను అక్కడ చేర్చివేసినారు. అప్పటినుండి అది సప్తర్షిమండల మయినది. పూర్వచరిత్రము విస్మృత మయినది. అయినను బహుకాలము ఎలుగుగొడ్డునకును, నక్షత్రములకును సంబంధము కలిగియుండినందునను, ఏ నక్షత్రములతోడి సంబంధ మని జ్ఞాపకశుద్ధి లేనందునను, ఋక్షశబ్దము భల్లూకవాచకముగాను నక్షత్రసామాన్యవాచకముగాను నిలిచినది. ఈ విషయమై మోక్షమూలర భట్టాచార్యులు (Max Muller) నిజము తెలియక పొరపడియున్నారు.

మఱియు నొకశబ్దము—

### ౪. చమస

ఇది యొక పవిత్రమైన యాగపాత్రము. ఔదుంబరము. ఒకవిధమయిన కొయ్యతెడ్డు. ఇంచుమించుగ అయిదారు అంగుళములచదరమును నాలుగు అంగుళముల స్థౌల్యమునుగల దై, మధ్య మూడు అంగుళముల ఆయామమును రెండంగుళములలోతును ఉండునట్లు తొల్వబడినపాత్రము. చేతితో పట్టుకొనుటకు ఆకొయ్యలోనే దీర్ఘము కావండ నొకపిడి చేయబడియుండును. అగ్నిష్టోమాదిసోమయాగములలో కొందఱు ఋత్విక్కులు చమసాధ్వర్యు లను పేరితో వీటిని దగ్గఱ పెట్టుకొని, అపుడపుడు ఒక్కొకమాట శ్రౌతప్రక్రియలోనిది అఱచుచు నస్యము వేసికొనుచు, లోకాభిరామము మాటలాడుచు ఉందురు. కొన్నితరుణములలో ఈచమసలలో సోమమును పోయుదురు. దానిని వీరు త్రాగుదురు. ఈ పదమునకు సంస్కృతమునందు సరియయిన వ్యుత్పత్తి లేదు. ఇది ప్రాచీనపారసీకులకును సాంస్కృతికుల

పూర్వీకులకును సామాన్యమగు మాట. దీని వ్యుత్పత్తి పారసీలో తెలియును. దీని స్వస్వరూపమున భరతఖండమందంతయు తెలిసినమాట. తెలుగువాడుక భాషలోకూడ 'చమ్చా' అని వాడెదరు. దీనిస్వరూపము 'చమ్‌చః'. అనగా చిన్న తెడ్డువంటి సాధనము. ఇంగ్లీషులో 'స్పూన్' అందురు. పారసీలో 'చమ్' అనగా తెడ్డు, అఒక, 'చః' అనునది క్షుద్రార్థద్యోతకమగు ప్రత్యయము. సంస్కృతములోని 'క' ప్రత్యయమువంటిది. 'చమ్‌చః' అనగా చిన్న తెడ్డు. ఇటువలెనే 'ఉత్తరాదిన' వేడినీళ్లు కాచు తామ్రపాత్రమునకు 'డేగిసా' అని అందురు. దీనిస్వరూపము 'దేగ్‌చః' [ప్రథమాక్షరము 'డ'కాదు.

'ద'] అనగా చిన్నకాగు అని అర్థము. దేగ్ అనునది పెద్దది. ఇట్లు చమ్‌చః అనునది-చమ్‌సః-చమసః అని మాఱినది.

* * * *

వితథములగు నిరుక్తములు లౌకికసంస్కృతమునందే కాదు. వైదికమునందుకూడ గలవు. ఒకకాలమందు శ్రౌతప్రక్రియలలో-ఇది యెందుకు అది యెందుకు-యూపములు ఆయాగములో తక్కువ యేమి, ఈయాగములో ఎక్కువ యేమి, ఈపేరు ఎట్లు కలిగినది. ఈకర్మ దేనికిగా, ఈమంత్ర మెందుకు, అని యీవిధమయిన మీమాంస కలుగుచువచ్చినది. అట్టిసందర్భములలో ప్రత్యుత్తరములు చెప్పబూని వేదములో అర్థవాదములు పుట్టియున్నవి. అర్థవాద మనగా అర్థమును తెలియజేయునది. ఈయర్థవాదములలోనిసంగతులు అనేకములు కేవలము కల్పన. వీటియందు యెన్నో పిట్టికథలు లేక పిట్టకథలు కలవు. వానిలో నొకదానిని ఉదాహరింతము.

## ౫. వసతీవర్యః

ఈశబ్దమునకు అర్థము-యజ్ఞశాలలో యజ్ఞకర్మకు ఉపయోగింపవలసిన ఉదకము. ఈయుదకమును పాఱుచుండెడు నదినుండికాని-ప్రస్రవణమునుండికాని, అవి లేనిచో నిర్మలమయిన పుష్కరిణినుండికాని - కడకు అదియును లేనిచోట శ్రోత్రియాగారమునుండికాని ముందుగా తెచ్చి పెట్టుకొనవలయును. ఈయుదకమునకు ఈపేరు ఎట్లు సిద్ధించినది అను విషయమునకు నిర్వచనము:— తైత్తిరీయసంహిత [కృష్ణయజుర్వేదము] ౬-వ కాణ్డము. ౪-వ ప్రపాఠకము ౨-వ అనువాకములో నున్నది.

"దేవా వై యజ్ఞ మాగ్నీధ్రే వ్యభజన్త, తతో య దత్యశిష్యత, త దబ్రువన్, వసతునున ఇద మితి. తద్వసతీవరీణాం వసతీవరిత్వం-తస్మిన్ ప్రాతర్న సమశక్నువన్,త దప్సుప్రావేశయన్. తావసతీవరీ రభవన్." ఈ శ్రుతికి అర్థము స్పష్టముగానే యున్నది. భట్టభాస్కరమిశ్రవిరచితమగు భాష్యమును, శాయన-మాధవభాష్యము ననువదించి వ్రాయుచున్నాను.

భట్టభాస్కరమిశ్రభాష్యము—

"దేవా ఏవ యజ్ఞ మాగ్నీధ్రే విభజ్య గృహీతవన్తః—తతః విభక్తశేషం య దతిరిక్త మాసీత్—త దబ్రువన్ దేవాః—నన్విద మపి అస్మాక మేవ సర్వేషాం సాధారణం వసతు—ఇద మపి శ్వః ప్రాత ర్విభక్తారః స్మః ఇతి.

తస్మా ద్వసతీవరీణా మపాం వసతీవరిత్వం వసతీ వరీరూపేణ విభక్తశేషః స్థిత ఇతి దర్శయతి—వస్తద్వసతి తద్వత్యః వసతీవర్యః—సాధారణ్యేన గృహీత్వా స్థితాః ఆపః-పాణినిసూత్రములు"-"తస్మిన్ విభక్తశేషే ప్రాతః సంవిభక్తుం శక్తా నాసన్.***తదవిభాగయోగ్యం మన్యమానాః దేవాః అప్సు ప్రావేశయన్. క్వాప్యుపయోక్ష్యతే ఇతి అప్సు నిహితవన్తః, యద్వా కమనేనేత్యప్సు ప్రాక్షిపన్—తా వసతీవర్యో నామాభవన్."

శాయన—మాధవభాష్యము—(వ్రాతపుస్తకము తప్పు లుండునది చిక్కినది.)

"పురా కదాచి ద్దేవాః ఆగ్నీధ్రమణ్టపే స్థిత్వా యజ్ఞాంశా నయం మమే త్యేవం వ్యభజన్త—తతః సర్వైః స్వస్వభాగేషు విభక్తేషు య దవశిష్టం త దుద్దిశ్య పరస్పర మబ్రువన్—ఇద మవశిష్ట, మిదానీం సాధారణ్యేన అస్మాక ముపతిష్ఠతు—ప్రాతర్విభాగం కరిష్యామః—ఇతి—యస్మా ద్వసత్వితి దేవై రుక్తం

తస్మా త్తస్యాంశస్య వసతీవరీనామ సంపన్నం(?)వసతి. స్తద్వత్యః, ఆపో, వసతీవర్యః—తతః ప్రాతఃకాలే పునస్సమాగత్య తస్మిన్ అవశిష్టే విభాగం కర్తుం నాశక్నువన్.

తస్యాల్పత్వేన బహూనా మపర్యాప్తత్వా త్తస్య సాధారణస్యైకేన గ్రహీతు మశక్యత్వా త్త దప్సు పరి త్యక్తవన్తః, తా శ్చాపోవసతీవర్యో భవన్.

'దేవతలు గదా [ఒకసారి] యజ్ఞమును [అనగా యజ్ఞపశువును] అగ్నిహోత్రమునొద్ద భాగించుకొన్నారు. అందులో నొకతునుక మిగిలిపోగా దానిని పంపకము చేయుటకు వలనులేక ఇది మనకు సాధారణముగా (వసతు) ఉండనిమ్మ అని చెప్పిరి. కావున వసతీవరులకు వసతీవరిత్వము తటస్థించినది. ఆపంపకము మఱునాడు తెల్లవాఱగ కూడ చేయలేకపోయిరి. అంతట నీటిలో ప్రవేశపెట్టినారు. (పాఱవేసినారు.) అవి అనగా ఆనీళ్ళు వసతీవరులాయెను.'

ఒక తునుక మిగిలియుండగా దానిని తమలో నెవరి కయిన నొకరికి ఇచ్చివేయగూడదా—పాఱవైతురుగాక—ఒకనికి అధిక్షము ఎందుకు పుట్టవలెను. ఇట్లు గ్రామజాతరలలో తగవులాడు ఆసాదివాండ్రవలె కలహము చేయుదేవతలసంగతి అట్లుండనిండు. ఈయర్థవాదము 'చూచిన' మహర్షికి ఒకసంగతి రూఢముగా తెలిసియుండినది. వసతీవరీశబ్దము యజ్ఞార్థ మయిన ఉదకమునకు నామ మని—ఈ పేరు ఎట్లు కలిగినది అనుప్రశ్నమునకు సమాధానము చెప్ప సంకల్పించినవాడయి యీశ్రుతివాక్యమును 'చూచెను.' ఈశబ్దమునకు యజ్ఞార్థ మయిన యుదక మని అర్థము ఎట్లు వచ్చిన దని అతనికి తెలియలేదు. అతనికి తెలిసినవఱకు వసతి, అనగా ఉనికి, వస-నివాసే అను ధాతువునుండి నిష్పన్న మైనమాట, ఈశబ్దములో మూలాధారముగ నుండినది. వరీ అనునది ఏమియని తెలియలేదు. రెండును చేర్చియుండుటచే వరీశబ్దమునకు స్వాతంత్ర్య ముండజాల దని భావించినాడు. రెండును చేరి ఉదకవాచ్య మెట్లయిన దనియు తెలియలేదు. మఱియు ఈ యర్థవాదము అపౌరుషేయ మైనందున వ్యాఖ్యాతలు ఎవ్విధముననైన దీనిని సమర్థించవలెను. దీనికి భట్టభాస్కరుడు వ్రాసినవివరణము "తస్మాద్వసతీవరీణా మపాం వసతీవరిత్వం—వసతీవరీరూపేణ విభక్తశేషః స్థిత ఇతి దర్శయతి—వస్తన్ వసతి—తద్వత్యః వసతీవర్యః. సాధారణ్యేన గృహీత్వా స్థితాః ఆపః."

[వస్తన్‌వసతి-అని అచ్చులో నున్నది. ఇది అసాధు వని లక్షించి ప్రాచీనప్రతులయందు వ్రాయసము పొరపాటు అని భావించి ఈసంహితను ముద్రింపించిన మైసూరువిద్వాంసులు శుద్ధపాఠపత్రమునందు 'వసన్ వసతిః' అని యుండనోపు నని సూచించియున్నారు.] భట్టభాస్కరోక్తములో 'వసతిః,తద్వత్యః వసతీవర్యః' అనగా ఆఖండముయొక్క వసతి తమయందుండుటచే వసతీవర్యః అని యేర్పడినట్లు చెప్పినాడు. కావున-వరీ అనునది వనిప్రత్యయార్థక మని వ్యాఖ్య-ఆవిధముగా ఈరూపము సిద్ధించుటకు-వసతీవత్యః కాకుండ వసతీవర్యః అగుటకు, వ్యాకరణసూత్రములను తెచ్చినాడు. వని ప్రత్యయము-జీ్రేఫములు-దీర్ఘత్వము - జీవన్తము-ఇట్లు ఏర్పడినది. మరల భట్టభాస్కరవ్యాఖ్యానమును చూతము. "తస్మాత్=ఆకారణముచేత, వసతీవరీణా మపాం=వసతీవరులను ఉదకములకు వసతీవరిత్వం=వసతీవరిత్వము (కలిగినది).వసతీవరీరూపేణ విభక్తశేషః స్థిత ఇతి దర్శయతి=వసతీవరీరూపముతో మిగిలిపోయినతునియ నిలిచిన దని చూపించుచున్నాడు. వసన్‌వసతిః=వసన్ అనగా ఉనికి, తద్వత్యః-ఆయునికి కలిగినవి, వసతీవర్యః=వసతీవరులు-సాధారణ్యేన=యావన్మందికొఱకు, గృహీత్వా=తీసికొని, స్థితాః=ఉండినట్టి, ఆపః=ఉదకములు." 'ఆకారణముచేత అనుటలో' ఈతునుక మనకుగా నుండనిమ్మ అని దేవతలు చెప్పినమాట తప్ప వేఱుకారణము లేదు. ఆఖండమును ఆరాత్రి అగ్నిహోత్రమువద్ద వేసిపెట్టినారు. కాని నీళ్లలో పాఱవేయలేదు. అప్పటికి నీళ్లకును ఈఖండమునకును సంబంధము కలుగలేదు. ఆసంబంధము మఱుదినము ఉదయమున కలుగబోవుచున్నది. కనుక ముందురాత్రి అక్కడ ఆతునియను పడవైచిన కారణముచేత దూరమున నెక్కడనో

యుండిననీళ్లకు వసతీవరిత్వము సిద్ధించుట అలభ్యమేాగము. మఱియు వెంటనే విభక్తశేషము వసతీవరీరూపముతో నిలిచిన దన్నారు. అట్లయిన యెడల ఈవసతీవరీసంజ్ఞ ఆరాత్రియే ఆయజ్ఞఖండమునకు కలిగినదే కాని నీళ్లకు కలుగలేదు. శాయనభాష్యము నిట్లే. కావున ముందు చెప్పిన 'వసతీవరీణామపాం వసతీవరిత్వ' మనువాక్యము సమన్వయము కాజాలదు. మఱియు వెనుక వచ్చువాక్యమునకుకూడ సరిపడదు. 'వసన్ = వసతిః, తద్వత్యః, వసతీవర్యః—సాధారణ్యేన గృహీత్వా స్థితా ఆపః'—అనగా ఈఖండమును తమయం దుంచుకొని (ఈఖండముయొక్క ఉనికి తమయందు కలిగి) అందఱికొఱకు పూటకాపులుగా నిలుపుకొన్నవైనందున ఆయుదకములు వసతీవరు లాయెను. అట్లయినచో వసతీవరి అనునామనిర్దిష్టమైనతునుకతో కలయిక కలిగినందున ఉదకములకును అదే నామము కలిగిన దని యేర్పడదు. తునుకను పొంది యున్నమాత్రన వసతీవరిత్వము ఆపాదించినట్లు ఏర్పడును. ఈవ్యాఖ్యానమునకు మూలాధారము లేదు. ఇప్పటికి మూలములో యజ్ఞఖండమునకును ఉదకమునకును సంబంధము కలుగలేదు. మఱియు ఆఖండమునకే వ్యాఖ్యాతలు వసతీవరిత్వము చెప్పినారు. 'వరీ' అనుదానికి 'కలిగినది' యని అర్థము చెప్పి ఆఖండమును ఉంపనిమ్ము అని దేవత లన్నందున ఉనికి గలదైనది, కావున ఆఖండమే వసతీవరీ అన్నారు. అయితే ఆమాటయును మూలములో లేదు. మూలములో వసతీవరీశబ్దము బహువచనరూపముతో నీళ్లకు పేరుగా చెప్పబడినదే కాని యజ్ఞఖండమునకు గాదు. వ్యాఖ్యానశేషమును చూడనగును. "తస్మిన్ విభక్త శేషే - ప్రాతఃశ్వః - న సమశక్నువన్ - సంవిభక్తుం శక్తా నాసన్—తదవిభాగయోగ్యం మన్యమానాః దేవాః అప్సు ప్రావేశయన్ - క్వాప్యుపయోక్ష్యతే ఇతి అప్సు నిహితవన్తః, యద్వా కిమనేనేత్యప్సు ప్రాక్షిపన్ - తా వసతీవరీరభవన్—తా (ఆపః) వసతీవర్యో నామాభవన్—" దీనివలన స్పష్టము—ఆయజ్ఞఖండమునకును ఉదకమునకును సంబంధము మఱునాడు ప్రాతఃకాలమందు కలిగినది గాని అంతకుముందు గాదు. తమకు ఎప్పటి కయిన నుపయోగపడవచ్చు నని నీటియందు దాచిపెట్టిరో, అక్కఱకు రాని దని పాఱవైచిరో యేర్పడలేదు. రెండవసందర్భముగా నుండవచ్చు నని తోచుచున్నది. శాయనభాష్యములో రెండవసందర్భ మని స్పష్టీకరించినారు.

మఱియు తమకు ఎప్పటి కైన నుపయోగించు ననుటకు ఏవిధమున నుపయోగి కాగలదు. దీని నేమి యేదేని యొకయజ్ఞకర్మకు ఉపయోగపెట్టుదురా. ఇది పర్యుషిత మయి పూతిగంధము కల దైపోవునే. ఏకర్మకుగాని అనర్హ మగునే. ఇదియునుగాక తాము ఉపయోగించుకొనుట సంఘముకొఱకుగా నుండవలెను. వారిలో నొకరుదానిని పిమ్మట తీసికొనిపోయినచో చౌర్యమగును. మఱియును ఈపర్యుషితము ఆనీటియందు ఎన్నిదినము లుండగలదు. పని లేదని పాఱవేయువారు నీటిలో నేల వేయవలెను. నీళ్లను చెడగొట్టి వ్యాధులను కల్పించుటకా. ఇంకను, నీటిలో 'పదిస్తుగా' పెట్టిపెడితే అటనుండునా, ప్రవాహములో పోదా—జలచరములు, గృధ్రవాయసక్రౌంచాదులు, తినకుండ పూజింపగలవా; పని లేదని పాఱవేసియుండవలెను. ఆ తునుకతో సంబంధము కలిగినపిదప ఉదకమునకు వసతీవరిత్వము కలిగినది. ఇకను మూలమును విడిచి వ్యాఖ్యానమును సమర్థించుటకు, ముందు యజ్ఞఖండమునకే వసతీవరిత్వము కలిగి పిమ్మట దానితోడికలయికచే ఉదకములకును అదే నామము సంభవించిన దని చెప్పవలెను. ఈ దురవస్థకు కారణము ఈ మూలములోస్ఖాలిత్య మున్నట్లు తెలియదగియున్నది. అయితే ఆమాట చెప్పుటకు లేదు. ప్రత్యవాయమును, వేదబాహ్యత్వమును, పాషండత్వమును, కలుగును. కావున 'ప్రతిలో నున్నట్టు చూచి బయ్యానగోకన్'.

శ్రుతి చెప్పినవారు వాక్యానుక్రమమును సరిగానే చెప్పియుందురు. ఏకాలములోనో ఒక అధ్యాపకుని పొరపాటుచే తప్పుపాఠము భూమిలో కుదిరిపోయి యుండవచ్చును గదా. ఈమాట చెప్పినయెడల అపచారమేమి? పాతకమేమి? శ్రుతులయందుగూడ ధావత్పతనము లెన్నియో? పై శ్రుతివాక్యమునకు మన కగపడు

## చిరకాలమునుండి బాధించుచున్న మూత్రవ్యాధులకును శగ (గనేరియా) వ్యాధికిని క్రొత్తగాకనిపెట్టబడిన దివ్యౌషధము.




# గనోకిల్లర్ (రిజిష్టర్డు)

ఈయౌషధము శ్రేష్ఠతమము. ఇంగ్లీషుమందులను దేశీయములగు నౌషధములను పుచ్చుకొనినను గుణము కలుగనియెడలను, యింజక్షనులనలనను వాక్సినులవలననుగూడ లాభము లేకపోయినయెడలను కడపటిప్రయత్నముగా మా గనోకిల్లరునుగూడ పుచ్చుకొనిచూడుడు. పెక్కు యేండ్లనుండియున్నను లేక క్రొత్తగా కలిగినను ఏరకము శగసంకటమైనను మరెట్టి మూత్రవ్యాధులకైనను స్త్రీలకైనను పురుషులకైనను గనోకిల్లరు తప్పక కుదుర్చును. మూత్రము ఝూరీగా వెడలును. మూత్రముపోవుచున్నపుడు కలుగుమంట తగ్గిపోవును. మూత్రనాళము నందలి వాపు తీసిపోవును. శగవ్యాధి (గనోకోకసు) వలన మూత్రము బొట్లుగా పడుట, మేహరోగమువలన మూత్ర ద్వారమునుండిపోవు తెలుపు, యూరెత్రిటిసు, ప్రోస్టాటిటిసు, సిస్టిటిసు, లుకోరియా, మున్నగువ్యాధులన్నియును స్త్రీలకును పురుషులకునుగూడ గనోకిల్లరువలన కుదురును. వీర్యము (సెమను) పోవుట, స్త్రీలు గర్భవతులుగా నున్నపుడు కలుగు మూత్రవ్యాధులు మున్నగునవిగూడ దీనివలన కుదురును. 50 మాత్రలుగల సీసా ఖరీదు రు. 3-0-0 వీ. పీ. చార్జి ప్రత్యేకము. ఒక్కసారి 3 సీసాలు తెప్పించుకొనిన వీ. పీ. చార్జి మేమే భరించెదము.

అడ్రసు:—డాక్టర్ డి. యన్. జసాని, 137 కికావీధి, గులాల్‌వాడి, బొంబాయి 4.

Tel. Add. "GONOKILLER" Dr. D. N. JASAN1, I37 Kika Street, Gulalvadi, Bomday, 4

మద్రాసు సిటి ఏజెంట్లు దాదా అండు కంపెనీ, 52, నైనియప్పనాయకవీధి, మదరాసు.

---

స్వల్పధర! ఫల మధికము!! పూర్తి తృప్తి!!!

100 కి 100 గురు సంతృప్తిచెందియున్నారు

# లోకామయహర కస్తూరి మాత్రలు




పిల్లలుమొదలు ముసలివారివరకు అందరి మందము, మలబద్ధము, పడిసెము, దగ్గు, గూరలు, శీతలముచే కాళ్లులాగుట, కడుపుబ్బరము, కడుపునొప్పి, పక్కలయందునొప్పి, ఆహారజీర్ణకాలమందు తలనొప్పి, చలిజ్వరము, జ్వరము, ప్లేగు, ఇన్‌ఫ్లూయంజా ఇంకను అనేకవ్యాధులను గుణపరచును. స్త్రీలు ప్రసవించిననాడు, స్నానమునాడు (కస్తూరికి బదులుగా) ఈ మాత్రలు 4-5 ను, 2-3 తమలపాకులలో నమలి మ్రింగవలెను. సాంక్రామికరోగులతో నుండవలసినవారు, దినము 1-2 మాత్రలను సేవించిన ఆరోగ్యదృఢాంగులగుదురు. ఈమాత్రలసీసాతోగల అనుపానపత్రమును చూడుడు. 300 మాత్రలు గల సీసా 1 కి 4 అణాలవంతున ప్రతిషాపులోపలను దొరకును. పోస్టుమూలకముగా 6 సీసాలు రు. 1-8-0, 12 సీసాలు రు. 2-12-0, 25 సీసాలు రు. 5-3-0.

సారస్వతాసవం:—మెదడుకు బలమును కలిగించి, జ్ఞాపకశక్తిని వృద్ధిచేయును గావున, మెదడు దుర్బలమువలన గలిగియుండు సమస్తవ్యాధులను పరిహరించి, నరములకు మంచిత్రాణను, రక్తవృద్ధిని కలుగజేయును. సంగీతపాఠకుల కంఠస్వరమునకు మృదుమధురత్వము నిచ్చును. పొడను పొడను ఉత్సాహము నింపును. బలహీనలైన స్త్రీలకు నెత్తినడుము (నెత్తినోరు చాల మెత్తగా వుండుటవలన) మాట్లాడను నడుపనుకాని పిల్లలకు సంజీవివంటిది.

6 ఔన్సుల సీసా 1-కి రు. 1-0-0. పోస్టుఖర్చులు ప్రత్యేకము.

## శ్రీ సీతారాఘవ వైద్యశాల, మైసూరు.

నడువు, ఇంచుక క్రిందుమీదయి యున్నట్లు చెప్పదగి యున్నది. వక్ష్యమాణపద్ధతిన వ్రాసి చదివినయెడల నుండవలసినసరణి తేటపడును. "దేవా వై యజ్ఞ మాగ్నీధ్రే వ్యభజన్త- తతో య దత్యశిష్యత - త ద బ్రువన్ వసతును న ఇద మితి-తస్మిన్ ప్రాతర్న సమశ క్నువన్-త దప్సు ప్రావేశయన్-తా వసతీవరీ రభవన్- తద్వసతీవరీణాం వసతీవరిత్వమ్." సరియయినపాఠ మి ట్లుండనియెడల మూలములో విరోధాభాసము కలుగును. ఎట్లనగా. "వసతునునఇద మితి, తద్వసతీవరీణాం వసతీవరిత్వం" అని యున్నది.

'మనకుగా నుండనిమ్ము' అని చెప్పినారు. కావున వసతీవరులకు అనగా ఉదకములకు వసతీవరిత్వము' మొదటివాక్యమునకును రెండవదానికిని ఏలాటిసాంగత్యమును లేదు. యజ్ఞఖండమును అచట నుంచినారు, సరే, వెంటనే నీళ్లప్రసక్తి యేమి? ఇక్కడ నేల చెప్పవలె? మఱియు ఆఖండమును అచ్చట, ననగా, అగ్నిహోత్రము నొద్ద నుంచినమాత్రన యెక్కడనోకలనీళ్లకు పేరుఎట్లు మాఱినది. ఇంకొకవిశేషము-ఈదేవతలు ఆతునుకను నీటిలో వేసినపుడు 'వసతునున ఇదం' అని చెప్పలేదు- తూష్ణీంభావముతో పాఱవైచిరేకాని ఇతరము కాదు. మఱియును ముందుదినమురాత్రి 'వసతునున ఇద'మని వారు చెప్పినమాట తెల్లవాఱుదలలో వచ్చి పంచుకొనెదు ఉద్దేశముతో అంతదనుకనుండనిమ్ము అను నర్థముతో చెప్పినమాటయేకాని సార్వకాలిక వ్యాప్తికి చెప్పినది కాదు. ఇది శాయనభాష్యములో స్పష్టము. తెల్లవాఱుదనుక వసతు అన్నారు. ఉదయమగుట, ఆ'వసతు'చరితార్థ మయిపోయినది. నీటిలో పాఱవేసినది ఉంచుకొనుటకు కాదు. కావుననే ఆతరుణములో 'వసతు'అనుప్రసంగ మేమియు చేయలేదు. కనుక ఆనీటికి వసతీవరిత్వము కలుగుటకు ఏలాటికారణమును తేటపడలేదు.

అనుక్రమముగా నోటిపాటమీద ఆధారపడినవి శ్రౌతస్మార్త విద్యలు. తప్పు లుండుటకు ఆశ్చర్య మేమి. ఈమండలములో నాకు తెలియవచ్చిన విషయ మొకటి కలదు. వివాహప్రకరణములో రెండు, మన్త్రము లని చెప్పబడు పౌరాణికశ్లోకములు, గలవు. వీనియం దొక టొకటియు ముఖ్యమయిన సందర్భములో చెప్పబడును. ఒకటి కన్యాదానమపుడు- రెండవది మాంగల్యధారణమపుడు. ప్రాచీనుల వాడుకలో ఈరెండుముఖ్యసందర్భములకును మన్త్రములే లేవని దీనివలననే తెలియదగియున్నది. ఉండినచో ఆమ్నాతమయినబుక్కులే యేర్పడియుండును. బజాఱుఅనుష్టుభులు ఎందుకువచ్చును. ఇక్కడ నలువదిసంవత్సరములకు పయిగా నాకు తెలిసి వాడుకలో నున్నకన్యాదాన మన్త్రమును ఇట్లు చెప్పుచున్నారు. 'కన్యాం కనక సంపన్నాం కనకాభరణై ర్యుతామ్, దాస్యామి విష్ణవే తుభ్యం బ్రహ్మలోకే జిగీష యా.' ఇట్లు చెప్పు యాజకులు సాంగాధ్యాపకులు, క్రమాంతస్వాధ్యాయపరులు. గురుముఖముగ విన్నది ప్రచురపఱచుచున్నారు. వీరి శిష్యులును ఇట్లే. కన్యాదాత బ్రహ్మలోకమును సాధించవలె ననుకోర్కతో దానము చేయుచున్నాడు గాని ఆలోకమును చేరి అక్కడ దేనినో, యెవరినో జయింపగోరి కాదు. 'బ్రహ్మలోకజిగీషయా' అని చెప్పవలెను.

రెండవశ్లోకమునందుగూడ యాజకులను పట్టిన సప్తమీపిశాచము విడువదాయెను. మాంగల్యధారణ మన్త్రము. "మాంగల్యతంతునానేన మమ జీవన హేతునా, కంఠే బధ్నామి సుభగే! త్వం జీవ శరదాం శతమ్." తంతునా = మంగలసూత్రముతో, కంఠే = (నీ)కంఠమునందు, బధ్నామి = కట్టుచున్నాను. దేనిని? ఈప్రశ్నకుప్రతిధ్వానము తప్ప ప్రత్యుత్తరము లేదు. దేనిని కట్టుచున్నాడు. 'నీంబోల్' గుండునా— నల్లపూసలనా; కాదు. మంగళసూత్రమును. 'బధ్నామి' అనుధాతువునకు కర్మగా నాచరించునది యేది— ఆసమయమునందు ఊపిరి తిరుగనీయక మేళగాండ్రు మ్రోగించుచుండు మేళతాళమృదంగాదిధ్వనులలో లీనమైపోయియుండును. పెండ్లికుమారుడు సూత్రముతో కంఠమును కట్టుచున్నాడు. కంఠం బధ్నామి అని యుండవలెను.

మఱియును శ్రాద్ధమంత్రములలో ఈ సాంగాధ్యాపకయాజకులపాఠములయందుగల తప్పులను లెక్కించుట సాధ్యము కాదు 'శ్వపుచ్ఛ మవనామితం' అన్నట్లు ఎన్నిసార్లు వారి తప్పులను దిద్దినను తిరుగా తరుణములో వారిపాఠమే వారికి నోటనుండి వచ్చును గాని శుద్ధ పాఠము రాదు. ఒకపరి, తప్పో ఒప్పో, యేర్పడిన పాఠము కడవఱకు అట్లే నిలుచును; లౌకికసంస్కృత మాయెనేమి, వైదికమాయెనేమి.

ప్రకృత మనుసరామః—ఇంతఱకును యజ్ఞార్థమై గ్రహింపబడు ఉదకమునకు వసతీవరీనామము కలుగుటకు కారణము గోచరము కాలేదు. ఒకవేళ దేవతలు ఒక నాడు ఆమాంసఖండమును నీటిలో పాఱవేసియుందురు గాక! ఆనీటికి ఆదినము వసతీవరీసంజ్ఞ కలిగిన దనుకొందము. ఈవల ఆనీటిని దేవతలు ఉపయోగించిరో లేదో తెలియదు. మఱియును ఈకల్పనలో నొకవిశేషము కలదు. చెఱువునుండియో నదినుండియో, బావినుండియో ఉద్ధరింపబడి యజ్ఞశాలకు తేబడి యజ్ఞార్థము సేకరింపబడినయుదకమునకే వసతీవరీసంజ్ఞ ఒప్పును గాని, ఆనదిలో, తటాకములో, బావిలో, నుండునీటికి గాదు. అట్లు గాక యజ్ఞార్థము కొంత ఉదకమును తీసికొని పోవుటకు పూర్వమే ఆనదీతటాకాద్యుదకమునకు వసతీవరిత్వము తటస్థించినదా? అట్లుండినచో ఏలోకమునందు గాని, ఏతావునగాని కల ఉదకమున కంతఱకును వసతీవరిత్వము సిద్ధించియే యున్నది. ఈ బ్రాహ్మణమును చూచినఋషి చెప్పినవాక్యములలో అట్లే అన్వయము కాదగి యున్నది. 'తా వసతీవరీ రభవన్' అనువాక్యము క్రింద నింకను కొంతగ్రంథము ఈ వసతీవరులను గుఱించినది కలదు. ఈ యుదకమును సూర్యాస్తమయమునకు ముందు సేకరింపవలెను. ఏదేని కారణమున అట్లు చేయని యెడల చీకటే అయినను ఒక దివిటీని, లేక కొఱవి కట్టైను తీసికొనిపోయి, నీటిమీద ఆ వెలుతురు ప్రసరింపజేసి సంగ్రహింపవలెను. అట్లు కనిచో యత్కించిత్. హిరణ్యమును ఘటములో నుంచి ఉదకమును దానిలో పట్టుకొనవలయును. అట్లును కానిచో బహుయాజి, అనగా సోమయాజి, యింటనుండు బావిలోని ఉదకమును తీసికొనవలెనని చెప్పి, దీనికి కారణమునుకూడ చెప్పినారు. అతడు ఏ కాలములోనో ఎక్కడనో చేసిన యజ్ఞములో వసతీవరులను సంగ్రహించినవా డయినందున, తదాది అతని యింట నుండు వాపీకూపతటాకములలోని నీ రంతయు వసతీవరు లయిపోయినదట. ఆహా, ఆయింటిభాగ్యము! అక్కడి పాచిపనులకును, అంట్లు తోముటకును, ఇతర కొన్ని చిల్లరపనులకుకూడ, నిరంతరము వసతీవరులే ఉపయోగపడుచున్నవి.

అట్లే ఆనద్యాద్యుదకమును, శౌచయాత్రాద్యనేక కార్యములకు అనేకులు తీసికొనిపోవుచుందురు. శ్రౌతస్మార్తనిత్యకర్మానుష్ఠానపరాయణులును పాత్రములను చేతతీసికొనిపోక నదులయొద్ద ప్రాతఃకాలములో చేయుచుండు కొన్నిపనులు అందఱికిని తెలిసియేయున్నవి. మఱియును, ఒకజాతివారుకాదు, ఒకకులమువారుకాదు, లోక మంతయు వారివారిపనులకు ఆనద్యాద్యుదకమును కొనిపోవుచుందురు. అది యంతయు వసతీవరులేనా? మఱియు, నదిలో వీరు వారనక 'అరుంధతీయ' మాతంగాదిజనములును ఈదులాడుచుందురు. వారేమి, వసతీవరులలో ఓలలాడుచున్నారా? వారిస్నాన మేమి, అవభృథస్నానమా? అట్లుండజాల దని తోచుచున్నది.

ఇదియునుగాక దేవతలు ఆయజ్ఞఖండమును పాఱవేసినది, ఏయుగములో - ఏకాలములో - ఏలోకములో - భూలోక మనికూడ తెలియదు. ఏటిలోనా, చెఱువులోనా, బావిలోనా, గుంటలోనా? అదియును తెలియదు. మఱియును వారు పాఱవేసినది యజ్ఞాంతమునందు. మొదట వారు యజ్ఞార్థమయి తీసికొనిపోయిన నీటికి పేరు ఏమిగ నుండినది. అప్పటికి వసతీవరీశబ్దమునకు పుట్టుక లేదే? ఆమొదటిపేరు ఇపుడు ఏ మైపోయినది? లేక యీమనకర్మభూమిలోమాత్రము గలనీళ్లకే యీనామనిర్దేశమా - ఈదేవతలు అంతకుముందు ఎన్ని క్రతువులు చేసియుండిరో? అపు డంతయు వారు వాడిన నీటికి ఏమిపేరు? మఱియు వీరు యజ్ఞఖండమును ఏనీటిలో పాఱవేసిరో ఆనీటికి వసతీవరిత్వము కలిగియుండును గాక! అటుపిమ్మట జరుగుచువచ్చిన జన్నములకు ఆతావులోనినీటినే కొనిపోవుచువచ్చిరా? మఱియు వారు

యజ్ఞఖండమును నీళ్లలో వేసినది, ఆనీళ్లను పవిత్రము చేసి తాము ఉత్తరోత్తరము యజ్ఞములయందు ఉపయోగపెట్టుకొనుటకు కాదు. పనికిరాదని యెంచి యేదో ఒకనీటిలో పాఱవేసినారు. మఱియు నీళ్లకు వసతీవరులని వారు నామకరణము చేయలేదు. యజ్ఞఖండమును పాఱవేసి 'వెళ్లోవెళ్లు.' వారు చేసినకార్యమువలన ఆనీటికిసంజ్ఞ కలిగిన దని ఈశ్రుతివాక్యమును 'చూచిన'ఋషికి ప్రథమము తెలియవచ్చినది.

ఇదియునుగాక వారు ఏదియో ఒకలోకములో ఒకతావులోని ఉదకమునకు వసతీవరిత్వమును కల్పించిన కారణముచేత – ఈలోకములోని ఈ మాగాణములలోని 'పుల్లనీళ్లపల్లె', 'సద్దినూటికిండ్రిగే', 'మిడుగురాళ్లమిట్ట', ఇత్యాదిగ్రామములలోని దొరువులయందలి నీటికి ఈనామము ఎట్లు కలుగును. కావున నీసందర్భములను చూడగా, యజ్ఞార్థమయి తీసికొని పోబడి యజ్ఞశాలలో నుంచబడిన ఉదకమునకే వసతీవర్యః అని సాంకేతిక నామము గాని ఇతరమునకు కా దనియును, దేవతల యజ్ఞఖండమునకును, యాగశాలయందలి నీటికిని, తన్నామముగువసతీవరీశబ్దమునకును ఏలాటిసంబంధమును లే దనియును తెలియుచున్నది.

మిక్కిలి పురాతనము కాలమునందు మన సాంస్కృతికులపూర్వులును—ప్రాచీనపారసీకులు, గ్రీకులు, రోమనులు,-వీరిపూర్వులును మఱియు కొందఱును, ఒక పెద్దకుటుంబములో శాఖలుగా నుండిరి. ఒకకాలములో ఇండ్లు లేక, నిలుకడ లేక, లంబాడితండములవలె వారి పశుధనమును వెంటబెట్టుకొని పచ్చికబయళ్లను ఆశ్రయించి పోవుచుందురు. వీరినిగుఱించినవివరము వక్ష్యమాణగ్రంథములో తెలుపబడును. వీ రందఱును అగ్నిని ఆరాధించువారు. [ఈవిశేషము మనదేశములో నుద్భవించి మనవారికి మాత్రము రూఢ మని ఆహితాగ్నులు భావింపవలదు.] వీరు ఇండ్లు కట్టుకొని నియమముగా నొకతావున నివసించుటకు ఉపక్రమించినపుడు ఒక్కొకయింటికిని ఒక అగ్నిహోత్రము ఏర్పడియుండును. ఆయగ్నికి త్రికాలములయందును హవిస్సును సమర్పింతురు. అగ్ని లేనిది యిల్లు లేదు. మఱియు భార్యలను వివాహము చేసికొని నిలుకడగా సంసారము చేయదొడంగినపిదపనే యిండ్లు యేర్పడినవి. కాగా, ఇల్లు, భార్య, అగ్ని, యీమాటికిని అవ్యవహిత మయినసంబంధము. పర్యాయపదము లని చెప్పవచ్చును. కావుననే గృహవాచకమయినశబ్దములు, అనేకభాషలలో భార్య అనునర్థములో వాడబడుచుండును. భార్య చనిపోయినవాడు 'నాయిల్లు కూలిపోయినది' అని చెప్పును. సంస్కృతమునందు 'గృహం గృహాశ్చ పుంభూమ్ని కలత్రేఽపిచ సద్మని' అని మేదిని. ఈవిధముగా గార్హస్థ్యమునకు అగ్నిశుశ్రూష ముఖ్యముగ నేర్పడినది. పయిన చెప్పిన శాఖలవా రందఱును ఈగార్హపత్యమును కొలుచుచుందురు. ఆయాగృహస్థునియింట నిల్లాలును కొమార్తలును ఆయగ్నిని కాపాడుచుందురు. ఆ యగ్నిహోత్రసామీప్యమున భోజనము చేయుదురు. అపుడపుడు ఇష్టులు చేయుదురు. మేషాదిసంక్రమణములు ముఖ్యదినములు. మఱియు ఊరు, పల్లె యేర్పడినచోట, ఒక్కొకయింట నుండు అగ్ని కాక, గ్రామమున కంతయు సామాన్యమగు నొక యగ్నిహోత్రము కులపతియింట నుండును. దీనిని కడు జాగ్రత్తతో కాపాడుచుందురు.

పట్టణములు ఏర్పడినపుడు అట్లు సామాన్య మయి అందఱికొఱకయిన అగ్నిని ఆ పట్టణములో అగ్న్యాగారములో ప్రణయింతురు. దానిని అధికృతులు మిక్కిలి జాగరూకతతో కాపాడవలయును. పూజలు చేయుచు ఆహుతులు వేయుచు నుండవలెను. రాజ్యములు ఏర్పడినపుడును అట్లే, ఆ రాజ్యమున కంతకును సాధారణమయినయొక అగ్నిహోత్ర ముండును. దానిపరిచర్యను గుఱించిన కట్టుబాట్లు పెక్కులు. అది ప్రమాదవశమున చల్లారిపోయినయెడల ఆదేశమున కంతయు గొప్పవిపత్తులు దుఃఖములును పాటిల్లును. ప్రాయశ్చిత్తములను జరపి అరణులతో మథించి పునః అగ్నిని సృష్టించి ప్రణయించవలెను.

ఒక ఆశ్రమమునుండికాని, వసతినుండికాని, గ్రామమునుండికాని, పట్టణమునుండికాని, చీలిపోయి జీవనార్థము వలసపోవుతండములు అక్కడి అగ్నిహోత్రములోని

అంగారలేశమును తీసికొనిపోయి ముందు ధామ్యాను వెనుక తాము కదలిపోవలెను. దారిలో అది చల్లార గూడదు. నిలిచినతావుల పూజ చేయుచు తాము స్థిర ముగ నుండదలచినచోట దానిని ప్రతిష్ఠించి యిండ్లు కట్టుకొన్న వెంబడినే ఆయాగృహస్థుడు ఈ యగ్నినుండి లేశగ్రహణమును చేసి తనగార్హస్థ్యాగ్నిని ప్రణయించు కొనవలెను. ఈ ప్రకారము పయిగణములవా రందఱును జరుపుకొనుచువచ్చిరి. ఈ అగ్నికి ఒక అధిదేవతను పేర్కొనుచుండిరి. వీరు వేల్చుహవిస్సులు, చేయుహోమ ములు, ఇచ్చు ఆహుతులు ఆయధిదేవతకు. అగ్నివాచ కము లగునామములు పుంలింగరూపము లయ్యును, అగ్నిహోత్రమునకుగల అధిదేవత స్త్రీదేవత—ఈమె భగవన్నిర్మాణములో, దేవతాసృష్టిలో, ఆదిసృష్టి యని నమ్మెదురు. ఈమెకు గ్రీకులో హెస్టియా / హెస్తియా అని పేరు. రోమనులభాషలో వెస్టా లేక వెస్తా అని నామము. ఈరెండును ఒకటే పదము.

ఈదేవతారాధనవిషయ మయి ప్రాచీనరోమ నులపద్ధతులు మనకు విస్తారముగ తెలిసియున్నవి. పయి చెప్పినవిధమున రోమనులరాజ్యమున కంతయు ముఖ్య పట్టణ మయిన 'రోము' నగరమునందు ఈ దేవతకు ఆల యము నిర్మిత మయి యుండినది. దానియందు నిరంతర మును అగ్ని సమిద్ధ మయి వెలుగుచుండును. ఈయగ్ని హోత్రమునకు పరిచర్య చేయువారు ఏవురు, లేక ఏడు గురు కన్యలు. వీరిని లేతప్రాయములోనే అక్కడ చేర్చి అక్కడినిబంధనలను నేర్పుచుందురు. ఆఱుసంవత్సరముల వయస్సునకు తక్కువపడక పదివర్షములవయస్సునకు అధికము కానిపిల్లలను తీసికొనివత్తురు. కాలక్రమమున వారు పనులను అలవరుచుకొని జరుపుచుందురు. వీరు ముప్పదిసంవత్సరములు ఈకొలువు చేయవలెను. ఆకాల ములో వివాహము చేసికొనగూడదు. పురుషసంపర్కము కూడదు. కఠినమయిన నిబంధనలకు లోబడి యుందురు. అగ్నివేదిచుట్టును సమ్మార్జనము వీరే చేయవలెను. ఆపను లకు వలసినయుదకమును వీరు తేవలసినది. పాఱుచుండెడు ప్రస్రవణమునుండికాని యేటినుండికాని తేవలెను. ప్రతి దినమును ఈకన్యకలు రోమునగరమువెంబడి ప్రవహించు చుండు 'టయిబర్'. నదినుండి ఉదకమును తెచ్చి యీ 'వెస్తా' అనుదేవతారాధనకు ఉపయోగింతురు. ఆయుద కముతోడనే కపాలపక్వపురోడాశమును మృణ్మయస్థాలీ పక్వ హవిస్సును అగ్నియందు సమర్పింతురు.

ఉపరి చెప్పినరోమనుభాషలోని పద మయిన 'వెస్తా' అనుదానికి అగ్ని యనికూడ నర్థము. అగ్ని దేవతకు నామ మైనందున నగ్నికికూడ వాచక మని యందురు గాని లోకములో వస్తువులకు నామములు ముందుగ నేర్పడియుండును. పిమ్మట అధిదేవతలు సంభ వించినపుడు ఆయావస్తునామమునుండి అధిదేవతలనామ ములు కల్పితము లగుటు అనుక్రమముగ నుండును. ప్రా చీనకాలమున సంస్కృతమునందును ఇంచుక రూపభేద ముతో నీశబ్దమే అగ్నివాచకముగ నుండిన దని తెలియ దగియున్నది. ఇప్పటికిని మహారాష్ట్రభాషలోని యీ క్రిందిపదములను లక్షించి చూడుడు:—

విస్తూ
విస్తు } =అగ్ని
విస్తవ

విస్తవణే మంటచేయుట.

సంస్కృతములో

వాస్తవా=అరుణోదయము=అరుణోదయకాలము

వేదములోనివి.

వస్తవే=(అగ్ని) ప్రకాశించుట.

వస్ (ధాతువు) ప్రకాశించుట.

వాసయతి=ప్రకాశించునట్లు చేయుచున్నాడు.

ఉష్మణ
ఉష్మణ్య } వేడి అయి ఆవిరిని విడుచుచుండునది.

మఱియు నీక్రిందిశబ్దస్తోమమును పరికింపుడు:—

ఉష్—(ఓషతి) కాలుట

ఉషిత
ఉష్ట
ప్రుష్ట
ప్లుష్ట } దగ్ధమైనదానిని జెప్పువిశేష్యనిఘ్నములు.

వ్యుష్ట=దగ్ధమైన, ఉదితమైన, ప్రొద్దుపొడిచిన
(వి శేష్యముగ)=అరుణోదయము, తెల్లవారుట,పగలు
ఉష్ణ=వేడిగల
ఉష్మ } గ్రీష్మకాలము.
ఊష్మ }
ఉషర్బుధః=అగ్ని నామము
ఉషపః=సూర్యుడు
ఉషా = కాలుట-కాల్చుట. సూర్యోదయకాలము
ఉషః=అరుణోదయకాలము

ఈ ఉకారాదిశబ్దరూపము లన్నియు వైదిక ముగువస్ (ప్రకాశించుట) అను ధాతుబీజమునుండి సంప్ర సారణమువలన నిష్పన్నము లని కొందఱు చెప్పియు న్నారు. మఱియు కొందఱు 'ఉష-దాహే' అని యొక స్వతంత్రమూలమును చెప్పినారు. ఇటులే ప్రుష-ప్లుష-దాహే అని ప్రుష్ట, ప్లుష్ట-శబ్దములకు వేఱొకమూలమును చెప్పినారు.

సంప్రసారణమున కలిగినమార్పులు తెలియక పోవుటయు కలదు. సంస్కృతమునందలి 'ఊర్మిః.' 'ఉరః' అనురెండుపదములకు నామలింగానుశాసనవ్యా ఖ్యాతలు వ్రాసినవ్యుత్పత్తిని పరికించి ప్రాచీనపారసీకుల వాణి యైన 'అవెస్త' భాషయందు ఈరెండుపదములకు నుండుస్వరూపమును గమనింపుడు.

'వరెమి' = అల—తరంగము. 'అవెస్త'
ఊర్మి = ,, ,, సం.
'వర' = ఱొమ్ము—వక్షస్సు—'అవెస్త'
ఉరః = ,, ,, సం.

మఱియు సూర్యనామ మైన 'వివస్వత్' శబ్ద మును మాడుడు. వి-వస్-వత్ మిగుల ప్రకాశము కల (వాడు). అని తెలియుచున్నను

దీనికి వ్యాఖ్యాతలు అన్యథా నిర్వచనమును ఇచ్చి యున్నారు. వస్ అను వైదికధాతువును లక్షింప లేదు. పయిశబ్దజాలమునందు సామాన్య మయినసందర్భ మొకటి కలదు—అగ్ని, కాలుట, కాల్చుట, తేజస్సు, ప్రకా శించుట, (సూర్యునివలన, అగ్నివలన) దీప్తము లేక దీప్యమానమగుట. ఈభావము లన్నియును ఒకపాదున బుట్టినవి. ఆకాశమందలి సూర్యునికి భూమియం దైన ప్రతిహస్తము అగ్ని, అగ్నినామధేయ మొకటి మూల ముగ నుండనిచో పయిమహోరాష్ట్ర(?)శబ్దములు ఆరూపము లతో అగ్నివాచకములుగ నెటు లేర్పడినవి? మఱియు 'వాస్తవా' అను ఉషావాచకశబ్దమును, 'వస్తవే' అను వైదికోక్తియును,ఎట్లు కలిగినవి?

మఱియు 'అగ్నౌతు హుతం [త్రిషు] వషట్ కృతమ్.' అన్నారు. అగ్నిహోత్రమున సమర్పింపబడి హుతమయిన (దగ్ధమయిన) దానికి 'వషట్+కృత మని' సంజ్ఞ = 'వషట్‌గాచేయబడినది.' అగ్నిపర మని యర్థము. శ్రౌతప్రక్రియలోని 'వషట్' అను ఎచ్చరిక పయిమాటకు సంక్షేపము. మఱియు రోమనులభాష యందలి 'వెస్తా' అనునామ మెట్లుకలిగినది? గ్రీకుభాష లోని 'హెస్టియా' శబ్దము మిక్కిలి పురాతనకాలమున 'వెస్టియా' అనురూపముతో నుండి ఈవల ప్రథమవర్ణము మాఱినట్లు లాక్షణికులవివరణము కలదు.

మీద జూపిన ఉకారాదు లన్నియు మూలభూ తమై అగ్నివాచక మగు వకారాదిశబ్దమునుండి సంప్ర సారణలబ్ధము లని చెప్పుట సమంజసము. ఇంక నొకతర గతిశబ్దజాలమును తిలకింపుడు.

వసత్ }
వసన్ }
వసన్తీ } = నివసించుట.
వసతీ }

వసిః }
వసతిః }
వసతీ } = ఇల్లు-ఉనికిపట్టు.
వస్త్యం }

వాస్తు = ఇల్లు-ఇల్లుకట్టుకొను స్థలము.

ఇవన్నియు 'వస నివాసే' అను ధాతురూపము నుండి వెలువడినవిగా చెప్పియున్నారు. తథాస్తు. పూర్వోక్తవివరమువలన గృహాస్థాగ్నియును, ఇల్లును అభేద్య మగుద్వంద్వ మైనకారణముచే అగ్ని నామము

నుండియే గృహనామములును విశేషించి యేర్పడిన వనుట ఒప్పిద మగును. మఱియు గ్రీకుభాషయందు పురము (నగరము)నకు పేరుగ 'అస్తు' అనుమాట కలదు. దీనివ్యుత్పత్తినిగుఱించి లాక్షణికులు అకారమునకు ముందు వేరొకవర్ణ ముండి లుప్తమయిపోయిన దనియును 'అస్తు' శబ్దమునకు అగ్నిదేవతావాచక మైన 'హెస్టియా' శబ్దమునకును—ఒకటే మూల మనియును చెప్పియున్నారు. ఈరెండుశబ్దములకును ప్రథమవర్ణము ఒకటిగనే యుండి లుప్త మైనది. ఈలుప్తవర్ణము ఈవలి గ్రీకులోని అక్షరసమామ్నాయమునుండియు పదముల నుండియు అంతరించిపోయినది. దీనికి 'డిగమ్మా' అని నామ ముండినది. స్వరూపము ఇంగ్లీషులిపిలోని F, గా నుండినది. ఉచ్చారణము—వకారధ్వనిగా గాని, ఇంగ్లీషులోని F యొక్క ధ్వనిగా గాని—రెంటికి మధ్యము ముగా గాని యుండిన దని లాక్షణికులసంప్రదాయము.

ఇట్లు—వసతీవర్యాః అనుపదములోని వసతీ అను భాగము 'అగ్నికి సంబంధించిన' 'అగ్నికొఱకయిన' 'యజ్ఞకర్మకు సంబంధించిన' అను అర్థమును గలది యని మీదిచర్చవలన తెలియదగియున్నది.

మఱియు—ఈ 'వర్యాః' అనునది యేది? వసతీ వర్యాః అనునది సమస్తపదము—వసతీ + వర్యాః. వర్యాః అనునది వనిప్రత్యయము కాదు. లౌకికసంస్కృతమందలి వారిశబ్దముయొక్క పూర్వరూపము. వేదాంగమగు నిఘంటువులో 'వర్యాః' అనుపదమునకు 'నదులు', 'ప్రస్రవణములు' అని యర్థము వ్రాసియున్నట్లు తెలియుచున్నది.

దీనికి వరీ అని ఏకవచనరూపముకూడ గలదు; అయ్యును సాధారణముగ, 'ఆపః స్త్రీ భూమ్ని' అన్నట్లు బహువచనరూపమును వాడుదురు. తెలుగులోకూడ నీళ్లు అని వాడుక. ఉదకము మెండుగ నుండిన, ప్రస్రవణమును, నదియును ఏర్పడును. సంస్కృతగణములో చేరిన ప్రాచీనపారసికాదిభాషలయందు - వర్ - వరీ = శబ్దములు హ్రస్వవకారాదిగ ఉదక మనునర్థముతో ఇంచుక రూపభేదములతో నగపడును. ప్రాచీనపారసీకవేద మగు 'అవెస్తశ్రుతుల'యందు ప్రయోగములు కలవు—

వఇరి = సరస్సు - కొలను - వఇర్య = నది, నది నుండి చీలుశాఖ - ఈ'వఇరి'అనునది మన శ్రౌతపద మగు వరీశబ్దపూర్వరూపము. 'అవెస్తా' భాషయందు అర్ధప్రాణములగు అచ్చులు గలవు. వానిని తేలికగ నుచ్చరింతురు. ఆసందర్భమును తెలుపుటకు ఇతరభాషలలిపియందు వ్రాయుటలో అట్టియచ్చులను గీటు తప్పించి కించిదూర్ధ్వముగను చిన్నరూపముతోను వ్రాయుదురు.

కావున వఇరి-వఇర్య అని వ్రాయుట-ఈయల్పప్రాణములకు సంబంధించిన సహజమయిన గుణ మొకటి కలదు. క్రమేణ వాడుకభాషలో నివి మనయర్ధాను స్వారములవలె నంతరించిపోవును. వఇరి అనునది-వరి-వరీ అని నిలుచును 'అవెస్త'భాష మనవారికి కుతూహల జనకముగ నుండు నని తోచి వఇర్యశబ్దప్రయోగమున కొకయుదాహరణమును వ్రాయుచున్నాను. అవెస్త వేదములో అనాహితాసూక్తమునందు చెప్పియున్నది:—

కశ్చిద్ చ (కశ్చిచ్చ) అఏషగ్ం (ఏషాం) వఇర్య నగ్ం, (వర్యాణాం) అనగా 'ఈనదీశాఖలలో ఏది గాని' యని యర్థము - సంస్కృతమునందు:—వృష్టిః - వర్షం - ప్రావృట్, వర్షాః, ఇటికి యేమి బీజాంకురము? వర్ష మన నేమి? ఆకాశమునుండి పడునీళ్లు. సంస్కృతమున వార్-వారి అనగా నీళ్లు.

వీటికి సంబంధించి అవెస్తపదములనుచూడుడు:—

వార్=వర్షించుట

వార } =వర్షము
వాఇరి }

వాఇర్య=వర్షోదకము

=వర్షమునకు సంబంధించినది.

=పడుచుండువర్షము.

ఈ రెండుభాషలయందును ఏతద్గణగతము లగు పదములకును, వసతీవరీ అనుశబ్దమునందలి 'వరీ' అను భాగమునకును, ఒకటే మూలాధారము. నీ రని యర్థము.

కావున వసతీవర్యాః, అనుదానికి అగ్నిహోత్రమునకు సంబంధించిన (యజ్ఞార్థమైన) ఉదక మని యర్థము

ఈసమస్తపదము బ్రాహ్మణములను 'చూచిన' ఋషులకు బహుకాలముముందుగనే వాడుకలో రూఢి యయిపోయి నది. శబ్దజాలములోని కొన్ని పదములు వాడుకలో నుత్స న్నమై పోయి వాటిపర్యాయపదములకు ప్రాబల్యము కలుగుచుండుట అనేకభాషలయందు కలదు. వసతీవర్యాః అనునది దేనికి సంజ్ఞ అని తెలిసియుండినది. నిర్వచనము తెలియలేదు. దీనికి నిరుక్తమును చెప్పఋూనినఋషి స్నానము చేసి కూరుచుండి 'బ్రహ్మయజ్ఞేన యక్ష్యే' అని సంకల్పించి కన్నులు మూసికొని యోగనిష్ఠలో నీయర్థ వాదమును 'చూచినాడు.'

---

# సముద్రము

మిన్నికంటి గురునాథశర్మ గారు (ఉభయభాషాప్రవీణ)

౧

పవళుల్ రేలు తదేకదీక్షమెయి సంపాదించి స్రోతస్వినీ
　వివిధాస్యంబులనుండి యయ్యమృత మబ్ధీ! యేమిభోగించితో?
లవణాసహ్యము బాడబానలకరాళజ్వాలదగ్ధం బ
ధోభువనచ్ఛిద్రవివర్తనంబు నిరతంబుల్ సల్పుటల్ గాక యో!

౨

జడసంయుతుఁడవు మలినాంగుఁడవౌర్వానలవిదీర్ణగురువిభవుఁడవో
కడలీ! యైనన్ ధన్యాత్ముఁడవైతివి, విష్ణు హృదయమునఁ దాల్చుటచే.

౩

నిండిన సంగ్రమా! పలుకనేరను వజ్రిభయంబుచేత నీ
యండను జేరి డాఁగె హృదయంబున టెక్కలమీఁదియాస; న
ట్లుండియు "నున్నకర్మ పొరుగూరికిఁ బోయినఁదప్ప" దన్నటుల్
కొండలజేనిపట్టి కలఁగుండువడుం గద బాడబాగ్నిచే.

౪

కొన్ని మణులుమాత్రము దలనున్నంతనె గజముగర్వ మొందెడిఁ గడలీ!
ఎన్నియొ రత్నమ్ముల నత్యున్నతిఁ గన్న న్మదంబు నొందవు లవముల్.

౫

సుర లమృతంబు లక్ష్మి మధుసూదనుఁడుల్ రశనల్ ధరిత్రి శం
కరుఁడు సుధాంశురేఖ నవకల్పకుజంబుల నింద్రుఁడుల్ గ్రహిం
చిరి; కలశాబ్ధి! నీయుదరసీమ నగంబుల డాఁచి; తైన నే
మర రె! ఘటోద్భవాపదకు నడ్డము రాఁ డొకఁడేఁ గృతజ్ఞుఁడై.

౬

నీపగడములకును స్వస్తి; నీమణులకుజోత! నీమౌక్తికములకు శుభము; జలధి!
ఘోరజలచరంబులబారిఁ గూలఁబడక ప్రాణముల బయటఁబడితి నంతె చాలు.

౭

శిల లెల్లన్ మణు లంబుసంచరుఁడు రాజీవాక్షుఁ డా సైకత
స్థలి ముక్తాన్విత, లక్ష్మి వార్వనిత తచ్ఛైవాలపంక్తుల్ ప్రవా
ళలతల్ నీరము పాల్ సురద్రువులు కూలంబందు రత్నాకరం
బు లనన్నామము; ఐన నేమి? దగనే పోఁగొట్టలేవైతిగా.

౮

చనుదేరన్ భవదీయదర్శనసముత్సాహాతిరేకంబునన్
మినుముట్టంగను ఘోషపెట్టెదవు నెమ్మిన్ స్నానముం జేయ ని
ల్చినఁ బోనెట్టెద వాచమించునెడ నక్షీబంబు వాఁ గొట్టెవో
వనరాశీ! "యిదియేమికర్మ" మతిథివ్రాతార్చల న్నేరవో?

౯

అమలినగోమణీకుజము లౌర యొకం డన నేల యుత్తమో
త్తమమసర్వవస్తువుల దాఁచియె గర్భగృహంబునన్ విరా
గము గలవానిపోల్కిఁ బొడకట్టను పై కెవఁ డేమి యిచ్చినన్
నిముసములోన వెల్పలికి నెట్టుచుఁ దుంగతరంగ బాహులన్.

౧౦

ఉన్నతాధమపదముల నొక్కతీరు-గాఁ గనుచు సర్వసమురీతిఁ గన్పడెదవు
పైకిఁ, గాని నీలోగుట్టు బయటఁబడదె-అంబ్వవతరణ సమయమందైనఁ గడలి!

౧౧

దంతురితస్థలమునను బ-రంతపనక్రాదుల్ ధరాధరములు నీ
పొంతనె దాఁచి యెఱుఁగన-ట్లుంటే గభీరాశయుండ వెసఁగెదు కడలీ!
అడిగిరి నోరు విప్పి విబుధాగ్రణు లెల్ల సుధారసం బుదా
రుఁడ వయి యిచ్చి పంపుట యుఱుల్ మఱి యీయవొ యూరకుంట యొ
ప్పెడునది కాని యిట్టు లతిభీకరదుర్భరకాలకూటమున్
జెడుగఁడ! పెట్టి చంపుదటె? జీవన మెంతగ నీకుఁ గల్గినన్.

౧౨

త్రిదశులకోర్కిఁ దీర్ప వెనుదీసి యెటో గినుమూఁడఁ బూని నీ
వది యిది యిచ్చి, పంపుటకు యత్నము సేసితి కాని వారలున్
వదలక యెంత వేఁడినను బ్రక్కలు బ్రద్దలు సేసి రాలఁ దీ
యఁదనపుటాసుధం గొనిరి యంబుధి! "లోభికి మూట నష్టి"గా.

(అడవిపువ్వులు)

# కరాచి కాంగ్రెసు దృశ్యములు




౪. విడిదిలో మహాత్ముడు నూలు వడుకుచుండుట. కుడివైపున సర్దారు పటేలుగా రున్నారు




౫. మహాత్ముడు మీరాబాయితోకూడ సాయంప్రార్థనము సలుపుటకయి
కాంగ్రెసుమంటపమునకు బోవుట




౬. శ్రీమతి సరోజినీదేవిగారు, డా. అన్సారిగారు




౭. శ్రీమతి కమలాదేవి ఛటోపాధ్యాయ మున్నగు ప్రచారకురాండ్రు

# కతియవారు ట్రేడింగుకంపెనీ యొక్క—

## సర్వజనాదరణీయమైన తలనూనెలు అందు వివిధపరిమళములుగల అత్తరులు

## కుసుమాల్ హెయిరాయిల్ (రిజిస్టర్డు)

శిరోజములకు, మెదడుకు, తగినటువంటి తలనూనె. సువాసనద్రవ్యములతోను, హీనాపుష్పములతో చేయబడి, సాటిలేనిదై తనరుచున్నది. సంపన్నులుమెచ్చినది. సీసా 1-కి రు. 1. వి. పి. చార్జీ 6 అణాలు ప్రత్యేకము.




## కెటి వైట్‌రోజ్ హెయిరాయిల్ నెం. 777 రు (రిజిస్టర్డు)

వెంట్రుకలవృద్ధికిని, కాంతికిని తోడ్పడునట్టి తలనూనె. గులాబీపువ్వుల నిజసౌరభ మిందు గలదు. ఒకసారి పరీక్షించిన మీకే తెలియగలదు.

వెల సీసా 1-కి 14 అణాలు. వి. పి. చార్జీ 6 అణాలు.

## కెటి కోకోనట్ హెయిరాయిల్ నెం. 777 రు (రిజిస్టర్డు)

టెంకాయనూనె తల కుపయోగించునని ప్రతివానికిని తెలియును. కాని ఎట్లు సిద్ధము చేసినచో నది ప్రశస్తమో తెలియదు. ఈ నెం. 777 రులో (రిజిస్టర్డు) చేసిన ఈ టెంకాయ నూనె శుద్ధిచేయబడి దుర్వాసనారహితముగాను సూక్ష్మసువాసనాసంకలితముగాను గావింపబడినది. అందుచే సామాన్యగృహస్థు లందరిమెప్పు నొందినది.

6 ఔన్సులు గల సీసా 1-కి 14 అణాలు. వి. పి. చార్జీలు 10 అణాలు ప్రత్యేకము.

మరియు జ్ఞప్తియిం దుంచుకొనుడు



## కెటి ఒట్టో రోజ్ నెం. 777 రు (రిజిస్టర్డు)

దీనికి సరిసమాన మగు నూనె లేదు. రోజాపుష్పములచే చేయబడినది. పుష్పవనమునం దున్న తాజా గులాబీపుష్పము లెంతటి పరిమళము నొసగునో యంతటి సౌరభము నిందు బడయగలరు.

అరఔన్సు బుడ్డి 1-కి రు. 1-12-0, పావు ఔన్సు బుడ్డి 1-కి రు. 1-0-0.

## కెటి ఒట్టో జాసిన్ నెం. 777 రు (రిజిస్టర్డు)

మల్లెపుష్పములను తెలియనివా రుండరు. కెటి ఒట్టో జాస్మిన్ (నెం. 777 రు) మల్లెపువ్వులులేని కాలము లందుకూడ మల్లెపూలవాసన నిచ్చుచు ఆశ్చర్యమును ఆనందమును కలిగించును. ఈ పరిమళము నొక్కసారి యాఘ్రాణించిన, అదిలేక మీ రొక్కనిమిషమైన నుండజాలరు.

అరఔన్సు బుడ్డి రు. 1-12-0, పావుఔన్సు బుడ్డి రు. 1-0-0.

## ఒట్టో మధుకర్ (రిజిస్టర్డు):—

ఒకసారి యీ అత్తరు నుపయోగించినవారు, సర్వదా దీనిని విడనాడలేకున్నారు. మేలైన పుష్పసౌరభమే యిందులకు కారణము. అరఔన్సు బుడ్డి 1-కి రు. 1-12-0. పావుఔన్సు బుడ్డి 1-కి రు. 1-0-0.

వి. పి. చార్జీలు 5 అణాలు ప్రత్యేకము. (ఒక్కొక్కదానికి)

మరా:—మీ గ్రామములందున్న దుకాణములలో కొనునప్పుడు కెటి మరియు నెం. 777 రు అనుపదములను గమనించుడు. అట్లుచేసిననే శుద్ధమైనవి మీకు దొరకగలవు.

పరీక్షార్థమై రెండు అణాస్టాంపుల నంపి యే రెండు తలనూనెల నమూనాలుగాని, లేక అత్తరునమూనా యొకటిగాని తెప్పించుకొనుడు.

సోల్ ఏజంట్లు:—**ది కతియవారు ట్రేడింగు కంపెనీ,**

ఖెట్వాడి, మెయిన్‌రోడ్, బొంబాయి, నెం. 4 రు.



# మీ శిరోజముల కోక టానిక్

వేసవి సమీపించుచున్నది. అప్పుడు మాడు మంటపుట్టి వేదన గలిగించును. శిరోబీజములు క్షీణించును. అట్టి సమయములందు మీ వెంట్రుకల కోకటానిక్ అవసరము. మీ వెంట్రుకలను కాపాడుకొనుడు. వాటిని

## కా మి ని యా నూ నె (రిజిస్టర్డు)

నుపయోగించి పోషింపుడు.

బట్టతల, వెంట్రుకలు రాలిపోవుట, గరుకుదన మెక్కుట, వృద్ధాప్యము రాకమునుపే వెంట్రుకలు నెరయుట, మున్నగువాటి నాపుటయందు దీనిజయ మెరుగదు. చుండును కుదుర్చును. నెత్తిచర్మమును శుభ్రపరచును. వెంట్రుకలు పట్టుకుచ్చువలె పెరుగుటకు తోడ్పడును. ఇవన్నియుగాక, ఘుమఘుమలాడు దాని సుపరిమళము మనస్సున కానందదాయకముగా నుండును. ఇటీవల వచ్చిన యీ దిగువ యోగ్యతాపత్రికల చదువుడు. మిస్టర్ ఆర్. కె. నాయర్, చన్‌కార, వండిపెరియార్ పోస్టు, (తిరువాన్కూరు) 1-2-1931 తేదీన వారు వ్రాసిన పోస్టుకార్డునం దిట్లు గలదు. రెండునెలల క్రితము మీరు కామినియానూనె నంపినందుకు వందనములు. నేను యీ నూనె నెవరికొరకు తెప్పించితినో, అట్టి మిసెస్ ఈశ్వరపిళ్లె యొక్క శిరోజములకు అద్భుతమైన గుణముల నిచ్చినదని చెప్పుటకు నేను మిగుల సంతసించుచున్నాను. కాబట్టి తిరిగి 12 సీసాల కామినియానూనెను వి. పి. గా పంపకోరుచున్నాను.

వెల సీసా 1-కి రు. 1-0-0 వి. పి. చార్జి 6 అణాలు ప్రత్యేకము.
3 సీసాలవెల రు. 2-10-0 వి. పి. చార్జీలు 12 అణాలు ప్రత్యేకము.

## పుష్పోద్యానవనమును జేబునం దుంచుట



OTTO DILBAHAR.

మీ రెప్పుడైనను

## ఓ ట్టో దిల్ బ హా ర్ (రిజిస్టర్డు)

బుడ్లను చూచితిరా. ఈ బుడ్డినుంచి ఒక్కబొట్టు క్రిందపడిన, పుష్పవనములోనుండి తాజాగా తెచ్చిన కొన్నివేల కుసుమముల యింపైన పరిమళము నది యొసంగును.

పూర్తినమ్మకము కలుగుటకై, ఉచితముగా నిచ్చెడి నమూనాబుడ్డికొరకు, పోస్టేజి వగైరాల నిమిత్తం రెండణాల స్టాంపును పంపుడు. పుష్పోద్యానవనమును జేబునందుంచుకొని నూతనానందము ననుభవింపుడు. అందరికి వీలగునట్లు, వివిధసైజుల సీసాలయందు విక్రయించబడుచున్నది.

అర ఔన్సు సీసా రు. 2-0-0 పావుఔన్సు సీసా రు. 1-4-0 ఒకడ్రాం సీసా 0-12-0 అరడ్రాం సీసా 0-8-0.
వి. పి. చార్జీలు 6 అణాలు ప్రత్యేకము. (ఒక్కొక్కదానికి)
ఒట్టోదిల్ బహార్ నమూనాలు ఒక్కొక్కటి 0-2-0 అణాలు. పరిమళకార్డులు ఒక్కొక్కటి ఒక అణా.

## నొప్పులకు, బాధలకు, గొప్ప ఔషధము




ఆడ్సన్స్ సిప్రెస్–సాల్వ్ (పెయిన్ బాం) (రిజిస్టర్డు)

ఎందుకు బాధపడెదరు? నిద్రపట్టక, అవస్థ యెందుకు? హాయిగా తిరుగుటకు వీలులేకుండ, మోకాళ్లవాపుపొందనేల? ఇవన్నియు

## ఓడ్సన్స్ సిప్రెస్-సాల్వ్ (పెయిన్‌బాం) (రిజిస్టర్డు)

వలన అతిత్వరలో కుదుర్చబడునుగదా? దీనిని కొంచము తీసికొని, బాధగల శరీరభాగమందు బాగుగా మర్దనచేయుడు. వెంటనే మీ బాధలు నివారణయయి, దాని మహిమాతిశయములను మీరు గాంచగలరు.

దీనిగుణములను నిరూపించుటకు నమూనాడబ్బీని ఉచితముగా నంపుదుము. పోస్టేజి ప్యాకింగ్ నిమిత్తము రెండణాల స్టాంపునుమాత్ర మంపుడు. వెల డబ్బా 1-కి రు. 1-0-0, చిన్నసైజు 0-8-0 అణాలు.
వి. పి. చార్జీలు 0-6-0 అణాలు ప్రత్యేకము (ఒక్కొక్కదానికి) నమూనాడబ్బీలు ఒక్కొక్కటికి 0-2-0 అణాలు.

సోల్ ఏజంట్లు:— **ఆంగ్లోఇండియన్ డ్రగ్ అండు కెమికల్ కంపెనీ,**

నెం. 285 రు, మార్కెట్, తపాలపెట్టె నెం. 2052. బొంబాయి నెం. 2 రు.

# ధ్వనికర్త యెవ్వరు?

సాహిత్యవిద్యాప్రవీణ బులుసు వేంకటరమణయ్యగారు,

**Research Student, Benares Hindu University**

## ౧. ప్రస్తావము

మనకింతవఱకు లభించిన సంస్కృతాలంకారగ్రంథములలో—విమర్శనదృష్టితో వ్రాయఁబడిన వానిలో ధ్వన్యాలోకమే మిక్కిలి ప్రాచీనమైనదనియు, మొదటిదనియుఁ బండితప్రకాండులంద ఱంగీకరించి యున్నారు. మన సౌకర్యముకొఱకు దానిని రెండు భాగములుగ విభజింపవచ్చును. మొదటిది కారికారూపముగ నున్న మూలగ్రంథము. రెండవది మూలమునకు వృత్తిరూపముగ నున్న వ్యాఖ్యానగ్రంథము. మొత్తము మీఁద గ్రంథమునకు ధ్వన్యాలోకమని పేరున్నను మూలగ్రంథము ధ్వనియనియు, వ్యాఖ్యానగ్రంథ మాలోకమనియు వ్యవహరింపవచ్చును. ఈధ్వన్యాలోకముపై నభినవగుప్తాచార్యుని లోచన మను వ్యాఖ్యానము కలదు. లోచనముం బట్టియు, నభినవగుప్తులు భరతనాట్యశాస్త్రమున కొనర్చిన వ్యాఖ్యానముంబట్టియు [అభినవభారతి] ధ్వన్యాలోకమునకుఁ గావ్యాలోకమనియు సహృదయాలోకమనియు నామాంతరము లున్నట్లు తెలియవచ్చుచున్నది.[1]

చాలకాలమునుండియు నీధ్వన్యాలోక మేకకర్తృకమా, అనేకకర్తృకమా అనువివాదములు పండితలోకమును గలఁచివేయుచున్నవి. కారికావృత్తిభాగములు రెండును శ్రీమదానందవర్ధనాచార్యులచే రచింపఁబడినవని కొందఱును, ఆలోకనామకమగు వృత్తిభాగము నొకదానినే యానందవర్ధనుఁడు రచించెననియు ధ్వనికారుఁడు వృత్తికారునికంటె విభిన్నుఁడనియును కొం[దఱు] దఱును వాదవివాదములఁ బాల్గొనుచున్నారు. ఆలోక, కర్త యానందవర్ధనుఁ డగుటలో నెవ్విధమగు విప్రతిపత్తియును మాత్రము లేదని యిందువలనఁ దెలియవచ్చుచున్నది.

ఇట్లు మతభేదములు కల్గుటకుఁ గారణ మేమో మొదటఁ బరిశీలించుట యుచితము. జల్హణసంగ్రథితమగు సూక్తిముక్తావళియందు రాజశేఖరుఁడు రచియించినదని

"ధ్వనినాతిగభీరేణ కావ్యతత్త్వనివేశినా,
ఆనందవర్ధనః కస్య నాసీ దానందవర్ధనః."

అని యొక పద్య ముదాహరింపఁబడి యున్నది.

ఆనందవర్ధనుఁడే ధ్వనికర్త యని నిర్ణయించు నీ ప్రమాణ మిట్లుండ రాజశేఖరుఁడు తనకావ్యమీమాంసలో వ్రాసిన

"ప్రతిభా వ్యుత్పత్త్యోః ప్రతిభా శ్రేయసీ త్యానందః సాహి కవే రవ్యుత్పత్తికృతం దోష మశేష మాచ్ఛాదయతి. తత్రాహ—
'అవ్యుత్పత్తికృతో దోషః శక్త్యా సంవ్రియతే కవేః,
య స్త్వశక్తికృతో దోషః స ఝడితి త్యవభాసతే.'
[కావ్యమీమాంస, పే. 16.]

అను వచనముఁబట్టి వృత్తియూడ నానందవర్ధన రచితమనియే తోఁచుచున్నది. రాజశేఖరుఁ డుదాహరించిన యీ మీఁది పద్యము వృత్తిగ్రంథములోనిది కాని మూలగ్రంథములోనిది కాదు. కారికావృత్తిగ్రంథములు రెండు నేకకర్తృకము లనువారి కిదే మూలాధారము.

కాని మూలకారుఁడు వృత్తికారునికంటె భిన్నుఁడని ఆధ్వన్యాలోకవ్యాఖ్యాతయగు నభినవగుప్తుఁడు

1 "కావ్యాలోకం సులోచనని యోజనయా జనస్య." [ధ్వన్యాలోకము, పే. 1, వ్యాఖ్య: 2-పద్యము.]
"యథాసహృదయాలోకకారః—'సంధిసంధ్యంగఘటనం రసాభివ్యక్త్యపేక్షయా.'
[అముద్రితాభినవభారతి, 2-వ భా. పే. 519.]

సూచించిన ట్లతని లోచనవ్యాఖ్యానముంబట్టి తెలియు చున్నది.

"అతఏవ మూలకారికా తన్నిరాకరణార్థా న శ్రూయతే వృత్తికృత్తు నిరాకృతమపి ప్రమేయసంఖ్యాపూరణాయ కంఠేన తత్పక్ష మనూద్య నిరాకరోతి—

—'తేనాత్ర ప్రథమోద్ద్యోతే ధ్వనేః సామాన్యలక్షణమేవ కారికాకారేణకృతమ్. ద్వితీయోద్ద్యోతే కారికాకారోఽవాన్తరవిభాగం విశేషలక్షణంచ విదధ దనువాదముఖేన మూలవిభాగం ద్వివిధం సూచితవాన్. తదాశయానుసారేణ తు వృత్తికృ దత్రై వోద్ద్యోతే మూలవిభాగ మవోచత్.' [లోచనము, పు. 59.]

"న చైత న్మయోక్తమ్, అపితు కారికాకారాభిప్రాయే ణేత్యాహ—తత్రేతి,—

'భవతి మూలతో ద్విభేదత్వం కారికాకారస్యాపి సమ్మతమితి భావః.' [లోచనము, పు. 60.]

ఇట్లే లోచనమునందలి 122, 128, 130, 131, 135, 138 పుటలయందును కాననగును. మూలకారుఁడానందవర్ధనునికంటె వేఱని వాదించువారల కీమీఁది లోచనవచనములు మూలాధారములు.

ఈమీఁది ప్రమాణములనే యాధారముగఁ జేసికొని బ్యూలర్ పండితుఁడు (Dr. Buhler) వృత్తికారునికంటె మూలకారుఁడు వేఱని నిశ్చయించెను. పిదప జాకోబీపండితుఁడును (Professor Jacobi),[2] కీత్తు పండితుఁడును (Keith)[3] డాక్టర్ సుశీలకుమారడే మహాశయులును (Dr. S.K. De)[4] బ్యూలరుగారిమతమునే యనుసరించిరి.

## ౨. కారికాకారుఁడు సహృదయుఁడా?

ప్రొఫెసరు సోవాణీ విద్వాంసుఁడు [Professor Sovani][5] పైవారిమతమునే యనువదించుచుఁ బైవారికంటెఁ గొంచె మెక్కుడుగ నిరూపింప నెంచి, మూలకారుఁడు సహృదయుఁ డనువాఁడని తలంచెను. పైవా రెవ్వరు నీవిషయమును ప్రస్తావింపలేదు. ఈపండితుఁడు తనవాదమున కుపపాదకముగ ధ్వన్యాలోకమునకుఁ గల సహృదయాలోకమను నామాంతరమునే సూచించెను. మూలకర్త సహృదయుఁడనియు నతనిగ్రంథమునకు ఆనందవర్ధనుఁ డాలోకమును వ్రాయుటచే నది సహృదయాలోక మయ్యెననియు నతనితలంపు.

కాని సహృదయాలోక మను నామము గ్రంథముయొక్క నామము సహృదయ మనుటలోఁ బ్రమాణము కాఁగలదేమో కాని కర్త సహృదయుఁ డనుటలో నించుకయు నుపయోగింపఁజాలదు. సహృదయాలోకమురీతినే కావ్యాలోక మను నామాంతరముకూడ నీవిషయమునే చాటఁగలదు. ఈవిషయమునే విమర్శించుచు కాణే మహాశయులు [P. V. Kane][6] "కారికాకారుఁడు సహృదయనామధేయుఁ డనుటలో నియ్యది ప్రమాణము కాఁజాలదనియు, ఆవాదమున నొకవేళ నుపయోగించుచో ముకుళభట్టుఁడు తన యభిధావృత్తి మాతృకయందు లిఖించిన

'ధ్వనేః సహృదయై ర్కావ్యాత్మతయోపవర్ణితస్య...' [అభిధావృత్తిమాతృక, పు. 21.]

ఈ మొదలగువచన ముపయోగింపవచ్చుననియు, న్యాయముగ నీయాశయము సరికాదనియు వర్ణించియున్నారు.[7]

అభినవగుప్తులు కూడ కారికాకారుఁడు వేఱని సూచించువచనములను లోచనమున వచించినను అతఁడు సహృదయనామకుఁడని సూచించియైన నుండలేదు. సహృదయశబ్దము లోచనమునఁ బలుసారు లుపయోగింపఁబడియున్నను మంచిహృదయము గలవాఁ డను సామాన్యార్థముననే ప్రయోగింపఁబడినది కాని వ్యక్తివిశేషార్థమునఁ బ్రయోగింపఁబడి యుండలేదు.

2 Z. D. M. G. Vol. 56, (1902), pp. 405-10.
3 Keith: Classical Sanskrit Literature, p. 135.
4 S. K. De's Histrory of Sanskrit Poetics Vol. 1.
5 J. R. A, S. 1910, pp. 164-167.
6 P.V.Kane: History of Alankara Literature (Introduction to Sahitya-darpana), p.61.
7 Ibidr p. 60.

"యేషాం కావ్యానుశీలనాభ్యాసవశా ద్విశదీభూతే మనోముకురే వర్ణనీయతన్మయీభవనయోగ్యతా తే హృదయసంవాదభాజః సహృదయాః."

[లోచనము, పు. 11.]

"తథాహి—'తటీ తారం తామ్యతి' ఇత్యత్ర తటశబ్దస్య పుంస్త్వ నపుంసకత్వే అనాదృత్య స్త్రీత్వమేవాశ్రితం సహృదయైః. 'స్త్రీతి నామాపి మధుర' మితి కృత్వా."

[లో. పు. 160.]

డే మహోదయులు వృత్తికారునికంటెఁ గారికాకారుఁడు వేరని చెప్పినను, అతఁ డేకాలమునాఁటివాఁడో, ఏనామమువాఁడో తెలియుటలేదనియు, హరిచంద్రశాస్త్రిలుకూడఁ గారికాకారునినామము సహృదయుఁ డని యంగీకరింపలేదనియుఁ దమగ్రంథమున లిఖించియున్నారు. కానఁ గారికాకారుఁడు సహృదయుఁడని మనము సందేహింప నక్కఱలేదు.

3. విభిన్నకర్తృక మనుటలోఁ గారణములు

కారికావృత్తికారులు వేర్వేఱని వాదించువారిలో నొకరగు డే మహోదయులు తమమతమున కుపష్టంభకముగ నభినవగుప్తుని స్వీకరించిరి. అంతియే కాక వారిచేతనే సంపాదింపఁబడి ముద్రింపఁబడిన ధ్వన్యాలోకచతుర్థోద్యోత లోచనము (కావ్యాలోకలోచనము) యొక్క పీఠికయం దొకనూతనవిషయమునుగూడ నిరూపించిరి. నాల్గవయుద్యోతమునందలి మూలకారిక[8] నొకదాని నుట్టంకించుచు, దీనిని వృత్తికారుఁ డొకరీతిని, లోచనకారుఁ డింకొకరీతిని బఠించుచున్నారని లిఖించెను. దానింబట్టి మూలవృత్తికారులు విభిన్నులని స్థిరపడునని వారియాశయము. దాని నిటఁ బొందుపఱతును.

"అవస్థాదివిభిన్నానాం వాచ్యానాం వినిబంధనమ్, యత్ప్రదర్శితం ప్రాక్.

భూమ్నైవ దృశ్యతే లక్ష్యే న తచ్ఛక్య మపోహితుమ్; తత్తు భాతి రసాశ్రయాత్."

[ధ్వన్యాలోకము, ఉద్యో. 4, కారి. 8, పు. 243-44.]

ఈమీఁదిరీతిని ధ్వన్యాలోకమునఁ గలదు. ఆనందవర్ధనునిమతమున "భూమ్నైవ దృశ్యతే లక్ష్యే న తచ్ఛక్య మపోహితు" మ్మని కారిక యని వారియభిప్రాయము. అభినవగుప్తుఁ డీకారికావ్యాఖ్యానమున

"అవస్థాదివిభిన్నానాం వాచ్యానాం వినిబంధనమ్, భూమ్నైవదృశ్యతే లక్ష్యే తత్తు భాతి రసాశ్రయా దితి కారికా. అన్యస్తు గ్రంథః మధ్యోపస్కారకః. అత్రపాదత్రయ మనూద్య చతుర్థపాదార్థ అపూర్వతయాభిధీయతే—తత్త్విత్యాదితి."

[లోచ. iv., పు. 25.]

అని యున్నది. కానఁ గారికాపాఠ మానందవర్ధనాభినవగుప్తపాదమతములలో విభిన్నమార్గములఁ ద్రొక్కెనని వారి (డేగారి) యాశయము.

కాని యానందవర్ధనుని తరువాతివా రందఱును ధ్వనికార, ఆలోకకారులను వేర్వేఱుగ నిర్దేశింపలేదు. ధ్వనికారపదము వృత్తికారవిషయమై కూడఁ జాలపర్యాయములు వాడఁబడియున్నది. ఇరువురి కభేదము కూడ కంఠతః చెప్పఁబడియున్నది. తమకు విరుద్ధమగు నీయంశమును డే గారన్యథా సమర్థించిరి.

ధ్వనిమార్గము కారికాకారునిచేఁ దొలుదొల్తనిరూపింపఁబడియున్నను, వివరించియుండకపోవుటచే జనులందఱును దానిని బాగుగ గుర్తెఱుంగ వీలు లేకపోయినది. వృత్తికారుఁడే వివరించి ధ్వనిస్వరూపమును నిరూపించుట నతఁడే ధ్వనికారుఁడని తదనంతరకాలీనులచేఁ బ్రతిపాదింపఁబడినది. విమర్శకదృష్టిఁ బరిశీలించినచో, వృత్తికారుఁడును ధ్వనికారుఁడే యనువాదుక స్థూలదృష్టిచేఁ గల్పింపఁబడిన దగుట సత్యదూరము. కాన నీయిరువురును వేర్వేఱువ్యక్తులని వీరియాశయము.

కారికాకారునివిషయ మంతగాఁ దెలియకున్నను, మనోరథుఁ డనునాతని సమకాలికుఁడై యాతఁ డుండియుండునని జాకోబీపండితుఁడు నిశ్చయించెను. కాని ధ్వన్యాలోకమున (పు. 9) నుదాహరింపఁబడిన "యస్మిన్నస్తి న వస్తు కించన మనః ప్రహ్లాది..." అనుఅభావవాద

8 S. K. De's Kavyalokalocana, iv. Introduction, P. 3.

పరమగు పద్యమును వ్రాసినయాతఁడు మనోరథుఁడనియు, నతఁడు గ్రంథకృత్సమానకాలీనుఁడనియు నభినవగుప్తుఁడు లోచనమున వివరించియున్నాఁడు. గ్రంథకారుఁ డన నభినవగుప్తునిదృష్టి నానందవర్ధనుఁడే కాని మూలకారుఁడు కాఁడని యాతని యీ క్రింది లోచనభాగములే విశదము చేయఁజాలియున్నవి: (ఇరువురును విభిన్ను లనువారి మతముచొప్పున)

"ఆనంద ఇతి గ్రంథకృతో నామ, తేన స ఏ వానందవర్ధనాచార్య ఏతచ్ఛాస్త్రద్వారేణ..." [పు.12.]

"సమాసోక్త్యాక్షేపయో రేక మేవోదాహరణం వ్యతరద్ గ్రంథకృత్." [పు. 37.]

"ఏవ మభిప్రాయద్వయమపి సాధారణోక్త్యా గ్రంథకృ న్న్యరూపయత్." [పు. 39.]

"అతఏవ గ్రంథకృత్పాభిధాస్యేన..." [పు. 58.]

ఈప్రమాణములం బరిశీలించినచో, జాకోబీగారి యభిప్రాయ మంత సముచితము కాదని తోఁచక మానదు.

## ౪. తటస్థుల యాశయము

పి. వి. కాణే మహోదయులు తమ యలంకార వాఙ్మయచరిత్రమున నానందవర్ధనుని తరువాతివా రండ ఱును మూలవృత్తికారులయైక్యమును బ్రతిపాదించిరని సోదాహరణముగ నిరూపించియున్నను, ఆమతము నవ లంబింప సాహసింపరైరి. అభినవగుప్తుని లోచనము వారి కడ్డుతగిలినది. కానఁ బైరీతిని గొంతవఱకు విషయమును బ్రతిపాదించియుఁ దటస్థభావమునే యవలంబించిరి. వా రుదాహరించిన - ఆనందవర్ధనానంతరకాలీనాలంకారికాభి ప్రాయము లిటఁ బొందుపఱతును. రాజశేఖరునిమత మీవఱకే వ్రాసితిని కానఁ దక్కినవానినే యుదాహ రించు టుచితము.

ఉద్భటుని కావ్యాలంకారసంగ్రహమునకు స్వాత లఘువృత్తిని రచియించిన—ధ్వన్యభావవాది యగు ప్రతీ హారేందురాజు

"కైశ్చిద్ ధ్వని ర్నామ సహృదయైః వ్యంజకత్వ భేదాత్మా కావ్యధర్మోఽభిహితః.........ప్రతీయమా నైకరూపస్య వస్తుత్రైవిధ్యం తైరుక్తమ్, వస్తుమాత్రా లంకారరసాదిభేదేన. తత్ర వస్తుమాత్రం ప్రతీయతే— యథా—'చక్రాభిఘాత.....'ఇతి."

[సార లఘువృత్తి, పు. 79.]

"యదుక్తం: 'ఆక్షిప్త ఏ వాలంకారః శబ్దశక్త్యా ప్రకాశతే, యస్మి న్ననుక్తః శబ్దేన శబ్దశక్త్యుద్భవో హి సః' ఇతి.........తత్రయత్తావద్వాచకశక్త్యాశ్రయం వ్యంగ్యభూతాలంకారైకనియతం శబ్దశక్తిమూలానురణన రూపవ్యంగ్యతయా సహృదయై రుక్తం 'సశ్వైకశరణ' మిత్యాదౌ." [పు. 83.]

"అతఏవ సహృదయై ర్యత్ర వాచ్యస్య వివక్షి తత్వం తత్రైవ వస్త్వలంకారయోః ప్రతీయమానయో ర్వాచ్యేన సహ క్రమవ్యవహారః ప్రవర్తితోఽర్థశక్తి మూలానురణనరూపవ్యంగ్యో ధ్వని రిత్యుక్తం నతు వాచ్యావివక్షాయా మపి. యత్రచ వాచ్య స్యావివక్షా పూర్వ ముక్తా, 'రామోఽస్మీతి', 'సువర్ణపుష్పా' మితిచ, తత్ర వయ మధికారాపేతప్రస్తుతార్థానుబంధి వస్తూపనిబంధా దప్రస్తుతప్రశంసాభేదత్వ మేవన్యాయ్యం మన్యామహే." [లఘువృత్తి, పు. 84.]

అను నీపోట్ల సహృదయపదమును కారికావృత్తి కారోభయపరముగ నిర్దేశించుచు, నిరువు రొక్కఁరే యను నభిప్రాయమును జాటుచున్నాఁడు.

కుంతకుఁడు తన వక్రోక్తిజీవితమున నానందవర్ధ నుని "తాలా జాఅన్తి గుణా" [తదా జాయన్తే గుణాః] అనుగాథ నుదాహరించుచు, "ధ్వనికారేణ వ్యంగ్యవ్యం జకభావోఽత్ర సుతరాం సమర్థితః, కిం పౌనరుక్త్యేన?" అని వ్రాసియున్నాఁడు. కాన ధ్వనికారుఁ డానందవర్ధ నుఁడే యని యతనిమతమని మన మెఱుఁగవలెను.

వ్యక్తివివేకకారుఁడగు మహిమభట్టుకూడ నీరీతినే నుడివెను:

"తచ్చ ధ్వనికారేణై వోక్తం 'యత్రార్థః శబ్దో వా.........' ఇతి." [వ్యక్తివివేకము, పు.1.]

"తథా చాహ ధ్వనికారః—'సారరూపో హ్యర్థః స్వశబ్దానభిధేయత్వేన ప్రకాశిత స్సుతరాం శోభా మావహతి." [పు. 11.]

ఇందు మొదటియుదాహరణము మూలగ్రంథములోనిది. రెండవది వృత్తిగ్రంథములోనిది. రెండును ధ్వనికారపదముచేతనే నిర్దేశింపఁబడిన వగుటఁ నిరువురు నొక్కరే యని యతని యభిమత మని యూహింపనగును. ఇంతియ కాక మహిమభట్టు ధ్వనికారుఁడే తన మూలగ్రంథమునకుఁ దానే వృత్తిని వ్రాసికొనియున్నాఁడని లిఖించెను.

"......అర్థః సహృదయశ్లాఘ్యః ఇతి సత్యమ్. కింతు తమర్థమితి తచ్ఛబ్దేన ఆనంతర్యా త్ప్రతీయమానస్యార్థస్య పరామర్శే సతి పారిశేష్యా దర్థో వాచ్యవిశేష ఇతి. స్వయం వివృతత్వా చ్చార్థశబ్దో వాచ్యవిషయ ఏవ విజ్ఞాయతే." [పు. 16.]

ఔచిత్యవిచారచర్చను రచించిన క్షేమేంద్రుఁడు కూడ

"తదుక్త మానందవర్ధనేన—
'విరోధీ వాఽవిరోధీ వా రసోఽంగిని రసాన్తరే,
పరిపోషం న నేతవ్య స్తేన స్యా దవిరోధితా.'"
[ఔచిత్యవిచారచర్చ, కావ్యమాల, 1. భాగ. పు. 134.]

అని మూలకారిక నానందవర్ధనరచితముగనే వచించినాఁడు హేమచంద్రుఁడు తనకావ్యానుశాసనమున

"అనేన స్వసంవేదనసిద్ధతా మాహ—
తథాచ శ్రీమదానందవర్ధనః—
'ప్రతీయమానం పునరన్యదేవ......' ఇతి."
[కావ్యానుశాసనము, పు. 26.]

అని మీఁదిరీతిని మూలకారిక యానందవర్ధనునిదే యని చెప్పెను. మఱల నీతఁడే "వినేయా నున్ముఖీకర్తుం కావ్యశోభార్థ మేవ వా" అనుకారికయు, "అర్థాన్తరగతిః కాక్వా..." అనుకారికయు ధ్వనికారునివని చెప్పుటచే ధ్వనికారానందవర్ధను లొక్కరే గాని వేర్వేఱువ్యక్తులు కారని తెలియఁగలదు.

విశ్వనాథకవిరాజుగారు తమసాహిత్యదర్పణమున "యత్తు ధ్వనికారేణోక్తం 'కావ్య స్యాత్మా ధ్వని'రితి." [పు. 17.]

"ధ్వనికారేణా ప్యుక్తం, 'నహి కవే రితివృత్తమాత్రనిర్వాహే ణాత్మలాభః. ఇతిహాసాదే రేవ తత్సిద్ధేః'" ఇతి. [పు. 19, 20.]

అని ధ్వనికారుని వనియే మూల వృత్తి గ్రంథముల రెంటిటి నుదాహరించియున్నారు. కాణేమహాశయు లీగ్రంథభాగముల నుదాహరించియు, నభినవగుప్తుని వ్యాఖ్య ప్రతికూల మగుటచే నేమియు నిశ్చయింపకపోయిరి.

### ౫. ఇరువురు నొక్కరే.

కాని కొందఱు "ఇరువురు నొక్కరే" యని వాదించుచున్నారు. ఈయభిప్రాయము చాలమందికి మనస్సున నుద్భవించినను వ్యక్తముచేయరైరి. కాని డాక్టర్ శంకరన్ మహాశయులు [Dr. A. Sankaran] తమ రసధ్వనిగ్రంథమున 9 నీవిషయమును సప్రమాణముగఁ బ్రతిపాదించెను. ఇందు వారికి మద్రపుర ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారము [The Government Oriental Manuscripts Library, Madras] నందలి యభినవగుప్తుని యభినవభారతి (భరతనాట్యశాస్త్రవ్యాఖ్య) మిక్కిలి ఉపయోగించినది. వారిచ్చిన ప్రమాణముల నిట వివరింతును.

"ఏతదేవోపజీవ్యానందవర్ధనాచార్యేణోక్తం, 'సుప్తిఙ్వచన' ఇత్యాది."
[అభినవభారతి, భా. 2, అధ్యా. 14, పు. 367.]

ఈ మీఁది "సుప్తిఙ్వచన—" అనునది కారిక.

"ఏత మేవార్థం సమ్యగానందవర్ధనాచార్యోఽపి వివిచ్య నిరూపయన్ సమీక్ష్య వినివేశితో రూపకాది రలంకారవర్గ ఇత్యుపక్రమేణ

9 Some Aspects of Literary Criticism in Sanskrit, or The Theories of Rasa and Dhvani, pp. 51—60.

'వివక్షాతత్పరత్వేన నాంగిత్వేన కథంచ న,
కాలే చ గ్రహణత్యాగౌ నాతినిర్వహణైషితా.'

ఇత్యాదినా గ్రంథసందర్భేణ సోదాహరణేన. తచ్చాస్మాభిః సహృదయాలోకలోచనే తద్విషయే విస్తరతో వ్యాఖ్యాతమ్."

[అభినవభారతి, భా. 2, పు. 385.]

"యత్తు వేణీసంహారే భానుమత్యాసహ దుర్యోధనస్య దర్శితో విలాసః, స నాయకస్య తాదృశేఽవసరే అత్యనుచిత ఇతి చిరంతనైరేవోక్తమ్—యథా సహృదయాలోకకారః 'సంధిసంధ్యంగఘటనం రసబంధవ్యపేక్షయా.' ఏతచ్చ వివరణేఽపి వాస్మాభిః వితత్య దర్శితమ్."

[అభినవభారతి, భా. 2, పు. 519.]

ఈ మీఁది యభినవగుప్తుని వచనరచన యిరువురొక్కరే యని నిరూపింపఁగలదు.

మఱియు ధ్వన్యాలోకలోచనమందే యొక్కొక్కయెడఁ గారికావృత్తికారులయభేదము కాననగును.

"ఏవం కారికాం వ్యాఖ్యాయ తదసంగృహీతమలక్ష్యక్రమవ్యంగ్యం ప్రకాశయితు మాహ–యస్త్వితి."

[పు. 130.]

"ఏవం వ్యంగ్యస్వరూపం నిరూప్య సర్వథా యత్ర చ్ఛాన్యం తత్ర కా వార్తేతి నిరూపయితు మాహ—ప్రధానేత్యాదినా." [పు. 219, 220.]

ఈ మీఁది స్థలములలోఁ గ్రమముగ "వ్యాఖ్యాయ," "నిరూప్య" అని ల్యబ్ప్రత్యయము కనఁబడుచున్నది. ఎవరు వ్యాఖ్యానముచేసిరో వారే "యస్త్వి" త్యాదికారికను జెప్పుచున్నారనియు, ఎవరు వ్యంగ్యస్వరూపమును నిరూపించిరో వారే "ప్రధానే" త్యాదికారికను రచించుచున్నారనియు, సమానకర్తృకత్వమునకే[10] వచ్చిన యీల్యప్ప్రత్యయములు తెలుపుచున్నవి. వ్యస్తపదములందున్న క్త్వాప్రత్యయములకు సమాసమున ల్యప్ప్రత్యయ మాదేశ మగును. కాన నర్థము భేదింపదు. ఈ పైకారణములచే మూలకారుఁడే వృత్తికారుఁడనియు, వృత్తికారునికంటె వేఱొకవ్యక్తి యుండి మూలమును రచింపలేదనియు, నిరువురును విభిన్నులను ననుమానమున కవకాశము కల్గించిన యభినవగుప్తుఁడే యిరువురొక్కరే యని నిరూపించె ననియు శంకరన్‌గారిమతము.

## ౬. సిద్ధాంతము

పై నిరూపింపఁబడిన మతము లన్నిటిని బరిశీలించినచో, నిరువు రొక్కరే యను మతమే సమంజసముగ నున్నదనియును, శంకరన్‌గారి ప్రతిపాదనము సమంజసముగనే యున్నదనియుఁ దోఁచుచున్నది. ఇరువురును వేర్వేఱను సంశయమును గొంతవఱకు సూచించినవాఁడొక్కఁ డభినవగుప్తాచార్యుఁడే. తక్కిన యందఱును, ధ్వనికారవృత్తికారు లిరువురు వేర్వేఱువ్యక్తులు. గారని వచించియేయున్నారు. అభినవగుప్తుఁడుకూడ నిరువురికి భేదము లేదని తన వ్యాఖ్యానములలో లిఖించియే యున్నాఁడు.

అభినవగుప్తుని సమకాలికుఁడగు మహిమభట్టిరువురికిని భేదము లేదని [ఇరువు రొక్కరే యని] ప్రతిపాదించుచుండఁగా నతనికి యథార్థము తెలియదని నుకువుట కడుంగడు సాహసము. మఱియుఁ గొన్ని ప్రమాణముల నిత్తును.

**i.** కారికాకారుఁడును వృత్తికారుఁడును వేర్వేఱు పురుషు లనిగదా కొందఱి మతము. మొదటికారికయందే "భాక్త మాహు స్త మన్యే" అని గలదు. "కొందఱు ధ్వనిని భక్తియందు (లక్షణ) అంతర్భవించినదానినిగాఁ బల్కుచున్నా"రని దానియర్థము. దీనిపైని గల వృత్తిఁ గనుఁడు.

"అన్యే తం ధ్వనిసంజ్ఞితం కావ్యాత్మానం గుణవృత్తి రిత్యాహుః. యద్యపి న ధ్వనిశబ్దసంకీర్తనేన కావ్యలక్షణవిధాయిభి ర్గుణవృత్తి రన్యో వా న కశ్చిత్ప్రకారః ప్రకాశితః, తథాపి గుణవృత్త్యా కావ్యేషు

10 పాణినీయాష్టాధ్యా: యి–"సమానకర్తృకయోః పూర్వకాలే, 3-4-21; సమాసేఽనఞ్ పూర్వే క్త్వో ల్యప్.7-1-37."

వ్యవహారం దర్శయతా ధ్వనిమార్గో మనాక్ స్పృష్టో లక్ష్యత ఇతి పరికల్పై్యవ ముక్తం 'భాక్త మాహు స్త మన్యే' ఇతి."

కారికాకారుఁడు వేఱని వాదించువారు కూడ నతనినామము, కాలము మొదలగువిషయములు తెలియ వనియే చెప్పియున్నారు. ఇరువురును విభిన్నులైనచో వృత్తికారుఁడు "యద్యపి న ధ్వనిశబ్దసంకీర్తన నేన..." అనువచనమును నుడువ నెట్లు సాహసించును? (ఎవ్వరును ధ్వనిని భక్తియం దంతర్భవించునట్లు చెప్పలే దని కదా దానియభిప్రాయము.) కారికాకారుఁ డేగ్రంథమును జూచి, "భాక్త మాహు స్త మన్యే" అని చెప్పెనో యెవ రెఱుంగుదురు? ఇరువురును వేఱ్వే అని వాదించినచో నీవృత్తివచనమునకు సామంజస్యము లేక పోవును కాన నిరువురు నొక్కరే యనుకొనవలెను.

ii. "తేన బ్రూమః సహృదయమనః ప్రీతయే తత్స్వరూపమ్" అనునది మొదటికారికయొక్క చివర పాదము. దీనికి వృత్తికారుఁ డీ క్రిందివిధమున వివరణము నొనర్చుచున్నాఁడు:

"అనేన చ రామాయణ మహాభారత ప్రభృతిని లక్ష్యే సర్వత్ర ప్రసిద్ధవ్యవహారం లక్షయతాం సహృదయానా మానందో మనసి లభతాం ప్రతిష్ఠా మితి ప్రకాశ్యతే."

ప్రీతిపదమునకు విస్మృతియం దానందపదము వాడఁబడినది. దీనిపైన లోచనము—

"ఆనంద ఇతి గ్రన్థకృతో నామ. తేన స ఏవానందవర్ధనాచార్యః ఏతచ్ఛాస్త్రద్వారేణ సహృదయహృదయేషు ప్రతిష్ఠాం దేవాయతనాదివ దనశ్వరీం స్థితిం లభతాం ప్రతిష్ఠాం గచ్ఛత్విత్యర్థః."

కారికలోని ప్రీతిపదమునకే యానందమని వివరణమని సహృదయులు తెలిసికొందురుగాక! ఆయానంద, పదప్రయోగమున వ్యంగ్యార్థముఁ దీసిన యభినవగుప్తుఁడు మూలకారునినామ మానందవర్ధనుఁ డని యంగీకరింపవలసియున్నది. ఒకవేళ వృత్తికారుఁడే యానందుఁడై, మూలకారుఁ డతనికంటె వేఱైనచో, వృత్తికారుఁ డీశాస్త్రము ద్వారా సహృదయహృదయముల నధిష్ఠింప వీలు లేదు. ధ్వనిమార్గమును గనిపెట్టినవాఁడు కారికాకారుఁడే యగుటనా ప్రతిష్ఠ యతనికే తగియున్నది. వృత్తికారుఁడు వివృతిని వ్రాయుట తప్ప వేఱు ఘనకార్య మొనర్చియుండ లేదు. కాన నానందుఁడే కారికాకారుఁడని యంగీకరించుట సముచితము.

iii. మూలకారుఁడు ధ్వన్యాలోక ప్రథమోద్యోతమునఁ దొలుత "యత్రార్థః శబ్దో వా..."అని ధ్వనిసామాన్యలక్షణముం జెప్పి యాపై "భక్త్యా బిభర్తి నైకత్వం రూపభేదా దయం ధ్వనిః" అని మొ. కారికలచే ధ్వనికి భక్త్యాద్యనంతర్భావమునే నిరూపించెను. కాని ధ్వని రెండువిధములని తద్భేదపరిగణనము నొనర్చియుండలేదు. ద్వితీయోద్యోత ప్రారంభమున మాత్రము:

" అర్థాన్తరే సంక్రమిత మత్యన్తం వా తిరస్కృతమ్,
అవివక్షితవాచ్యస్య ధ్వనే ర్వాచ్యం ద్విధామతమ్."

అని ధ్వనిభేదమగు నవివక్షితవాచ్యము యొక్క అవాంతరభేదద్వయమును బరిగణించుచున్నాఁడు. ఈయవివక్షితవాచ్యధ్వని యేమి?-అను ప్రశ్నకు మూలగ్రంథ మింతవఱకును సమాధాన మీయలేదు. మొదటియుద్యోతమున నావిషయ మెత్తుకొననేలేదు. వృత్తికారుఁడుమాత్రము ప్రథమోద్యోతమున

"అస్తిధ్వనిః; స చావివక్షితవాచ్యో, వివక్షితాన్యపరవాచ్య శ్చేతి ద్విప్రకారకః" అని ప్రతిపాదించియున్నాఁడు.

ముఖ్యమగు భేదద్వయము మూలకారునిచే ముందుగ నిరూపింపఁబడనిచో, రెండవయుద్యోతమునఁ దొలుతనే యవాంతరభేదములఁ బరిగణించుట పొసంగదు. కావున మూలకారుఁ డసంబద్ధప్రలాపి యనవలసివచ్చును. ఇరువురు నొక్కరే యని యంగీకరించినచోఁ, బ్రథమోద్యోతమున వృత్తిలో ముఖ్యభేదద్వయముఁ జెప్పుటచే నిపు డవాంతరభేదములఁ బరిగణించుచున్నాఁడని సమర్థింపవచ్చును. కాన ధ్వన్యాలోక మేకకర్తృకమే యనుటలో నిది యుపయోగించును.

iv. ద్వితీయోద్యోతముననే [పు. 107.]

"రూపకాది రలంకార
వర్గో యో వాచ్యతాం శ్రితః,
స సర్వో గమ్యమానత్వం
బిభ్ర ద్భూమ్నా ప్రదర్శితః."

అని యొకకారిక గలదు.

"అన్యత్ర వాచ్యత్వేన ప్రసిద్ధో యో రూపకాది రలంకారః సోఽన్యత్ర ప్రతీయమానతయా బాహుల్యేన ప్రదర్శిత స్తత్రభవద్భి ర్భట్టోద్భటప్రభృతిభిః. తథాచ ససందేహాది షూపమారూపకాతిశయోక్తీనాం ప్రకాశమానత్వం ప్రదర్శిత మి త్యలంకారాన్తరే వ్యంగ్యత్వం న యత్నప్రతిపాద్యమ్." అని దీనిపై వివృతి కలదు. దీనిం బట్టి యలంకారమున నలంకారాన్తరము వ్యంగ్య మగునని భట్టోద్భటాదులు నిరూపించిరని పలుకువాఁడు కారికాకారుఁ డనియే తెలియుచున్నది. ఆపై నున్నది కనుఁడు.

" ఇయ త్పున రుచ్యత ఏవ—
'అలంకారాన్తరస్యాపి ప్రతీతౌ యత్ర భాసతే,
తత్పరత్వం న వాచ్యస్య నాసౌ మార్గో ధ్వనే ర్మత.'

ఇందు "ఇయత్పునః..."అనునది వృత్తికారునివచనము. శ్లోకము మూలకారిక. దీనిపైని లోచనము—

"నను పూర్వై రేవ యదీద ముక్తం[11] కిమర్థం తవ యత్న ఇత్యాశంక్యాహ—ఇయదితి."

మూలకారుఁడే పూర్వులమతమును నిరూపించియుండ దానిని వృత్తికారుఁడు నిరూపించె నను నాశయమును మనమునం దిడికొని లోచనకారుఁడు "ఇయత్పునః" అనువృత్తిగ్రంథమునకు వ్యాఖ్య రచించుట సమంజస మగునా ? ఇరువురును వేర్వేఱువ్యక్తు లైనచో నిది సరిపడనేఱదు కావున దీనికి సామంజస్యము సాపాదింపఁ దలఁపు కలదేని యిరువురు నొక్కరే యని యంగీకరింపవలెను.

v. మూఁడవయుద్యోతమున [పు. 143.] "రసబంధోక్త మౌచిత్య" మ్మనుకారికను వివరించుచు వృత్తికారుఁడు

"ఇతి కావ్యార్థవివేకో యోఽయం చేత శ్చమత్కృతివిధాయీ, సూరిభి రనుసృతసారై రస్మదుపజ్ఞో న విస్మార్యః."

అని లిఖించియున్నాఁడు. ఇది వృత్తికారుని యాధిక్యమును దెలుపుదు చేయుచున్నది. ఇరువురును వేరువే రయినచోఁ గావ్యతత్త్వమును బ్రకటించినవాఁడు మూలకారుఁ డగుటఁ దదుపజ్ఞమే యగును. అపుడు వృత్తికారుని "అస్మదుపజ్ఞ" కథనము వ్యర్థము కావలసియున్నది. ఇరువు రొక్కరే యని చెప్పినచో నేమియు దోసము కలుగఁజాలదు.

vi. తృతీయోద్యోతమునందే వ్యంజనాస్థాపనావసరమున [పు. 109] వృత్తికారుఁడు

"తస్మాన్ ఘటప్రదీపన్యాయ స్తయోః. యథైవ హి ప్రదీపద్వారేణ హి ఘటప్రతీతా వుత్పన్నాయాం న ప్రదీపప్రకాశో నివర్తతే తద్వత్ వ్యంగ్యప్రతీతౌ వాచ్యావభాసః. యత్తు ప్రథమోద్యోతే 'యథా పదార్థద్వారేణ' ఇత్యుక్తం తదుపాయత్వ సామ్యమాత్రస్య వివక్షయా" అని వచించియున్నాఁడు. "యథాపదార్థద్వారేణ" అనునది కారిక యని చదువరులు జ్ఞప్తియం దుంచుకొనవలెను.

ఇచట లోచనకారుఁడు

" నను పూర్వ ముక్తమ్
'యథా పదార్థద్వారేణ వాక్యార్థః సంప్రతీయతే,
వాచ్యార్థపూర్వికా తద్వ త్ప్రతిపత్తి ర్హి వస్తునః'

ఇతి. తత్కథం స ఏవ న్యాయ ఇహ యత్నేన నిరాకృత ఇత్యాశంక్యాహ యత్త్వితి" అని వివరించి

11 ముద్రితపుస్తకమున "న తు పూర్వై రేవ యదీద ముక్త"మ్మని కానవచ్చుచున్నది. అది సరికాదు. ఈపాఠమునే యంగీకరించినచోఁ . బూర్వాపరవిరోధమును, అనన్వయమును సంభవింపఁగలదు. కాన పాఠమును శోధించుకొనుట యుచితము.

ఏకగ్రీవమైన అభిప్రాయము

# జీవామృతము

## 33 వత్సరములనుండి ప్రఖ్యాతిలో నున్న శ్రేష్ఠమైన టానిక్

| | | |
|---|---|---|
| ఇదివరలో దివాన్‌గా నున్న మ-రా-శ్రీ యస్. ఆర్. రామారావుగారు, పలాస, గంజాంజిల్లా. ఇటీవల మీ రంపిన జీవామృతము దానిపేరుకు తగినదని చెప్పుటకు సంతసించుచున్నాను. దానిని నా భార్యకిచ్చితిని. ఆమెకు తృప్తికరమైన ఫలితముల నొసంగినది. | మ-రా-శ్రీ వి. రామస్వామి అయ్యర్ అవర్‌గళ్, రిటైర్డు డిప్యూటీకలెక్టరు, చిత్తూరు. పండిత గోపాలాచార్యులుగారి జీవామృతము ఆలోచనతో పని చేయువారికి శ్రేష్ఠమైన టానిక్ యని నేను మనఃపూర్తిగా చెప్పగలను. | మ-రా-శ్రీ బి.వి. శ్రీహరి రావు నాయుడుగారు, ఐ.జి. ఆఫ్ రిజిష్ట్రేషన్, మద్రాసు. సాధారణటానిక్‌గాను, నరముల నిర్మాణము చేయుటకును, జీవామృతము నేనుపయోగించిన యితర ఔషధముల నన్నిటిని మించినది. |

మీరుకూడ యేల పరీక్షించరాదు? అది పూర్ణారోగ్యము నొసంగునే!

సీసా 1-కి రు. 3-4-0. ప్రతిచోటను దొరకును. కేటలాగు ఉచితము

## ఆయుర్వేదాశ్రమము

151 గోవిందప్పనాయక్‌వీథి, తపాలపెట్టె 287 మద్రాసు.

---

త్వరపడుడు! త్వరపడుడు!!

(గాంధిమహాత్ముని స్వీయచరిత్రము.)

## ఆత్మకథ (రెండుభాగములు)

శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారు తెనిగించినది.

మేలు కాగితము, ముచ్చట గూర్పు అచ్చు, బైండు

మొ భా. ౧ రు. ౦-౧౨-౦

,, భా. ౨ రు. ౧-౦-౦.

తపాలు ఖర్చులు ప్రత్యేకము.

అమూల్యమగు ఈ గ్రంథమునకు వెంటనే ఆర్డరులు పంపుడు.

మేనేజరు; ఆంధ్రపత్రికా కార్యాలయము, చెన్నపురి.

---

# ధ్రువనాడి

ననుసరించి ఒకసంవత్సర ఫలితములు మాస వివరములతో సహా వ్రాసి పంపుటకు ఛార్జి



రు. 2-4-0.

అనేకులు వ్రాయించుకొని సంతృప్తిపడుచున్నారు. జాతకచక్రము నకలుగాని, జన్మనక్షత్రముగాని పంపవలయును.

## ప్రొఫెసర్ శేఖర్,

మిస్సరిప్పు ఏలూరు (పశ్చిమగోదావరి)

యున్నాఁడు. "యథా పదార్థద్వారేణ" అనువచనము వృత్తికారునిదే యని మనస్సున నిడికొని యభినవగుప్తుఁడిట్లు వ్రాసినట్లు మీఁదివాక్యమువలన స్పష్టమగుచున్నది. కాన వృత్తికారుఁడే మూలకారుఁడని దీనివలనఁ దేటపడఁగలదు.

vii. ఈయుద్యోతమునందే 182వ పుటలో

"రసాద్యనుగుణత్వేన వ్యవహారోఽర్థశబ్దయోః,
ఔచిత్యవాన్యస్తా ఏతా వృత్తయో ద్వివిధాః స్మృతాః"

అనుకారిక కలదు. దానితరువాతికారిక

"విమతివిషయో య ఆసీ న్మనీషిణాం సతతమవిదితసతత్త్వః, ధ్వనిసంజ్ఞితః ప్రకారః కావ్యస్య వ్యంజిత స్సోఽయమ్."

అనునది పుట 204 లోఁ గలదు. ఈరెండింటికిని నడుమనే వృత్తికారునిచే లెస్సగా వ్యంజనావృత్తి విచారించి స్థిరీకరింపఁబడినది. నడుమఁ గల వృత్తిగ్రంథమును విడిచినచోఁ గారికలు రెండింటికిని సంగతియే కుదురదు. మొదటికారికయందు వృత్తులును, రెండవకారికయందు ధ్వనియు నిరూపింపఁబడియున్నవి కాన నారెంటికిని అతుకుబడి కుదుర్పవలెను.

"విమతివిషయో య"అను రెండవకారికకు దానికిపైనఁ గలవృత్తిగ్రంథములతో నేకవాక్యత యున్నట్లు "త దేవం గుణవృత్తివాచకత్వాదిభ్యః శబ్దప్రకారేభ్యో నియమేనైవ తావద్విలక్షణం వ్యంజకత్వమ్......త దేవమ్." అను వృత్తిగ్రంథమే తెలియఁజేయుచున్నది. లోచనకారుఁడును :

"విమతివిషయత్వే హేతు రవిదితసతత్త్వ ఇతి; అత ఏవావమర్శనా దత్ర న కస్యచి ద్విమతి రితస్తాత్పర్యాత్ కుణాత్ ప్రభృతీతి ప్రతిపాదయితుమాసీదిత్యుక్తమ్. ఏవంయత్కించిద్ ధ్వనే రాత్మీయరూపం భేదోపభేదసహితం యచ్చ వ్యంజకభేదముఖేన రూపం తత్సర్వం ప్రతిపాద్య ప్రమాణభూతం వ్యంగ్యవ్యంజకభావమేక ప్రఘట్టకేన శిష్యబుద్ధౌ వినివేశయితుం వ్యంజకవాదస్థానం రచితమితి ధ్వనిం ప్రతి య ద్వక్తవ్యం త దుక్తమేవ" అని కారికను వివరించియున్నాఁడు. ఇం దేకప్రఘట్టముగ శిష్యబుద్ధిపై శిద్యముకొఱకు వ్యంజనావృత్తిని వివరించినది వృత్తికారుఁడు కాని కారికాకారుఁడు కాఁడు. కాని కారికార్థమును వివరించుచు నాకారికాకారుఁడే యిట్లు వివరించెనని లోచనమున నుండుట నిరువురికిని భేదము లేదని యంగీకరింపవలెను.

మఱియు లోచనకారుఁడు "విమతివిషయో య" అను కారికావ్యాఖ్యానము ననుసరించియే "అధునా తు గుణీభూతో ఽప్యయం వ్యంగ్యః కవివాచః పవిత్రయతీ త్యమునా ద్వారేణ తస్యైవాత్మత్వం సమర్థయితు మాహ—ప్రకార ఇతి" అని వ్రాసియున్నాఁడు. ఇయ్యదియు మీఁది యభిప్రాయమును గొంతవఱకు బలపఱుపఁగలదు.

viii. 206 వ పుటలో "ప్రకారోఽయం గుణీభూత" అనుకారికావివరణమున "వ్యంగ్యాలంకారస్య గుణీభావే దీపకాది ర్విషయః. తథా—" అని గలదు. ఆపై "ప్రసన్నగంభీరపదా"అనుకారిక యున్నది." ఏవం ప్రకారత్రయస్యాపి గుణీభావ........బహుతరలక్ష్యవ్యాపకతాస్యేతి దర్శయితు మాహ—తథేతి." అని యచటి లోచనము. ప్రకారత్రయమునకును గుణీభావమును జెప్పినవాఁడు మూలకారుఁడే. మఱియు "తథా" అను అవతారికారూపపదము వృత్తికారునిది. దర్శయితమేమో మూలకారుఁడు. ఇచటిలోచనవచన మిరువురను భిన్నులు కారను నభిప్రాయమును వ్యక్తము చేయుచున్నది. ఇట్టిచిన్నచిన్నవచనము లనేకములు లోచనమందుఁ గానవచ్చుచున్నవి; కాని వ్యాసవిస్తరభయమున నన్నింటిని నుట్టంకింపనైతిని.

ఇట్టిప్రమాణములే గాక మూలవృత్తిగ్రంథముల రచనాప్రణాళియు, వ్యాఖ్యానసరళియు నేకకర్తృతయందుఁ బ్రమాణము లగుచున్నవి. ఇరువురు నొక్కరే యగుటచేఁ గొన్నికొన్నికారికలకు వ్యాఖ్య విపులముగఁ గన్పడదు. వేర్వేఱు వ్యక్తు లైనచోఁ బ్రతికారికకును వృత్తికారుఁడు విపులవ్యాఖ్యనే రచించియుండును. 14 వ పుటను గనుఁడు—

"తత్ర నాచ్యః ప్రసిద్ధో యః ప్రకారై రుపమాదిభిః;
బహుధా వ్యాకృత స్సోఽన్యైః కావ్యలక్ష్మవిధాయభిః"
(కారిక).

"తతో నేహ ప్రతన్యతే అనూద్యతే. కేవలం పున ర్యథోపయోగ మితి." (వృత్తి.) ఇందుఁ గారికావివృతియే లేదు.

"ప్రతీయమానం పున రన్యదేవ వస్త్వస్తి వాణీషు మహాకవినామ్, య త్త త్ప్రసిద్ధావయవాతిరిక్తం విభాతి లావణ్య మివాఙ్గనాసు."

అని 15 వపుటలోని కారిక. దీనివృత్తి మూలరూపముగనే

"ప్రతీయమానం పున రన్యదేవ వాచ్యా ద్వస్త్వస్తి వాణీషు మహాకవీనామ్." అని యున్నది. వృత్తి లేకున్నను నష్ట మేమి? 29, 32, 64, 82, 118, 121, 122 పుటలయందుఁ గూడ నీరీతిగనే యున్నది. ఇంక నిట్టివి చాలఁగఁ గలవు.

71 వ పుటలో రసవదలంకార విషయచర్చయందు

"ప్రధానేఽన్యత్ర వాక్యార్థే యత్రాంగంతు రసాదయః;
కావ్యే తస్మి న్నలంకారో రసాది రితి మే మతిః."
[అని కారిక.]

మూలమున "మే మతిః" అని యున్నపుడు పరమతము నిరూపింపఁబడవలెను. మూలమునందుఁ గాని వృత్తియందుఁ గాని "యిది పరమత" మని పరమతము నిరూపింపఁబడలేదు. వ్యాఖ్యాత వేఱైనచో దానిని నిరూపింపక తప్పఁడు. "మే మతిః" అనుదానికి "మామకీన. పక్షః" అను వివృతికూడ నభేదమును విశదము చేయుచున్నది. 74 వ పుటలో మాత్రము

"యత్ర హి రసస్య వాక్యార్థీ భావ స్తత్ర కథ మలంకారత్వమ్? అలంకారో హి చారుత్వహేతుః ప్రసిద్ధః న త్వసా వాత్మైవాత్మన శ్చమత్కార హేతుః" అని వృత్తి కలదు. పరమతము నొకింతయును సహింపక, మిక్కిలి నైరస్యమున వారిం జూచి, "ఇయ్యది నాపక్ష" మని దృఢతరముగఁ బలుకు వృత్తికారుని ఈసాహూత వాక్య మాతఁడే మూలకారుఁడని తప్పక చెప్పఁగలదు.

ఇంతియ గాక అప్పయ్యదీక్షితులుగారు తమ చిత్రమీమాంసయందు వృత్తికారునే ధ్వనికారునిగా నుడివిరి. పండితరాజుగారు పలుతావుల నీయభిప్రాయ మునే మాపియున్నారు. అతఁడు

"తథాచ ద్వితీయోద్యోతే—
"శబ్దార్థశక్త్యాక్షిప్తోఽపి వ్యంగ్యోఽర్థః కవినాపునః;
యత్రావిష్క్రియతే స్వోక్త్యాసాన్యై వాలంకృతిర్ధ్వనేః."

ఇతి సూత్రయిత్వా,..............'స్ఫుటం సోక్త్యా నివేదిత ఇత్యయమపి న ధ్వనే ర్మార్గః' ఇత్యాహు రానందవర్ధనాచార్యాః."
[రసగంగాధరము, పు. 262-263.]

—అని నిరూపించియుండుటచే ఆనందవర్ధనులే సూత్రకారుఁడును, వృత్తికారుఁడును గూడ నని నిశ్చయింపవచ్చును.

## 7. డేగారికి సమాధానములు

వృత్తికారుఁడే మూలకారుఁ డైనచో డే మహాశయుల యుక్తులకు విరోధము కలుగును గాన వానికి సమాధానములు చెప్పవలసియున్నవి. "అవస్థాదివిభిన్నానా" మనుకారికను వృత్తికార లోచనకారులు వేరువేరుగఁ జదువుచున్నా రను డే గారి తలంపు సరియైనది కాదు. లోచనకారుఁ డెట్లు పఠించెనో వృత్తికారుఁడుకూడ నట్లే పఠించెనని చెప్పుటలో నసంగత ముండదు. ముద్రితపుస్తకములో "న త చ్ఛక్య మపోహితుమ్" అను వృత్తిభాగము ముద్రాపకులపొరపాటున స్థూలాక్షరముల ముద్రింపఁబడి కారికాభాగముతోఁ గలుపఁబడినది. అది వారిపొరపాటు. దానినిబట్టి వేఱుగఁ దలఁచుట సరి కానేరదు.

కారికాకారుఁడు ధ్వనిమార్గము నారంభించియున్నను, దానిని వృత్తికారుఁడే విపులీకరించుటచే నతని తరువాతివా రందఱును వృత్తికారునే ధ్వనికారునిగాఁ బ్రకటించిరి కాని యథార్థమును గుర్తెఱిఁగి కాదని డే మహాశయులు నుడువుటయు ననుచితము. ధ్వనిమార్గము ధ్వనికారునిచేతనే ప్రారంభింపఁబడక అంతకుఁ బూర్వ

మునసే యున్నట్లు "కావ్య స్యాత్మా ధ్వని రితి బుధై ర్య స్సమామ్నాతపూర్వః" అను తొలికారికవల్లనే తెలియుచున్నది. "కేచి ద్వాచాం స్థిత మవిషయే తత్త్వ మూచు స్తదీయ" మ్మను నాలవపాదము నీయంశమునే తెలియఁజేయుచున్నది. కావున ధ్వనిప్రకాశకుఁడు కారికాకారుఁడే కాని యానందవర్ధనుఁడు కానందున ధ్వనికార పదముచేఁ గారికాకారుఁడే గ్రహింపఁబడవలసియున్నది.

ఈవాదవివాదముల కొకమాదిరి బీజమునాటిన యాతఁ డభినవగుప్తుఁడు. అతని సమకాలికుఁ డగు మహిమభట్టునకు యథార్థము తెలియకపోదుకదా! అతఁ డానందవర్ధనుఁడే మూల వృత్తిగ్రంథములను వ్రాసినట్లు చెప్పియే యున్నాఁడు. అభినవగుప్తుని గురువగు ప్రతీహారేందురాజుకూడఁ బై యభిప్రాయమునే కలిగియుండెను.

అభినవగుప్తుఁడుకూడ నిట్లే ప్రతిపాదించెనని యిదివఱకే లిఖింపఁబడియున్నది. అట్లయినచో నిరువురును విభిన్నులని ప్రతిపాదించు నతనివచనములకు గతి యేమని సందేహము కలుగవచ్చును. ఈ క్రిందిసమాధానముం గనుఁడు—

కావ్యప్రకాశాదిగ్రంథములు కొన్ని మూల వృత్తి గ్రంథరూపములచే ద్వివిధములుగఁ గలవు. అందు మూలకారుఁడే వృత్తికారుఁడని యందఱు నంగీకరించియున్నారు. కాని వ్యాఖ్య వ్రాయునపుడు మూలకారుఁడు తాను వేఱొ వ్యక్తి యైపోవుచున్నాఁడు. అట్టి యభిప్రాయమునే మనమునం దిడికొని మూలకారుఁడు, వృత్తికారుఁడునువేర్వేఱువ్యక్తులని యభినవగుప్తుఁడుపలికియుండును. ఆయథార్థముపై దృష్టి నిల్పక స్థూలదృష్టిం జూచినచో నిరువురును విభిన్నవ్యక్తులని తెలియవచ్చును.

కొన్నిచోట్ల లోచనవ్యాఖ్యానమున "ఇది నా యభిప్రాయమే కాదు. మూలకారుని యభిప్రాయము కూడ నింతియే యని వృత్తికారుఁడనుచున్నాఁ"డని కానవచ్చును. దానినిబట్టియు విభిన్నవ్యక్తిత్వమును నిర్ణయింప వీలు లేదు.

మూల వృత్తి కారు లిరువు రొక్కరే యైనను మూలమున లేని (మూలమునఁ బ్రతిపాదింపని) విషయము వృత్తియందు లిఖించుట సరిపడదు. మూలాభిప్రాయమునే వివరించి చెప్పునది వృత్తి. కాన మూలమును విడిచి వృత్తి స్వతంత్రరీతిని చరింపలే దను నభిప్రాయమే యట్టియెడ నభినవగుప్తసమ్మతమని మనము తెలిసికొనవలసియున్నది.

ఇరువురును విభిన్నవ్యక్తు లైనచో నొక చిన్న విషయమునసైనను భేదాభిప్రాయ ముండుట సహజము. అణుమాత్రమును భేద మెచటను గానఁబడకున్నది. రెండుభాగములకర్త యొకఁడే యనుటలో నిదియు నొక చిన్నహేతువు గాఁగలదు.

## 8 ఆనందవర్ధనుని చరిత్రము

పైకారణములంబట్టి యానందవర్ధనాచార్యుఁడే మూలకారుఁడును వృత్తికారుఁడును గూడ నని నిశ్చితమగుచున్నది. ఈతఁ డేశతాబ్దమునాఁటికాఁడో, చరిత్ర మేమియో యించుకంత ప్రస్తావించుట అప్రస్తుతముకాదు.

"ముక్తాకణః శివస్వామీ కవి రానందవర్ధనః,
ప్రథాం రత్నాకరశ్చాగాత్సామ్రాజ్యేఽవన్తివర్మణః"

అనుకల్హణుని రాజతరంగిణీపద్యము [5–34] ను బట్టి యితఁ డవంతివర్మకాలమువనుండినట్లు తెలియుచున్నది. అవంతివర్మ క్రీ. శ. 855 నుండి 884 వఱకుఁ గాశ్మీరదేశమును బరిపాలించినట్లు చరిత్రలవలనఁ దెలియుచున్నది. బ్యూలర్, జాకోబీపండితులు (Buhler and Jacobi) కూడ నీమతము నంగీకరించియున్నారు.

పిశల్ పండితుఁడు (Prof. Pischel) లోచనమునుబట్టి యానందవర్ధనుఁ డభినవగుప్తుని గురువని నిరూపించెను. లోచనమున ముచ్చోటుల 12 నట్లు కానవచ్చుచున్నది. కాని యభినవగుప్తుని ప్రగురువగు ముకుళభట్టుని తండ్రి యగు కల్లటుఁడు ఆనందవర్ధనుని సమకాలికుఁ డని తోఁచుచున్నది. కల్లటుఁ డవంతివర్మకాలము నాఁటివాఁడే యని

12. (1) అత్ర గ్రంథే ఽస్మద్గురుభి ర్నిరూపితః. [పు. 37.] (2) అస్మద్గురవ స్త్వాహుః. [పు. 183.] (3) అస్మదుపాధ్యాయాస్తు. [పు. 214.]

"అనుగ్రహాయ లోకానాం భట్టాః శ్రీకల్లటాదయః;
అవన్తివర్మణః కాలే సిద్ధాః భువ మవాతరన్."
[రాజతరంగిణి, 5-66.]

అను కల్హణునివచనమువలననే తెలియుచున్నది.

కాన సాక్షాద్గురు వనుట పొసఁగదు గాన నభినవగుప్తున కాతనియందు గురుభావ ముండుటచేఁ బరంపరగా గురువని చెప్పవచ్చును.

ఆనందవర్ధనుని చరిత్రమును దెలిసికొనుట కేమియు నాధారములు లభింప లేదు. కాని యితఁడు "నోణుఁ" డనునతని సుతుఁ డని యితని దేవీశతకమును బట్టి తెలియవచ్చుచున్నది. ఇతఁ డర్జునచరితము, విషమబాణలీల మొదలగు మఱికొన్ని గ్రంథములను గూడ రచించెనని యితనిధ్వన్యాలోకముంబట్టియే తెలియుచున్నది.

---

## మాతృవందనము

కల్లూరి వెంకటసుబ్రహ్మణ్య దీక్షితులుగారు

కైలాసపతి సముత్కటజటాజూట నిర్గళదమందసుధాతరంగ, గంగ
ప్రాలేయనిలయ సంభవభవ్య జలపాన సకలకల్మష తాప శమన, యమున
హిమశైలసౌధచంక్రమవిభ్రమామోద భరిత నిర్మలగాత్ర, బ్రహ్మపుత్ర
పంచాప్రవాహ సంవర్ధితాఖిలసస్య చిరబంధు సౌభాగ్యసింధు, సింధు
వుపనదీ కాంతలంత చేయూఁత నిడఁగ-నీకు మంగళనిత్యాభిషేక విధులు
గూర్తు రరవింద కహ్లారకుముదగంధ-బంధురోదారజలముల భారతాంబ!

హిమవన్నగం బుత్తరమునఁ గైదండయై కీర్తి విస్తార సంపూర్తిఁ దెలుపఁ
గడమ దిక్కులను సాగర కరఁగ ధ్వను ల్మంగళారావ సంపదలు గొలుప
పరమపావన నదీ భవ్యాది దేవతాకాంత లద్భుతనాట్య గతులు సలుప
వివిధఫలప్రసూన విరాజితారామ తతిభృంగము ల్గానశ్రుతులు గలుపఁ
బ్రకృతి చిత్రవిచిత్ర సంపదలతోడ-నఖిల విశ్వంభ రాధిపత్యము వహించి
నిండు పేరోలగమునఁ గన్పండువగుచుఁ-జెలఁగు భారతరాజ్యలక్ష్మి! నమస్సు.

అమరసింహాది సత్తములఁ బోషించిన యలవిక్రమాదిత్యు నంతవాఁడు
కవిదిగ్గజంబులం గరుణాంతరంగాన నాదరించిన భోజు నంతవాఁడు
ఆంధ్రవాగను శాసనాచార్యు లాలించి నట్టి రాజనరేంద్రు నంతవాఁడు
అలసాని పెద్దనాదుల మెచ్చుకొనిన విద్యానగరాధీశు నంతవాఁడు
ప్రకటకీర్తి విహారడోలికల నునిచి-తతమధుర సత్ప్రబంధ గీతముల జోల
వాడి నిన్నూపి రెంతటి భాగ్యవతివో?-భారతాంబా! జోహారులుపహారమమ్మ!

—'భారతాభ్యుదయము నుండి.'

---

ఇద్దరు కవులు :　　　కృష్ణశాస్త్రి　　　ముద్దుకృష్ణగారు.

నాయని సుబ్బారావు

రవి కవి. విలపిస్తున్నాడు అనుకుందాము. చూస్తూవుంటాము. విచారంగా వుంటుంది. లోపల బాధగా వుంటుంది. కాని ఆ బాధతోనే ఆ అందమైన గడ్డం, కళ్ళఅద్దాలు, ఆతీర్చిన ముక్కూ, ఆసౌందర్యం, ఆకన్నీళ్లూ, అంతా ఒకభంగిమ చూస్తుంటాము. విచారం ఒక్కటే కాదు. ఆదృశ్యం ఆకర్షణ యెక్కువ. గుండెల సమస్య ఒక్కటే కాదు. కన్నులకు కూడా అవసరం కద్దు.

గాంధి. ఏడుస్తున్నాడు అనుకుందాము. ఊ మనమూ ఏడ్చేస్తాం. గుండెలు ఓ పిండు కుపోతవి. కళ్లు మూసుకుని ఓ లోపలలోపల పొడుచుకు వొస్తున్న బాధతో యేడ్చివే స్తాము. ఒక్కటే బాధ.

ఈ విషయంలో:

కృష్ణశాస్త్రి రవికవివంటివాడు.

నాయని గాంధివంటివాడు.

కృష్ణశాస్త్రి జుట్టు జాగ్రత్తగా దువ్వు కుని, దుస్తులు వొయ్యారంగా సర్దుకుని, సౌం దర్యానికి ఏమీ లోపంలేదు కదా అని మూడు సారులు అద్దం చూసుకుని, ధైర్యం తోస్తేనే కాని వీధిలోనికి రాడు. అతనిభావంకూడా అంతే; చక్కనిపొందిక, జిలుగూ, మాధుర్యం, ధ్వనిగల భాష ఆహంగావితో గాని బయ టకు రాదు.

నాయని ప్రేమ యెక్కువ బాధిస్తూ వున్నరోజుల్లో శిరస్సు ముండనం చేయించు కొని వెఱ్ఱిగా తిరిగేడు. అతనిభావంకూడా అంతే; నగ్నంగా సూటిగా వొస్తుంది. నడక కూడా తోచినట్లు నడుస్తుంది.

కృష్ణశాస్త్రి ఏడుస్తా నంటాడు. "నన్ను విడువుడు, ఒకసారి నన్ను విడిచినంత ఏకాంత యవనికాభ్యంతరమున వెక్కివెక్కి రోదిం తును"అంటాడు. ఏడుస్తాడు," "నేను చిరునవ్వు పెదవుల నిలపలేను...... నేను జీవింపలేను" అని. కళ్లనీళ్లు కారుతూనే వుంటవి మనకూ. "ఓహో" అని కూడా అంటాము. ఏడుపు కూడా కళ.

నాయని ఏమీ చెప్పడు. తలుపుచా టుకు తీసుకు వెళ్లి గుండె బ్రద్దలుగా యేడ్చి వేస్తాడు. కౌగిలించుకుని మనమూ యేడు స్తాము.

శాస్త్రిదుఃఖం. గుండెలు కదపడమే కాదు. బాహ్యప్రకృతి నంతా కదిపి ఏడిపించు తాడు. కళ్లు తెరిచి చూస్తూ తెలుసుకుంటూ బాధపడిపోతాము. ఇతనిదుఃఖం భయపడుతూ చూస్తాము.

నాయనిదుఃఖం. కళ్లు మూసుకుని గుండె లలోతులోపడిపోయి బాధపడతాము. ఇతను ఏడుస్తాడంటే భయం వేస్తుంది. గుండెలు కొట్టుకుంటవి.

వీళ్ల ప్రేమా యింతే:

శాస్త్రి. ప్రేమిస్తున్నానంటాడు. ప్రేయసి, ప్రేమ, వొళ్లు తెలియకుండా పాడివేస్తాడు. మనం మబ్బులలో నక్షత్రాలలో వెన్నెలలో తేలిపోతాము. ఇతను ప్రేమరెక్కలమీద తేలి "ఏలో, ఎటకో ఎటకో జలదాల దాటితారక లవినీలనీలపథ రాజుల నతిక్రమించి, సోలిసోలి, చవలేటితుషారపుస్వప్న రాసులలో" కలిపిపోతాడు. లేదా, "కలదు నాలోన క్షీరసాగర ము నేడు" అంటాడు.

నాయని. ప్రేమగుండెలు తెరుస్తాడు. లోలోపలికి తీసుకుపోతాడు. "ఆనందధామ ములు అనేకభువనసంధుల రాజిల్లునవియు నేడు మత్పదాక్రాంతములు" "నీదివ్యసాన్నిద్య మం టికుంటె పుడమికిన్ స్వర్గమున కొక్క ముడి రచించి" అంటాడు.

శాస్త్రి ప్రకృతిలో లీన మాతాడు.

నాయని ప్రకృతిని తనలో లీనంచేస్తాడు

శాస్త్రి ప్రేయసి తెలిసికోలేము. శరీరం వీలులేని ఒకతేజస్సు. మనం చిత్రించి చూసు కోవలెనంటే, రంగులకు రేకలకు ఇముడు తుందా నాప్రేయసిసౌందర్యం అంటాడు.

నాయని ప్రేయసిని చూడగలము. గర్వంతో చూపుతాడు. రంగులు పరికరాలు యిచ్చి చిత్రించుకొమ్మంటాడు.

శాస్త్రి "ఏమృగతృష్ణనో వలచి యేడ్చెదు" అంటాడు.

నాయని "ఈమెకోసం యింత బాధ" అని చూపుతాడు.

శాస్త్రి ప్రేమ ప్రపంచంలో వున్నసౌందర్యం అంతమీదా వికసిస్తుంది.

నాయని ప్రేమ ప్రపంచంలో వున్నసౌందర్యాన్నంతా తనలోనికి ఆకర్షించుకుంటుంది.

---

## మా చందాదారులకు

మా కార్యాలయమునకు వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ 'చందా దారు' సంఖ్య వ్రాయవలెను. లేకున్న ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము. చందాదారుసంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముందున్నది. చందా దారులకు భారతి ౧౦-వ తేది లోపల అందకపోయిన యెడల వెంటనే తపాలువారికిని, మా కార్యాలయమునకును తెలుప గోరెదము.

మేనేజరు, 'భారతి.'

విరహ గోపి    పాటిబండ మాధవశర్మ గారు

(వెనుకటిసంచిక తరువాయి)

౨౧

ఓపగరాని దుర్భర వియోగము దాపురమయ్యెతోన, ఏ
శాప వినష్టమైన నిముసమ్మున నీ యమృతప్లుతస్ఫుర
ద్రూపము కన్నులం బడినదో! మరి కేవల మింక నొక్కడే
తేపకు చూచుకోవలచితిన్ నిను, సార్వయుగీనసుందరా!

౨౨

పావనప్రేమ జీవనులవైఖరి హేళనసేయు క్షుద్రమా
యావుల కాళులంటి వినయమ్మున వేడితి తెల్విమాలి; నీ
త్రోవ లెరుంగు పొందె పతితుల్ పలుగాకుల నాశ్రయించితిన్;
కేవల శుష్కహాసములకే గురియైతిని నీదుకోసమై!

౨౩

నీకయి బైసిమాలితిని నీకయి మానము మాపుకొంటి; ని
న్నేకలగాంతు; నిన్నె పలవింతు; నను న్మదపిచ్చి గొన్న పల్
గాకి యటించు దూరజనకాండము; కామెరపాటు గొన్న యీ
లోకము గుర్తెఱుంగునె యలోకభవద్విమలాచ్ఛ తేజమున్?

౨౪

బాహిరమే యెఱుంగని ప్రపంచము ఆంతర మేమెరుంగు; నీ
స్నేహములో నిదో గడనసేయు నిమిత్తమువోలె యేదియో
వ్యూహము పన్ని కల్లవలపుల్ గురిపించెదనంట; ఇంతవి
ద్రోహము లూహసేతురు నరుల్; జగ మెంతటి పాపదగ్ధమో!

౨౫

నీ నవనీత కోమలవినీల రసప్లుతమూర్తి వంశికా
గాన సుధాస్రవంతుల జగమ్మఖిలమ్మును మూర్ఛవోవగా

నానయనంపుదోయికి గనంబడునాటికి మెచ్చికోలుగా
ప్రాణసమర్పణమ్ము సలుపందలపోయుదు నైచ్ఛికమ్ముగా!

౨౬

కమ్మని పాటకుఁ మరియు కమ్మని మాటకు సౌధదిగ్ధరూ
పమ్మునకుఁ గడుఁ మొగిము వాచితి నంతియెగాని, నీదు వం
శమ్మునొపించెయమ్మునో, నిజమ్ముగ దొంగిలు బుద్ధిలేదు, లే
శమ్మును; నీదుపాదముల సాక్షిగనే వచియింతునింతయుఁ.

౨౭

నీవ మదీయజీవనవనీపికభర్తవు! సర్వలోక సంభా
వితవృత్త! మానసిక వాచిక కాయిక శుద్ధిగాగ ని
న్నే వరియించుకొంటి పయనెత్తు సహస్రభవాలకైన నా
పావన ప్రేమచిహ్నముగ; వర్షకవారిద కాలకైశికా!

౨౮

నీయధరోష్ఠబింబమున నించిన నాటిసుధా ప్రపల్లవ
చ్ఛాయలయందె నామరపు చాలని మేనికి దాహశాంతిగా;
నీయతిరూపహాసములు నించిన వెన్నెలతేటలందె ప
ర్యాయము లేని నాదు హృదయాంధతమోహృతిగా నశించెదఁ.

౨౯

నీకటి ఘంటికాగణ వినిర్మిత క్రమఘుణంఘుణారవా
నీకములందె నాహృదయ నిస్వహాణక్వణ నిశ్చయమ్ముగా;
నీకయిదోయి వేణువు ధ్వనించిన త్రెంపులులేని రాగపుం
బోకడలందె నా తనువు బాంగ్రపుజాళియగా భ్రమించెదఁ.

౩౦

నీమధులిగ్ధరుద్భ్రమలినీకృత దృష్ణివహప్రచోదితా
ధ్వామలయందె నాకు సతతమ్ము విహారము చేసికొంటగా;
నీమరుదింద్రనీలమణి నిర్మిత సంధకృదంగనిస్తుల
స్థేమములందె నాకనులు చిల్లులువోవుటగా వసించెదఁ.

౩౧

కామగవీపయః కలితక్రమవపుః పరిణద్ధమార్దవ
శ్రీ మదుదూఢ కర్కశశరీర నగత్వము గుద్దలింపగా,
నీమధురాధరామృతధునీలహరీపరిభూత దార్ఢ్యమై
నామలినాంగ మూర్ధ్వగమనత్వము మయ్యెడుగాక మాధవా!

౩౨

కాలజనుండు కూర్చిన యొకానొక నూతన జీవివంకకై
వ్రాలినదీయెడంద; అవురా! ఇది త్రెయ్యుటలేక యెన్నిజ
న్మాలుగ వచ్చుచుండిన యశాశ్వతమైత్రియొ! కాకయున్నచో
నేలను నాయెడంద తపియింపవలెన్ నినుగూర్చి స్నిగ్ధుడా!

౩౩

ఊరటలేక పేదవడియున్నయెడం దమరొక్కమారు క
న్నారగ నిన్నుజూచుకొను నాస జనింపపురానిలింప సం
చారసమర్హభీకర నిశాసమయమ్ముల సైత మిట్లె ని
ద్రారతిపిడి త్రుమ్మరెదు దానగదా హృదయాధినాయకా!

౩౪

బారులుగట్టి పక్షులు నభస్థలి నీడపథమ్మువట్టె; అం
భారవఘూర్ణితమ్ములు గవార్భకముల్ నిజగోష్ఠమార్గ సం
చారమువట్టె; ఈపొదలచాయల నీకయి వేచియున్న నీ
నీరవ విగ్రహమ్మటులనే శిలయయ్యె! తమమ్ము మున్కొనెన్.

౩౫

వేణువు మోవి మోపి, యరవిందదళామలినాంగుళీగతిన్
దేనియలూరు దివ్యఫణితిన్ బలికింపుము మంద్ర మధ్యమ
స్థానక్రమ ప్రకారమున తారమునంట! త్వదీయగాన సో
పానములంటి పెట్టుకొని ప్రాకెదనాకముదాక నోప్రభూ!

౩౬

చల్లనిపిల్లతెమ్మెరలు; శారదచంద్రిక; సైకతమ్ము; లీ
చల్లనివేళ లోకము వశమ్మగు తీయని కావిమోవిపై

పిల్లనగ్రోవి నూది వినిపింపుము మోహనరాగమొండు ; జల్
జల్లున త్రుళ్ళిమై పరవశ మ్మయిపోవగ గోపబాలకా!

౩౭

నీ రమణీయవంశకల నిస్వనమేటికొ రోజు రోజునన్
నీరసమై వినంబడెడు ; నీచిరుబొజ్జకునిండ వెన్నచే
కూరుతురాగదోయి యిటకున్ ! మురళీమృదుగానమే వినన్
నేరనినాడు లోకము మునింగి నశింపదటోయి మాధవా !

౩౮

స్ఫుటితద్వేషణ కంఠమై హతజనుశ్శృగ్భారమై, సంతతో
ద్భటభూభృన్నివ సత్త్రిదృక్ఛివమసః పద్మార్కమై, వల్లవీ
పటలాహ్లాది విలాసమై, హృతసుహృత్పాతిత్యమై, లోకసం
కట సంఘాతని బర్హణాఢ్యమగు పత్కంజమ్ము రంజిల్లుతన్ !

౩౯

దివిషత్ప్రోద్భట విద్విషత్స్మయతమోదీర్ణ చ్ఛటాచ్ఛేదన
వ్యవహారమ్మున నందగోపకుల దుగ్ధాంభోధి శీతాంశుడై
భవదూరస్థితి వీడిపుట్టి, వరగోపస్త్రైణ సౌందర్య వై
భవలోలుండగు కృష్ణమూర్తి హృదినావాసించునశ్రాంతమున్.

౪౦

ఉపసంహృతి

నీకై వేణువునాదు నాయుని మ్రోయింపంగదోయీ ప్రభూ!
లోకాలోకనగాగ్ర శృంగమున గొల్వుండిర్చి కూర్చుండి; స్వే
చ్ఛాకళ్యాణ సుధాప్రసన్నికర మాసారమ్ముగా, ద్విష్టపా
తాక ప్రాభవతైక్ష్ణ్య సంహరణ శైత్యమ్మైన సంగీతమున్ !!

---

# పెలియాజ్ మెలిజాండాలు

దేశరాజు రామదాసుగారు

(వెనుకటి సంచిక తరువాయి)

అంకము ౨.

రంగము ౧.

[ప్రవేశము: పెలియాజ్ మెలిజాండాలు]

పెలియాజ్—నే నెక్కడకు తీసుకొచ్చానో నీవు తెలియదు. మధ్యాహ్నము తోటలో మిక్కిలి వేడిగా నున్నప్పుడు, నేను తరచుగా నిక్కడకు వచ్చి కూర్చుంటాను. ఈవేళ చెట్లనీడల క్రిందకూడా గాలి మందంగా నుంది.

మెలిజాండా—ఆహా! ఈ నీ రెంత నిర్మలంగా నుందో......

పెలియాజ్—శీతాకాలంలో చల్లగాకూడ నుంటుంది. ఇదిత్యక్తమైన ఒక ప్రాతబావి. అది ఒకప్పుడో అద్భుతమైన బావి యని చెప్పుకుంటారు. దాని నీటి స్పర్శవల్ల గ్రుడ్డివాండ్రకు కళ్లు వచ్చేవి.—ఇప్పటికీ దీనిని "గ్రుడ్డివారి బావి" అని పిలుస్తారు.

మెలిజాండా—ఇప్పుడు మరి దీనివల్ల గ్రుడ్డివారి కన్నులు చక్కబడవా?

పెలియాజ్—ఇప్పుడు రాజునకే దాదాపు అంధత్వము ప్రాప్తించడముచే, దీనికడ కెవ్వరు రారు.

మెలిజాండా—ఇది యెంత నిర్జనముగా నున్నదో!......ఎక్కడనుండిగాని శబ్దము వినబడదు.

పెలియాజ్—ఇక్కడ నెప్పుడు నొక వింత నిశ్శబ్ద ముండును......చూచినవారికి నీరు నిద్రపోతున్నట్టు కనబడుతుంది......ఆ చంద్రకాంతశిలావేదిక కొనను కూర్చుందామా? అక్కడొక నిమ్మచెట్టున్నది. దానిగుండా నెప్పుడూ సూర్యకిరణములు ప్రసరింపలేదు.......

మెలిజాండా—నే నా చంద్రకాంత శిలావేదికపై పడుకుంటాను—నాకు నీటి యడుగు చూడవలెనని యున్నది.......

పెలియాజ్—దాని యడుగెవ్వరికీ కనబడలేదు. అది బహుశః సముద్రమంతలోతున్నాది. ఈ నీరెక్కడనుండి వస్తున్నాదో యెవరికీ తెలియదు. అది పాతాళమునుండి వస్తున్నాది కాబోలు.

మెలిజాండా—అడుగునేదైనా మెరుస్తూవుంటే, ఆవస్తువుతోగూడా నడుగు కనబడేది కాబోలు...

పెలియాజ్—అంతవంగకు...

మెలిజాండా—నాకు నీరు ముట్టుకోవాల నుంది.

పెలియాజ్—జారిపోతావు జాగ్రత్త...నేను నీ చెయ్యి పట్టుకుంటాను.

మెలిజాండా—వద్దువద్దు. నాకు రెండుచేతులు నీట్లో ముంచాలనుంది...నా చేతు లీవేళ వ్యాధిపీడితముగా నున్నాయి.

పెలియాజ్—ఆc ఆc జాగ్రత్త మెలిజాండా...మెలిజాండా—ఆc, నీజుత్తు!...

మెలిజాండా—[లేచి కూర్చుని] నే నందుకోలేను. నేను మరందుకోలేను.

పెలియాజ్—నీజుత్తు నీట్లో తడిసిపోయింది...

మెలిజాండా—అవునవును. అది నా చేతులకంటే పొడుగుగా నుంది...అది నాకంటేగూడా పొడుగుగా నుంది...

[నిశ్శబ్దము]

పెలియాజ్—నిన్నతడు చూచిన దొక బావివద్దనే గదూ?

మెలిజాండా—ఊc...

పెలియాజ్—అతడు నీ కేమి చెప్పాడు?

మెలిజాండా—ఏమీలేదు;—నాకు జ్ఞాపకములేదు.

పెలియాజ్—అతడు నీరు మిక్కిలి దగ్గరగా నున్నాడా?

మెలిజాండా—ఆఁ నన్ను ముద్దాడవలెనని యనుకున్నాడు.

పెలియాజ్—అది నీ కిష్టము లేదు?

మెలిజాండా—లేదు.

పెలియాజ్—ఎందుకు లేదు?

మెలిజాండా—అదిగో! అదిగో! నీటియడుగున నా కేదో కనబడుతున్నాది.

పెలియాజ్—జాగ్రత్త! జాగ్రత్త! దానిలో పడిపోతావు. దేనితో ఆడుతున్నావు?

మెలిజాండా—అత డిచ్చిన ఉంగరముతో.

పెలియాజ్—అది పోగలదు. జాగ్రత్త.—

మెలిజాండా—భయము లేదు. నాచేతుల నిదానం మీద నాకు నమ్మక ముంది...

పెలియాజ్—అంతలోతు నీటిమీద ఆలా ఆడవద్దు...

మెలిజాండా—నాచేతులు నింపాదిగా నున్నాయి.

పెలియాజ్—ఎండలో ఎలా మెరుస్తున్నాదో! ఆకాశంపై పంత మీద కెగురవెయ్యకు.

మెలిజాండా—అయ్యో!

పెలియాజ్—ఏం పడి పోయిందా?

మెలిజాండా—అది నీట్లోకే పడిపోయింది...

పెలియాజ్—ఏదీ! ఎక్కడ? ఎక్కడ?

మెలిజాండా—అది లోపలికి వెళ్లిపోవడము కనబడలేదు.

పెలియాజ్—దానికాంతి కనబడుతూ వున్నట్టుంది.

మెలిజాండా—నా ఉంగరమా?

పెలియాజ్—ఆఁ అవును. అదిగో అక్కడ...

మెలిజాండా—అబ్బా! అబ్బా! మనకు మిక్కిలి దూరంగా నుంది...కాదు, కాదు, అది కాదు...అది పోయింది...అది పోయింది...నీటిమీద ఒక పెద్దవలయం తప్ప మరేమి లేదు...ఇప్పు డేమి చెయ్యడము?...మన మిప్పు డేమి చెయ్యడము?...

పెలియాజ్—ఉంగరమునుగూర్చి నీ వంత చికాకు పడగూడదు. దానినిగూర్చి తలపెట్టకు...బహుశా తరువాత అది మనకు దొరకవచ్చు. లేదా మరొకటి మనము చూసుకుందాము.

మెలిజాండా—లేదు. లేదు. అది మనకుదొరకదు సరేకదా...మరొకటికూడా దొరకదు... నేను దానిని చేతులో గట్టిగా పట్టుకున్నట్టు తలచేను. వెంటనే చేతులు మూసేశాను. అయినప్పటికి పడిపోయింది...సూర్యుని వైపు మిక్కిలి ఎత్తుగా ఎగరవేశాను...

పెలియాజ్—రా, రా! మరొకనాడు మనము రావచ్చును. రా, వేళైంది. మనకోసం వాళ్లొస్తూవుంటారు.—ఉంగరం పడిపోయేటప్పుడికి మట్టమధ్యాహ్నముగా నుంది.

మెలిజాండా—ఉంగర మేమైం దంటే గొలాడ్‌న కేమి చెప్పుతాము.

పెలియాజ్—జరిగినదానిని చెప్పేదాము.

(నిష్క్రమింతురు.)

## రంగము ౨.

కోటయందలి ఒకగది

[గొలాడ్ పాన్పుపై శయనించి కనబడును; మెలిజాండా పాన్పుప్రక్క నుండును.]

గొలాడ్—ఆహా! అంతా సవ్యంగానే వెళ్లుతున్నాది. మరేమి కష్టం రాగూడదు. కాని యిదంతా యెలాగు వచ్చిందో నేను చెప్పలేను. అడవిలో నేను మామూలుగానే వేటాడుతున్నాను. ఎందుచేతనోగాని, హటాత్తుగా ఒక్కసారి నాగుఱ్ఱం తన్నింది. ఏదైనా విపరీత మైనసంగతి చూచిందా?... నే నప్పుడే మధ్యాహ్నం పన్రెండుగంటలు లెక్కపెట్టేను. పన్రెండోదెబ్బ వినే సరికి హటాత్తుగా భయపడి గ్రుడ్డివానికి పిచ్చెత్తినట్టు చెట్టుమీదకు పరుగెత్తింది. నేను పడిపోయాను, గుఱ్ఱం కూడా నామీదపడిపోయుండాలి. అడవంతా నాగుండెమీద పడిపోయిందనుకున్నాను. నాహృదయం నలిగి

పోయిం దనుకున్నాను. కాని నాగుండె గట్టిగానే వుంది. మరేమీ అపాయం రాకూడదు.

మెలిజాండా—కొంచెము నీరు త్రాగుతారా?

గొలాడ్—అక్కరలేదు అక్కరలేదు. నాకు దాహం లేదు.

మెలిజాండా—మీకు మరొకతలగడా కావాలా?...దీనిమీద కొంచెము నెత్తురు పడింది.

గొలాడ్—వద్దువద్దు—అవసరము లేదు. ఇప్పుడే నోటినుండి కొంచెము నెత్తురు కారింది. మళ్లీ మరికొంచెము కారుతుందేమో...

మెలిజాండా—నిశ్చయమేనా? మీ కంతగా బాధ లేదుగదూ?

గొలాడ్—లేదు. లేదు. ఇంతకంటే హెచ్చు బాధగా నుండేది. నేను కత్తికి, నెత్తుటికి అభ్యాసపడ్డాను ...ఇవి చిన్నపిల్లల యెముకలు కావు...నీవంత యెందోళన పడ నక్కరలేదు...

మెలిజాండా—మీరు కండ్లు మూసుకొని పడుకోండి. ఈరాత్రంతా నేను మీప్రక్కనే పడుకుంటాను.

గొలాడ్—వద్దు వద్దు, నిన్నాయాసపెట్టడము నా కిష్టములేదు. నా కేమి యక్కరలేదు...నేను, చిన్నబిడ్డలాగ పడుకుంటాను...ఏం మెలిజాండా? ఎందుకకస్మాత్తుగా ఏడుస్తున్నావు?

మెలిజాండా—(కన్నీరు గార్చుచూ) నేను... నేనుకూడా జబ్బుగానే వున్నాను.

గొలాడ్—నువ్వూ జబ్బుగానే వున్నావా? నీ కేమి బాధ?—

మెలిజాండా—నాకు తెలియదు...నా కిక్కడేమీ బాగులేదు...నేడు మీకు చెప్పేస్తా, నాథా! నాథా! నా కిక్కడ సౌఖ్యము లేదు....

గొలాడ్—ఏమి? ఏమిటైంది మెలిజాండా? ఏమిసంగతి?...అనుమానంలేని నేను...ఏమి? ఏమిటి జరిగింది? ఎవరైన నీయెడ నపరాధం చేశారా? నిన్నెవరైన నొప్పించగలరా?

మెలిజాండా—లేదు, లేదు; ఎవరు నాకు గోరంతైనా నొప్పి కలుగచెయ్యలేదు...అది కాదు...అది కాదు...కాని నేనిక్కడ మరుండలేను...కారణమేమో నాకు తెలియదు...నాకు వెళిపోవాలనుంది. దూరంగా వెళిపోవాలని...న న్నిక్కడ విడిచిపెట్టితే నేను చచ్చిపోతాను.

గొలాడ్—కాని యేదో జరిగుండాలి? నువ్వు నావద్దనుండి మభ్యపరుస్తున్నట్లున్నది. యథార్థమంతా నాతో చెప్పు మెలిజాండా!...దీనికి కారణం రాజా?... మా అమ్మా?...లేక పెలియాజా?...

మెలిజాండా—కాదు, కాదు, పెలియాజ్ కాదు. ఎవరూ కారు. మీరు నన్ను బోధపర్చుకోలేరు.

గొలాడ్—నే నెందుకు బోధపర్చుకోలేను?... నీ వేమీ చెప్పకపోతే నన్నేమి చెయ్యమన్నావు?...నీ వంతా చెప్పు. నా కంతా బోధపడుతుంది.

మెలిజాండా—ఇదేమిటో నామట్టుకు నాకే తెలియదు....ఏమిటో సరిగా నాకు తెలియదు. నేను చెప్పగలిగుంటే చెప్పుదును...అదేగో నాకంటే బలవత్తరంగా నుంది....

గొలాడ్—రా, తెలివిగా మాట్లాడు. మెలిజాండా! నన్నేమి చెయ్యమంటావు? నువ్వింకా పిల్లవు కావుగదా—నన్నా నువ్వు వదలియ్యాలనుకున్నది?

మెలిజాండా—ఆ, ఆ, కాదు. అది కాదు... నాకు మీతోనే వెళిపోవాలనుంది...ఇక్కడ నేను మరుండలేను... నేను చాలకాలం బ్రతకనని తోస్తుంది.

గొలాడ్—కాని, ఏమైనప్పటికి ఏదైనా కారణముండాలి. అందరు నీకు పిచ్చెత్తిం దనుకుంటారు. నువ్వు పిల్ల చేష్టలు చేస్తున్నా వనుకుంటారు. రా, ఏవిధంగానైనా పెలియాజేనా?—నీతో వాడు తరుచుగా మాట్లాడతా డనుకోను.

మెలిజాండా—మాట్లాడతాడు. మాట్లాడతాడు. అప్పుడప్పుడు మాట్లాడుతాడు. నన్ను చూస్తే యేవగించినట్లు కనబడతాడు. అతని కండ్లల్లో అది కనబడుతుంది...కాని నన్ను కలిసినప్పుడల్లా మాట్లాడతాడు...

గోలాడ్—దానికి నువ్వు మరోకలా గెంచకూడదు. వాడెప్పుడూ ఆలాగే వుంటాడు. వాడు వింత మనిషి. అదిగాక యిప్పుడు వాడు మిక్కిలి విచారంగా నున్నాడు. వాడిప్పుడు మరణాసన్నుడైన వాని స్నేహితుని, మార్సెలస్‌ను తలచుకుంటున్నాడు. బహుశః అతన్ని చూడడానికి వెళ్ల వీలు లేదేమో...వాడు మారిపోతాడు. నువ్వే చూస్తావు. ఇంకా వాడు చిన్నవాడు.

మెలిజాండా—కాని అదికాదు...అదికాదు...

గోలాడ్—అయితే యేమిటి?—ఇక్కడ జీవితానికి నువ్వలవాటుపడలేకపోయావా? ఇచ్చట నీకు చాల నిర్జనంగా నుందా? నిజమే యీకోట మిక్కిలి పురాతనమైనది. మిక్కిలి చీకటిగాను;...మిక్కిలి చల్లగాను, లోతుగాను ఉంది, ఇందులోనున్నవారందరు వయస్సుచెల్లినవారే. దేశంకూడా వెలుతురులేని యడవులతో భయంకరంగా కనిపిస్తుంది. కాని కోరినట్టయితే యిదంతా మిక్కిలి సంతోషకరంగా చేసుకోవచ్చును. అప్పుడెక్కడా సంతోషమే. అయితే సంతోషం రోజూ రాబోదు. ప్రపంచం ఎలా నడుస్తున్నదో దాన్ని తెలుసుకోవాలి. అయినా కొంచెం చెప్పు, ఏదైనా సరే నువ్వు కోరినది నే నిస్తాను....

మెలిజాండా—అవునవును—అది నిజమే... ఇక్కడాకాశమే కనబడదు. నేటి ప్రాతఃకాలమందే నేను మొట్టమొదట ఆకాశం చూశాను.

గోలాడ్—దీనికేనా యేడుస్తున్నావు, అయ్యో! నా పిచ్చిదానా?—అంతేనా మరేమి లేదూ?—నీకాకాశం కనబడలేదని నువ్వేడుస్తున్నావా? లే, లే, ఇటువంటివాటి కన్నిటికి ఏడుస్తూవుండాచు నే వయస్సులో లేవు—ఇక్కడేమి యెండాకాలం లేదా? కొద్దిలో నిక నీకు రోజూ ఆకాశం కనబడుతునేవుంటుంది—తరువాతి వచ్చే సంవత్సరం...రా, నీ చెయ్యియ్యి, నీరెండు చిన్నిచేతులూ యియ్యి. [ఆమెచేతులను పట్టుకొనును.] ఆహాహా! ఈ చిన్నిచేతులను నేను పువ్వులవలె నలిపివేయగలను...ఏదీ నే నిచ్చిన ఉంగరమెక్కడ?

మెలిజాండా—ఉంగరమా?

గోలాడ్—అవును. మన పెండ్లిఉంగరమేదీ?

మెలిజాండా—అది...అది పడిపోయిందనుకుంటాను.

గోలాడ్—పడిపోయింది? ఎక్కడ పడిపోయింది? పోగొట్టలేదుకద?

మెలిజాండా—లేదు లేదు, అది పడిపోయింది... అది పడిపోయుండాలి...కాని అదెక్కడుందో నాకు తెలుసును.

గోలాడ్—ఎక్కడుంది?

మెలిజాండా—మీకు... మీకు... ఆ సముద్రం ప్రక్క నున్న గుహ తెలుసునుగదా?

గోలాడ్—తెలుసును.

మెలిజాండా—సరే అక్కడుంది...అక్కడుండాలి...అవు నవును. నాకు జ్ఞాపకంవచ్చింది...ఈవేళ ఉదయం న్యియాల్డుకోసం గుల్ల లేరడానికని అక్కడికి వెళ్లేను...అక్కడ మంచిమంచి గుల్లలున్నాయి. అప్పుడే ఉంగరం నాచేతినుండి జారిపోయింది...అంతలో కెరటము మీదికి వచ్చింది. నేను మరి వెనక్కుండా వెళ్లిపోరావలసివచ్చింది.

గోలాడ్—అక్కడున్నదని నీకు నమ్మకమేనా?

మెలిజాండా—ఆఁ. ఆఁ. నమ్మకమే...జారిపోయినట్టు నాకు తట్టింది. అప్పుడు వెంటనే ఒక్కసారి గా అలలఘోష......

గోలాడ్—నువ్వు వెళ్లి యీక్షణమే దానిని తీసుకరావాలి.

మెలిజాండా—నేను వెళ్లి యీక్షణమే దానిని తీసుకరావాలి?

గోలాడ్—అవును.

మెలిజాండా—ఇప్పుడే?—వెంటనే? యీ చీకట్లో?

గోలాడ్—అవును. ఇప్పుడే, వెంటనే, యీ చీకట్లో! నువ్వు వెళ్లి తక్షణం దాన్ని తీసుకురావాలి. ఆ ఉంగరాన్ని పోగొట్టుకున్నకంటే నాకున్న యావత్తు పోగొట్టు

నుంటాను. అది యెక్కడనుండి వచ్చినదో నీకు తెలీయదు. ఈరాత్రి సముద్రం చాల గొప్పగా పొంగుతుంది. సముద్రం పొంగి నీకంటే ముందు దాన్ని తీసుకుంటుంది... త్వరపడు...నువ్వు వెళ్లి తక్షణమే దాన్ని తీసుకురావాలి...

మెలిజాండా—నేను వెళ్ల లేను...నేనొక్కర్తె నే వెళ్ల లేను.

గొలాడ్—వెళ్లు. నీ యిష్టమువచ్చినవారితో వెళ్లు. ఒకరు లేదు. కాని నువ్వువెంటనే వెళ్లాలి. వినబడ్డాదా?—త్వరపడు—పెలియాజ్ ని నీతో రమ్మని పిలువు.

మెలిజాండా—పెలియాజా? పెలియాజ్ తో నా? కాని పెలియాజ్ నాతో రాడేమో...

గొలాడ్—పెలియాజ్ నువ్వు కోరినట్టూ చేస్తాడు. పెలియాజ్ సంగతి నీకంటే నాకు బాగా తెలుసును. వెళ్లు,వెళ్లు, త్వరపడు. నాఉంగరం రాకుండా నేను నిద్రపోను.

మెలిజాండా—అయ్యో! అయ్యో! నాకు సౌఖ్యం లేదు...నాకు సౌఖ్యం లేదు...[ఏడ్చుచు నిష్క్రమించును.]

## రంగము 3

గుహాముందట.

[ప్రవేశము: పెలియాజ్, మెలిజాండాలు]

పెలియాజ్—[గొప్పసంభ్రమముతో మాట్లాడుచు] అవును; ఈపనిమే ఘనము చేశేము. మిక్కిలి చీకటిగా నుండటముచేత గుహాముఖద్వారము మిగిలిన చీకటినుండి వేరుపరచడము కష్ట సాధ్యము...ఆదారిని నక్షత్రములు లేవు. చంద్రుడా పెద్ద మేఘమును చీల్చుకొని వచ్చిందాక ఆగుదాము. వెన్నెల గుహంతా వెలుతురిస్తుంది. అప్పుడు మనము నిర్బాధకముగా లోపలికి ప్రవేశింపవచ్చును. దారి మిక్కిలి సన్నముగా నుంది. రెండు సరస్సులు కలిసిన దగ్గర ఎవరికీ తెలియని ప్రమాదకరమైన స్థలములు కొన్నున్నాయి. నేను దివిటీగాని లాంతరుగాని తేవడము మరిచిపోయాను. కాని ఆకాశమండలి కాంతిరేచాలు ను అనుకుంటాను.—నువ్వెప్పుడు నీ గుహాలోనికి వెళ్ల సాహసించడము లేదుగదు?

మెలిజాండా—లేదు.

పెలియాజ్—రా, లోపలికి రా,... అత డొకవేళ అడిగినట్టయితే, నీ ఉంగరము పోయినస్థలమును వర్ణింపడానికి సామర్థ్య ముండాలి...ఇది మిక్కిలి పెద్దదియు సుందరమైనగుహ. ఇందు మనుష్యులను, చెట్లను పోలి జలనిర్మితమైన దిబ్బ లున్నాయి. ఇది నీలివర్ణమైన నీడలతో నిండియున్నది. కొసవరకు దీని నెవరూ పరిశీలించి యుండలేదు. ఇక్కడ నిక్షేపము లుంచినట్లు కనపడుతున్నది. పురాతననౌకల భగ్న శకలములు కనబడును. కాని దారి తెలిసినవా డొకడు లేక యెవరును దూరము పో సాహింపగూడదు. కొందరు వెళ్లినవారు తిరిగి రాలేదు. నామట్టుకు నేను దూరము పో సాహసింపను. ఆకాశముయొక్కగాని, అలలయొక్కగాని వెలుతురు మనకు కనబడకపోగానే మన మాగిపోదాము. ఎవరైనా ఒక చిన్నదీపం వెలిగిస్తే, పైకప్పు ఆకాశమువలె నక్షత్రములతో నిండినట్టు కనబడును. ఆలాగు కనబడడానికి, రాతిని ప్రకాశింపజేస్తూ అక్కడనున్న స్ఫటికపు ముక్కలూ, లవణఖండములు కారణమని అంటారు.—చూడు, చూడు. ఆకాశము నిర్మలంగా అవుతున్నట్టున్నాది...నీ చెయ్యియ్యి. వణకవద్దు. ఆలాగు వణకవద్దు. భయ మేమి లేదు. సముద్రపువెలుగు మనకు కనబడకపోగానే మనం ఆగిపోదాము...ఈ గుహారావము నీకు భయం కలిగిస్తున్నాదా? అది రాత్రియొక్క శబ్దము. మౌనముయొక్క శబ్దము...మనవెనుక సముద్ర ఘోష వినబడుతున్నాదా?—అది యీరాత్రి అంత ఆనందంగా కనబడదు. ఆఁ. ఇదిగో వెలుగు...

[చంద్రుడు విశాలముగా బిలముఖద్వారమును, బిలమును వెలిగించును. కొంతలోతులో ముగ్గురు ముదుసలిభిక్షుకులు నరసినగెడ్డములతో, ఒకరిప్రక్క నొకరు, రాతికి చేరబడి నిద్రపోతూ, కనబడుదురు.]

మెలిజాండా—అమ్మో!

పెలియాజ్—ఏమిటది?

మెలిజాండా—అక్కడ...[ముగ్గురు భిక్షుకులనుచూపును]

పెలియాజ్—సరిసరి. నేను చూశాను.

మెలిజాండా—మనం వెళిపోదాం పద... మనం వెళిపోదాం పద...

పెలియాజ్—ఆఁ అలాగే.—అక్కడ నిద్రపోతున్నవారు ముగ్గురు వృద్ధభిక్షుకులు... దేశంలో కరవుగా నుంది... ఇక్కడ పడుకోడానికి వీ రెందుకు వచ్చారో!

మెలిజాండా—పోదాం పద. రా. రా. పోదాం పద.

పెలియాజ్—జాగ్రత్త. అంత గట్టిగా మాట్లాడవద్దు... వారిని లేపవద్దు... వారింకా గాఢనిద్రలో నున్నారు... రా.

మెలిజాండా—విడిచిపెట్టు, నన్ను విడిచిపెట్టు—నే నొక్కర్తె నే నడుస్తాను.

పెలియాజ్—మళ్లీ మరొకనాడు వద్దాము.

[నిష్క్రమింతురు.]

రంగము ౪

కోటలో నొకగది

[ఆర్కేల్ పెలియాజులు కనబడుదురు]

ఆర్కేల్—నువ్వు చూస్తునేవున్నావు. నీ నిరర్థకప్రయాణమును నిరోధిస్తూ, నిన్నిక్కడ నుంచడానికే ప్రతిహింశము పన్నుచునుతున్నట్టున్నది. ఇదివరకు నీ తండ్రియొక్క స్థితిగతులు నీకు మభ్యపరిచారు. కాని యిప్పుడతని సంగతి సిరాళగా నుంది. ఆ ఒక్క కారణమే నిన్నుంచడానికి చాలును. కాని యింకా అనేక కారణాలున్నాయి... మన ప్రతిపక్షులు దండువెడలనున్న సమయంలో, మన ప్రజ లాకటిచే మాడుతూ అన్ని వైశ్యులగొణుగుకొనుచున్న సమయంలో నీవు మమ్మ విడుచుట భావ్యం కాదు.—మరి యీ ప్రయాణమెందుకు? మార్సిలస్ చనిపోయినాడు. వచ్చినవారి సమాధానం చూచుటకంటే జీవితమునకు విధ్యుక్తధర్మాలింకా వున్నాయి. నీకుందజీవితమువల్ల నీకు చికాకుగా నుందని చెప్పుతున్నావు. కాని చురుకుదనమును, కార్యశూరతయు దారిప్రక్కను దొరికేవి కావు. ప్రతిక్షణమును వానిని నాహ్వానించుటకు సంసిద్ధుడవై యుండాలి. అవి ప్రతిదినము ను వస్తూపోతూవుంటాయి. వానిని నువ్వెప్పుడూ చూడలేదా? నేనంధప్రాయుడ నైనప్పటికి వానిని చూడడం నీకు బోధపరుస్తాను. ఏనాడు వాని నాహ్వానించడానికి సిద్ధంగా నుంటావో ఆనాడు నీకు వానిని చూపిస్తాను. ఇంకా విను: నీహృదయాంతరాళమునుండి యీ ప్రయాణము చేయక తప్పదని తోస్తే, వెళ్లడానికి నే నే మాత్రమును ఆటంకపెట్టను. ఏలనంటే, నేనిని నీక్షేమము నకై యర్థింపవలెనో, విధి కాహుతిచేయవలెనో, నాకంటె నీకే బాగా తెలుసును. నేనుమాత్రము, మనకు ఏమిటి జరగబోవుచున్నదో తెలిసేవరకు మాత్ర ముండ గోరుతాను...

పెలియాజ్—నే నెంతకాలం వేచుండాలి.

ఆర్కేల్—కొన్ని వారములు— కొద్దిరోజు లే కావచ్చును.

పెలియాజ్—సరే. ఉంటాను.

అంకము 3

రంగము ౧

కోటలో నొకగది

[పెలియాజ్ మెలిజాండాలు కనబడుదురు. మెలిజాండా గది కొండవకోనను తిప్పకు నూలు చుట్టు చుండును.]

పెలియాజ్—య్నియా ల్డింకా రాలేదు. ఎక్కడికి వెళ్లేడు?

మెలిజాండా—వాడు సందులో నేదోవిన్నాడు; అదేమిటో చూడడానికి వెళ్లేడు.

పెలియాజ్—మెలిజాండా......

మెలిజాండా—ఎందుకు?




గానకళాప్రవీణమగు శునకము. దీనియెదుర పాటపటమును చూపిన నాపాటరాగము నాలాపించును




న్యూయార్కు నగరపు సాయంసమయ దృశ్యము

పెలియాజ్—పని చెయ్యడానికింకా నీకు కనబడుతున్నాది?

మెలిజాండా—నేను వెలుగులోను చీకటిలోను ఒక్కలాగే పనిచెయ్యగలను......

పెలియాజ్—కోటలో నందరూ పడుకున్నట్టున్నారు. గొలాడ్ వేటనుంచి యింకా యింటికి రాలేదు. మొత్తంమీద చాలా రాత్రైంది.... వాడు పడిపోయినదెబ్బవల్ల యింకా బాధపడుతున్నాడా?

మెలిజాండా—ఇప్పుడు మరేం బాధ లేదని చెప్పారు.

పెలియాజ్—వాడింతకంటే జాగ్రత్తగా నుండవలసింది. వాని అవయవము లిరువయ్యేండ్లయువకుని అవయవాల్లాగ బలంగా నుంవు... నాకు కిటికీలోనుండి నక్షత్రాలు కనబడుతున్నాయి. చెట్లపై ప్రకాశిస్తూవున్న చంద్రకాంతికూడ కనిపిస్తూ వున్నది. చాలా రాత్రైంది. ఇప్పుడు మరి వాడు తిరిగి రాడు. [తలుపు తట్టుట వినబడును.] ఎవ రక్కడ? లోపలికి రా... [న్యియాల్డు తలుపు తెరచి లోనికి ప్రవేశించును] నువ్వేనా అలా తలుపు తట్టిందీ... తలుపు తట్టేమార్గ మది కాదు. ఏదో ప్రమాదం జరిగినట్టు కొట్టేవు... చూడు. మీ చిన్నమ్మను భయపెట్టేశావు.

న్యియాల్డు—నేను మెల్లిగానే తట్టేను.

పెలియాజ్—చాల రాత్రయింది; నాన్నగారీరాత్రి యింటికి రారు. నిద్రపోడానికి వేళైంది....

న్యియాల్డు—మీరు నిద్రపోంది నేను పోను.

పెలియాజ్—ఏమిటి?...ఏమి టంటున్నావు?

న్యియాల్డు—నేను....మీకంటే ముందు....మీకంటే ముందు...నిద్ర పోనన్నాను. [ఒక పెట్టున నేడ్చుచు మెలిజాండా ప్రక్క దాగును]

మెలిజాండా—అ దేమిటి న్యియాల్డు—...అదేమిటి?...ఒక్కసారిగా ఎందు కేడుస్తున్నావు?

న్యియాల్డు—(వెక్కి వెక్కి) ఎందు కంటే....

మెలిజాండా—ఎందుకు చెప్పమ్మా ఎందుకు?

నియ్యాల్డు—చిన్నమ్మా....చిన్నమ్మా...నువ్వు వెళిపోతున్నావు......

మెలిజాండా—ఎందుకు న్యియాల్డు నీ కేమి పట్టింది?...నేను వెళిపోతా నని కల్లోనైనా అనలేదే.

న్యియాల్డు—వెళిపోతావు. వెళిపోతావు. నాన్న వెళిపోయారు నాన్నగా రింకా రాలేదు.....ఇప్పుడు మీరుగూడా వెళిపోతారు. నేను పోల్చుకున్నాను.... నేను పోల్చుకున్నాను...

మెలిజాండా—కాని అటువంటిమాటే రాలేదే. నియ్యాల్డు...దేనివల్ల నేను వెళిపోతా నని పోల్చుకున్నావు?...

న్యియాల్డు—నేను పోల్చేను...నేను పోల్చేను... నాకు వినబడకుండా కక్కతో నీ వేవో కొన్ని సంగతులు చెప్పావు?

పెలియాజ్—వానికి నిద్రగా నుంది.....వాడేదో కలగన్నాడు...రా న్యియాల్డు...అప్పుడే నిద్ర పోతున్నావా? ఆకిటికీలో నుండి చూడు. హంసలు కుక్కలతో దెబ్బలాడుతున్నాయి.

న్యియాల్డు—(కిటికీవద్ద) ఆఁ, అదిగో, అవి కుక్కలను తరుముతున్నాయి...వాటినవితరుము మన్నాడు అబ్బా! అబ్బా! నీరు...రెక్కలు...అవి జడిసిపోయాయి.

పెలియాజ్—[మెలిజాండావద్దకు తిరిగి పోయి] వానికి నిద్రగా నుంది, వాడు నిద్రతో పోరాడుతున్నాడు. వానికండ్లు మూతలు పడుతున్నాయి....

మెలిజాండా—[నూలు వడకుచు గొంతుకలో పాడుకొనుచుండును.]

ద్యానియల్ యోగి పాదపద్మములు గొలుతు
ధన్యు మైకేలు నాత్మలోఁ దలఁచుచుందు...

న్యియాల్డు—[కిటికీవద్ద] అమ్మా! అమ్మా!

మెలిజాండా—[తటాలున లేచి] అ దేమిటి న్యియాల్డు?......అ దేమిటి?

న్యియాల్డు—కిటికీలోనుండి నాకేదో కనబడ్డాది. [పెలియాజ్ మెలిజాండాలు, కిటికీవద్దకు పరుగెత్తుదురు.

పెలియాజ్...కిటికీదగ్గ రేమి టుంది? నువ్వు చూచిం దేమిటి?

న్యియాల్డు—అయ్యో! అయ్యో! నే నేదో చూశాను.

పెలియాజ్—కాని అక్కడేం లేదు.....నాకేమి కనబడ్డం లేదు.

మెలిజాండా—నా కంతకంటే......

పెలియాజ్—అ యేమిటో చూసిం దెక్కడ? ఏవైపు?

న్యియాల్డు...అదిగో అక్కడ. అదిగో అక్కడ...ఇప్పుడు వెళిపోయింది.

పెలియాజ్—వా డేమి చెప్పు తున్నాడో వానికే తెలియదు. అడవిలో ప్రకాశిస్తూవున్న చంద్రుణ్ణి చూసివుంటాడు. అక్కడ తరుచుగా విచిత్ర మైన ప్రతిబింబా లుంటాయి......లేకపోతే ఆదారి నేవో వెళ్లుంటుంది......లేకపోతే వాడు నిద్రలో నుండుంటాడు. చూడు చూడు, వాడు నిద్రపోతున్న ట్టుంది......

న్యియాల్డు—అదిగో నాన్నగారు! అదిగో నాన్నగారు!

పెలియాజ్—[కిటికీవద్దకు వెళ్లి] అవును. వాడు చెప్పినమాట నిజమే. గొలా డిప్పుడే సాలిట్లోకివచ్చాడు.

న్యియాల్డు—నాన్నా!......నాన్నా!......నేను వెళ్లి కలుసుకుంటాను.

[పరిగెడుతూ నిష్క్రమించును—నిశ్శబ్దము.]

పెలియాజ్—వాళ్లు మేడమీద కొస్తున్నారు.

[ప్రవేశము. గొలాడ్ న్యియాల్డులు దీపములు పట్టుకొని]

గొలాడ్—మీరింకా యీచీకట్లో నేవున్నారా?

న్యియాల్డు—నేను దీపం తెచ్చాను, అమ్మా, నేనొక పెద్దదీపం తెచ్చాను. [దీప మెత్తి మెలిజాండా వైపు చూపును.] ఏడుస్తున్నావా? అమ్మ యేడుస్తున్నావా? [పెలియాజ్ వైపు దీప మెత్తి వాని వైపు గూడ చూచును.] నువ్వు కూడానా? నువ్వు కూడా యేడుస్తున్నావా? నాన్నగారు...నాన్నగారు...వాళ్లిద్దరు ఏడుస్తున్నారు...

గొలాడ్—ఆలాగ వాళ్ల కళ్లల్లో పడ్డట్లు దీపం పట్టుకోకు.

రంగము ౨.

కోటయందలి ఒకబురుజు బురుజు కిటికీ క్రిందనుండి ఒకనడదారి యుండును

మెలిజాండా—[కిటికీదగ్గర తనతల దువ్వుకుంటూ వుండును]

గీతము

త్రిశవవర్ష ము లయ్యె నే వెదకుచుండి
చెలియలార! యత్రం డున్నస్థలముకొరకు
కాని యత్రం డున్న జాడను గానవైతి
అనుజలార! నాపాదము లరిగిపోయె
అతండు సర్వసంచారి సర్వాత్మకుండు
ఐన నేటికి పుట్టువు లేనివాడు
గడియగడియకు హెచ్చుదుఃఖంబు పెరిగి
తిరిగితిరిగి నాపాదము లరిగిపోయె
హృదయజీవకాంతులు నశియింపుచుండె
నా మనం బెంతో వేదనన్ నవయజొచ్చె
మీ రిపుడు షోడశాబ్దకృశోదరమధ్య
లింక మీకాల ముదుదెంచె; నింతనుండి
నాకరమునుండి కదురును కైకొని, చని
అనుజలార! యాతని మీర లరసికొనుడు.

[నడదారిగుండా, ప్రవేశము పెలియాజ్]

పెలియాజ్—ఓహో!

మెలిజాండా—ఎవ రక్కడ?

పెలియాజ్—నేను నేను.....విదేశవిహంగము లాగ పాటపాడుతూ, ఆకిటికీవద్ద నేమి చేస్తున్నావు?

మెలిజాండా—తలచిక్కు తీసుకుంటున్నాను...

పెలియాజ్—అదేనా గోడమీద కనబడ్డాది? ...నీప్రక్కను దీప ముందనుకున్నాను...

మెలిజాండా—నేను కిటికీ తెరిచేను. బురుజు మీద చాల వేడిగానుంది...ఈరాత్రి చాల హాయిగా నుంది...

పెలియాజ్—అసంఖ్యాకమైన నక్షత్రాలున్నాయి ఈరాత్రి కన్నబడ్డన్ని నక్షత్రాలు నా కెప్పుడూ కనబడలేదు....కాని చంద్రు డింకా సముద్రం మీద వున్నాడు...చీకటిలో నుండకు. మెలిజాండా కొంచెము వంగు. చీరాడుచున్న నీకొప్పు చూస్తాను.

మెలిజాండా—నేను దెయ్యంలా గున్నాను. [కిటికీలోనుండి వంగును.]

పెలియాజ్—హాయి హాయ్. మెలిజాండా. హాయి హాయ్...ను వ్వెంత చక్కగా నున్నావు. ను వ్వెంత చక్కగా నున్నావు. కొంచం వంగు...కొంచం వంగు—నన్ను కొంచము నీదగ్గ కు రానీ...

మెలిజాండా—నే నింకా మరి దగ్గరకు రాలేను. ...వంగవలసినంత వంగేను.......

పెలియాజ్—ఇంక మీదకు మరి నే నెక్కలేను. ఈసాయంకాల మొక్కసారి నీచేతునైనా యియ్యి... నేను వెళ్లిపోకముందు...........నేను రేపు వెళ్లిపోతున్నాను....

మెలిజాండా—అం. ఆం లేదు. నే నివ్వను.

పెలియాజ్—అవు నవును. నేను వెళ్లిపోతున్నాను. నీచేతులు, ఒక్కసారి నీచేతులు ముద్దు పెట్టుకుంటా నియ్యి,

మెలిజాండా—నువ్వు వెళిపోతే నాచేతులివ్వను.

పెలియాజ్—ఇయ్యి! ఇయ్యి!

మెలిజాండా—అయితే నువ్వు వెళ్లవా?

పెలియాజ్—నే నుంటాను...నే నుంటాను...

మెలిజాండా—ఆచీకట్లో నా కొకగులాబీపువ్వు కనబడుతున్నాది.......

పెలియాజ్—ఎక్కడ? ... నాకు గోడమీద వ్యాపించిన గన్నేరు కొమ్మలు మాత్రమే కనబడుతున్నాయి.

మెలిజాండ—క్రిందికి. క్రిందికి. ఆతోటలో. అదిగో అక్కడ; చిరుచీకట్లు కమ్ముచున్న ఆయాకు పచ్చ రంగులో......

పెలియాజ్—అది గులాబీ కాదు.........నే నిప్పుడే వెళ్లి చూస్తాను; కాని ముందు నీ చెయ్యియ్యి చెయ్యియ్యి.

మెలిజాండా—అందుకో, అందుకో,......... అబ్బా! యింతకంటె నేను మరి వంగలేను....

పెలియాజ్—నీచేతులు నా పెదవుల కందవు.......

మెలిజాండా—ఇంతకంటె నేను మరి వంగలేను ...ఇక నేను పడిపోయే అవస్థలోకి వచ్చాను. అయ్యో! అయ్యో! నాజుత్తు బురుజులోనుండి క్రిందకు జారిపోతున్నాదే...

[ఆమె వంగునప్పుడు, జుత్తు తటాలున తిరుగబడి పెలియాజ్ పైకి ప్రవహించును.]

పెలియాజ్—ఆహా! ఇ దేమి టిది? నీకొప్పే? నీకొప్పు నాదగ్గరకు వస్తున్నది. నీకొప్పంతా, మెలిజాండా, నీకొప్పంతా బురుజులోనుండి క్రిందికి పడిపోయింది!—దానిని నాచేతులతో పట్టుకున్నాను. నా నోటితో పట్టుకున్నాను.....నాబాహువులతో పట్టుకున్నాను. నామెడచుట్టూ చుట్టుకున్నాను...ఈరాత్రి మరి నాచేతులు వదలను.

మెలిజాండా—వదిలీ! వదిలీ!...నువ్వు నన్ను పడిపోయేటట్టు చేస్తావు.

పెలియాజ్—వదలను. నేను వదలను......నే నెప్పుడూ నీకొప్పులాంటికొప్పు చూడలేదు.......మెలిజాండా...చూడు. చూడు. అంతయెత్తునుండి వస్తున్నది. అయినా దానిప్రవాహము నాగుండెలకు తాకుతున్నాది. నామణుకుల కంటుతున్నా....మిక్కిలి మృదువుగా నుంది...స్వర్గమునుండి వస్తే యెంత మృదువుగా నుంటుందో అంత మృదువుగా నుంది...స్వర్గములోనైనా యిటువంటిజుత్తు చూడను.......చూస్తున్నావా? నా రెండు చేతులు కలిపి దాన్ని పట్టుకోలేకపోతున్నాను.

ఇంకా కొన్నిపాయ లాగన్నేరుశాఖలకు తగులు కున్నాయి. అవి నాచేతుల్లో పక్షుల్లా గున్నాయి. అవి నన్ను ప్రేమిస్తాయి. నీకంటే అవే నన్ను హెచ్చుగా ప్రేమిస్తాయి.

మెలిజాండా—వదులు. వదులు. ఎవరైన ఆతెన్ను వస్తారు.

పెలియాజ్—వదలను. వదలను. నిన్నీరాత్రి వదలను. ఈరాత్రి నువ్వు నాఖైదీవి. ఈరాత్రంతా; ఈరాత్రంతా.

మెలిజాండా—పెలియాజ్! పెలియాజ్.

పెలియాజ్— నేను వానిని గన్నేరుశాఖలకు కట్టేస్తున్నాను.....ను వ్విక్కడనుండి వెళ్లవు.....ను వ్విక్కడనుండి మరి వెళ్లవు....చూడు. చూడు. నీజుత్తు నేను ముద్దు పెట్టుకున్నాను—నీకేశముల మధ్య నాబాధంతా పోయింది......నాముద్దులు నీకేశములగుండా ప్రాకడం నీకు తెలుస్తున్నాదా?......అవి నీజుత్తంతా ప్రాకుతున్నాయి........ప్రతివెంట్రుకకా ఒక్కొక్క ముద్దు నీకు తీసుకురావాలి......చూడు చూడు...నా చేతు లాడలేకలను...నాచేతులు స్వేచ్ఛగా నున్నాయి. అయినా నువ్వు నన్ను వదలలేవు.

మెలిజాండా—అబ్బబ్బా! నువ్వు నాకు నొప్పి కలిగిస్తున్నావు. [ఒకపావురాలపింఛు బురుజు విడిచి పెట్టి, రెక్కలు కొట్టుకుంటూ వాళ్ళచుట్టూ ఆరాత్రిలో ఎగురును] ఏమిటి జరిగింది పెలియాజ్?—ఈచుట్టూ ఎగురుతున్న వేమిటి?

పెలియాజ్—పావురాలు బురుజు విడిచిపెడుతున్నాయి......నేను వాటికి భయ పెట్టేను; అవి ఎగిరిపోతున్నాయి......

మెలిజాండా—అవి నా పావురాలు పెలియాజ్-వెళదాము పద. నన్నొదులు. అవి తిరిగీ రాకపోతాయి.

పెలియాజ్—ఎందుకు తిరిగీ రాకపోతాయి?

మెలిజాండా—చీకటిలో తప్పిపోతాయి .....న న్నొదులు...నాతల ఎత్తనీ...ఎవరివో అడుగులచప్పుడు వినబడుతున్నాది.—న న్నొదులు—గొలాడ్డే! అతడు గొలాడే అనుకుంటాను......మనమాటలు వినుంటాడు.

పెలియాజ్—ఆగు, ఆగు, నీజుత్తు పాయలు శాఖలకు చుట్టుకు పోయాయి......చీకటిలో నక్కడ తగులుకున్నాయి. ఆగు, ఆగు, రాత్రి చాలా చీకటిగా నుంది......

[ప్రవేశము నడదారిగుండా, గొలాడ్]

గొలాడ్—మీ రిక్కడేమిటి చేస్తున్నారు?

పెలియాజ్—నే నిక్కడేమిటి చేస్తున్నానా? ...నేను....

గొలాడ్—మీరు పిల్లలు.......మెలిజాండా, కిటికిలోనుండి అంత వంగకు, నువ్వు పడిపోతావు....... చాల రాత్రైంది దని తెలియలేదు? దరిదాపు సగంరాత్రి కావచ్చినది. చీకటిలో ఇలా ఆడకండి. మీరు పిల్లలు. [దుర్భరంగా నవ్వుతూ] ఏం పిల్లలూ! ఏంపిల్లలూ!

[పెలియాజ్‌తో నిష్క్రమించును]

## రంగము 3.

### కోటక్రింది గుహలు

గొలాడ్—జాగ్రత్త. ఈదారి. ఈదారి. ను వ్వెప్పుడూ యీగుహల్లోనికి వెళ్లలేదా?

పెలియాజ్—వెళ్లేను ఒక్కసారి. కాని చాల కాలంక్రిందట.

గొలాడ్—అవి చాలా పెద్దవి. వరుసగా ననేకమైన పెద్దగుహలు. ఎక్కడికి వెళ్తాయో భగవంతునికే యెరుక. కోటంతా యీగుహలమీదే కట్టబడ్డాది. అక్కడ యెట్టిగంధమో నీకు వాసనకొడుతున్నాదా?—అదే నీకు చూపాలని నాఉద్దేశం ఇదంతా మనం ప్రస్తుతం చూడబోయే, భూమిక్రిందనున్న సరస్సుమీద నుండి వస్తున్నాదని అనుకుంటాను. జాగ్రత్త, ఆదీపం వెలుతురులో నాముందర నడువు. మన మెప్పుడక్కడకు చేరేది నేను చెప్తాను. [మౌనముతో నడచుచుందురు.] అన్నాదేవు నిదయావల్ల......కాని నీకు కనబడలేమూ?

మరొక్క అడుగు వేసియుండువా అగాధమైన గోతిలో పడియుందువు! . ...

పెలియాజ్ — నా కేమి కనబడలేదు. ....నా దారిలో దీప మేమీ వెలు గివ్వడము లేదు.

గొలాడ్ — నేను తప్పటడుగు వేశాను....కాని నేను నీచెయ్యి పట్టుకోకపోయి యుందు రా.......నేను చెప్పుతూవున్న నిల్వానీరిదే....అక్కడనుంచి మృత కళేబరములయొక్క దుర్గంధము నీకు కొడుతున్నాదా? ఆ వాలియున్న చాపరాతికొనకు వచ్చి దానిమీద కొంచెం వంగు. ఆవాసన వచ్చి నీమొగాన కొడుతుంది.

పెలియాజ్ — ఆవాస నప్పుడే నాకువేస్తున్నాది. ...అది సమాధిచేసిన గోరీలవాసనలా నున్నాది.

గొలాడ్ — కొంచెం దూరం. ఇంకా కొంచెం దూరం......అప్పుడప్పుడు మనకోటను బాధిస్తున్న వాసన యిదే రాజుగారు ఇక్కడనుంచి వచ్చిన దంటే నమ్మరు. అదిగాక యీగుహలను పరిశీలింపవలసిన అవసరం వచ్చింది. ఈ గుహలగోడలలోను, స్తంభములందు, ఉన్నరంధ్రాలు చూశావా? ఇక్కడ మన మిదివరకు అనుమానింపనిహింళము దాగి యున్నది. తగినశ్రద్ధ తీసుకో పోతే యెప్పుడో ఒక్కరాత్రి కోటకూలిపోతుంది కాని యేమి చెయ్యడం? ఇక్కడకు రావడానికి ఎవ్వరూ యిష్టపడిరు.......ఈగోడలలో కొన్ని అద్భుతమైన కన్నా లున్నాయి.....అబ్బా! యిక్కడ...... ఆవస్తున్న దుర్గంధం నీకు కొడుతున్నాదా?

పెలియాజ్ — కొడుతున్నాది. మనచుట్టూ మృత్యువు ఎగబ్రాకుతూ వున్నట్టుం దావాసన.

గొలాడ్ — దానిమీదనుంచి కొంచెం వంగు భయపడకు... నేను పట్టుకున్నాను... ఏదీ యియ్యి...... ఆఁ ఆఁ నీ చెయ్యి కాదు. అది ఒక వేళజారిపోతుంది.... నీభుజము...నీభుజము...అగాధమును చూచావా?... .. ...(తొట్రుపాటుతో) పెలియాజ్, పెలియాజ్?

పెలియాజ్ — చూశాను. నా కాయగాధ జలముయొక్క అడుగు కూడా కనబడ్డట్టుంది......... అక్కడ వెలుగా అలా ఆడుతున్నాది?...నువ్వు...

[తిన్నగా నిలబడి వెనుకకు తిరిగి గొలాడునుచూచును.]

గొలాడ్ — (గద్గదస్వరముతో) అవును. అది దీప మే. చూడు అన్ని వైపుల వెలు గివ్వడానికని నేను దీపాన్నిటూ అటూ తిప్పుతున్నాను.......

పెలియాజ్ — నాకు ఊపి రాడకుండా వుంది పోదాంపద......

గొలాడ్ — అలాగె-పోదాం పద. [మౌనముతో నిష్క్రమింతురు.]

## రంగము ౩.

గుహాముఖద్వారమువద్ద నొకడాబా.

[ప్రవేశము, గొలాడ్, పెలియాజులు]

పెలియాజ్ — అబ్బా! ఇప్పటికి నే నూపిరి తియ్యగలిగేను...ఆ మహాగుహలలో నేను. మూర్ఛపోతానేమో అనుకున్నాను. సరి నేను క్రింద పడిపోడానికి సిద్ధంగా నున్నాను...అక్కడగాలి, కంపుగాను, సీసపు పొగవలె బరువు గాను ఉంది. ఆచీకటి దట్టమై విషపూరితమైనబంకలా గుంది...ఇక్కడి దంతా సముద్రపుగాలి! ఎంత హాయిగా నుందో చూడు. ఆచిన్ని ఆకుపచ్చని అల నుంచి, అప్పుడే చిగిరించిన పల్లవములాగ—అదిగో! ఆడాబాక్రింద పువ్వులకు నీరు పోస్తున్నారు. ఆపుష్పముల వాసన తడసినకలాబీలవాసన యిక్కడకు వస్తున్నాది...పువ్వులు లప్పుడే బురుజునీడకింద కొచ్చాయి. ఇప్పుడు దరాదరి మధ్యాహ్నము కావాలి......మధ్యాహ్నమే నాకు గంటలు వినబడుతున్నాయి. పిల్లలు స్నానానికై సముద్రతీరానికి వెళుతున్నారు....ఇంతసేపు మనము గుహల్లో నుండిపోయా మని నాకు తెలియదు.

గొలాడ్ — పదకొండు కాకమునుపే కోటకిందికి దిగేం......

పెలియాజ్ — అంతకు ముందే. అంతకంటే ముందై యుండాలి. నేను పదిగంటలపుర విన్నాను.

గొలాడ్ — పదిన్నరకో, పావుతక్కువపదకొండో.

పెలియాజ్—కోటకిటికీలన్నీ తీశేశారు. ఇవాళ రోజూకంటే వేడిగా నుంటుంది......అదిగో బురుజు కిటికీవద్ద, అమ్మా, మెలిజాండా వున్నారు......

గోలాడ్—అవును. వాళ్లు నీడతట్టు కూర్చున్నారు—మెలిజాండానుగూర్చి మీయిద్దరకు జరిగినదంతా విన్నాను. అదంతా నిన్నసాయింత్రం చెప్పారు. అది ఆటని నాకు తెలుసును. అయినాగాని ఆలాగు మళ్లీ జరగకూడదు. మెలిజాండా మిక్కిలి చిన్నది. కోమలగాత్రి, నిదానమైనమనిషి. అదిగాక కొద్దిరోజులలో పిల్లతల్లి కాబోతున్నాది. అందుచేత మనం మరీ జాగ్రత్తగా దానితో మెలగాలి...అది మిక్కిలి దుర్బలమైనది. ఇంకా చిన్నతనము పోలేదనే చెప్పవచ్చును. ఇటువంటిసమయములో ఏపాటియాందోళన కలిగినా ప్రమాదం రావచ్చు. యీయిద్దరి కేదో వున్నాదను కోడాని కిది మొదటిసారి కాదు...నువ్వు దానికంటె పెద్దవాడవు; అదే చాలు నాసంశయానికి...సాధ్యమైనంతమట్టుకు దాన్ని తప్పించుకో. అయినా ఆటోపం చెయ్యకు. ఆటోపం చెయ్యకు,—అడవితట్టు ఆ రోడ్డుమీద నాకు కనబడుతున్న దేమిటి?......

పెలియాజ్—అవి యింటికి పోతున్న మందలు..

గోలాడ్—అవి తప్పిపోయినపిల్లల్లా గరుస్తున్నాయి. కసాయివానివాసన అప్పుడే వాటికి కొట్టిందా అనిపిస్తున్నాది. మనకు మధ్యాహ్నభోజనమునకు వేళైంది.—ఆహా! ఎంత మనోహర మైనదినము.—నూర్పుల కెంత సుదినము. [నిష్క్రమింతురు]

రంగము ౪.

కోటముందట

[ప్రవేశము, గోలాడ్ న్యియాల్డులు]

గోలాడ్—న్యియాల్డు, రా. ఇక్కడ మనం కూచుందాము. రా తొడమీదికి రా. ఇక్కడనుండి మనం అడవిలో జరిగిన దంతా చూడొచ్చు. నిన్ను నే నెప్పుడూ చూస్తున్నట్టే లేదు. నువ్వు నన్ను విడిచి పెట్టేశావు. ను వ్వెప్పుడూ మీచిన్నమ్మతోనే వుంటావు...ఇప్పుడు మనము తిన్నగా మీచిన్నమ్మకిటికీకిందనే వున్నాము.—ఆమె, యిప్పుడు దైవప్రార్థనచేసుకుంటూ వుంటుంది కాబోలు...కాని న్యియాల్డు చెప్పు. మీ చిన్నమ్మ చిన్నాన్న పెలియాజు కలిసి తరుచుగా నుంటారు. కాదు?

న్యియాల్డు—అవు నవును. ఎప్పుడున్నూ నాన్నా!, ను వ్వక్కడ లేకపోతే సరి.

గోలాడ్—ఆహా! చూడు. ఎవరో లాంతరు పట్టుకొని తోటలోనికి వెళుతున్నారు...కాని వాళ్లొకరి నొకరు ప్రేమించ రని విన్నాను...వాళ్లు తరుచుగా దెబ్బలాడుకున్నట్టు కనబడుతుంది......ఏం? నిజమేనా!

న్యియాల్డు—అవు నవును. నిజమే.

గోలాడ్..నిజమే! ఆహా. కాని వాళ్లు దేనిగురించి దెబ్బలాడుకుంటూ వుంటారు?

న్యియాల్డు—తలుపునుగురించి.

గోలాడ్—ఏమిటి?—తలుపును గురించా?—ఏమిటి చెప్పుతున్నావు? రా, చక్కా చెప్పు. తలుపును గురించేందుకు దెబ్బలాడుకోవాలి!

న్యియాల్డు...అది తీసి వొదిలీడానికి వీలు లేదు కాబట్టి.

గోలాడ్—ఎవరదితీ సుంచీ వద్దంటారు? ఎందుకు దెబ్బలాడుకుంటారు?

న్యియాల్డు—నాకు తెలియదు నాన్నా! దీపంగురించి.

గోలాడ్—నేను దీపంగురించి మాట్లాడడం లేదు, తరువాత దానిగూర్చి మాట్లాడదాం. నే నిప్పుడు తలుపునుగురించి మాట్లాడుతున్నాను. నే నడిగినదానికి జవాబు చెప్పు. నవ్వు సరీగా మాట్లాడడం నేర్చుకోవాలి. నీకు నేర్చుకోనేయీడొచ్చింది...ఆలాగు నోట్లో చెయ్యి పెట్టుకోకు......లే...

న్యియాల్డు—నాన్నా! నాన్నా! నే నలాగు మరెప్పుడు చెయ్యను. [ఏడ్చును.]

గొలాడ్—లే చెప్పు. ఎందు కేడుస్తున్నావు? ఏమిటి సంగతి?

న్యియాల్డు—అబ్బా! నాన్నా! నువ్వు నాకు నొప్పెట్టిస్తున్నావు...

గొలాడ్—నొప్పెట్టిస్తున్నానా? — ఎక్కడ నొప్పెటించేను? నొస్టుం దనుకోలేదు.

న్యియాల్డు—ఇక్కడ. నా చేతిమీద.

గొలాడ్—నేను నొస్టుం దనుకోలేను. లే. ఏడవకు. రేపు నీకేదయినా యిస్తాను......

న్యియాల్డు—ఏమిటి నాన్నా?

గొలాడ్—విల్లు. బాణాలు. కాని ఆతలుపు గురిం చేమిటో చెప్పు......

న్యియాల్డు—పెద్దబాణాలేనా?

గొలాడ్—ఆఁ, ఆఁ, చాల పెద్దబాణాలు— కాని వా ల్లెందుకు తలుపు తీసుందురు? లే చెప్పు. ఒద్దొద్దు. ఏడవకు. నేను కోప్పడనులే. మనం మెల్లిగా పెలియాజు చిన్నమ్మ కలిసి మాట్లాడుకున్నట్లు మాట్లాడు కుందాము. వారిద్దరు కలిసి వున్నప్పుడు దేనిగూర్చి మాట్లాడుకుంటూ వుంటారు?

న్యియాల్డు—చిన్నమ్మ పెలియాజున్నా?

గొలాడ్—ఊఁ, దేనిగూర్చి మాట్లాడుకుంటారు?

న్యియాల్డు—నన్నుగురించి — ఎప్పుడూ నన్ను గురించి.

గొలాడ్—నిన్నుగూర్చి యేమిటి మాట్లాడు కుంటారు?

న్యియాల్డు—నేను చాల పొడుగ్గా ఎదుగుతానని.

గొలాడ్—అయ్యో! కర్మమా! సముద్రపుటడుగున నిక్షేపం వెదుకుచున్న గుడ్డివాడిలా గుంది నాబ్రతుకు ...అప్పుడే పుట్టినబిడ్డ అడవిలో తప్పిపోయినట్టున్నాను నేను, నువ్వు...కావి న్యియాల్డు! నేను పరధ్యానంగా నున్నాను. మనం నిదానంగా మాట్లాడుకుందాము. పెలియాజు చిన్నమ్మ నేను లేనప్పుడు నన్నుగూర్చి యెప్పుడు మాట్లాకోరా?

న్యియాల్డు—మాట్లాడుకుంటారు నాన్నా! మా ట్లాడుకుంటారు. నిన్నుగూర్చే యెప్పుడు మాట్లాడు కుంటారు.

గొలాడ్—ఆహాఁ.....అయితే నాగురిం చేమిటి మాట్లాడుకుంటారు?

న్యియాల్డు—నేను నీయంత పొడు గెదుగుతా నని అంటారు.

గొలాడ్—నువ్వెప్పుడు వాళ్లతోనే వుంటావా?

న్యియాల్డు—అవు నవును. ఎప్పుడు వాళ్లతోనే నాన్నా!

గొలాడ్—వా ళ్లెప్పుడు నిన్ను మరోదగ్గిరకు పోయి ఆడుకోమనడం లేదు?

నియ్యాల్డు—లేదు నాన్నా. నే నక్కడ లేక పోతే వాళ్లు భయపడతారు

గొలాడ్—భయపడతారు?......వాళ్లు భయ పడతా రని నీకెలాగు తెలిసింది?

న్యియాల్డు—చిన్నమ్మ యెప్పుడు 'నువ్వెక్కడికి వెళిపోకు. నువ్వెక్కడికి వెళిపోకు' అని అంటుంది.. వా ళ్లెప్పుడూ విచారంగానే వున్నా నవ్వుతారు.

గొలాడ్—కాని అంతమాత్రంలో వాళ్లు జడిసే రని చెప్పలేవు......

న్యియాల్డు—నిజం నాన్నా! నిజం. చిన్నమ్మ జడుస్తుంది......

గొలాడ్—దేనివల్ల అది జడుస్తుం దని చెప్ప గలవు?

న్యియాల్డు—వా ళ్లెప్పుడూ చీకట్లో యేడుస్తారు

గొలాడ్—ఆహా! అయ్యో!

న్యియాల్డు—అది మా స్తే పైవాళ్లకుకూడ యేడు పొస్తుంది.

గొలాడ్—ఆఁ.

న్యియాల్డు—ఆమె పాలిపోయింది నాన్నా!

గొలాడ్—అయ్యో! దైవమా!.........ఓర్పు ఓర్పు.

న్యియాల్డు—ఏమిటి నాన్నా!

గొలాడ్—ఏమీ లేదు నాయనా!—అడవిలో తోడేలు వెళ్తుతూ కనబడింది—అయితే వాళ్లు సఖ్యంగానే వున్నారు?—వాళ్లు దెబ్బలాడుకోకుండానున్నారని విన్నందుకు సంతోషంగా వుంది. వాళ్లిప్పుడప్పుడొకరి నొకరు ముద్దు పెట్టుకుంటారు. లేదు?

న్యియాల్డు—నాన్నా! వాళ్లొకళ్లని ముద్దు పెట్టుకుంటే యేమి? వాళ్లు పెట్టుకోడం లేదు.—ఆఁ. ముద్దు పెట్టుకుంటూ వుండేవారు నాన్నా! అవునవును. ఒకనాడు......వర్షంగా నున్నప్పుడు.

గొలాడ్—ఒకరి నొకరు ముద్దు పెట్టుకున్నారు? కాని ఎలాగు? ఎలాగు ముద్దు పెట్టుకున్నారు?—

న్యియాల్డు—ఇలాగు నాన్నా! ఇలాగు. [నవ్వుతూ మూతిమీద ముద్దుపెట్టుకొని] హాఁ, హాఁ, నీగెడ్డాం నాన్నా!... ..గుచ్చుకున్నాది. అది శుభ్రంగా పండి పోతున్నాది నాన్నా! నీజుత్తుకూడాను. అంతా పండి పోయింది...

[వారు కూర్చున్న స్థలమునకు పైనున్న కిటికీలో దీపం వెలిగింపబడును. దానికాంతి వారిమీద బడును.] హోయి హోయి. చిన్నమ్మ దీపం వెలిగించింది. ఇప్పుడు వెలుగ్గా నుంది, నాన్నా! యిప్పుడువెలుగ్గా నుంది... ..

గొలాడ్-అవును. వెలుతురుగా నుంది......

న్యియాల్డు-నాన్నా! మనంగూడా అక్కడికి వెళదాము.

గొలాడ్-ఎక్కడికి వెళదా మంటావు?

న్యియాల్డు-దీపం ఉన్నదగ్గరకు నాన్నా!

గొలాడ్-వద్దు వద్దు నాన్నా! ఈ క్రీనీడలో కొంతసే పుందాము......పాపం ఆ అడవిలో నిప్పు చేయడానికి ప్రయత్నిస్తున్నవాళ్లను చూశావా?-వర్షం కురుస్తున్నాది. అల్లాప్రక్కను గాలివల్ల దారిలోనికి పడిపోయినచెట్టును ఎత్తడానికి తోటమాలి యెంతప్రయత్నం చేస్తున్నాడో చూశావా? వాడెత్తలేడు. చెట్టు చాలా పెద్దది. మిక్కిలి బరువుగాకూడా ఉంది. అది పడిపోయినచోట నుండవలసిందే. మరేమి లాభం లేదు... పెలియాజ్‌కు పిచ్చెత్తిం దనుకుంటాను.

న్యియాల్డు—లేదు నాన్నా! పెలియాజ్‌కు పిచ్చి లేదు, అతని కెంతోదయ.

గొలాడ్—మీచిన్నమ్మను చూడాలని వుందా?

న్యియాల్డు—ఉంది. ఉంది. నే నామెను చూస్తాను.

గొలాడ్—హోరు చెయ్యకు. నిన్ను కిటికీదగ్గర కెత్తుతాను. నేను పొడుగ్గా నున్నా నా కందదు. [బిడ్డ నెత్తును.] ఏమాత్రమును శబ్దం చేయకు. మీ చిన్నమ్మ జడుస్తుంది.........ఇప్పు డామెను చూడగలవా;......ఆమెగదిలో నే వుందా?

న్యియాల్డు—ఉంది.........గది వెలుతురుగా కూడా వుంది.

గొలాడ్—ఏం. ఒకర్తే వుందా!

న్యియాల్డు—అవును...కాదుకాదు. చిన్నాన్న పెలియాజు కూడ అక్కడున్నాడు.

గొలాడ్—వాడా!

న్యియాల్డు—ఆఁ, అవు నాన్నా! నువ్వు నాకు నొప్పెట్టిస్తున్నావు.

గొలాడ్—భయంలేదు. నెమ్మదిగా నుండు. మరి నీకు నొప్పెట్టించను లే. చూడు చూడు న్యియాల్డు. నేను జారిపోయాను. మెల్లగా మాట్లాడు. వాళ్లేమి చేస్తున్నారు?—

న్యియాల్డు—వాళ్లేమిటి చెయ్యడము లేదు నాన్నా! దేనికోసమో చూస్తున్నారు.

గొలాడ్—వాళ్లొకరికొకరు దగ్గరగానున్నారా?

న్యియాల్డు—లేదు నాన్నా!

గొలాడ్—మరి......పరు పెక్కడ? వాళ్లు పరుపుదగ్గ రున్నారా!

న్యియాల్డు—పరుపా నాన్నా?—నాకు పరుపు కనబడలేదు.

గొలాడ్—మెల్లిగా, మెల్లిగా, వాళ్లు నీమాట వింటారు. వాళ్లేమైనా చెప్పుకుంటున్నారా?

న్యియాల్డు—లేదు నాన్నా! వాళ్లేమి చెప్పుకోడం లేదు.

గొలాడ్—అయితే వాళ్లు మరేమిటి చేస్తున్నారు? ఏదైనా చేస్తు వుండాలి......

న్యియాల్డు—వాళ్లు దీపం తట్టు చూస్తున్నారు.

గొలాడ్—ఇద్దరున్నా?......

న్యియాల్డు—అవును నాన్నా......

గొలాడ్—మరి మాట్లాడ్డం లేదు?......

న్యియాల్డు—లేదు నాన్నా, వాళ్లు కళ్లు మూసుకోడము లేదు.

గొలాడ్—వాళ్లు ఒకరిదగ్గర కొకరు వెళ్లడము లేదు?......

న్యియాల్డు—లేదు నాన్నా! వాళ్లు కదలడం లేదు.

గొలాడ్—వాళ్లు క్రింద కూర్చున్నారా?

న్యియాల్డు—లేదు నాన్నా! గోడకు చేరబడి నిలుచున్నారు.

గొలాడ్—వాళ్లేమైనా సంజ్ఞలు చేస్తున్నారా? ఒకరిత ట్టొకరు చూసుకోడము లేదు?—ఏమి సంజ్ఞలు చేయడం లేదు?

న్యియాల్డు—లేదు నాన్నా! అయ్యో వాళ్లు కళ్లు మూయ్యడమే లేదు నాన్నా...నాకు మిక్కిలి భయం వేస్తున్నది.

గొలాడ్—నిశ్చలంగా నుండు—ఇంకా వాళ్లు కదలలేదు గదు?

న్యియాల్డు—లేదు నాన్నా! నాకు భయం వేస్తున్నది. దింపీ నాన్నా!

గొలాడ్—భయపడడాని కక్క డేమి ఉన్నాది? చూడు చూడు.

న్యియాల్డు—ఇంకా నేను మరి చూడలేను నాన్నా! నన్ను దింపీ.

గొలాడ్—చూడు చూడు.

న్యియాల్డు—అబ్బా! నాకేడుపొస్తున్నాది నాన్నా! నన్ను దింపీ నన్ను దింపీ......

న్యియాల్డు—రా మనం వెళ్లి యేమిటి జరిగిందో చూదాము.

[నిష్క్రమించుదురు.]

---

## మా వ్యాసకర్తలకు

వ్యాసములు చిన్నసైజు కాగితములపై ఒకవైపున మాత్రమే విడిఅక్షరములతో బంతులు దూరదూరముగా, దిద్దుబాట్లు లేకుండ, తిన్నగా వ్రాసి వర్ణక్రమమునను తప్పులు లేకుండ చూచుకొని పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిగుల కష్టము కలుగుటయే కాక తప్పులుకూడ నిలిచిపోవునని మనవి.

సంపాదకుడు, 'భారతి'.

---

# వసంతము

పెమ్మరాజు లక్ష్మీపతిగారు

౧

జవ్వనపుం బిసాళి కనుసైగలతో జిరునవ్వుమోవిపై
నివ్వటిలంగ గ్రొత్తనెరనీటు-గోటుల జీ్కరించు నీ
'నవ్వులరాణితో' బ్రణయనాటకముల్ బ్రకటింపగోరి నా
పువ్వుల రంగడా! భువనమోహనుడా! చనుదెంచినావురా!

౨

మంచుపజీకి గ్రొందళుకు మాసిన కూసములూడ్చి, యీపిరా
యించిన రంగుతో పడగలెత్తిన యందము లిన్నియున్ డమా
యించిన షోకులై బలెబలే యనిపించఁ బ్రమోదవార్ధిఁ దే
లించుచు నుంటివా! జగము లిన్నియుఁ బూలచిగుళ్ల తెప్పలన్.

౩

ఔరా నిన్నటిదాక మ్రోడులయి యే యందంబు నేచంద మే
సారస్యంబును లేని యీకుజము లీస్వచ్ఛందసౌందర్య వి
స్ఫార ప్రోజ్జ్వలమూర్తులై పుడమిపై స్వర్గంబుఁ గల్పించె నౌ
రౌరా యెంతటి యైంద్రజాలికము లయ్యా, నీవిలాసోన్నతుల్.

౪

నీలనభంబు క్రింద నళినీరవ రంజిత పుష్పమంజరీ
జాలము లొప్పఁ బూచిన రసాల మహీజమునీడఁ బెద్దబా
కాలవె పట్టుచుండిరి దిగంతరముల్ ప్రతిరావమీన రాం
డోలున మూడు దెబ్బలును మ్రోగగసాగెను పెండ్లిగుంపులోన్.

౫

ఆకెలనన్ వినన్ జెలగె హాయి సనాయిరవంబు క్రొత్తతా
టాకుల కమ్మతావి నిగుడన్ రచియించిన పెండ్లిపందిటన్
జాకలివాండ్రదే భుజముసాచిరి పల్లకి బైకి నెత్తగా
నాకసమున్ దిశల్ వగులు నట్లొకపెట్టున మ్రోసె వాద్యముల్.

౬

అమృతానంద సముద్రవీచికలపై నంతంత దోగాడు ఫే
నములై, యీమృదు దక్షిణానిల తరంగాయాధముల్ పుష్ప గు
చ్ఛము లల్లాడెడు తీవి యామురిపి మాసౌందర్య లీలావిహా
రముబాలాస్యము లాయెయీయారముల గర్వస్ఫూర్తి వీక్షింపుమా!

౭

ఈసరిక్రొత్తకెంజిగురు లీ తొలిపూవుల కమ్మతావు లీ
యాసవ మాధురీ మహిమ లీసకలంబు ననుగ్రహించి, కై
సేసిన యీవసంత నవజీవన వైభవముం గ్రహించి, యా
యాసము విస్మరింప జనదా? క్షణకాలము మానవాళికిన్.

౮

మ్రోడులుకూడ క్రొత్తనునుమోజులు రా జిగురించె, హాయిగా
పాడదొడంగె కోకిల, ప్రపంచములో నవె క్రొత్తక్రొత్త తా
జాడలు తోచు నీనవవసంత శుభోదయ వేళ నేనియున్
పాడుకొనంగలేని హతభాగ్యులెవో దలపోయ మానవుల్!

౯

ఒకయన్వేషణకాదు సిద్ధి యిదియేదో చెప్పలే నీ యలౌ
కిక సౌందర్య కళాప్రసూనముల రేకెత్తించి యీభూమిపై
పికగానంబయి పుష్పపల్లవములై పీయూష వర్షంబునై
యకలంకాకృతిదాల్చి బొల్చెడిని దివ్యంబై వినూత్నంబునై.

౧౦

కోయనుగీతమందుకొని కూతకుకూత కతీంద్రియ ప్రమో
దాయత వార్ధివీచికల నల్లననూయెల లూపుచున్ పికం
బీ యఖిలావనిన్ విసరి వేయుచునున్నది మింటిత్రోవ, నీ
కోయిలపాటయందు జత గూరిచి హాయిగ పాడుకొందునా!

౧౧

నేలనువీడి సాములును, నింగికి నిచ్చెనలున్ ఘటింపఁగాఁ
బోలదె? చాలనే? నవ సుమోజ్జ్వలితాసవసారపాన లీ
లా లలితానుభోగ రసలబ్ధివహించి, తళుక్కుమందు, నీ
కాల నిమిత్తదేశ పరిఘావృత దుర్గము దాటిపోవఁగాన్.

౧౨

త్రాగెడుజాతి సుమసుధారసమానుట తప్పుకాదు, నే
త్రాగెద, నాడెదన్, పృథివిదాటెద; మీటెద వాణి వీణపై
తీగలు ద్రెస్సిపోవ రసతీవ్రత; నీచిగురాకు తీగపై
నూగెద భూమి వీడి యొకయూపున స్వర్గముఁ గాలిఁ దన్నుచున్.

౧౩

సురభిళ దక్షిణానిలము శోభిలుచున్న రసాలవాటికాం
తరమున నీడలన్ గుసుమ తల్పమునన్ శయనించి "సుందరీ
సురపతినైతి నే నెవరు జూచెదనీక"ని యావసంతబం
భరముల్లు పోయివచ్చునని వ్రాసితి నేనొకచీటి రంభకున్.

౧౪

చిక్కని యీసుమాసవమహీరసముం గొని ముంచి వ్రాసినా
నిక్కమలాచ్ఛపత్రమున నీవిరికేసరమే కలంబుగా
నక్కరముల్ కదున్ మెరయునట్లుగ పుప్పొడిపైన జల్లి నా
న క్కమలాక్షి యందుకొనునా? 'కడు మోట'ని త్రిప్పివేయునా?

౧౫

రాలిన మాలతీసుమపరాగము, లొల్కిన తేనె వాకలం
దేలిననీడ లీయవి; మదీయ మనోహరమూర్తి సమ్మదో
ద్వేలమరున్నదీసలిలవేష్టిత కాంచనసైకతాళి న
న్నేలిన తావులట్టుల రహించు దహించెడి నేడు నామదిన్.

(సశేషము,)



పాడుపుడుకథలు

సూరీ, సీతీ, వెంకీ వాళ్లనాన్న రాక ముందే, దీపం పెట్టడంతోనే, భోజనము చేశారు. వాళ్లనాన్నా అన్నయ్యా అప్పుడే భోజనముచేసి వచ్చారు వాళ్లనాన్న కుర్చీ మీదకూర్చుని ఏదో పుస్తకం చదువుకోవడం మొదలుపెట్టాడు. వాళ్లన్నయ్య దీపం పుచ్చుకొని వసారాలో చదువుకోడానికి వెళ్లాడు. వాళ్లమ్మ వంటింట్లో అన్నం తింటోంది.

సూరీ సీతీ నడవలో పట్టెమంచంమీద దుప్పటీ వేసుకు పడుక్కున్నారు. వాళ్లమ్మ వచ్చేదాకా వెంకికూడా ఆమంచంమీదే పడుక్కుంది. ముగ్గురు ఇరుకుగా పడుక్కున్నారు. సూరి కథలు చెప్తోంది. సీతీ వెంకీ ఊకొట్టుతున్నారు. సూరి కోతికథ అప్పుడే చెప్పేసింది. చివరకు వచ్చేటప్పటికి కోతి డోలు బుజానికి వేసుకొని చెట్టుకొమ్మమీద కూర్చుని

ముల్లు పోయి కత్తి వచ్చె ఢాంఢాం
కత్తిపోయి పుల్లులు వచ్చె ఢాంఢాం
పుల్లులు పోయి అట్టు వచ్చె ఢాంఢాం
అట్టు పోయి కడవ వచ్చె ఢాంఢాం
కడవ పోయి కన్నె వచ్చె ఢాంఢాం
కన్నె పోయి డోలు వచ్చె ఢాంఢాం

అని పాడుకొంటూ కూచుందని సూరి చెప్పినప్పుడు అందరూ గట్టిగా నవ్వారు. వెంకికి మరీ సంతోష మయింది.

ఢాంఢాం కత్తి పోయి ఢాంఢాం
ఢాంఢాం డోలు వత్తె ఢాంఢాం

అంటూ కూచుంది.

"ఊరుకోవే వెంకీ. అక్కయ్యా ఇంకో కథ చెప్పవూటే" అంది సీతి.

"ధాంధాం కత్తి పోయి ధాంధాం
ధాంధాం డోలు వత్తె ధాంధాం" అని వెంకి దీర్ఘాలు తీసింది.

"ఊం కోమంటే నీకు కాదూ. ఏమే అక్కయ్యా ఇంకోకథ చెప్పవులే" అంది సీతి.

"వెంకీ ఇంకోకథ చెప్పనా" అంది సూరి.

"తెప్పు, ఇంకోకద తెప్పు" అంది వెంకి.

కథ కాదే, సీతి. పొడుపుడుకథలు పొడు చుకుందామా సీతి" అంది సూరి.

ఆం, ఆం, పొడుపుడుకథలే, పొడుపుడు కథలే" అంది సీతి.

"కద తెప్పవుతే" అంది వెంకి.

"ఇది కథే. విను వెంకీ, ఇది కథేనమ్మా" అంది సూరి.

"నువ్వు పొడవ్వే ముందు" అంది సీతి.

"పొడవనా పొడవనా" అంది సూరి.

"నే పొడిచేదా" అంది సీతి.

"పొడు అమ్మా మరి;" అందిసూరి.

"తీసినకొద్దీ పెరిగేదేమిటి ?" అంది సీతి.

"చెప్పనా, చెప్పనా, అదేమిటి చెప్మా; నుయ్యి. అవునా" అంది సూరి.

"కాదు మళ్లీ చెప్పుకో" అంది సీతి.

"నుయ్యేనమ్మా" అంది సూరి.

"కాదు నేచెప్పనా" అంది సీతి.

"చెప్పుమరి" అంది సూరి.

"గొయ్యి" అంది సీతి.

"చూశావా, చూశావా, నేచెప్పలేదూ నేచెప్పలేదూ" అంది సూరి.

"ఆం ఆం నువ్వు చెప్పావా ఏమిటి. నువ్వు నుయ్యన్నావు" అంది సీతి.

"నుయ్యిమాత్రం పెరగదా ఏమిటి" సూరి.

"పోనీపోనీ మరి. నువ్వుపొడు ఈమాటు" అంది సీతి.

పొడవనా. వెండిగోలుసులు వెయ్యడమే గాని తియ్యడం లేదు. ఏమిటి చెప్పుకో" అంది సూరి.

"ఏమిటి చెప్మా ఏమిటి చెప్మా" అని సీతి ఆలోచిస్తూ ఉంది.

"నే తెప్పనా" అంది వెంకి.

"చెప్పమ్మా మహా" అంది సూరి.

"ధాం ధాం" అంది వెంకి అందరూ నవ్వారు.

"చెప్పుకోవే మరి సీతీ" అంది సూరి.

"ఉండుమరీ. ఆలోచించుకోవాలా"అంది సీతి

"చెప్పు మరి చప్పుని" అంది సూరి.

"గోడ" అంది సీతి.

"కాదు; కాదు; కాదులే" అంది సూరి.

"గోడ కడతారుగాని తీస్తారా ఏమిటి" అంది సీతి.

"గోడ వెండిగోలుసులా ఏమిటి?" అంది సూరి.




జర్మను దొంగ ఇటుల వివిధవేషములు వేసికొని బ్యాంకులను దొంగిలించుచున్నాడు




నీటిపయి మోటారుకారు నడచుట. నీటిపై తేలునట్టి బెలూనులు గలవు. వానికి కారును ఉక్కుతీగలతో కట్టుదురు. అపుడు మోటారుకారు పడవవలె నీటిపై నడచును

"నాకు రావడంలేదు. నువ్వు చెప్పు" అంది సీతి.

"చెప్పనా వంట్లో కలి—ఆకలి" అంది సూరి.

"అవునే మరిచిపోయాను" అంది సీతి.

"ఇంకా పడుకోకుండా రుట్రా మీరు." అని వాళ్లమ్మ కేకేశింది.

వాళ్లన్నయ్య దీపం ఆర్పివేసి నడవలో ఇంకో మంచంమీద పడుక్కున్నాడు. వాళ్లనాన్న మంచంమీద పడుక్కొని ఇంకా చదువుకొంటున్నాడు.

"మరి నువ్వు పొడు ఈమాటు" అంది సూరి.

"చూస్తే చూపులు, నవ్వితే నవ్వులు, గుద్దితే బద్దలు చెప్పుకో" అంది సీతి.

సూరి చెప్పకముందే వాళ్లన్నయ్య "అద్దము" అని చెప్పాడు,

"ఆఁ అమ్మా; చెప్పకురా అన్నయ్యా" అంది సూరి.

"పోనీ ఇంకోటి పొడవనా" అంది సీతి.

"పొడు" అంది సూరి.

"చెరువుదగ్గిర ఎద్దు రంకె వేస్తే ఆవుకు పిల్లలు పుట్టాయి—ఏమిటో చెప్పుకో" అంది సీతి.

మళ్లీ వాళ్లన్నయ్య "కుక్కగొడుగులు" అని చెప్పేశాడు.

"పోనీ అమ్మా మరీ. ఊరుకోరా అన్నయ్యా" అంది సూరి.

"ఈమాటు చెపితే ఒట్టు" అంది సీతి.

"ఒట్టు" అంది వెంకి.

"ఈమాటు నే పొడుస్తానే సీతీ పిల్లపుట్టుక తల్లిచావు ఏమిటో చెప్పుకో" అంది సూరి.

సీతి చెప్పకముందే వాళ్లన్నయ్య అరిటిచెట్టు అని చెప్పాడు.

"నే ఒట్టేశానులే" అంది సీతి.

"ఒట్టు తీసి గట్టున పెట్టానులే" అన్నాడు వాళ్లన్నయ్య.

"పోనీలేరా అన్నయ్యా; పోనీలే, సీతీ, మనం పొడుపుడుకథలు పొడుచుకోవద్దు ఇంక నేను ఇంకోచిత్రం చెప్పనా" అంది సూరి.

"చెప్పు చెప్పు" అంది సీతి.

"కథ చెప్పు" అంది వెంకి.

"కథ కాదు. "అమ్మా" చెప్పకుందామే సీతీ" అంది సూరి.

"చెప్పకుందాం. నువ్వు మొదలెట్టు" అంది సీతి.

"అమ్మా ఏంతి" అంది వెంకి.

సూరీ సీతీ కలిసి ఇలాగ చెప్పకుంటున్నారు. వెంకి వింటోంది. వాళ్లన్నయ్య నిద్రపోతానని నిద్రపోయాడు.

"నువ్వు ఎక్కడకు వెళ్లావు?"

"ఏటికి"

"ఏ ఏరు?"

"పాలేరు"

"ఏ పాలు"

"మేక పాలు"

"ఏ మేక?"
"కొమ్మేక"
"ఏ కొమ్మ?"
"ఏనుగ కొమ్మ"
"ఏ ఏనుగ?"
"మద మేనుగ"
"ఏ మదము"
"ఆ మదము"
"ఏ ఆమదము?"
"చిట్టా మదము"
"ఏ చిట్ట?"
"సరి చిట్ట"
"ఏ సరి?"
"దా సరి"
"ఏ దాసు?"
"కాళిదాసు"
"ఏ కాళి?"
"భద్ర కాళి"
"ఏ భద్ర"
"తుంగ భద్ర"
"ఏ తుంగ?"
"నీళ్ల తుంగ?"
"ఏ నీళ్లు"
"ఉప్పునీళ్లు"
"ఏ ఉప్పు"
"పెట్లుప్పు"
"ఏ పెట్లు?"
"గుర్రపు పెట్లు"
"ఏ గుర్రం?"
"పటాణి గుర్రం"
"ఏ పటం?"
"గాలి పటం"
"ఏ గాలి?"
"సుడి గాలి"
"ఏ సుడి?"
"అరటి సుడి"
"ఏ అరటి?"
"బొంతరటి"
"ఏ బొంత?"
"కంబళి బొంత"
"ఏ కంబళి?"
"రత్న కంబళి'
"ఏ రత్న?"
"నవ రత్న"
"ఏ నవ?"
"గోరి నవ"
"ఏ గోరు?"
"పులి గోరు"
"ఏ పులి?"
"కొండ పులి"
"ఏ కొండ?"
"బెల్లం కొండ"
"ఏ బెల్లం?"
"తాటి బెల్లం"
"ఏ తాడు?"
"ఉరి తాడు"
"ఏ ఉరి"
"తీగ ఉరి"

"ఏ తీగ?"

"గుమ్మడి తీగ"

"ఏ గుమ్మడి?"

"పెళ్లి గుమ్మడి"

"ఏ పెళ్లి?"

"పూల పెళ్లి"

"ఏ పూలు?"

"మా పూలు"

"ఏ మా?"

"అమ్మా"

అమ్మా అని గట్టిగా సీతి అంది. సీతితో కూడా సూరి అమ్మా అంది. వెంకి వాళ్లిద్దరినీ చూచి అమ్మా అంది. మళ్లీ ముగ్గురూ కలిసి ఒక్కసారి అమ్మా అన్నారు.

"ఎందుకర్రా పిలుస్తారు" అని వాళ్లమ్మ వంటింటోంచి వచ్చి అడిగింది.

"మేం పిలవందే" అన్నారు వాళ్లు.

"ఇప్పుడు అమ్మా అనలేదుటర్రా" అంది వాళ్లమ్మ.

"వాళ్ల నిన్ను పిలులేదే. కథలు చెప్పుకుంటున్నారు" అన్నాడు వాళ్లనాన్న.

"అయ్యో మీకథలు బంగారం కానూ. ఈపాటికి పడుకోండి" అని వాళ్లమ్మ చెప్పి వెంకిని ఎత్తుకొని తనదగ్గిర పడుకోబెట్టుకోటానికి తీసుకువెళ్లింది. సూరీ సీతీ కౌగలించుకొని ఒకరిమీద ఒకళ్లు చేతులూ కాళ్లూ వేసుకొని కథలు తలుచుకొంటూ నిద్రపోయారు.

---

## *నీరాజనము

కోడాలి ఆంజనేయులుగారు

రాలిన కన్నీటి నీలాలపేరు
పడిన నెత్తురుబొట్ల పగడాలసరము
పొడమిన చెమటల ముత్యాలమాల
చెదరినతిలకాల చిగురులదండ
పగిలినగాజుల పచ్చలగొలుసు
† వెలసిన చిరునవ్వు వెన్నెలరేక
అలసిన నునుమేని అపరంజిదళము
కుందిన వాలుచూపు కుంకుమరేకు

భక్తితోనర్పించి స్వాతంత్ర్యలక్ష్మి!
పుణ్యాంగనలు నిన్ను పూజించుచుండ
పారిజాతపు పూలవానలుగురిసి
దివ్యాంగనలు నిన్ను దీవించునట్లు
విజయదుందుభి మ్రోత వినిపింపదా నేడు!
జయపతాకచ్ఛాయ సాగిపోదా నేడు!
మంగళతూర్యాలు మార్మ్రోగవా నేడు!
పుణ్యభారతభూమి పులకింపదా నేడు!

---

* ఎరవాడ చెరసాలలో భారతస్త్రీలకు జరిగిన అపచారము విన్నప్పుడు.—

† వెలిసిపోయిన లేక మాసిపోయిన అని అర్థము.

# కన్యాదానఫలం దక్కుతుందా?

అక్కిరాజు ఆంజనేయులుగారు, బి. ఏ.

౧

"పాపా, యేాలవకు, తిందానికి పెత్తాలే. మొగులొద్దూ? కావాలా? పెల్లి చేత్తాలే, యిప్పూకే!", అంటూ, వచ్చీరానిమాటలతో అదేమిటో ఒకలోకంలో ఉంది కల్యాణి, చందనబ్బొమ్మల్తో ఆడుకొంటూ. తానొక జేనెడు పావడకట్టుకొంది, కూతురుబొమ్మకు చిన్న జల్తారుపేలిక పరికిణీ కట్టింది. "ఎవరు మోత్తారబ్బా, ఈపాలుపావల?" అంటూ ఊడదీసి పారేసి, ఆడుకొంటూంది. చెయ్యాలం పెండ్లి. విందు కావాలా? "అమ్మా బెల్లంపెత్తవూ?" అంది. "ఇప్పుడు కాదుండమ్మా" అంది పార్వతమ్మ. కల్యాణి బొమ్మకూతురికే పెండ్లిచెయ్యాగా, పార్వతమ్మా భద్రయ్యా నిజం కూతురికి చెయ్యకూడదా? "బెల్లమే" అంటూ ఏడుపు సాగించింది పిల్ల.

నేస్తం కృష్ణావధాని అన్నిశాస్త్రాలూ గాలించాడు. చురుకైనబుద్ధి. పూర్వాచారం నిలపడమే జీవితధర్మంగా భావిస్తున్నాడు. పూర్వాచారంలో కొంచెం లౌక్యం మిళితంజేస్తాడుకూడా. ఇప్పుడేదో పనిమీద పోతుండగా భద్రయ్య కేకవేశాడు.

భద్రయ్యకు అరవయ్యోపడి దాటుతుంది. పార్వతమ్మ పదిహేనేండ్లు తక్కువలోఉంది. ఒక పెద్దజవాబుదారీ భద్రయ్యకుండె అణిచేస్తూంది. ఈకాలం ఆయుఃప్రమాణాన్నిబట్టి తాను అరవైయేండ్లు బ్రతకడమే విచిత్రం. అయినా భార్యాభర్తలు గట్టివారే. ఆయనకు యాభైఅయిదు; ఆమెకు నలభై ప్రాంతంలో కల్యాణి పుట్టింది. ఇక బదకనని పెద్దబెంగపట్టుకొంది భద్రయ్యకు. తాను పోతే కల్యాణిపెండ్లి చేసేదెవరు? ఆపిల్ల పెండ్లిభారం తీరెనా, తన జీవి సుఖంగా పోతుంది. అయితే తనబాధ్యత తీర్చుకోవడమేలాగా? కల్యాణికి పెండ్లి చెయ్యాలి. మూఢాచారంలోగూడా సందిగ్ధాలున్నాయి. 'అష్టవర్షా భవేత్కన్యా' అని ఉంది. కాబట్టి, కల్యాణికి అయిదేండ్లుకూడా నిండలేదు కాబట్టి, దాని పెండ్లి కన్యాదానంకింద వస్తుందా, రాదా? అని సందేహం. జీవితంలో ఇక కన్యాదానం చెయ్యబోడు. పార్వతమ్మకు ముట్లుడిగాయి.

మనోవేగానికి మితేమిటి? ఈలా యేమేమో అనుకొంటూండగా, కృష్ణావధాని వచ్చాడు. 'ఏమన్నా! ఎందుకు పిల్చావు? ఏదో పనిమీద వెళుతూంటే' అన్నాడు.

భ—ఊళ్లోవాళ్ల కార్యాలకేకదా? ఎక్కడో పనికిమాలు ఇక్కడే అనుకొందూ. వయస్సుచేత నేను పెద్దవాణ్ణయినా, విద్యచేత నీవు. బుద్ధివయసు ప్రధానంగాని శరీరంవయస్సు కాదు. అట్లయితే, మనందరికంటే ఆ చింత పెద్దది.

కృ—ఏమిటి? ఎక్కడికో పోతున్నావు?

భ—నాసంగతి తెలుసుదువుకదూ. ఎక్కడ మొదలూ?

కృ—'ఎక్కడో పనికిమాలు ఇక్కడే అనుకొందూ' అన్నావు.

భ—ఆ, అవును. నేను పెద్దవాణ్ణయినాను. కాట్లో కాళ్లాచుకొని ఉన్నాను.

కృ—అయితే, యిప్పుడేమిటి?

భ—పెద్దవాణ్ణి. అటూయిటూ బుద్ధినిపోనియ్యాకుండా ఒక్క విషయంమీదే ఉంచమంటే నాతరమా?

కృ—ఇదంతా ఏంకథకు పీఠిక?

భ—నాతలమీద పెద్దభారముంది. అలా అంటే తర్కానికి దిగుతావు. "నీలాంటివాళ్లు ఎంతమంది పోలేదు? వాళ్లపిల్లలగతేమైంది? అందరూ చెడ్డారా?" అంటావు. అంతటికీదేవుడే, మనబాధ్యతేమిటి అంటావు. పురుష ప్రయత్నమనేది ఉంటేనేకదా, దైవసహాయం?

కృ—అనన్లే, విషయంచెబుమూ; ఏమిటీగొడవ?

భ—కల్యాణికి మూడుముళ్లూ పడినట్టాయెనా, నా ప్రాణి హాయిగాపోతుంది.

కృ—అదా? అయితే పెండ్లిచేసెయ్యి. వరుడు న్నాడా?

భ—ఇప్పుడు సందేహమదికాదు. పిల్లకు అయినో యేడే నిండలేదుగదా, కన్యాదాన మౌతుందా కాదా? కన్యాదానఫలం దక్కుతుదా? అని.

కృ—ఈమాటకా యింత ఆర్భాటం?

అంటూకనుబొమలుముడిచాడు, యీ లౌకికశిఖామణి. చంటిబిడ్డకూ కూడా పెండ్లి చెయ్యవచ్చునని ఎక్కడా ఒక్కశ్లోకమూ కనబడదు. నాలుగైదు నిమిషాలు అట్టే ఎగజూచాడు.

కృ—అదికాదోయి. శాస్త్రమంటే దేశకాల పాత్రలకు అనుగుణంగా ఉండే ధర్మగ్రంథమేకదూ?

భ—అవును. అయితే?

కృ—వేదకాలాన వందలయేండ్లుఆయుఃప్రమాణం ఉన్నప్పుడు రజస్వలావివాహాలూ స్వయంవరాలూ జరుగుతుండేవి. ఏ వెయ్యేండ్లక్రిందనో శతాయువులై ఉండగా, రజస్వలావివాహాలు పదహారు పదిహేడేండ్లకు జరుగుతుండేవి. ఇంకా యివతల ఆయుఃప్రమాణం యే యెనభయ్యో ఉంటూండగా శాస్త్రకారులు 'అష్టవర్షాభవేత్కన్యా' అని యెనిమిదేండ్లకుదించారు. ఇప్పుడు అదీలేదు. మొన్న ఆంధ్రపత్రికలో మనదేశంలో సరాసరి ఆయుఃప్రమాణం యిరవై మూడేండ్లే అన్నారు. అదే నిజమైతే, లెక్కప్రకారం కన్యాదానవయస్సు రెండేండ్లాచిల్లరకు దించవచ్చు. వచ్చేమిటి? వలె. లేకుంటే మన దేశం అధోగతిపాలే.

భ—నిజంగా నీ అభిప్రాయ మంతేనా?

కృ—ముమ్మాటికీ.

భ—బుద్ధికి బృహస్పతివోయి! అయితే కన్యాదానఫలం తప్పదుకదా?

కృ—ఇక ఆలస్యం చేసేకొద్దీ అసాధ్య మౌతుంది కూడాను. వదినా, వెళతా.

పార్వతమ్మ—మంచిది, బావా.

ఇంతవరకూ బొమ్మలపెండ్లి భోజనాలకు బెల్లం కోసం యేడుస్తూఉన్న కల్యాణ్ని ఓదార్చడంలో ఉంది పార్వతమ్మ. రెండుచేతులూచాచి, చిన్నరొమ్మువెనక్కు విరుస్తూ, 'అంతబెల్లం కావాలి' అంది కల్యాణి. అంత కాదు యింతకాదు, చాచిన రెండుచేతులంత కావాలట ఎక్కడ తేవడం? ఆ ఉపాయం తల్లులకే తెలుస్తుంది. ఈ సిరికాయంత ఒకటీ నిమ్మకాయంత ఒకటీ రెండుండలు చెరొకచేతా పట్టి ఏదికావాలని అడగ్గా, నిమ్మకాయంతదాన్ని నవ్వుతూ ఎగిరందుకొని, మళ్లీ తన గొడవలోకి వెళ్లింది కల్యాణి. పార్వతమ్మ పిల్లను సముదాయించి వచ్చేసరికి, 'వదినా, వెళతా' నన్నాడు కృష్ణావధాని.

'కన్యాదానఫలం దక్కుతుందట' అన్నాడు భద్రయ్య. పార్వతమ్మ 'ఎలాగా?' అనగా, ఉపాయం చెప్పాడు.

## ౨

ఇంతవరకూ భద్రయ్యచేసిన వ్యవహారం రాముడు లేని రామాయణం. పెండ్లి కొడు కేడీ?

భద్రయ్యసంసారం మెరుగైందే. ఎన్నిపాపాలో చేశాడు. పాపమెక్కువయ్యేకొద్దీ మూఢభక్తియెక్కువ. అట్లని మూఢభక్తికలవాళ్లంతా ఎక్కువపాపం చేశారనడంకాదు సుమీ. పాపం మనసు పీకుతూండబట్టే శాస్త్రాల్లోచెప్పినట్లు కన్యాదానఫలితానికి వెదకడం.

అల్లుడు యింగ్లీషు చదువుకొన్నవాడుగా ఉండాలి. లేకుంటే, పదిమందిలో తనపిల్లకే తలవంపులు. అందుకోసం భద్రయ్యకాలేజీలు వెదక మొదలుపెట్టాడు. 'మాతావిత్తం' అన్నట్లు, పార్వతమ్మ డబ్బుగలవాణ్ణిగా చూడమంది. 'పితాశ్రుతం'— భద్రయ్య చదువుకున్న వాణ్ణికోరుతాడు. భార్యాభర్తల అభిప్రాయాలు అన్యోన్యానుకూలంగా ఉంటేనేగాని, సంసారం సాఫీగా

జరగదు. విద్యాధనాలు రెండూ ఉండేవాడు దొరకడమే కొంచెం కష్టం. ఇక, కల్యాణే పెద్దదై ఉంటే, 'కన్యా వరయతే రూపం' అన్నట్లు, అందగాణ్ణి కోరే ఉంటే, యీ పెండ్లి అయ్యే ఉండదు. ఇదే కాదు, యీ వరుస మీదనే అయితే ప్రపంచం గార్హస్థ్యధర్మంమీద నడవడం అసాధ్యమే; మరో విధంగా నడువవలసి ఉంటుంది. కాని, పిల్ల కంతజ్ఞానం రాని స్త్రీ గదా?

తిరిగి తిరిగి విజయనగరం కాలేజికి వచ్చాడు భద్రయ్య. సాధారణంగా కాలేజీలలో వరుణ్ణి వెదికేవారు, మంచి అయ్యవార్ని ఎవర్నో పట్టుకొని, ఆయన ద్వారా మంచిపిల్లవాణ్ణి యేరుకోవడం సాధారణం. కాని కాలం మారిపోతూ ఉంది. నాలుగైదేళ్ల పిల్లకు వరుడు కావాలని హెచ్చరిస్తే, యీమాత్రం ఆమాత్రం జ్ఞానమున్నవారెవరైనా చీవాట్లు వేస్తారు. ప్రపంచజ్ఞానంగలవాళ్లు సాధారణంగా కాలేజీ బ్రహ్మచార్లకు అనాఘ్రాత పుష్పం లాంటిపిల్లను కట్టడానికి కొంచెం అనుమానిస్తారు. కాని ఆ అనుమానం భద్రయ్యకు లేదు, ఎక్కడా వినలేదు. తానెరిగిందొకటి, శైశవవివాహం సమ్మతించరు నవనాగరకులని.

ఇందుకనే, భద్రయ్య కొత్తయుక్తి ఒకటి పన్నాడు, కాళయుక్తి. సోదెమ్మహోటల్లో భోజనం చెయ్యడం, అరుగుమీద కూర్చోడం, పుస్తకాలు చేతపట్టుకొని కాలేజికి వెళ్లేవాళ్లని చూస్తూ ఉండడం. కాలేజి విడిచే వేళకు మళ్లీ ఆలాగే చూస్తూ ఉండడం.

మూడు నాలుగు రోజులు గడిచింది. ఒకదినం సాయంత్రం చేత పుస్తకాలతో, ఒక యువకుడు తెలుపు కలిసిన యెరుపుచాయతో, రివటలాగా సన్నని పొడుగరి, సేలంజల్తారుదోవతి, కండువా, సిల్కుచొక్కా వేసుకొని కండ్లకు అద్దాలూ కాళ్లకు స్లిప్పర్లూ వేసి, ఠీవిగా, అనో వయ్యారంతో, కొనకంట అటూయిటూ గుమ్మాలవైపు చూస్తూ, భద్రయ్యముందరగా వెళ్లుతున్నాడు.

బ్రదికానను కొన్నాడు భద్రయ్య. అతనివెనకే కదిలాడు. ఆ కుర్రవాడూ ఆవీధిలోగుండా యీవీధిలోగుండా తిరిగి. 'అసావాదిత్యో బ్రహ్మ' అన్నట్లు చివరకు కానుకుర్తివారివీధిలో ఒకబసలో ప్రవేశించాడు. బల్లమీద పుస్తకాలు పడేసి, వాలుకుర్చీలో కూర్చొని, ఎక్కణ్ణో మనసు పెట్టుకొని, జపాను విసనకర్రతో మెడగుండీ తీసి గుండెపై విసురుకొంటూ ఉండగా, భద్రయ్య ప్రవేశించాడు. వయసుమీరిన బ్రాహ్మణ్ణి చూడగానే, ఎంత యింగ్లీషు చదువుకొన్నా, కుర్చీచేతులపై కాళ్లు దించి, 'ఎవరండీ' అన్నాడా యువకుడు. 'మీతో పనుండి వచ్చానండీ' అని సగౌరవంగా ఉత్తరమిచ్చాడు భద్రయ్య. అతను 'దయచెయ్యండి' అంటూ, ఇంకొక కుర్చీ యిచ్చి, భద్రయ్య కూర్చోగా, 'ఏమి సెలవు' అన్నాడు.

భ—కొంచెం శాంతంగా మాట్లాడవలసిన విషయం. అడగడానికి మరచాను, తమ పేరేమి?

యు—గోపాలమంటారు.

భ—ఇంటిపేరు?

గో—పసుమర్తివారు.

భ—నావల్ల ఆలస్యం అవుతూందేమో, షికారుకు?

గోపాలానికి ఆలస్యమేమిటి? సత్రానికివెళ్లి భోజనంచేసి, తర్వాత సినీమాకు వెళ్లి, అక్కణ్ణుంచి గుడివీధికి వెళ్లి యే అర్ధరాత్రికో పడకకు బసకు వచ్చే యేర్పాటు ఆలోచిస్తుండగా, భద్రయ్య వచ్చాడు. వచ్చింది పెద్దబ్రాహ్మడు. ఇంటిపేరు అడిగాడు. కారణమేమైయుంటుందో కాలేజీ కుర్రవాళ్లకు చెప్పాలా? 'మీవల్ల ఆలస్యం ఏమీ లేదండీ' అన్నాడు గోపాలం.

భ—ఏ పదిగంటలకు తిన్న అన్నమో, కాఫీ హోటలుకు వెళ్లి ఫలహారం చేసి వచ్చి కూర్చుంటే బాగుండును. శాంతంగా మాట్లాడవచ్చు.

'ఊరక రారు మహాత్ములు' అన్నారు. ఇదికూఢీగా పెండ్లి ప్రయత్నమే. వచ్చినవాడు పూర్వాచారపరాయణుడుగా ఉన్నాడు. తాను మంచి అలవాట్లు కలవాడుగా కనబడాలి.

గో—ఈపూటకూలితిండి అనాచారానికే తలప్రాణం తోకకొస్తూంటే, కాఫీహోటేలు ఫలహారమే?

పూటకూళ్ళయింట, వంటగదిలో ఎవరు వండినా, వడ్డించేదన్నా బ్రాహ్మణమనిషి. కాఫీహోటళ్ళల్లో అదీలేదూ. సెలవుల్లో యింటికి వెళ్ళితే మా అమ్మ కొత్త జంఝం వేయించి పెట్టెలూ బట్టలూ అన్నీ తడిపించి మరీ విస్తరి ముందు కూర్చోనిస్తుంది.

భ—ఆఁ! ఏవూరు బాబూ?

గో—గోదావరిజిల్లా అమలాపురం.

భద్రయ్యగారు కన్యాదానానికి పవిత్రమైన కుర్రవాడు దొరికాడన్న సంతోషానికి మితిలేదు. పాపాలన్నీ యీకన్యాదానంతో సరి, జన్మతరించిందనుకొన్నాడు.

భ—అమ్మా నాయనా ఉన్నారా?

గో—నాయన చిన్నప్పుడే పోయాడు. అమ్మ పెద్దది. ఆచారం లావు.

భ—ఆమె ఒక్కర్తే ఉందా?

గో—మాతమ్ముడు సుందర మున్నాడు.

కల్యాణి కాపరానికొచ్చేసరికి అత్తఉండనే ఉండదు. ఇక ఆడబిడ్డల పోరో? అందుకోసమే భద్రయ్య 'అక్కచెల్లెం డ్లున్నారా?' అని ప్రశ్నించాడు.

గో—లేరు. అన్నదమ్ముల మిద్దరమే.

భ—(ఆతురతతో) నాయనా, గోపాలం, ఒక కార్యముండి వచ్చాను.

గో—చెప్పకుండానే తెలుస్తూంది. అయినా, చెప్పండి.

భ—పెద్దవాణ్ణయినాను, చాలకాలంలేదు. నా జన్మకు ఆఖరు కన్యాదానం చెయ్యదలచాను.

గో—అయితే యిప్పుడే పెండ్లి చేసుకొంటేనా చదువు చెడుతుంది. పెద్దపెద్ద ప్లానమీద ఉన్నాను. ఏలాగా?

భ—నీకేమీ యిబ్బందిలేదు. పిల్లకు ఇంతా అయినో యేడే. వెయిన్నూటపదహార్లతో సాలంకృత కన్యాదానం చేసుకొంటా. ఖర్చులు నావే. నీవు ఊఁ అని మూడుముళ్లూ వేసి వస్తే చాలు.

గో—చదువు చెడుతుంది. మాప్రయత్నం ఏమీ వద్దన్నా మీఊరికి రాకపోకలకే కొంతకాలం అవుతుందా?

భ—అంతమాత్రమూ లేకుండా పెండ్లియేలాగా?

గో—కల్యాణికి యెన్నేండ్లన్నారు?

భ—అయినోయేడు.

గో—ఆమాట కొంచెం ధైర్యమిస్తూఉంది. ఏ యేడెనిమిదేండ్లకో కాపరానికొచ్చేసరికి నాప్లానన్నీ కొనసాగుతాయి. అయితే ఒకమాట ఉంది. ఎంతకల్ల సంసారమైనా, కొండైనా ఒక్కొక్కరాయి తీస్తుంటే తరుగుతుందన్నారు గదా? ఇక నాసంగతో, రాళ్లుతియ్యడంగాదు, గుండ్లుతియ్యడం, మీరూ ఒకచెయ్యి వెయ్యవలసిఉంటుంది. ఒకటికాదు, రెండుచెయ్యాలి.

భ—కానీ, ఏమైనా, నీఅంతటివాడు అల్లుడైతే, అంతేచాలు.

ఇలా మాట్లాడుతూండేసరికి భోజనాలవేళైంది. గోపాలం కాబొయ్యే మామగారితో హోటలుకు వెళ్లాడు, 'ఆలస్యా దమృతం విషం' భద్రయ్య ఆరాత్రికే ప్రయాణమైనాడు. మామగార్ని బండెక్కించి, చిల్లరఖర్చు కని ఆయన యిచ్చినయాభై రూపాయలతో సానివీధి చేరాడు అల్లుడు.

భద్రయ్యసంతోషానికి మేర లేదు. చూడను బాగున్నాడు. మంచివంశం, మంచిఆచారం, చదువులో శ్రద్ధ, కల్లసంసారం—ఇకేంగావాలి? కల్యాణి అదృష్టం! గోపాలం ముదర బెండకాయన్న సంగతి తనకేందెలుసు?

కల్యాణి దదోలోకం. పీటలమీద తన బొమ్మల కూడా తనతోపాటుఅన్నీ, మంగళసూత్రంతోగూడా. బాజాలు, బూరెలు దొరికాయి, బొమ్మ లున్నాయి. ఇకేమీ!

ఏలాగైతేనేమి, పెండ్లయింది. డబ్బుచేతికొచ్చింది. చదువంటే అతిశ్రద్ధ కాబట్టి, పదహారురోజుల పండగకు కూడా ఉంచుకోకుండా అత్తమామలు గోపాలాన్ని ప్రయాణం జేశారు.

'నా బరువు తొలిగిం దబ్బా' అనుకొన్నాడు భద్రయ్య.

గోపాలం వెళ్ళాకకూడా, కల్యాణి రోజూ పారాణింముకొని, పెండ్లిచేసుకొనేది. తోడిపిల్లలచేతికి మంగళసూత్రం తీసిచ్చి, తాటాకుపీకలతో వాళ్లు బాజాలు ఊత్తుంటే, తాను మంగళసూత్రం కట్టించుకొనేది. అమ్మా నాయనా కూడదంటే యేడుస్తుంది. ఏడ్పించడానికి మనస్కరించక వాళ్ళూ ఊరుకొనేవారు.

## 3

పెండ్లి కాకముందు గోపాలంజీవిత మున్నట్లు ఇప్పుడు లేదు. చాలా మార్పు కలిగింది.

మొదట కాలేజీలో ప్రవేశించగానే సత్రంలో పద్దు వేయించుకొన్నాడు. పద్దుల్లకలిగే సౌఖ్యాల కోసమై ఒకనాట్కిశమను ఓర్చుకొన్నాడు. ప్రిన్సిపాలు బోర్డింగుకావలసిన విద్యార్థుల విచారణచేసేదినం కొంచెం అలంకారం మాని పాతచొక్కాయితొడిగి లేని వంగి మాటలతో ఆ అయిదునిమిషాలూ గడిపాడు. వారంతిరిగేసరికి సత్రంగుమాస్తా పద్దుపడిందని చెప్పాడు. ఇక సత్రంలో భోజనం చెయ్యడం, ఇంటినించి హోటలు కని వచ్చిన డబ్బుతో రాత్రి ఖర్చు పెట్టుకోడం.

విద్యార్థిసత్రం భోజనమంటే మనుషులు తినవలసిందికాదు నిజమేగాని, అందువల్ల మిగిలేడబ్బువల్ల కలిగేసుఖంముందర యీభోజనకష్టం తెలిసేదికాదు. ఏమినాయనా చిక్కిపోతున్నావని యింటికి వెళ్లినప్పుడడిగితే, బి. ఏ. చదువూ, ఫూటకూలితిండీ, అనేవాడు.

ఇదివరకు మనియార్డరువచ్చిన రెండుమూడు రోజులే ఠెంపరరీగా గృహస్థుకావడం. ఇప్పుడో, కావలసినంత డబ్బుండడంచేత నిత్యగార్హస్థ్యం.

పరీక్షలయిపోయాయి. గోపాలం ఇంటికిగానీ, మామగారియింటికిగానీ వెళ్లడు. ఏమని యింటికి వ్రాశాడంటే, 'బి. ఏ. పరీక్షవిషయంలో సందేహంలేదు. తర్వాత చదువుకు ఇక్కడనే ఉండి వేసవిలో చదువుకోవాలనిఉంది' అని. చదువుసంగతి ముసలిముండ అమ్మకు తెలుసునా? వెట్టిపట్టి మామకు తెలుసునా? ఏమో పెద్దపరీక్షలు ప్యాసయి ఉద్యోగాలూ ఊళ్లూ యేల్తాడు గోపాలం అని వాళ్ల విశ్వాసం.

పరీక్షాఫలితాలు వచ్చాయి. అందరూ పోస్టాఫీసుకు వెళ్లుతూంటే, తాను గుడిపీధికి వెళ్లుతున్నాడు. తన పరీక్షనుగురించి అనుమానం ఉంటేకదూ? జీవనం మాత్రం మహాతీవ్రంగా నడుపుతున్నాడు. బాంకిలో మొత్తం నెలనెలకూ తగ్గుతూఉంది; ఒంటిలోశక్తి దినదినమూ తగ్గుతూఉంది. వైద్యం ప్రారంభమైంది. పుస్తకాల అరమరనిండా మందుసీసాలు నిండాయి.

విజయనగరంలో వేసవి అంటే తెలుసునా! తెల్లవారేసరికి పక్షులు చచ్చి చెట్లకింద పడతాయి. ఆ యెండేచాలు మనిషిని మాడ్చెయ్యడానికి. గోపాలం తీవ్రజీవనంతో మండేవేడి సంధించింది. ఇంకేమి?

గోపాలానికి చాలా జబ్బు చేసింది. చిన్నప్పుడు అశ్రద్ధ చేసినందుకు ... ... ... ... ... ... ... ... ... ... ... స్నేహితులు కనిపెట్టారు. ఫూటకూలితిండికీ, విజయనగరంవేడికీ, యీవ్యాధులకూ, గోపాలం క్షణక్షణం క్షీణమౌతున్నాడు. అదిచూచి అందరూ ఊరికి వెళ్లమన్నారు. తెల్లవార్లూ మొర్రోమని గోలపెట్టడం చూచి స్నేహితుడొకడు, గోపాలానికి ఒళ్లుతెలియకుండా ఉన్నప్పుడు, తెలివితో మాట వినడని, చెప్పకుండా తీసుకవెళ్లి ఊరు చేర్చాడు. తల్లీ తమ్ముడూ అప్పుడు మేలుకొన్నారు.

ఒకనాడు బతుకుతాడా అన్నంత జబ్బుచేసింది. భద్రయ్యకు మైలు రుసుం గట్టి తంతికొట్టారు.

ప్రాణం పోయింది. అత్తా మామా వచ్చేదాకా దహనంచెయ్యడమెలాగా? ప్రాణం పొద్దున పోయింది. సాయంత్రానికి గోలపెడుతూ పార్వతమ్మవచ్చి కల్యాణిని శవంమీద వేసింది. భద్రయ్య ఎట్లయినా మొగవాడుకాబట్టి గోలపెట్టడంలేదు. ఒక్కపెట్టున అందరూ గోలుమనే టప్పటికి కల్యాణి 'బా' అని పార్వతమ్మమెడ



ప్రియసంకేత గయో కబ కౌతహు ఆప్ గజీన బియోగ బఢాయో
సంగ సహైలీకే బీన బజావత యాబిధి జా సుహియా బిరమాయో
మోతి నహేర సిగార కియే నభఛాయ రహై ఘనచిత్త లగాయో
గోడమల్లార శ్రీరాగకీ రాగనీ నామ యహ అభిరామ సుహాయో.

[జయపురచిత్రము: దివాన్ బహదూరు గోవిందదాసు చతుర్భుజదాస గారి యనుమతి ]

కరుచుకొంది. 'నిర్భాగ్యపుముండా, నీగతి తెల్లవారిందే' అని అమ్మ పిల్లపైనబడి యేడుస్తుంది.

దహనమైంది. ఇల్లు బావురు మంటూంది. "ఈ పుట్టువెధవ కెందు కిచ్చానే నాబంగారు నాయనా?" అంటూ పిల్లను చూచి అత్త యేడుస్తుంది. ఏమన్నా, ఆడపిల్లతల్లి కాబట్టి, పార్వతమ్మ బయలాడలేకపోతూంది. లక్ష్మిలా ఉండవలసినపిల్లను యీగతి పట్టించి ఎలాబతికి నన్నావూ కడుపున పెట్టుకొనివేగడమూ అని బయల్లాగా నిరామయంగా ఉన్నహృదయంతో ఉండేపార్వతమ్మకు ఎత్తిపొడుపుమాటలుకూడాను.

కర్మ దానిపాటికది జరుగుతూంది. ఆఖర్నాడు కల్యాణి రేవుకుతీసుకెళ్లాలి; కనబడక వెతుకుతున్నారు. కల్యాణి ఎక్కడ ఆడుకొంటూంటుందో అని మామూలు చోట్లల్లా చూస్తున్నారు. ఒకరు పెరట్లోకి వచ్చేసరికి ఒకమూలను ఎవర్నిచూడడం? బొమ్మలు పెట్టుకొని పారాణించుకొని పక్కింటిపిల్లతో పెండ్లి ఆట ఆడుకొనే కల్యాణిని. అతని మనసెటుపోయిందో గదా? నోట మాటరాదు, గుండె జారిపోయినట్టయింది. ఒకమూలను తాను కూర్చొన్నాడు. "అమ్మాయీ, అగ్గయిపోయిన అమ్మాయీ," అని అణిగిపోతూ ఉన్న అమ్మకేక వినబడ్డది. 'ఇక్కడ ఆడుకొంతున్నా'అని కల్యాణి అరిచింది. అమ్మ వచ్చేసరికి, చప్పట్లు కొట్టుకొంటూ నవ్వుతూ, మొగమెత్తుకొని ఎదురుపోయింది. 'అవ్వ'ని నోరు కొట్టుకొంటూ, గుండె బాదుకొంటూ కొంగుతో పారాణి తుడిచి, పిల్లను చంకబెట్టుకొని వెళ్లింది.

బంగారుగాజు లుంచారు. మాంగళ్యం తియ్యబోతే కోతిపిడికిలి పడుతుంది కల్యాణి; ఏడుస్తుంది. ఏమనడం? తినడానికి మిఠాయితెప్పించిపెట్టి, మోసంచేసి తాడు వెనకనుంచి కత్తిరించేశారు.

## ౪

కల్యాణిది తెలిసినయేడుపూకాదు, తెలేనియేడుపూకాదు. నోములునోచినపిల్లలు దారినపోతుంటే చూచి, తానూ నోచుకొంటాననంటుంది. కూతురికి తెలేని విచారం నెత్తిన పులుముకవలసివచ్చింది. పిల్లసంగతి ఆలోచించే, పార్వతమ్మ యెవరినీ తనకు బొట్టుపెట్టడానికి రావద్దని బతిమాలుకొంది.

ఈలాంటివి అనుదినమూ తటస్థిస్తూనే ఉండేవి. ఆడవారిహృదయం మగవారిలాగా ప్రకృతిదూరం కాలేదు కాబట్టి అప్పుడప్పుడూ కల్యాణిదుస్థితి దేవుడు వ్రాసిందా, మనుషులు కల్పించిందా అని లోపలచేరి తన్నెవరో అడిగినట్టు తోచేదిగాని, దానికి జవాబు పార్వతమ్మ చెప్పలేకపోయేది. ఒకపక్క ప్రకృతి తన హృదయానికిగాలంవేసి లాగుతూంది; ఒకపక్క మనుష్యకల్పితమై ప్రకృతి విరుద్ధమైన సాంఘికాచారం భద్రయ్యగా మూర్తీభవించి తనను అణగదొక్కుతూ ఉంది.

కల్యాణిని భరించడం గుండెమీద కుంపటిపెట్టినట్టుంది.

పిల్లకు యేటిమీద యేడు పడింది. అడవిలో పువ్వుపూచినట్టు పుష్పవతి అయింది. ఆసమయంలో మనసులో యేలాంటికోరికలు పుట్టేదీ ఆడవాండ్లకే తెలియాలి. ఇప్పుడిప్పుడే కల్యాణికి తాను అయిదోతనంలేనిదనీ, తన పుష్పవతీత్వం అందరికీ విచారకరమేగాని సంతోషకరం గాదనీ, బోధపడుతూఉంది.

అన్నివిధాలా బాగుంటే అందరూ గౌరవిస్తారు. కష్టములపాలైనప్పుడు లోకమంతా కఠినంగా, చులకనగా, నీచంగా చూస్తారు. ఇటువంటిసంఘాన్ని దీని ఆచారాలను ఎవరు ఎందుకు గౌరవించి శిరసావహించాలో, బోధపడదు.

ఎదటింటిసుందరం, పక్కింటిరాధ చేసుకొన్న పుణ్యమేమి? తానుచేసిన పాపమేమి? వాళ్లుమొగుళ్లతో హాస్యాలాడుకొంటూ, నవ్వుతూ పేల్తూ, మహాలక్ష్మల్లాగా కలకలలాడుతూ, హాయిగా కాలంగడుపుతున్నారు. వాళ్లనందరూ మర్యాదగా, ముద్దుగా చూస్తున్నారు. ఇక తన సంగతో? పూర్వాచారప్రియుడు భద్రయ్య. చుట్టపక్కాలంతా మూడోచేతివారు. ఎవరెక్కడికి పోతున్నా, కల్యాణి ఎదురైతే వెనక్కుపోతారు. మరీ గట్టిమనసువారైరా, "ఎదురైం

దిరా, పాడుముండ” అని కల్యాణికి వినబడే ట్టుగా గొణుగుతారు. ఆసాణుగు వినబడ్డప్పుడు, తా నొక నీచప్రాణిగా పశువులకంటే అధమంగా లోకానికి తోస్తు న్నట్టూ, అందుకు తాను చేసిన తప్పేమో అనీ అను కొనేది. ఇటువంటిప్రశ్నలు తోచేవే కాని, వాటికి ఏదో ఒకజవాబు ఇదమిత్థ మని తేల్చుకో లేకపోయేది. ఇక యింట్లో, పార్వతమ్మకు ఎప్పుడైనా జ్వరమో, తల నొప్పో వస్తే, కల్యాణి తలకు స్నానంజేసి తడిగుడ్డతో వండి వడ్డిస్తేనేగాని నాన్న ముట్టుకోడు. ఒకటిరెణ్ణాళ్లు యిలా చేసేసప్పటికి తలనొప్పి జ్వరం అంటుకొనేవి.

హా! లోకమా! ఎక్కేమనిషికి సాయంచేస్తావు; తనతప్పేమీ లేకనే పట్టుతప్పి పడేమనిషిని తన్నితన్ని అణుక్కతోస్తావు!

రోజు యోగంగా కల్యాణి కాలం గడుపుతూ ఉంది.

ॐ

పురుషులవిషయంలో కూడా చెప్పవలసి ఉంది కాబట్టే, గృహస్థులకు కూడా ఒకవిధమైన లింగశుద్ధి ఉంది కాబట్టి, పాతివ్రత్యం అన వీలులేదు, బ్రహ్మ చర్య మందాము. స్త్రీలవిషయంలో మాత్రం పవి త్రతో, పవిత్రతో అని ఆర్భాటం చేస్తాము. మొత్తం మీద ఒక స్త్రీ చెడిందంటే ఒక పురుషుడూ చెడ వలెగదా? అ దే మంటే మగవాళ్లకు తప్పులే దంటారు. వారు చెడకుండా వీరు చెడడ మెలాగా? ఒక పెళ్లితో ఒకభార్యతో పురుషుడికి తృప్తిలేనప్పుడు, ఒక పెండ్లిసౌఖ్యమైనా లేకండా స్త్రీకి తృప్తి ఉండడ మెలాగా? ఆలా ఎందుకుండాలి? వాళ్లను పవిత్రంగా ఉండమని మగవాళ్లు పశువుల్లా ప్రవర్తిస్తూ ఉంటే సంఘం చక్కబడుతుందా? నిజంలో ప్రపంచ మీలా ఉండడం ధర్మాలు తెలేకకాదు; చెప్పినప్రకారం చేసి దారి చూపేవారు లేక. మరోసంగతి. అన్నీ ఉడిగి అడవులకు పోయిన బడుగుమును లెప్పుడో వ్రాసినప్రకారం యిప్పుడూ జరగమంటే సాధ్యమా? అందరము ఉప్పూ కారం తినేవాళ్లమే. కామ మనేది దేవుడు పెట్టాడు. ఏమాత్రమూ సంతుష్టిలేకుండా దాన్ని ఆద్యంతాలూ అణచమంటే సామాన్యులకు సాధ్యంగాదు. కేవలము భోగవాంఛ పాప మనలేముగదా! పాపమే అయితే గార్హస్థ్యమే అశాస్త్రీయం. కాబట్టి జన్మసిద్ధమైన, పవిత్రమైన యీకోరిక తీర్చుకోడానికి ప్రతిమనిషికీ ఒక మారు అవకాశం యివ్వడం ధర్మం. ఏమిటయ్యా యీ పాదిరిగుడిబోధ అంటారా? వస్తున్నా.

పుష్పవతి అయి ఏణ్ణర్ధం గడిచింది. స్త్రీలవిష యంలో సంభోగవాంఛను ఒకఅలకు పోల్చవచ్చు. ఇందు లో రెండురకాలు. ఒకటి యుక్తవయస్సతో ప్రారం భమై ఇరవై మూడు, యిరవైనాలుగుకు పూర్తిగాఉబికి అంతట క్రమక్రమంగా తగ్గి ముప్పైకి సమసి, మళ్లీ యే ముప్పైయెనిమిదికో పుట్టి ఉబికి నలభైరెంటు మూటికి చచ్చిపోతుంది. రెండోది, ప్రతినెలా నెలమూడురోజు లకు మూడునాలుగురోజులు ముందుపుట్టి అంతట యెని మిది తొమ్మిదోనాటికి మహత్తరంగాఉబికి దేహమంతా వ్యాపించి, చూస్తే గగుర్పాటయ్యేటట్టుచేసి, అంతట పదిహేను పదహారోనాటికి సమసిపోతుంది. మనిషి మనిషికీ కొంచెము ఈయీ కాలనిర్ణయంలో మార్పుండ వచ్చు.

ఈలా ప్రతినెలలో ఒక పదిహేనురోజులు, ఏమీయెరుగని కల్యాణికి, ఒంట్లోయేమిటో ఒక వర్ణింప రాని కోరిక కలిగినట్టూ, ఒక పొంగువచ్చినట్టూతోచేది. మనస్సేదో ఒకవిధంగా ఉండేది. ఇతరుల భయానికే గాని, అందమైనవాళ్లను చూస్తే ఏదో ఒకవిధంగా ఉండేది. ఈ ఉద్రేకం యేమిటో తనకేమీ బోధపడడం లేదు.

ఇప్పటికి పార్వతమ్మ కావలికాయడం తగ్గింది.

ఏకాంతవాసం యోగాభ్యాసకులకు అవసరమూ, యిష్టమూ, కావాలని తెచ్చిపెట్టుకొనేది కాబట్టి మేలు చేస్తుంది. కాని బలవంతమాఘుస్నానంలాగా తెచ్చిపులి మ్మితే భరించడం కష్టం. మనిషిని సాంఘికపశువన్నారు. తోటివాళ్లు ఆడుతూపాడుతూ ముస్తాబుచేసుకొని సర దాగా ఆయింటికీ యీయింటికీపోతూ దిగులనేదేమిటో

యెరగకుండా దినాలు క్షణాలుగా గడుపుతుంటే, కల్యాణిస్థితి యేలాఉంది? పాపం తన అమాయికపు నవ్వు నవ్వరాదట! ఎవరితోనూ మాట్లాడరాదట! ఏయింటికీ పోరాదట! పొద్దుపోవడమేలాగా! పుస్తకాలతో పొద్దుపుచ్చడానికి చదువురాదు.

చెడ్డకూర్గకుంటే యేమిటో యెరగనిపిల్లకు పెద్దవారు ఉపదేశం చేస్తున్నారు. వారాలాంటివారు, వీరు యీలాంటివారు, నవ్వితే ఆ అర్థం, అటుచూస్తే యీ అర్థం, అంటూ, మంచిచెబుతున్నామనే వెఱ్ఱినమ్మకంతో కామశాస్త్రం బోధిస్తున్నారు. చిన్నవాళ్లకు బుద్ధిచెప్పే టప్పుడు, అన్నీ ఉడిగిన పెద్దవారంతా యోగులౌతారు. 'వృద్ధా నారీ పతివ్రతా' అన్నారుగదా. వీళ్లస్వభావాలే పరిశీలిస్తే యెంతఘోరంగా ఉంటాయో వారికే యెరుక, దేవుడికేయెరుక.—అంటే సామాన్యమానవుల సంగతిసుమా! మానవస్వభావం, చెయ్యొద్దన్నపని, అందులో యేమో ఉంది అని, చెయ్యడం. 'దొంగకరు స్తాడే' అన్నట్టు అవుతుందని గ్రహించేతెలివి భద్రయ్యకేది? పైఅంతస్తు అద్దెకిచ్చాడు. పిల్లలను చెరిచేది తల్లిదండ్రులే అనడంలోనూ కొంతసత్యంఉంది.

తనపై యేండ్లు పడేకొందీ, నాన్నహృదయం క్రూర మౌతున్నట్టు కనబడుతూంది కల్యాణికి. మొదట బుద్ధి చెబుతున్నాననే నమ్మకంతో చెడ్డ ర్లు పిల్లకు తెలేనివి చూపాడు. అంతట కసుర్లూ, దెబ్బలలోకి దిగాడు. కల్యాణి తప్పేమి? ఎవరితోనన్నా మాట్లాడుతూ హాస్యపుమాటవస్తే నవ్వడం. భద్రయ్య ఆనవ్వుకొకఅర్థం అంటగంటి ఒళ్లువిరగ్గొట్టడం. నాతప్పేముంటే నీవందుకు నవ్వావని పాపం ఆరోపించడం. అడ్డంవస్తే పార్వతమ్మకూడా కాయశుద్ధి అవుతూ ఉంటుంది. అనుమానం పుట్టనేకూడదు; పుట్టైనా, సర్వత్రా అనుమానమే.

దేహయాత్ర దుర్భరమౌతూఉంది కల్యాణికి.

౬

భద్రయ్య చెల్లెలు లక్ష్మమ్మను అవూళ్లోనే యిచ్చారు. కల్యాణి సమర్తాడినప్పటినుంచీ మేనత్తగారింటికూడా పోరాదని కట్టాయమైంది. ఇన్నాళ్లుగా లక్ష్మమ్మ ఎన్నిమార్లు పిలిచినా కాదంటూ వచ్చారు. కాని, కాలంగడిచేకొద్దీ ఆచారాలేసళ్లుతుండగా ఆజ్ఞలు సళ్లవా? "పిల్లకుళ్లిపోతూంది, నాలుగునాళ్లు మాయింట్లో ఉంచుకొని పంపుతా" నని భద్రయ్యను ఒప్పించి, కల్యాణిని తీసుకపోయింది మేనత్త.

స్వేచ్ఛ లేకలేక అబ్బితే, దాన్ని సంపూర్ణానుభవంలోకి తేజూడడం మానవస్వభావం. మేనత్తగారింటికి చేరగానే ఆమట్టుపట్లయిండ్లు చుట్టేస్తూంది కల్యాణి. అందులో, అంతా చుట్టాలే, బీరకాయపీచులాగా; తప్పేమి?

కల్యాణి మరో అత్తగారింటికి పోయింది. లేకలేకరావడం. ఏండ్లకుగా ఒకటిరెణ్ణాళ్లన్నా ఉంచుకోకుండా పంపడం సరిపోతుందా? కాని లక్ష్మమ్మ ఒప్పుకోలేదు. ఆనాటికన్నా ఉంచమని ఒప్పించి వచ్చి, పిండివంటకు సామానులు తేవడానికీ, అవిచెయ్యడానికి వస్తువులకూ అటూయిటూ తిరుగుతూఉంది ఆ అత్త.

కృష్ణయ్యబావ కాలేజి సెలవులకు యింటికొచ్చాడు. బావామరదలూ మాట్లాడుతున్నారు. తనకు బోధపడని సరసాల్లోకి దించి నవ్విస్తున్నాడు బావ. ఏమో ప్రశ్నలు వెయ్యగా యేమో జవాబు లిచ్చింది. ఆప్రశ్నలకూ అర్థంతెలేదు, తనజవాబులకూ అర్థంతెలేదు. అమాయికంగా మాట్లాడుతూ నవ్వుతుండగా బావచెయ్యట్టుకొన్నాడు. ఒళ్లు జల్లుమంచింది.

*          *          *

అత్త వచ్చింది. అరిశలూ పరమాన్నం చేసింది. మర్నాటికి లడ్డుకు సామాను తయారౌతూంది. లక్ష్మమ్మ యింతప్రయత్నమూ చెరిచి కల్యాణిని పిల్చుకపోరుగదా?

ఆనందంలో మునుగుతున్నారు అమ్మా, కొడుకూ, కోడలూ.

లక్ష్మమ్మ వచ్చి మర్నాటిదాకా ఉండి పదిమాత్రలు తానూ వేసుకొని, సాయంత్రానికి కల్యాణిని తీసుకపోయింది.

ఏదో పనిమీదగా నీరాని కృష్ణయ్యా పిన్నిగారింటికి గంటుగంటకూ రాను మొదలు పెట్టాడు. లేనివీ, కల్పించినవీ కాబట్టి, చెప్పేకారణాలు తడికల్లా ఉన్నాయి. 'దీనిభావమేమి తిరుమలేశ,' అనుకొంది లక్ష్మమ్మ. ప్రపంచ మెరగకుండా యీప్రాయాని కొచ్చిందా? మర్నాడుపొద్దునే కోడల్ని తీసుకెళ్లి భద్రయ్యకు ఒప్పగించింది. పైన ఏమన్నా చెబితే పిల్ల ఒళ్లు సున్నంలో కెముకఉండదని తెలుసు. కలిఉండే గుహలోకి వచ్చిన లేడివిధమైంది కల్యాణిగతి మళ్ళీ.

పక్కింటి బుచ్చమ్మ వచ్చింది, పార్వతమ్మతో మాట్లాడడానికి. పొద్దు కూకింది, పార్వతమ్మ వంటకు వెళ్లింది. బుచ్చమ్మ పిలువగా కలిసి చెంబట్టుకపోడానికి అమ్మనడిగింది. నీళ్ల చెంబుకని బుచ్చమ్మ కల్యాణినికూడా తీసుకొని యింటికిపోయి, పని కల్పించుకొని, 'అమ్మా, అమ్మా, ఆగడిలో విత్తళిచెంబు తేవూ?' అని బతిమాలుకొంది.

కల్యాణి తలుపు కొంచెం వెనక్కుతోసి లోపలికి వెళ్లింది. అక్కడ కృష్ణయ్యాబావ.

* * *

కిట్టనివెధవ ఎవడో భద్రయ్యకు చల్లగా అంటించాడు. అందులో మూడోమనిషి వింటూండగా చెబితే మంత్రం బాగా పనిచేస్తుం దని, కృష్ణావధాని యేదో మాట్లాడుతుండగా, క్షేమంగోరి వచ్చినట్టు వచ్చిచెప్పాడు. దానిమీద తర్కం.

కృ—అంత చిన్నపిల్లకు కాలేజీబ్రహ్మచారిని తెచ్చి కడితే ఏమౌతుంది?

భ—దాని కర్మ, నాతప్పా. కన్యాదానం చెయ్యగానే మొగుణ్ణి చావమన్నానా?

కృ—మొగుడు చచ్చి పిల్ల పంచెండడం దాని కర్మమని ఆత్మశాంతి చేసుకొన్నవాడవు, యిప్పు డిట్లా కావడంకూడా దానికర్మే అని అనుకొని ఊరుకోక అగ్గయిపోతా వెందుకూ?

భ—ఏమిా, అప్పుడామాటా, యిప్పుడీమాటా!

కృ—బలవత్తరమైన కర్మఫలం అనుభవిస్తూంటే నీవెవడవోయి మధ్య అడ్డడానికీ, అధికారం చలాయించడానికీని?

భ—ఇదికూడా దానికర్మే.

కృ—శభాష్! కర్మసిద్ధాంత మెంత నీచానికి వచ్చింది. కర్మఫలమా, నీ కన్యాదానఫలమా?

ఇలా అనేటప్పటికి భద్రయ్య అగ్గయిపోయాడు, లేచి వెళ్లా డక్కణ్ణుంచి.

ఈవాసన భద్రయ్యకు కొట్టినట్టు కల్యాణి ఎరగదు.

ఒకనాటిసాయంత్రం యథాప్రకారం కల్యాణి చెంబట్టుకొని వెళ్లగా, భద్రయ్య బుచ్చమ్మగారింటికి వెళ్లాడు. బుచ్చమ్మ వీధితలుపు గడియవేసి, తాను పెరట్లో ఉంది. భద్రయ్య చుట్టుతిరిగి పెరటిగుమ్మం గుండా, బుచ్చమ్మ పోవద్దని అరుస్తున్నా, లోపలికి వెళ్లాడు. ఒకగది తలుపు దగ్గర వేసి ఉండగా ఒక్కతాపు తన్నాడు. యముడిలాగా వచ్చాడుగాని, కల్యాణి గడగడ వణకుతూ ఒకత్తే ఉంది.

జుట్టుపట్టుకొని వంచి గుద్దుతూ తిడుతూ, బటబట యీడ్చుకొంటూవెళ్లి యింట్లో అరుగుమీదపడేసి, ఒళ్లు తెలేని కోపంలో మోకాలితో గుండెమీద ఒక్కతాపు తాచాడు. 'భోక్క'ని నెత్తురు కక్కి తెల్లగుడ్లువేసి ప్రాణం విడిచింది కల్యాణి.

# అశోకుడు: కళింగయుద్ధము

డి. వి. అవధానిగారు

ఆచిరాధిష్ఠిత రాజ్యుడైనను జనాహ్లాదంబు కల్పించి తా
నచిరాకృష్టధరాప్రజాహృదయ కంజాంతస్థుడైనాడు స
త్సచివాగ్రేసర సేవ్యమానుడగుచున్ చండప్రతాపానతా
రి చమూనాయకుడా యశోకు డతిసంప్రీతిన్నయం బొప్పగన్.

తాను కళింగభూవిభుడు ధర్మనిబద్ధుని కాయశోకభూ
జానికి కోపహేతువగు శౌర్యము నెద్ది యొనర్చెనో సదా
దీనదయాపరుం డతడు తీవ్రతరాగ్రహ పూరితాత్ముడై
సేనలగూర్చి నిశ్చయముచేసె కళింగము ముట్టడింపగన్.

భేరీ రణోన్ముఖ భీకరధ్వానమ్ము లాశాంతరమ్ముల నందుకొనగ
మత్తమాతంగ శుంభద్ఘీంకృతమ్ములు; అరిసైనికులగుండె లదురగొట్ట
అతివేగ ధావన్మహాశ్వఖురస్వనం బరిరాజు పారిపొమ్మనుచు జెప్ప
రథచక్రచలన సంక్రాంత పరాగమ్ము లరిరాజ్యరమ మోము నదుముకొనగ
కరుల మెడలోని ఘంటలకంచుమ్రోత-అరిభటుల జీవనపు గడియారమందు
నంత్యనాదమువలె దోప నపు డశోక-ధరణిపుడు సైన్యయుతుడయి తరలి వెడలె.

ఆగచ్ఛత్పరి పంథిసైన్య సముదాయాలోకనోత్పన్న స
ర్వాంగవ్యాప్త మహాభయవ్యపగతాహంకార ధైర్యాది స
చ్ఛృంగారమ్ములు గల్గుసైనికుల సంవీక్షించి యుత్సాహ పూ
ర్ణాంగుండై యిటు హెచ్చరించును కళింగాధీశు డుద్రిక్తుడై.

బ్రతికిన సర్వమాగధ ధరాపరిపాలన జేయవచ్చు పూ
రిత గురుభక్తి యుక్తులయి ప్రీతిని భూప్రజలెల్ల గొల్వగన్
మృతులమయేని స్వర్గమున మేదురసౌఖ్యము చూరగొందు మీ
వెతగొననేల ధైర్యమున విద్విషుల న్భరియింపు డందరున్.

దేహ మశాశ్వతమ్ము కడతేరక తా కలకాలముండ దీ
దేహము గల్గినప్డె కడుధీరత శత్రులతోడ బోరి మీ

బాహుబలమ్ము జూపి జయభాగ్యసమేతులరై భవద్యశో
దాహము దీర్చికొం డదనుదాటిన జన్మవృథాయగుం జుడీ!

క్షత్రియాన్వయమందున జననమంది-అరుల నెదిరించి పోర భయంపడుచును
పారిపోయితి మనునపవాదుకన్న-నుర్వి నవమాన మెంచ వేరొండు గలదె.

అని వివరించు భూపునిముఖాగతమైనదో లేదో పల్కు సా
ధనముల చేత బూని ఘనధైర్యసముజ్జ్వలదంగులై కళిం
గ నృపుని సైనికుల్ కదన కార్యము దీర్పగ సిద్ధులైరి యా
ననముల శౌర్యలక్ష్మి జయనాదము సల్పుచు తాండవించగన్.

ఆహవమాయె నప్పుడు రథాంగ తురంగ మతంగజాది స
ద్వాహనపాదధూళి నవవల్లభ సంవరణేచ్ఛ నెక్కుడు
త్సాహముతోడ మింటిపయి దద్దయువేచిన దివ్యకన్యకా
వ్యూహము గప్పిపుచ్చుతెరవోలె నటించుచు నింపునింపగన్.

ఆరణమందు మాగధులు నంచితశౌర్యవిలాస సంప ద
ద్ధారులు శత్రుసైనికవిదారణ చేసిరి క్రోధమూర్తులై
ఆరుధిరప్రవాహములు నంతు నెరుంగక యుచ్చవచ్చిన
ట్లారయ నిట్టులట్టులు ప్రయాణముజేయుచు పొంగిపొర్లగన్.

జయరమ తన్ను తావలచి సంతసమొప్పగవుంగలించెనన్
ప్రియమునుజూప దన్య జనవేదన నోర్వని మాగధావనీ
ప్రియుని ముఖాంబుజమ్ము కడు వేదననే బహిరించెగాని; ఆ
రయ ఘనులొంద రుత్సుకము లాభము హానిఫలంబమైనచో.

అతడు స్వభావసిద్ధముగ నత్యధికోరు దయాఃశాలి తా
నితరుల రక్తపుం జినుకు నెన్నడు జూడనివాడు సైనిక
క్షతములనుండి పై కెగసి చారలుగట్టిన రక్తధారలన్
కృతహృదయార్తుడౌచు పరికించెను బాష్పవికీర్ణనేత్రుడై.

ఆనరపాలు సద్హృదయమందలి పేరినరాజ్యకాంక్ష తే
జోనల మూర్తులై యెదిరి ఆహవభూమి యశశ్శరీరముం

బూనిన శత్రుసైనికుల పొంగిన నెత్తురు వేడిచే తిరో
ధానము సెందిపోయినది దైవము సేతకు తప్పకల్గునే.

అత డెటుచూచిన న్నరియె ఆహవభూమి హతారి సైన్య సం
తతి పటుదేహ బాణ సముదాయకృతక్షత మేదినీ తల
చ్యుత రుధిరప్రవాహములె చోద్యముగా గనుపట్ట నాతడా
గతభయచిత్తయుక్తుడయి కన్నుల నశ్రులుగార నిట్లనున్.

"కరుణాహీనుడనై దురాశకెరనై కల్పించి యుద్ధమ్ము నిం
దరి జంపించితి చేతులార నకటా దౌర్జన్యముం జేసినా
నెరుగన్నేరక యుద్ధ మిట్టిదనుచున్, ఈనాటినుం చేను సం
గరముం జేయను జేయజేయ నిక నేకార్యమ్ము తావచ్చినన్."

---

## కాసీకత

నండూరి వెంకటసుబ్బారావుగారు, బి. ఏ., బి. యల్.

నామాట తెలపవే నారాజుతోటి
మా మనుసులను కలపవే కాసిరాణీ!

౧

నాకళ్లలో సూపు,
ఏకాడనో సింత,
తలపచట, వలపిచట
తగునటమ్మా తనకు?
నామాట......

౨

వనమంత, వొంటిగా,
దినమంత తిరుగునే
తననీడ పాకైన
సనువు లేదే నాకు!
నామాట......

౩

అలిసలిసి యిలుసేరి
అడగనీడే బాధ!
మనుసునైనా పాద
మంటనీడే నన్ను!
నామాట......

౪

నవనీతమే రాజు!
అవలీల పని నీకు!
వలపుమాటల తోనె
సిలలు కరిగింతువే!
నామాట......

# ఎవరి దదృష్టం?

శ్రీమతి బసవరాజు వేంకటరాజ్యలక్ష్మిగారు

కమలాసరళలిద్దరు ఏలూరులో ఒకబడిలోనే చదువుతుండిరి. ప్రాణస్నేహితలు. బళ్లోకి వెళ్లేటప్పుడు గాని వచ్చేటప్పుడు గాని నిమిష మైనా యెడబాసి యుండరు. ఆటలలో నైనా విరోధమెప్పుడూ యెరగరు. ఒకవేళ వచ్చినా నిముషములోనే పోయేది. చదువులో కూడా చాలతెలివిగా చదువుతుండేవారు. ఉపాధ్యాయునికికూడా కమలాసరళలంటే చాల సంతోషం. బడిలో ఆటగంటకొట్టగానే అందరూ పరుగెత్తుకువచ్చేవాళ్లు. ఆటల్లో కూడా వీళ్లిద్దరే నాయకురాండ్రు. కమల పిల్లలందరిని రెండు వరుసలుగా భాగించేది. ఒకవరుస అటువైపు యింకొకవరుస యిటువైపు. ఒక వరుసకు నాయకురాలు సరళ, ఇంకొకవరుసకు నాయకురాలు కమల. ఒకవరుసవారు రెండవ వరుస వారికి ఎదురుగుండా ఒకరిబుజముల మీద ఒకరు చేతులు వేసుకుని

"వస్తున్నాము వస్తున్నాము యీసాయంకాలమూ" అని పాడటమూ,

రెండవ వరుసవారు,

"ఎవరికోసం వస్తున్నారు యీ సాయంకాలమూ" అని పాడటమూ,

"కమలకోసం వస్తున్నాము యీసాయంకాలము" అని సరళా, సరళజట్టులోనివారు పాడుతూండగా సరళ వెళ్లి కమలని చెయి పట్టుకుని గుంజి వీళ్ల జట్టులో కలుపుకోవటమూ ఇల్లాగే ఆవరుసవారందరూ వీళ్లజట్టులోకొచ్చే వరకూ ఆ మొదటపాటపాడి అందరిని లాక్కొచ్చేవాళ్లు. సరళ గెలిచిందనే ఉక్రోషము కమలకుండేది. కాని అది కొంచెంసేపటిలోనే పోయేది. మళ్లీ "సరళా, రా, పులీ మేకా ఆడుకుందాం" అని పిలిచేది. ఈవిధముగా వారి యిష్టమువచ్చిన ఆటలన్నీ ఆడుకుని సాయంకాలము కు యింటికివచ్చేవాళ్లు. సరళ యిల్లు కమలయిల్లు దగ్గరదగ్గరగానే వుంటవి.

సరళ తండ్రి మాధవరావుగారు, తల్లి సీతాబాయమ్మగారు యిప్పటి నవనాగరికులు. బాల్యవివాహనిరోధమునకు చాలా పాటుపడుతున్నారు. ఆవూరిలోనే స్త్రీలకు క్లబ్బుఒకటి స్థాపించి కొంతమంది స్త్రీలను మెంబర్లుగా చేర్పించి టెన్నిసు, పింగ్‌పాంగ్ మొదలయినవన్నీ పెట్టించారు. స్త్రీలుగూడా పురుషులతో సమముగా ఉండవలెనన్న పద్ధతిలోనివారు. సీతాబాయమ్మగారు ఆంగ్లము చదువనూ, వ్రాయను బాగా నేర్చుకున్నారు. ప్రతిరోజూ సాయంకాలము 5 గంటలకల్లా కాలికి మేజోళ్లూ బూట్సులు తొడుక్కొని క్లబ్బుకు వెళ్లి టెన్నిసు ఆడేవారు. ఆక్లబ్బులో వాళ్లతో పాటు చదువుకున్న వాళ్లనే గౌరవము చేయు

ప్రాచ్యనాట్యకళోజ్జీవనము

శ్రీమతి హాథీసింగు - నాట్యము



శ్రీమతి పి. హాథీసింగుగారు



గోపిక—శ్రీమతి పి. హాఢీసింగుగారు

టమూ, చదువుకోనివాళ్లని గౌరవించక పోవటముచేత చాలామంది స్త్రీలు మెంబర్లుగా చేరలేదు. ఉద్యోగస్థుల భార్యలంతా కుర్చీలో కూర్చోటం సాధారణ స్త్రీలందరిని క్రింద కూర్చోబెట్టటం వారికి రిపగ్నెంటైనది. అందువల్ల ఉద్యోగస్థుల భార్యలు తప్ప యితరులు వెళ్లటం లేదు. సరళకూడా బడినుంచి రాగానే తల్లితో క్లబ్బుకు వెడుతూండేది. కూడా కమల కూడా వెళ్లేది.

కమల తండ్రి నారాయణమూర్తి గారు తల్లి వరలక్ష్మమ్మగారు. చాలా నిష్ఠపరులు. మన హిందూ సంప్రదాయానుసారంగా బాల్యవివాహములు చేయవలెననేవారు వరలక్ష్మమ్మగారు పార్వతీదేవల్లే పసుపు పూసుకుని పెద్దకుంకుమబొట్టు పెట్టుకుని ఇప్పటి వారిలాగు క్లబ్బులకు వెళ్లక పురాణములకో దేవాలయములకో వెళ్లేవారు. లేకపోతే యింట్లోనే యుండి రాట్నము వడికేవారు.

కమలా సరళలకిప్పుడు పన్నెండవయేడు. నారాయణమూర్తి గారు, వరలక్ష్మమ్మ గారు కమల వివాహము చేయవలెనని చాలా తొందర పడుతున్నారు. సంసారపక్షములో కొంచెం బాగున్న సంబంధం వెతుకుతున్నారు. సరళ తలిదండ్రులు శారదాబిల్లుప్రకారము చేయదలచుకున్నవారు గనుక తొందరలేదు గదాయని సరళని బాగా చదివించుతున్నారు.

కమలకి పెళ్లి ప్రయత్నము జరుగుచుండగా కమలా సరళలకు వాద వివాదములొచ్చినవి. "పదహారేళ్లకు పెళ్లి చేసుకోవాలి గాని పన్నెండ్లకు పెళ్లేమిటి? నాస్నేహితురాలవై యుండి నీవు పన్నెండేళ్లకి పెళ్లిచేసుకోటం నాకిష్టం లేదు. పెళ్లి చేసుకోగానే చదువు మాన్పిస్తారు. చిన్నతనంలో పెళ్లిళ్ల వల్ల అనేకకష్టాలున్నయి. నీవు పెళ్లిచేసుకోవ"ద్దనేది సరళ. "పూర్వసంప్రదాయానుసారంగా పెళ్లి చేసుకోటమే మంచి"దనేది కమల.

అక్కడికి దగ్గరలోనే విజయరాయిలో సంబంధం కుదుర్చుకున్నారు కమలకి. పిల్లడి పేరు దామోదరం. స్కూల్‌ఫైనలు పరీక్ష ప్యాసు అయినాడు. జాతీయోద్యమసందర్భమున చదువుమానినాడు. అదిగాక యీకాలంలో బ్రాహ్మణ్ణికి ఉద్యోగాలిచ్చేవాళ్లేలేరని గ్రహించి పైక్లాసు చదవక ఆ వూరిలోనే ఆశ్రమంలాంటి యిల్లు, తోట, సొంత వ్యవసాయం, పాడి పంట చూసుకుంటూ పార్వతీపరమేశ్వరుల లాంటి తలిదండ్రులతో చాలా ఆనందంగా వున్నాడు. చరఖాసంఘం ఒకటి ఏర్పాటు చేసి, హిందీపాఠశాల ఒకటి పెట్టించి అందరిచేత నైమ్ముప్రకారం చరఖా వడికిస్తూ పిల్లలకి హిందీ చెపుతూ మిగిలినరోజంతా తనతండ్రికి వ్యవసాయంలో తోడ్పడుతుండేవాడు. దామోదరం తల్లికూడా ఇప్పటికాలపువారి మోస్తరుగా దాసీలనూ, బోనగత్తెలనీ పెట్టక అన్నీ స్వంతముగా చేసుకుని భోజనములయిన తరువాత చుట్టూ పదిమందిని చేర్చుకుని వృథాకాలక్షేపము చేయక రాట్నం

వడికేది. వాళ్లు కూడా తమ రాట్నములను ఆమెదగ్గరకే తెచ్చుకుని వడుక్కునేవారు. ఇవన్నీ చూచే సంసార పక్షములో బాగుందని నారాయణమూర్తి గారు వప్పుకున్నారు. కట్నకానుకల విషయంలో వారేమీ అడుగలేదు. వెంటనే సమ్మతించారు. నారాయణమూర్తిగారివల్ల విని వరలక్ష్మమ్మగారు కూడా చాలా సంతోషించి పెళ్లిపనులు చేస్తున్నారు. వక్కతే ఆడపిల్ల వటంచేత చాలా వేడుకగా చేయాలని చుట్టాలనీ స్నేహితులనీ అందరినీ పిలిచారు.

పెళ్లి సమీపించింది. ఒక్కొక్కరే చుట్టాలు వస్తున్నారు. పెళ్లివారు రేపుదయం వస్తారు. ఇంట్లో అంతా హడావుడిగా వున్నారు. పెళ్లికూతుర్ని చేసి కల్యాణంబొట్టు పెట్టినారు. నారాయణమూర్తిగారు వరలక్ష్మమ్మగారు అందరిని పిలవటానికి ఊళ్లోకి వెళ్లినారు. సరళ తల్లిదండ్రులుని సరళని పిలిచి, 'సరళా నీస్నేహితురాలి పెళ్లికి నీవే పెత్తనంచెయ్యాలి, నీవైదురోజులూ అక్కడే వుండాలి' అని చెప్పివచ్చినారు. లగ్నం పది గంటలకు. ఉదయం 6 గంటలకల్లా విడిదిలో దిగినారు పెళ్లివారు. పానకం కావళ్లిచ్చి పెళ్లికొడుకుని తీసుకునివచ్చి అంకురార్పణకి కూర్చున్నారు. పెళ్లికూతురు లోపల గౌరీ పూజ చేస్తూంది. పెళ్లికొడుకుకూ పెళ్లికూతురుకూ మధ్య తెర అడ్డం కట్టినారు. పురోహితుడు పెళ్లికూతుర్ని తీసుకురమ్మని కేకలు పెడుతున్నాడు. పెళ్లికూతురి మేనమామ ప్రేలగంప తీసుకువచ్చి అక్కడ దింపినాడు. దేవకన్యకలాగు కమల గంపలోనుంచి దిగి పీటపయిన కూర్చుంది. తలిదండ్రులు కన్యాధారపోశారు. వరదక్షిణ క్రింద నూటపదహార్లు యకరం భూమీ యిచ్చారు. సరళకి పెళ్లి ఇష్టంలేకపోయినా కమలని చూస్తే యిష్టం గనుక దగ్గరే కూర్చుని మూడుముళ్లూ వేయించింది. ముత్తయిదులంతా-

"ఆనందమానంద మాయెను
మనరాముడు పెళ్లికొడుకాయెను
మనజానకి పెళ్లికూతురాయెను
సకలజనులకు సంతోష మాయెను."

అని పాడినారు. ఐదురోజులూ పెళ్లి సలక్షణంగా జరిగింది. వియ్యపురాలి లాంచనాలనీ ఆడబడుచులాంచనాలనీ పోట్లాడక వియ్యపురాళ్లూ వియ్యంకులూ చాలా సరదాగా హాస్యాలతో అయిదురోజులూ జరిపినారు.

గృహప్రవేశమునకు పిల్లని తీసుకువెళ్లినారు. కూడా సరళతలిదండ్రుల నడిగి సరళనే పంపినారు. సరళవస్తేనేగాని వెళ్లనంది కమల. అక్కడ మూడురోజులుండి మళ్లీవచ్చినారు.

ఈవిధముగా కొన్నిరోజులు గడచినవి. కమలకు యుక్తవయస్సు రాగానే బడికి పంపడం మంచిదకాదని బడి మాన్పించినారు. ఆమె యింట్లోనే తండ్రిదగ్గర చదువుకుంటూ మంచి సంగతులన్నీ తెలుసుకుంటూ వుండేది. కమలని బడి మాన్పించటం సరళకిష్టంలేదు. ఒంటరిగా బడికి వెళ్లటం సరళకి కష్టంగా వుండేది.

సరళకుకూడా యుక్తవయస్సు వచ్చినది కాని బడికి వెళ్ళుతూనే యున్నది. సరళ యిప్పుడు నాల్గవ ఫారం చదువుతున్నది. తల్లితోకూడా క్లబ్బుకు వెళ్లి టెన్నీసుఆట నేర్చుకుంటున్నది. ఒక్కొక్కప్పుడు సరళా కమల లిద్దరు కమలగారి దొడ్లో మామిడిచెట్టుక్రింద కూర్చుని అంతులేని కబుర్లు చెప్పుకునేవాళ్లు పొద్దుపోయినదికూడా తెలియకుండా. కమల తల్లి పొద్దుపోయిందని పిలుస్తే వెళ్లేవారు. ఒక్కొక్కరోజు సరళ ఇంటికి వెళ్లేదేకాదు. "కమలా నీవు కొద్దిరోజుల్లో అత్తవారింటికి వెడతావు కాబోలు; నే నెప్పుడైనా వస్తే జ్ఞాపకముంచుకుంటావా? నీవు వెడితే నాకీవూళ్లో తోచదు. నామాట విన్నావా పెళ్లిచేసుకో వద్దంటే? పెళ్లిచేసుకోకపోతే వెళ్ళనక్కరలేదు గదా!" అనేది సరళ. విని నవ్వుతూ ఊరుకునేది కమల.

ఇల్లా కొన్నిరోజులు గడచినవి. కమల అత్తవారింటికి వెళ్లినది. వదలి వుండటం సరళకు, కమల తలిదండ్రులకు చాలా కష్టముగా వుండేది. దగ్గరవూరేగనుక వారమున కొకసారి వెళ్లిచూచి వచ్చేవారు. కమల అత్తవారింట్లో అందరికీ అణుకువగావుండి అత్తగారి నే పనీచేయనీయకుండా అన్నిపనులలోనూ తనే వుండి అత్తమామలకు శుశ్రూషచేస్తూ భర్తకనుకూలవతియై వుండేది. తనకు తీరుబడియైనప్పుడల్లా పిల్లల్నందరినీ చేర్చుకొని పాటా పద్యం నూలువడకటం హిందీ మొదలైనవన్నీ నేర్పేది. వాళ్లయిల్లు భూలోకస్వర్గము లాగు ఆనందముగా యుండేది.

సరళ స్కూలుఫైనల్ ప్యాసు అయినది. ఒకరోజు సరళ తండ్రిగారిదగ్గరకువెళ్లి, "నాన్నగారూ, యీ సంవత్సరం టెన్నీసుపందెములు మద్రాసులో జరుగుతయి; నాకుచూపించరూ" అని అడిగింది తండ్రి 'సరే అమ్మనుకూడా కనుక్కొని వెడదామంటేతీసుకువెడుతా'మన్నారు. తల్లికూడానరేనన్నది. అందరూ ప్రయాణమై వెళ్లారు. ప్రతిరోజూ పందెపు ఆట చూడటానికి తలిదండ్రులతో కూడా సరళ వెళుతూ వుండేది.

ఇల్లా వారంరోజులు పందెం బాగా జరిగింది. అందులో గెలిచిన హాకీం బేగ్ అనే ఆయన బి. ఏ. ఆనర్సు ప్యాసయినాడు. టెన్నిసులోగాని పరీక్షలోగాని మొదటిగెల్పు ఆయనదే. ఆయనను చూడగానే సరళ ఆయన్నే పెళ్లిచేసుకోవా లనుకున్నది. ఆయనకూడా సరళను చూచినప్పటినుండి ఆమెనే పెళ్లిచేసుకోవా లనుకున్నాడు. సరళతండ్రితో కొంచెం కొంచెం స్నేహం సంపాదించినాడు. రోజూ వీరింటి కాయన ఆయనయింటికి వీరు వెళ్లటం ప్రారంభించారు. అందుకని సరళకీ ఆయనకీ పరిచయమైనది.

ఒకరోజు సరళా, బేగూ మాధవరావుగారిదగ్గర కొచ్చి "మేమిద్దరం పెళ్లిచేసుకుంటాం మీరనుజ్ఞ యివ్వవలసిన" దని అడిగినారు. మాధవరావుగారు భార్యతో ఆలో

చించి "సరే మీకిద్దరికి యిష్టమైతే నాకూ సమ్మతే" నన్నారు. మన హిందూపద్ధతిప్రకారం పీటలమీద కూర్చోటం, కన్యాధారపోయటం ఏమీ లేకుండా వధూవరులు ఒకరి వుంగరాలు ఒకరి కిచ్చుకుని పువ్వులు చల్లుకున్నారు. ఇంగ్లీషువాళ్ల పద్ధతి ప్రకారం పెళ్లి కాగానే (హనీమూన్‌కు) ఇంకో వూరు వెళ్లటం కోసం అందరినీ సెలవడిగినారు. స్నేహితులంతా విందులవీచేసి వీడ్కోలిచ్చారు. అల్లుడూ కూతురూ వెళ్లగానే మాధవరావు గారూ సీతాబాయమ్మ గారూ వాళ్ల వూరికి వెళ్లారు.

బేగు సరళతో ఇల్లా నెల్లాళ్లు ఆవూరు యీవూరు తిరిగి తనతలిదండ్రులకి కోడలిని చూపించాలని వాళ్ల వూరు నెల్లూరువచ్చాడు. వాళ్లని చూడగానే హిందూపిల్లని చేసుకున్నందుకు బేగుమీద నతని తలిదండ్రులకు చాలకోపము వచ్చినది. వీళ్లిద్దరిని వాళ్లమతములో చేర్చుకోమన్నారు. సరళను వదిలేస్తేగాని పీలులేదన్నారు. అతనిచుట్టాలు వాళ్లు చాలా నిందించారు. హిందూపిల్లని చేసుకోవటమేమి టన్నారు. బేగు అదంతా చూచాడు. బంధువుల అనాదరణ, మతములో చేరనివ్వకపోవటం, అదిగాక వీళ్లిద్దరికికూడా భోజనపు పద్ధతులలో కలవకపోవటం చూచి ఒక రోజు సరళతో 'నీవు నాకక్కరలేదు. నీవు వేరేపెళ్లి చేసుకో' పొమ్మన్నాడు.

సరళ నిర్ఘాంతపోయింది. ఏడ్పువచ్చింది. 'ఇల్లా అన్యాయం చెయ్యటం న్యాయమేనా' అని అడిగింది. 'నేనేంచెయ్యను; వెళ్ల' మన్నాడు. అప్పుడు కమలమాట జ్ఞాపకము వచ్చినది. చిన్నప్పుడు వాదించుకున్న మాటలు జ్ఞాపకమునకు వచ్చినవి. ఆడపిల్లలు పదహారేళ్లకి పెళ్లిచేసుకుంటే తాళ్లిష్టము వచ్చిన వాళ్లని వాళ్లు చేసుకోవటం; వాళ్లకు నాగతే పట్టటం. బాల్యవివాహాలలోనే కష్టాలున్నవనుకున్నాను. బాల్యవివాహం చేసుకున్న కమలే ఆనందంగా వుంటోంది గదా. శారదా బిల్లుప్రకారం చేసుకున్న నేనే విచారించుచున్నానే అని అప్పుడు తెలుసుకుంది.

తలిదండ్రులదగ్గరకు వెళ్లటానికి సరళకు మొగము చెల్లలేదు. కమలదగ్గరకే వెళ్లుదామని బయలుదేరింది. ఒకదానితోనే యింతయింది. రెండవపెళ్లి చేసుకుంటే అది యింతేనని భయపడ్డది. కమలదగ్గరకు వెళ్లింది. కమల 'అదేమి విచారముగాయున్నా' వని అడిగింది 'నాగతియిల్లా అయిన'దని సంగతంతా చెప్పింది సరళ. కమల సంగతంతా విని చాలా విచారపడి 'ఇక నీవు ఎక్కడికి వెళ్ల వ'ద్దని సరళతో గట్టిగా చెప్పింది. దామోదరం కూడా ఎంతో ఆదరించాడు.

ఇంతలోకే సహాయనిరాకరణోద్యమములో దామోదరం జైలుకు వెళ్లినాడు. ఆయన జైలుకెళ్లి వచ్చేవరకు అయన పని అంతా కమలా సరళా చేయదలుచుకున్నారు. వెంటనే సరళ ఇదివరకు పాశ్చాత్య వ్యామోహమున కొన్న జపాను సిల్కుచీరలు, బెంగుళూరు చీరలు, అన్నీ అగ్నిసంస్కారం చేసింది.

ఖద్దరుకున్న గౌరవము విదేశీబట్టలకు లేదని గ్రహించి వెంటనే అందమైన ఖద్దరుచీర ధరించినది. హిందీప్రచారంచేస్తూ ఉపన్యాసాలిస్తూ స్త్రీలను వాలంటీర్లుగా జేర్చిస్తూ దేశసేవ బాగా చేస్తూంది. ఖద్దరుబట్టలు మూటనెత్తిని బెట్టుకుని యింటింటికి వెళ్లి

ఖద్దరమ్మా ఖద్దరూ
పవిత్రమైన ఖద్దరూ
భారత దేశపు ఖద్దరు
అందమైన ఖద్దరూ
ఆదికాలపు ఖద్దరూ
అరువదికోట్ల రూప్యములను
అందజేసే ఖద్దరు
చీరెలమ్మా చీరలు
పవిత్రమైన చీరెలు
రంగురంగుల చీరెలు
రమ్యమైన చీరెలు
ఖద్దరమ్మా ఖద్దరు.

అని పాడుతూ ఖద్దరమ్మేది. సరళవంటిపిల్ల యింటింటికివచ్చి ఖద్దరమ్ముతూంటే ఎవరుకొనకుండావుంటారు? అక్కడే చిన్నకుటీరం ఏరుపరచి పురాణకాలక్షేపం, చదువూ, నూలువడకటం యిలాంటివిపెట్టిచాలావృద్ధిలోకి తెచ్చిందిసరళ. ఇప్పు డావూరిలో నూలు వడకనివారే లేరు; ఖద్దరుకట్టనివారే లేరు. ఇప్పుడుసరళని ఎరగనివారూ;గౌరవించనివారు లేరు. సరళఒక్కమాటమాట్లాడిందంటే నూటపదహార్లు కుమ్మరించే వాళ్లు తిలక్ నిధికి.

హకీంబేగ్ సరళపేరు ప్రఖ్యాతులుఅన్నీ ప్రతిపత్రికలోనూ చదివి అందరివల్లావిని పశ్చాత్తాపముకలిగి ఎల్లాగయినా మళ్లీసరళా తనూ కలిసివుండాలని అనుకున్నాడు. వెంటనేఉద్యోగంవదిలివేసినాడు. సరళవున్నవూరు వెతుక్కుంటూవచ్చినాడు. సరళనుబతిమాలినాడు. సరళఒప్పుకోలేదు. "నీవుపొమ్మన్నప్పుడుపోవటం, వుండమన్నప్పుడు వుండటం నాపద్ధతి కాదు. ఇదివరకైనదేదో అయినది; ఇక రాను. దేశమే నాకుసంసారం. నీకిష్టమైతే దేశ శేవ చెయ్యి. మన మాతృదేశానికి స్వాతంత్ర్యములభించిన తరువాతనే మనకుసంసారసుఖము. అంతవరకు ఎవరికివారే. ఇదే నా నిశ్చయము. క్షమించవలెను" అన్నదిసరళ. బేగు ఆమె మనోనిశ్చయానికి ఆశ్చర్యపడి చేసేదేమీలేక కన్నీళ్లతో ఆమెను వదిలి వెళ్లినాడు.

బొంబాయిలో 1929 వ సంవత్సరంలో హిందువులకూ ముసల్మానులకూ పెద్దతగువు వచ్చింది.దోమ్మీలు,హత్యలూ నిత్యమూ జరుగుతున్నవి. చాలా అల్లకల్లోలంగావుంది. కాంగ్రెసువాలంటీర్లు అల్లర్లాపటానికి ఎంతో శ్రమ పడుతున్నారు. బేగు యీగోలంతా పత్రికల్లో చదువుతున్నాడు. హిందూకన్యను పెళ్లిచేసుకున్నందుకు హిందూముసల్మానులకు రాజీకుదర్చటమే తనకుతగిన దేశసేవయని నిశ్చయించి బేగు బొంబాయివెళ్లి కాంగ్రెసువాలంటీర్లలో చేరి నిత్యమూ రాత్రివేళ అల్లర్లు జరుగుతున్న వీధులలో పారాయిస్తూయుండేవాడు.ఒకరోజు రాత్రి పారా యిస్తూండగా బేగును అకస్మా

త్తు — ఎవడోదుర్మార్గుడు కత్తితో పొడిచిచంపి పారిపోయినాడు. మర్నాడు బేగంశవాన్నివాలంటీర్లంతా వూరేగించి సమాధిచేశారు.

బేగుమరణవార్త సరళ పత్రికలలో చదివింది. తనభర్తకు వీరస్వర్గము లభించింది గదా అని సంతసించింది. కమలమాత్రము సరళఅవస్థకు చాలా విచారపడ్డది. ఇంతలో దామోదరం ఆరుమాసములశిక్ష పూర్తికాగానే జైలునుంచి వచ్చినాడు.

సరళను ఒకరోజున బెజవాడలో విదేశి బట్టలదుకాణముదగ్గర పికెటింగు చేస్తూండగా పోలీసువారు అరెస్టుచేశారు. మేజస్ట్రీటుసరళకుఆరుమాసములు శిక్షవేసి రాయవేలూరుజైలుకు పంపినాడు. జైలులో ఆహారమూ, నియమములూ ఆమెకుసరిపడనందున యిరువదియొక్కరోజు ఉపవాసముచేసింది.అందువలన ఆమె చాలాజబ్బుపడిజైలులోమరణావస్థలోనున్నది. కమలనుచూచి ప్రాణము విడవవలెనని చెప్పి కమలకు టెలిగ్రాం యిప్పించింది.

కమల సరళతలిదండ్రులకు తెల్పి అంతా కలిసిజైలుకువెళ్లినారు. సరళను చూచినారు. సరళ మరణావస్థలో వుండినప్పటికి తలిదండ్రులకు నమస్కరించి "నాకోసము మీరు దుఃఖించకండి. దేశముకోసం ప్రాణాలు ధారపొయ్యటం నాఅదృష్టం. కమలే యింతటినుంచీ మీ కూతురు. కమలా! నీవు నేను ఒక్కప్రాణముగా యింతకాలమున్నాము. నా తలిదండ్రులకు యింతటినుండీ నీవే కూతురివి. నేను స్వర్గానికి పోతున్నాను. నీవు అదృష్టవంతురాలవై వర్ధిల్లు. దేశసేవమాత్రం మరవవద్దు" అంటూ కమలను కౌగలించుకొని ఆమెబుజముమీద తల వాల్చి ప్రాణం విడిచింది. కమలా, సరళతలిదండ్రులు ఎంతో విచారించారు. 'అంత సుకుమారంగా పెరిగిన పిల్లకి యిటువంటి చావా' అని శోకించారు.

యథావిధిగా సరళకు అగ్ని సంస్కారములు చేసి సరళతలిదండ్రులు కమలతో కూడా కమలాసరళలు స్థాపించిన ఆశ్రమానికి చేరినారు. ఆశ్రమములో సరళపేర ఒక పూల మొక్కనాటి కమల, సరళతలిదండ్రులు నిత్యం నీళ్లుపోస్తూ సరళకు బదులుగా ప్రేమిస్తూదాని పూలు చూచి సరళ బతికివుందని ఆనందిస్తూ జీవితం గడుపుతున్నారు. కమలకూతురికి సరళ పేరు పెట్టుకుంది.

---

చాటువులు

మహామహోపాధ్యాయ ఆచంట వేంకటరాయ
సాంఖ్యాయనశర్మ గారు

మొలకలు మొన్న, సిన్నటికిఁ బోకలు, నేఁటికి రేగుపండ్లు, రే
పల లికుచంబు, లావెనుక నాగకపట్లకుఁ గుంభి కుంభ మాం
సల పృథు పీవరోన్నత కుచంబులు పైఁదలిఁ దాల్చి నిద్ది కో
మలి భుజ మధ్యగంచు తరమా కొనగోరిడిమైన చూపఁగన్.

నీకనులకు నీచనులకు - నీకేలుంగవకు నీదు నెమ్మొగమునకున్
గోకిల వాణీ దీవెనఁ - గైకొనుమీ నీకు సుఖ మఖండము సుమ్మీ.

మనసెఱిఁగి రానికోమలి-ననుదినముం జూచునట్టి యడియాసలచేఁ
బనిచెఱుపుఁ బాటుచెఱుపున్ - దననిద్దుర చెఱుపు భోజనంపుం జెఱుపున్.

తనకెంత మోహమున్నన్ - దనపై వలపేమిలేని తరుణీమణికై
మనసు పడుచుండు రీజగ-మునఁగొందఱు చదువుకున్న మూఢులుగట్టా!

కిలికి! మదిలోని కోరిక ద్దెలుపవలయు-సిగ్గుపడరాదటంచు నెచ్చెలులు పలుక
సోగ తెలివాలు గన్నులఁ జూచె విభుని-మోము పేరానఁ దొలుచూలుముద్దరాలు.

కూర్మినక్కునఁ జేర్చి చన్గుడుపుచుండఁ-బాలుగ్రోఁక నగుచుండె బాలకుండు
కట్టెదుటి నిల్వుటద్దమ్ముఁ గాంచి కేల-సైగఁ జేసెను బొమ్మని సకియ నవ్వె.

నాదు కెమ్మోవి మీరాని నారొ యేమొ-చుట్టు మనుచున్న దింకను జూచినార!
మీరు కెమ్మోవి నాకిచ్చినారు గారు-న్యాయమా యను దీనవాక్యములఁ దలఁతు.

---

# వి ద్యా ర్థి




జూలై, ఆగస్టు —



సెప్టెంబరు, అక్టోబరు —



నవంబరు, డిశంబరు —



జాన్యుయరి, ఫిబ్రుయరి —



మార్చి, ఏప్రిలు —



పరీక్షలో —

తలిశెట్టి రామారావు.




## 'అన్నపాలపక్షి'

మాస్టరు అంజి

ఒక పడుచుపిల్ల కొత్తగా కాపురానికివచ్చింది. ఆమెకన్న పెద్దది వకసవతిన్నీ, వకతోడి కోడలున్నూ కలరు. కొన్నాళ్లకు ఆమె తోడబుట్టినవాడు చెల్లెలిని చూడవచ్చాడు. అన్నమీద వుండే ప్రేమచేత వంట నేతితోను, పాలతోనుచేసి పెట్టుదామనుకుంది. పోయి సవతిని అడిగింది 'బియ్యము నేతితో కడిగి పాలతో వండనా, పాలతో కడిగి నేతితో వండనా' అని. నేతితోకడిగి పాలతో వండమన్నది సవతి. సవతిమాట నమ్మజాలక, యిదేమాట తోడికోడల్ని అడిగింది. తోడికోడలుపాలతో కడిగి నేతితో వండమన్నది. ఆమె మాట ప్రకారం ఆపిచ్చికల్లాలు పాలతో కడిగి బియ్యము నేతితో పొయ్యిమీద పెట్టింది. పాపం! కొంత సేపటికి చూచుకునేసరికి బియ్యం చిట్టింకట్టి ఉంది. తోడబుట్టినవాడు అన్నం పెట్టమన్నాడు. అప్పుడు నేతితో కడిగి బియ్యము పాలతో చేర్చి పొయ్యిమీద పెట్టింది. అది వుడికేదాకా వుండలేక ఆపెయన్న లేచిపోయినాడు. అన్నము వుడికినతరవాత ఆయన్నము కుండను నెత్తినబెట్టుకుని ఆమె 'అన్నా అన్నం' 'అన్నా అన్నం' అంటూ వెంటబడింది. కాని యాతడు కోపముకొద్దీ నడచి యెక్కడికో పోయినాడు. అదే యన్నపాల పక్షి యై '......న్నా......న్నం'అంటూ తిరుగుతోంది. ఇప్పటికి కూడా ఆ పిట్టకు నెత్తిన యెత్తుగా యీకలు వుంటై. అదే అన్నపుకుండ అంటారు పెద్దలు.

---

## అత్తగారి గంగాప్రవేశం

పాలంకిపాటి లక్ష్మీబాయమ్మగారు

అనగనగా ఒకవూరుంది. ఆవూళ్లో ఒక ముసలమ్మ్ముంది. ఆవిడకు ఒకకొడుకున్నాడు. వాడు పెద్దవాడు కాగానే పెళ్లి చేసింది. కొంతకాలమయింతర్వాత కోడలు

కాపురానికి ఒచ్చింది. ఈకోడలికి అత్తగారు యింట్లో వుండడం యిష్టం లేక రోజూ అత్తగారిని, 'అత్తా! నువ్వెప్పుడు గంగాప్రవేశ మవుతావు? అత్తా! నువ్వెప్పుడుగంగాప్రవేశ మవుతావు?' అని అడుగుతూ వుండేదిట. కోడలిమాటలు విని విని ఆ గడుసు అత్తగారే మన్న దంటే, "అమ్మా! నువు మొన్న నేగదా కాపురానికి ఒచ్చింది. నీవు కాపురము చేస్తూంటే కొన్నాళ్లు చూసి గంగాప్రవేశ మవుతా" నంది.

అప్పుడీకోడలు కొన్నాళ్లు వూరుకొని "అత్తా! కొన్నాళ్లు చూశావుగదా. యింక గంగాప్రవేశానికి వెళ్లు" అండట.

అప్పుడు అత్తగారు "నీవు కడుపుతో వుంటే చూసిపోతా" నంది. మరికొన్నాళ్లకు కోడలు కడుపుతో వుంది. ఏడవ మాసం వచ్చింది. అప్పుడు యీకోడలు "అత్తా! నే కడుపుతో వుండడము చూశావుగదా యిక వెళ్లి పోరాదా" అంది. అప్పుడుమళ్లా అత్తగారే మం దంటే "అమ్మా నీవు కొడుకును కంటే చూసి మనుమణ్ణి ఎత్తుకొని ముద్దాడి పోతానే" అంది. కోడలున రేనని పిల్లాడు పుట్టిందాకా వూరుకుని పురుడుపుణ్యాలు వెళ్లిన తర్వాత "అత్తా! యిదుగో మనుమడు వీణ్ణి ముద్దుపెట్టుకుని నా కిచ్చి వెళ్లి గంగాప్రవేశ మవు" అంది.

అప్పుడు అత్తగారు ఏమం దంటే "అమ్మా పిల్లవాడి ఆటాపాటా చూసి పోతానే" అంది. అప్పుడు కోడలు మళ్లా కొన్నాళ్లు వూరుకుని "ఆటా పాటా చూశావుగా యిక పోవే" మంది కోడలు.

"ఇక త్వరగానే వెళ్లిపోతానే పిల్లాడి ఒడుగు కానీ" అంది ముసలమ్మ. కొన్నాళ్లయినాక "పిల్లాడికి పదేళ్లు వచ్చాయి ఒడుగయింది. ఇక వెళ్లు" అత్తా అంది కోడలు.

"ఇక వాడిపెళ్లి ఒకటి చూసివెళ్లిపోతా" నంది అత్తగారు. కొన్నాళ్లకు పిల్లాడిపెళ్లి అయింది. కాగానే "పెళ్లి అయింటిగా అత్తయ్యా, ఇక వెళ్లు" అంది కోడలు. "అమ్మా! నీకోడలు రాగానే చూసి ఆమర్నాడే వెడతాను" అంది అత్తగారు.

కొన్నాళ్లకు కోడలు కాపురానికి వచ్చింది. అప్పుడు కోడలు "అత్తయ్యా! యిక గంగాప్రవేశాని కెళ్లు"అన్నది. ఈమాట విని అత్తగారు ఏమం దంటే "ఒల్లీ, నన్ను రోజూ గంగాప్రవేశ మవమంటావు. నీకోడలూ కాపురానికి ఒచ్చిందిగా నువ్వూ నేను యిద్దరము ఒక్కమాటే గంగాప్రవేశ మవుదాము రా," అంది. అప్పుడు కోడలు "ఓయి బాబో, నాకే ఎసరు పెట్టింది యిక ఏమీ అనరాదు" అనుకుని నోరు మూసుకుని బుద్ధి తెచ్చుకుంది. కథ కంచి కెళ్లింది; మనం ఇంటికివచ్చాం.

# చెవుడుగొడవ

కనుపర్తి వరలక్ష్మమ్మగారు

అనగా అనగా ఒకవూళ్లో తల్లీ దండ్రీ, కొడుకూ కోడలు గల ఒకకుటుంబము ఉండేది. దైవవశాత్తు వాళ్లు నలుగురూ చెవిటివాళ్లే; కాబట్టి ఒకరిమాట ఒకరికి తెలియక రోజూ కొట్టుకులాడుతుండేవాళ్లు. ఇట్లా ఉండగా ఒకనాడు కొడుకు పొలము దున్నటానికి పొద్దున్నే లేచి ఎడ్లను తోలుకొని పొలము వెళ్లాడు. అక్కడ వాడు పొలం దున్నుకుంటుండగా ఒకబాటసారి ముందూరికి దోవ తెలియక తంటాలు పడుతూ వీనివద్దకు పోయి 'అయ్యా ఫలానీవూరికి యిదేనా దారి' అని అడిగాడు. వాడు చెవిటివాడు కాబట్టి బాటసారి అడిగిన మాట తెలియక తనవద్దకు ఎడ్లబేరానికి వచ్చాడనుకొని 'ఎఱ్ఱెద్దు ఏడోరాలు, నల్లెద్దు నాలుగోరాలు. ఇంతకు గవ్వ తగ్గితే యివ్వ' నన్నాడు. అతడుచెప్పినమాటల కాబాటసారి తెల్లబోయి 'ఇదేమిరా వూరికి దారిఅడిగితే ఎద్దులధర చెప్పతాడు. చెవిటివాడు కాబోలు'ననుకొని 'ఇక వీడితో అడిగే దెందుకు మఱెవ్వరినైనా అడుగుదా'మని తనదారిని పోయినాడు. ఇతలో పొలముదున్నే చెవిటివాడి పెండ్లాము, మొగుడికి దుత్తలో బువ్వపెట్టుకొని తెచ్చింది. దాన్ని చూచి మొగుడు 'మనయెద్దులకు బేర మొచ్చింది. ఎఱ్ఱెద్దు ఏడోరాలు నల్లెద్దు నాల్గోరాలు. ఇంతకుగవ్వ తగ్గితేయివ్వనన్నాను'అని చెప్పాడు. ఆపెండ్లామూ చెవిటిదే కాబట్టి మొగిడిమాట తెలియక వేడిబువ్వతేక చద్దిబువ్వెందుకు తెచ్చావని మొగుడు కోపంచేస్తున్నా డనుకొని 'అత్త పెట్టి యిచ్చిన బువ్వదుత్తే నేను తీసుకొచ్చాను. చద్దిబువ్వ తెచ్చావని నన్ను కూకలేస్తావే'మని మొత్తుకోటం మొదలుపెట్టింది. మొగుడు ఎద్దులబేరం చెప్పా, పెండ్లాంబువ్వసంగతిచెప్పా, ఇట్లా ఒకరిమాటఒకరికి తెలియక కాసేపు వాదించుకొని యింటికి పోయినారు. అక్కడ తల్లి యెవరితోనో మాట్లాడుతున్నది. ఆమె దగ్గిఱకిపోయి కొడుకు యెద్దులబేరం సంగతి కోడలు, బువ్వదుత్తసంగతి చెప్పారు. ఆవిడా చెవిటిదే కాబట్టి కొడుకూ కోడలూ చెప్పేసంగతులు వినబడలేదు. పైగా తాను యెవరితోనో మాట్లాడుతుండటంచే 'వాళ్లతో నీకు మాట లేమి' టని మందలిస్తున్నా రనుకొని 'పెద్దదాన్ని కనుక యెవరితో నైనా మాటా మంచీ ఆడుతాను. నాకు మీ అదుపులేమి' టని జగడం ప్రారంభించింది. ఈవిధంగా ఒకరిమాట ఒకరికి తెలియక ముగ్గురూ కాసేపు కుమ్ములాడి తండ్రి వద్దకుపోయినారు. ఆముసలివాడు శనగగుగ్గిళ్లు తింటూ కూర్చున్నాడు. వాడితో పెండ్లాము, కొడుకూ, కోడలూ తమతమగొడవలు చెప్పుకున్నారు. వాడూ చెవిటివాడే కాబట్టి వాళ్లు చెప్పేమాటలు అర్థం కాలేదు. పైగా తనకు 'పెట్టిన గుగ్గిళ్లు గాక యింకా చాటుగా తెచ్చుకొని తింటున్నావా' అని వాళ్లందఱు తన్ను కోప్పడుతున్నా రనుకొని 'అయ్యా నీవుపెట్టిన

గుగ్గిళ్లేనే నేను యింకా యెక్కడ తెచ్చుకు న్నానే ' అని మొత్తుకోడం మొదలుపెట్టాడు. ఇట్లా ఒకరిసంగతి ఒకరికి తెలియక వాదించుకొని వాదించుకొని తమతగువు పరిష్కారంగాక ఆవూరి కరణంవద్దకు పోయినారు. ఆకరణంగూడా చెవిటివాడే. అతడు పెండ్లాముతో ఎందుకో పోట్లాడి అప్పుడే వచ్చి అరుగుమీద కూర్చు న్నాడు. ఇంతలో ఈ చెవిటివాళ్లు ఆకరణంవద్ద చెప్పకోడానికి పోయినారు. ముందు ముసలి వాడుఆకరణాన్ని చూచి'అయ్యా! తమరుపెట్టిన గుగ్గిళ్లే నేను తింటూంటే ఇంట్లో గుగ్గిళ్లు దొంగతనంగా తెచ్చి తింటున్నా నని జగడ మాడుతున్నారు చూడండి' అన్నాడు. తరు వాత వాడిపెండ్లాము వచ్చి 'నేను పెద్దదాన్ని గదా, నన్ను వారితో వీరితో మాట్లాడవద్దని అదుపుజేస్తారు చూడండి' అన్నది. తరువాత కొడుకువచ్చి 'పొద్దునయెద్దులకు బేరంవచ్చింది ఎఱ్ఱెద్దు యేడూరాలు, నల్లెద్దు నాల్గూరాలు అంతకు గవ్వ తగ్గితే యివ్వనన్నాను. ఏమండీ తగ్గించియివ్వడానికి నాయెద్దులు చచ్చువా పుచ్చువా' అన్నాడు. తరువాత కోడలొచ్చి 'అత్త పెట్టియిచ్చిన బువ్వనే నేను తీసుకుపోతే వేడి బువ్వలేక చద్దిబువ్వ తెచ్చావే మని నన్ను తిట్టుతున్నాడు చూడండి' అని మొఱ పెట్టుకొన్నది. ఆచెవిటికరణంగారికి వీరుచెప్పిన మాటలు తెలియలేదు. కాబట్టి తాను పెండ్లా ముతో పోట్లాడి ఉండడంచేత ఆమెతో సమా ధానపడమని చెప్పతున్నా రనుకొని "మీారు నూరుచెప్పండి వెయ్యిచెప్పండి;ఆముండ మొఖం నేను చూడను. దానిచేతి అన్నము నేనుతినను." అనడం మొదలుపెట్టాడు.

ఈవిధంగా ఒకరిమాట ఒకరికి తెలియక వాదించుకుంటున్నారు. తిండీ లేదు. తిప్పలూ లేదు. పొద్దు తిరిగిపోయింది. ఇంతలో ఒక మంచి వాడు-అంటే చెవుడు లేనివాడు-అక్క డకొచ్చాడు. వాడితో యీచెవిటి వాళ్లయి దుగురు తమతమ గొడవలు చెప్పకొన్నారు. వాడు వారిమాట లన్నీ విని పక్కన నవ్వకొని ఒకరిమాట లొకరికి తెలిసేటట్లు పెద్దగా అఱిచి చెప్పి సమాధానం పెట్టాడు. అయిదుగురు చెవిటివాళ్లకు సమాధానం చెప్పేటప్పటికి మంచివాడిగొంతు చించుకు పోయింది.

అంతే కథ కంచికి పోయింది; మనం యింటి కొచ్చాము.

---



రైతులారా వేగ తెండు
పాడిపంట లన్నికూడ
రాజు వచ్చి కాసు లిచ్చు
రైతుబాగూ కోరునపుడు
కూడు గుడ్డా మనకు నేడు
కొల్లగాను మీరు తెండు
మీకు బాగే మాకు బాగు
రైతుబాగే రాజ్యమునకు.

ఎన్నరాని సుఖములూ
ఎందు పొంద వచ్చును?
పాడిపంట లెప్పుడూ
పండుచుండు నెప్పుడు ?
ఆడితప్పకుండగా
ఆటలాడు టెప్పుడు?
కన్నతల్లి నెప్పుడూ
గావుమనుచు నెప్పుడూ
కన్నతల్లి భూమినీ
గావుమందు మెప్పుడు.





తేములపాకులమీద వడ్లెండబోసి
ఆవడ్లు యీవడ్లు బస్తాలకెత్తి
అత్తదంచినవడ్లు అధికసన్నాలు
మామదంచిన వడ్లు మల్లిసూదుల్లు
నేను దంచిన వడ్లు నేతిలోవేసి
అన్నవస్తే వెంతో పరమాన్న మొండి
అందరికి పెట్టింది నాకులేదయ్యా
మాఅత్తగారేమొ అతిచిత్రమయ్యా.



ఏడుమల్లేపూల ఎత్తుమాపిల్ల
ఎండకూ వానకూ — ఓర్వలేదమ్మ
సున్నితపునీతమ్మ చిన్నిపొన్నారి
సూర్యుడూ చంద్రుడూ చూడలేదమ్మ
చక్కదనాలచుక్క సౌందర్యరాశి
రాముడికి యిస్తాము రమ్యంబుగాను



నీటిలో యీదే దదియేమే
గాలిలోయెగిరే దదియేమే
తోటిలో వుండే దదియేమే
రంగురంగుల దదియేమే
నీటిలో యీదే దదికప్ప
గాలిలో యెగిరే. దదిడేగ
రంగురంగుల దదిపువ్వు
అన్నీకూడా ఒక్కటే.



# చిట్టెలుక

కో. నరసింహాచారిగారు

ఈ వ్యాసమున చేతిరుమాలుతో ఒట్టెలు కను చేయుటను గుఱించి చెప్పెదను. ఒక చేతిరుమాలును (Handkerchief) (చిత్రము 1, క ఖ గ ఘ) తీసికొని, దానియొక్క గ, ఖ అను మూలలు చేరునటుల మడువవలెను (చిత్రము 2). క ఘ అను మడువబడిన మూలలను, ఒకదానిపై నొకటి వచ్చునటుల, చిత్రము 3 నందు జూపబడిన విధముగా మడువవలెను. పిమ్మట క ఘ అను మూలలను చేర్చి ముడివేయవలెను (చిత్రము 4). తర్వాత ప ఫ అను అంచును పట్టుకొని క ఘ ల యొక్క ముడిపైకి మడిచి కొంత దూరమువఱకు క్రిందికి చుట్టుచు రావలెను (చిత్రము 5). అటుపిమ్మట, చుట్టబడిన రుమాలును, చిత్రము 6 నందు జూపినరీతిగా, అడుగు భాగము పైకి వచ్చునటుల త్రిప్పవలెను.

చిత్రము 6 నందలి ప ఫ అను కొనలను, ఒకదానిపైకి ఒకటి వచ్చునటుల, 7 వ చిత్రమునందలి రీతిగ మడువవలెను. గ అను క్రిందిమూలను పైకి మడిచి, ప ఫ లను మడుచుటవలన గలిగిన సందులోనికి దూర్చవలెను. (చిత్రము 7 నందు ఫ వద్దనుండు ఈకె గుర్తువద్ద దూర్చవలెను). పిమ్మట, నది చిత్రము 8 యందలిరీతిగ నేర్పడును. దానిని చిత్రము 9 యందు జూపిన విధముగ రెండు చేతులలో పట్టుకొని దాని మధ్యనుండు సందులోనికి ఇరుప్రక్కలను త్రోయుచు వచ్చిన యెడల, మొట్టమొదటవేసిన క ఘ ల యొక్క ముడి బయటికివచ్చును (చిత్రము 10). ముడిని విప్పినయెడల చిత్రము 11 నందలి స్థితివచ్చును.

తర్వాత క ఘ లను కొనలలో నొక దాని (ఇందు క అను కొన తీసికొనబడినది) వెడల్పుగా విప్పుకొని (చిత్రము 12) చ జ ల వద్దకు సరిగా మడిచి క ను క్రిందికి దేవలెను. (చిత్రము 13 చ జ లను చేర్చి ముడివేసిన యెడల చ జ లు రెండుచెవులుగను, క

అను మూలనోరుగను ఏర్పడును (చిత్రము 14). ఇప్పటికి చిట్టెలుక బొమ్మ పూర్తి యగును. పిమ్మట చిత్రము 15 నందు జూపినరీతిగ, ఎలుకను, ఎడమచేతిలో పట్టుకొని, ర అను చోట కుడిచేతి వ్రేళ్లతో చిటికవేసిన రీతిని ఎదుర గొట్టినయెడల ఎలుక చేతినుండి ఎగిరిపడును.





శ్రీమతి పి. హఠీసింగుగారి నాట్యదృశ్యము ౨

# పరీక్షలు

భమిడిపాటి కామేశ్వరరావు గారు

[ఇది ౫-౪-౧౯౩౧ తేదీని ఏలూరు హైస్కూలులో, పాతవిద్యార్థి సంఘంతరఫున జరిగిన వార్షికసమావేశసందర్భంలో చదివినది.]

ఇది ఈహైస్కూలుతాలూకు పాతవిద్యార్థిసంఘం యొక్క ద్వితీయవార్షికోత్సవసమయం. ఈసందర్భంలో సరస్వతీపుత్రులైన సోదరులు చాలామంది ఎలుగుంటే ఒకర్ని ఒకరు కలుసుగోడానికీ, ఎఱక్కుంటే ఒకర్ని ఒకరు తెలుసుగోడానికీ, వీలైంది—లక్ష్మీపుత్రులైన సోదరులు భోజనం వగైరాఖంజాయింపులు చెయ్యడంవల్ల. ఈసభలో బాలురు వృద్ధులు, వృద్ధబాలురు, బాలవృద్ధులు, వగైరాలు, ఉన్నారు. వయోభ్యాసాల్నిబట్టీ, జ్ఞానైశ్వర్యాల్నిబట్టీ మానవులకి అభిరుచులు ఉంటాయి. అనేకమైన అభిరుచులు గలవారు పంక్తులుతీర్చి కూర్చున్నప్పుడు యావన్మందికీ సయించే ఏకవస్తువు తేవడం కష్టం, అందేటట్టువడ్డించడం కష్టతరం. పోనీ ఏ ఎలకనో అడిగి తెచ్చి వడ్డించినతరవాత తీరా బాగుంటుందా మరి అని వారు భరించి భుజించినా అది అందరికీ రుచించడం కష్టతమం. అయినా సరే 'యథాశక్తి' సూత్రాన్ని అనుసరిస్తూండాలి. ఇక్కడ ఉన్నవారిలో, ప్రతివారూ ఎన్నో కొన్ని పరీక్షలు చవిచూసి ఉంటారు. అంచేత, మనకందరికీ, 'పరీక్షలు' అనేది సామాన్యవిషయం అనచ్చు. కాబట్టి, "పరీక్షలు" గురించి కొంచెం అంటాను.

హాస్యరహస్యం తెలిసిన ఒకకవి రాసినదాల్లో ఒకచోట:

వెంకన్న—రాముడూ! పరీక్షంటేయేమిషిరా?

రాముడు—పరీక్ష అంటే యుగ్జామినేషన్.

వెం—(పొడుం పీలుస్తూ) యెగ్జం నాకు తెలుసును. మేషం అంటే మేక; మేకపోతుని వేస్తారా యేమిషిరా?

రా—ఫూలిష్! యెగ్జం కాదు, మేషం కాదు. శాస్త్రుల్లో ప్రశ్నలు అడుగుతారు.

అని ఉంది. ఇంగ్లీషుమాటనిబట్టి వెంకన్న తీసిన అర్థంవల్ల కొంత నవ్వు వచ్చినా, కొంత సత్యంకూడా తేలుతుంది. అల్లాగ్గానే అసలుపదం అయిన పరీక్ష అంటే ఏమిటో చూడాలి. పరీక్ష అంటే చూడడమే, ఇటూ అటూ అంతటా నిదానించి చూడడం. సంభాషణల్లో "ఏం? ఆయన్ని మీరు అంత పరీక్షగా చూస్తున్నారు, ఎరుగుదురా?" అనీ, ఎక్కడేనా లోతభిసేల్లవయినం తేల్చవలసొచ్చినప్పుడు, "ఏమో! అంత పరీక్షగా అడిగితే నేను చెప్పలేనుస్మీ దాం తగలెయ్యా!" అనీ అంటూంటారు. కొన్నికొన్ని మాటలకి అర్థాలు మారుతూంటాయి. క్రమేణా ఈమాటయొక్క అర్థంకూడా చెదిరింది. అక్కణ్ణించి, మనస్సులో ఉండే సంగతులు చూడ్డానికి చేసే ప్రయత్నం అనే అర్థంతో ఈమాట వాడుతోచ్చారు. మనస్సు కంటికి కనిపించదు. అల్లాంటి మనస్సులో ఏమన్నా అంశం గాని, వృత్తాంతం గాని ఉంటే (సాధారణంగా ఉండకపోవచ్చు లెండి!), అవి అంతకంటే కనపడకవు. అవి ఏరూపంగానో బహిర్గతం అయినప్పుడే వాటికి జన్మసిద్ధి. అందుకు సాధనం ప్రశ్న. అది గాలంలాగ పనిచేసి కల్మషంలేని మనస్సుని బట్టబయలు చేస్తుంది. తను చెప్పింది కట్టుదిట్టంగా కుర్రాడి మనస్సుని పట్టుకుని ఉందో లేదో కనిపెట్టడానికి, చెప్పేవాడు, చిన్నచిన్న ప్రశ్నలువేసి వాటిసమాధానాలు చూసుగుని మరీ చెబుతాడుకొత్తసంగతి. అనగా పరీక్షిస్తూండడం చెప్పేవాడికి నిత్యకర్మ. అందుకనే, చదువు చెప్పే బంధువుడు ఎవరేనా గుమ్మంలోకి వస్తే, ముసలమ్మగారు, "చూడు నాయ్నా! మా కుర్రకుంక పోతు

భారం చెప్పుకుంటున్నాడు. ఏక అల్లరి. కాస్త పరీక్ష చేసి వెడుదూ!" అని కోరుతుంది. ఆ ప్రకారంగానే, కొద్దిమంది విద్యార్థు లుండేటప్పుడు, ఏదేనా అంశం వాళ్లకి వచ్చునో రాదో తేల్చడపువ్యాపారం ముఖాముఖీగా జరగచ్చు, జరుగుతూండేదికూడాను పూర్వం. అవి నోటిపరీక్షలు. ఒకొక్క విద్యార్థి ఏదో శాస్త్రం పాపం ఏ పదిపన్నెండేళ్లో చావగొట్టి చదివి పరీక్షకొస్తే, పరీక్షకారుడు ఎక్కడిదో కొతివిలాంటి వంగి ప్రశ్న వాణ్ణడిగి, ఆకాస్తముక్కా వాడు చెప్పలేకపోతే, వాడికి అసలు ఆశాస్త్రంలో ఓనమాలు రావని తీర్పు చెప్పి పొమ్మనడం ఉండేది. అది న్యాయం అని ఎవరూ అనరు. కాని, వేనవేలు జనం గొడ్డలిపెట్టుగా వచ్చి, "మాకు ఫలానాశాస్త్రం వచ్చును, మా మనస్సులో ఉంది, కావలిస్తే మా మనస్సులు తణిఖీ చేయ్యండి" అని అడిగినప్పుడు, నోటిపరీక్ష అసంభవం అయింది. పైగా, విద్యార్థుల్లో అంతరాలు చూసి ఆరాలు తియ్యాలసి వచ్చినప్పుడు, అందరికీ ఒకేకాలంలో అవే ప్రశ్నలు ఇవ్వడం ధర్మం. అంచేత రాతపరీక్షలు బయల్దేరాయి. కొన్నికొన్ని రాతపరీక్షల్లో మూలగ్రంథాలు పక్కని పెట్టుకుని చూస్తూ సమాధానం రాయచ్చు—ఆ మూలగ్రంథాలుమాత్రం ఓ వాగన్‌వి ఉంటాయి. కాని సర్వసాధారణంగా రాతపరీక్షల్లో మూలగ్రంథాలు ఓమూల పడేసి ఖరాగా వెళ్లి సమాధానాలు రాయాలి. మెట్టుమాట. ఇప్పట్లో పరీక్ష అంటే, మనస్సుని కొలవడానికి ఏర్పాటు చేసి ఉన్నకొలామానంలాంటి ఒక పేపరులో ఉండే ప్రశ్నలకి సమాధానాలు రాయడం. పరీక్ష అనేమాటకిఇది మూలార్థంకాకపోయినా, ఇందులో కూడా పరీక్షకారుడు ప్రశ్నలు ఇవ్వడానికి వృత్తాంతం అంతటా చూడాలి, కుర్రాడిమనస్సు అంతటా చూడాలి. కుర్రాడు తనమనస్సు తను అంతటా మాసుగుని సమాధానం ఇవ్వాలి. మనస్సులో ఏమీ కనిపించకపోయినా, ఇటూ అటూ, గోడలూ, ఇంటికప్పూ వగైరా అంతటా చూస్తాడు. ఏ మైతేం, ఈరాతపరీక్షలు రకరకాలు; గవర్నమెంటువి, క్లాసువి, యూనివర్సిటీవి, వృత్తివి, పోటీవి, నౌఖరీవి (అనగా సర్వీస్‌వి).

అయితే, ఈపరీక్ష అనేది ఆదిని ఎవడు తెచ్చిపెట్టాడురా మననెత్తిమీదికి అని ఒక ఆసామీ విమర్శించి, ఒక చైనామనిషి కనిపెట్టాడని తేల్చాడు. చాలా మూలం తెలియనివన్నీ చైనాలో పుట్టాయనడం వాడుకట. కాని ఒక హిందువుడు ఆ ఆసామీని ఖండించి, పరీక్ష అనేది ఇండియాలోనే వెలిసింది అని నిష్కర్ష చెయ్యడానికి రెండుసబబులు చెప్పాడు. ఒకటి—కృష్ణుడిచేత క్షేమంగా చూడబడ్డ పరీక్షన్మహారాజు పరీక్షల్ని సృష్టించాడని. రెండు— అంతకు చాలా పూర్వమే, ప్రహ్లాదుడికి గురువైన చండామార్కులవారు మార్కుల సంగతి యావత్తూ చాలా తీవ్రంగా కనిపెట్టారని. మొత్తంమీద, ఎక్కడ పుడితేం చిరకాలంనించి ఈ పరీక్షలు ఉన్నాయి, నలుమొహాలా పాకుతున్నాయి.

కాని, ఈ పరీక్షల అట్టహాసం అంతా అసలు ఎందుకు? అనేదిఒక సమస్య. పరీక్ష సాధారణంగా రెండేసి మూడేసి గంట లుంటుంది— అనగా ఒక్కొక్క పేపరు. ఆ స్వల్పకాలంలో అది కుర్రాడి గ్రహణశక్తి, విచక్షణ, జ్ఞాపకశక్తి, సమయస్ఫూర్తి, స్వయంకల్పనాశక్తి, వాక్యరచనాశక్తి, వగైరా బోలెడు కొలవాలి. కాని ఇన్నింటల్లోనూ ముఖ్యంగా జ్ఞాపకశక్తి మాత్రమే ప్రస్తుతపరీక్షలు కొలవగలవు. అనగా, లోగడపుస్తకాల్లో రాసి ఉన్నవృత్తాంతం కుర్రాడి బుర్రకాయలో ప్రవేశించి మాయం అవకుండా ఉందా లేదా అని. కాబట్టి ఇల్లాంటిపరీక్షలో దేన్లోనేనా, అయిదోఆరో మార్కులు తక్కిన వాళ్లకంటే అదనంగా రావడంనుంచి అగ్రస్థానం ఆక్రమించినవాడు, ఎక్కువ జ్ఞాపకశక్తి, రచనా కౌశల్యం కలవా డనచ్చుగాని, ఎక్కువ తెలివిగలవా డనడానికి వీల్లేదు. ఇంగ్లండులో వెనక ఉంటోచ్చిన రాంగ్లరు పరీక్షలో కొన్ని ఏళ్ళపాటు కృతార్థులైన వాళ్లసంగతి చూడగా, అగ్రగణ్యుల్లో పిక్కాపద్దులున్నా, రెండు మూడు స్థానాలవాళ్ళల్లో అఖండ ప్రజ్ఞావంతులూ అవుతోచ్చారట. అయినా సరే, ఈ పరీక్ష లెందు కంటే, తెలివితేటలు కనిపెట్టడాని కంటారు కొందరు. మరో కాయన్ని అడిగితే, పరీక్షఅనేది కొందర్ని ఫేలుచేసి పంపటాని కన్నాడు. ఇంకో ఆయన్ని కనుక్కుంటే

పరీక్షలవల్ల పై అధికార్లకి కొంత ఆదాయం, అంచేతే ఈపరీక్షల్ని నక్కల్లాగ పట్టుగుని వాళ్లూ దేవుళ్లాడుతున్నారు, అన్నాడు.

పోనీ, ఎందుకో అందుకు! పరీక్షకి మూలం ఏమి? అంటే ప్రత్యేకకమిటీలయొక్క ఆమోదంపొందిన టెక్స్టుబుక్కులు—అనగా నియమిత గ్రంథాలు. అప్పుడప్పుడు, ప్రాలుద్ధంవల్ల మంచిపుస్తకాలు నియమితగ్రంథాలుగా పడతాయి. మొత్తంమీద టెక్స్టుబుక్కు అనగా ఒక తద్దినం. అదితప్ప కడంవి అన్నీ బాగుంటాయంటాడు కుఱ్ఱాడు. అదివరదాకా గొంగళీ పురుగులా చీదరగా ఉండేచవటపుస్తకం, అప్రూవుకాగానే, రెక్కలొచ్చి ఎగిరిపోతుంది. ఒకపుస్తకం ఏదేనా పరీక్షకినియమితం అయితే, చాలమందికి లాభం, కొండొకచో గ్రంథకర్తకి లాభం. ఆగ్రంథంయొక్క ఖరీదులో అనేకమందికి వాటాలు ఉండడంవల్లే, దానిఖరీదు చాలా జాస్తీగా ఉండి, గ్రంథంలో ఉండే పదార్థానికీ ఖరీదుకీ పోలిక లేకుండా ఉండడం. ఆలోచనా నూతనత్వంగలఅపూర్వ గ్రంథం అయితే పైవారు ఓపట్టాన్ని ఆమోదించరు. ఒకొక్కగ్రంథాన్ని అబద్ధాలతో ముంచెత్తితేగాని పైవారు స్వీకరించరు. ఒకానొకప్పుడు పుస్తకంలో శృంగారం ఉన్నా ఫరవాలేదు. మరొకప్పుడు పుస్తకంలో రాసి ఉన్నకొన్నికొన్ని సత్యవాక్యాలు తీసేస్తేగాని ఆమోదం దొరకదు ఒకప్పుడు స్త్రీచేత రచింపబడితే సరి, పుస్తకం అప్రూవ్ డే. అందుకనే, కొందరు పురుషులు, తమరే పుస్తకాలురాసి, అవి పైవారి ఆమోదం పొందవేమో అనేభయం నివారించుకునేటందుకు, స్త్రీల పేరట అచ్చువేస్తూంటారు, ఇంకొకప్పుడు, ఇంగ్లీషు కంపెనీలలో పడ్డపుస్తకం అవడంవల్లా, వేరొకప్పుడు విశేషప్రజ్ఞ లేకుండానే ఒకడు పుస్తకం రాసినందుకు అతణ్ణి కాస్త ప్రోత్సహించాలనీకూడా అది నియమిత గ్రంథం అవుతుంది. బోలెడు లోపాయికారీ సంగతులు పురస్కరించుకుని ఆలోచిస్తేగాని వీట్లవయినం తేలదు. కుఱ్ఱాళ్లు ఏఇబ్బందోపడి, నియమితగ్రంథాలు కొంటారు — తెలుసుని తప్ప.

ఈలాంటిగ్రంథాల్లోన్నీ, గ్రంథాలులేని సందర్భంలో విషయసూచికల్లోన్నీ, ఆధారంగాపెట్టుగుని, వాటిల్లో ప్రశ్నపరంపర—ఒకపేపరు—తయారు చెయ్యడానికి పరీక్షాధికారి ఉంటాడు. (అతణ్ణి నియమించడంలో కూడా లుకలుకలు బోలెడుంటాయి). ప్రశ్న అడిగే వాళ్ళకి విషయం తెలియదని మనం అనుకుంటే తప్పు. అందుకని, అతడు విషయం చూసి, ఇంకా పరీక్షకొంత కాలం ఉందనగానే, పేపరు సిద్ధపరిచి, మరి యిద్దరు అధికారుల్తో అది చర్చించి, అవసరం అయితే మార్చి, అచ్చుకి పంపడానికి ఇచ్చేస్తాడు. ఇంతకాండా జరిగినా సరే ఒకొక్కపేపరు అభాండ్రాగానే ఉంటుంది. ఒకొక్కడు, కుఱ్ఱాడికిఏమి తెలుసునో కనుక్కునే ప్రశ్న అడిగితే తీరిపోనా, ఏమి తెలియదో కనుక్కుందాం అన్నట్టు ఎక్కడో మూలదాకున్న అల్పవిశేషాలమీద ఇరకాటపుప్రశ్న అడుగుతాడు. ఒకొక్కడు నియమిత గ్రంథం చదవకుండానే గట్టిపేపరు ఇస్తాడు. ప్రశ్న సూటిగా ఉంటే ప్రతీవాడూ చెప్పేసి నెగ్గుకు పోతాడేమో గదా అనే విచారంచొప్పున ఒకొక్క పరీక్షకారుడు, ఆప్రశ్నని వంకరటింకర భాషలో పాతేసి ఇస్తాడు. తను ఏక్లాసుకి పేపరిస్తున్నాడో ఆక్లాసువాళ్ళకంటె ఎక్కువసంగతులు తనకి తెలియవని ప్రజలు అనుమానిస్తారేమోఅని భయంవేసి కాబోలు, ఒకొక్కడు ఆ క్లాసుకి పైవాళ్లు చదివేసంగతులు ఆ క్లాసుకి ఇస్తాడు. ఒకొక్క బద్ధకస్తుడు, తీరుబడిలేక,— పేపరు ఇచ్చినందుకు కొంత పుచ్చుగుంటాడు, అది వేరుమాట!— కుఱ్ఱాళ్ళకంట యింకా పడిఉండదు అనితనికి నమ్మకం ఉన్న కొత్త పుస్తకంలోంచి ప్రశ్నలు అక్షరాలా ఇచ్చేస్తాడు, వాటిల్లో ఉండేదోషాల్తో సహా! ఒకప్పుడు పరీక్షాధికారి అన్యదేశంవాడయితే, పొరపాట్న పూర్వసంవత్సరపు నియమితగ్రంథంలోంచి ప్రశ్నలు ఇవ్వడం గాని, లేక నియమితగ్రంథం వ్రాసినకవిచేసిన మరొకగ్రంథంలోంచి ప్రశ్నలివ్వడంగాని కద్దు. మరొకప్పుడు పరీక్షకారుడు ఏదేనా స్కూలుకి చెందినవాడైతే (ఎంచేతంటే కొందరు పరీక్షకారులు స్కూలు-పాఠం చెప్పడం-వగైరాఎరగరు!) తన స్కూలువాళ్లకి ప్రశ్నలు

ఏచాటునో చెబుతాడు. మళ్లీ, ఒకొక్కడు తను పరీక్షలో ఇచ్చినవి మినహాయించి కడంవి కొన్ని కుర్రాళ్లకి చెప్పి, అవే వాళ్లచేత రుక్కయ్యించి, చివరకి వాళ్లచేత పబ్లికుగా పచ్చిబూతులు పడతాడు. కొందరు, తమరు కోరే సమాధానం ఏమిటో స్పష్టంగా తమకే తెలియకుండానే ప్రశ్న లిస్తారు. వాళ్ల ఉద్దేశం, ఎవళ్లూ రాయకపోతే అసలే తగాదా లేదనీ; ఒకవేళ ఎవడేనా తనకి నచ్చేటట్టు రాస్తే, వాటి ఆధారంవల్ల తక్కినవాళ్లవి విలవ కట్టచ్చుననీ. అందాకా యెందుకు! కొందరు పరీక్షాధికార్లని అధాత్తుగా కలుసుకుని జబ్బట్టుగుని కూచోబెట్టి వాళ్లిచ్చినప్రశ్నలే వాళ్లకిస్తే, ఫేలవుతారు. ఒకచోట ఇద్దరు పండితులు కలిసి హిస్టరీపేపరు ఇచ్చారట. అందులో ఒకాయన (పాపం జాగ్రత్తపరుడు!) ఆ ప్రశ్నలకి నమోనా సమాధానాలు రాసి ఉంచుకుని, నలుగురు కుర్రాళ్ళు రాసినసమాధానాలు రాసి ఉంచుకుని, నలుగురు కుర్రాళ్ళు రాసిన సమాధానాలు దిద్ది విలవ కట్టి, ఆమార్కులు వేరే ఓకాగితంమీద ఎక్కించుకున్నాడు. ఆయనప్రకారం నలుగురి కుర్రాళ్లపరీక్షా గోకేసింది. తరవాత, ఆయన ఆ నాలుగుపేపర్లూ పేపరిచ్చిన రెండోపండితుడికి దిద్ది విలవ కట్టగలందుకు పంపించాడట. ఆ పంపడంలో ఆ నలుగురుకుర్రాళ్ళు రాసినసమాధానాలున్న కాగితాలూ కాక, తను రాసి ఉంచుకున్న సమాధానాలకాగితం కూడా, పడిపోయిందిట పొరపాటున. ఈ అయిదు కాగితాలూ ఆ రెండోపండితుడు దిద్ది విలవ కట్టి తేల్చిన ఫలితం ఏమీ అంటే; ఆనలుగురుకుర్రాళ్లూ ప్యాసు, ఆ అయిదోకాగితంవాడు ఫేలూ! కొన్ని నెలల ఆలోచించి ఇవ్వవలసిన ప్రశ్నలు ఇట్టే గోకి పారేస్తే ప్రమాదాలు ఉండక మానవుమరి.

సరి, పరీక్షలు ఇక ఓ నెలో పదిహేనురోజులో ఉండనగా, చాలమంది విద్యార్థులు లేస్తారు. సంవత్సరం పొడూగునా కొంచెంకొంచెం గ్రహించవలసినది ఓ వారం పదిరోజుల్లో సాయంపట్టెయ్యలేమా అని వాళ్ల ఊహ. ఆ పరీక్షకి ఒకరోయేడు కాక మూడేళ్ళు టైము ఇచ్చినా సరే, వాళ్ళు మూడోసంవత్సరపు చివరనెలలోనే లేస్తారు. అక్కణ్ణించి పరీక్షదాకా ప్రతిరాత్రి మేలుకుంటారు. టీలు తాగుతారు. టీ తాగడానికి ఏపదింటికో కొంతమంది ఏచోటో పోగవుతారు. బోలెడు రాత్రిదాకా మేలుకుండి చదవాలిగదా అని, ముందు టీ కాయడం తాగడం అయేవరకు హాస్కడం. రెండు జాములకిగాని టీలు అవవు. అప్పుడు ప్రారంభించి, కళ్లు జోతుల్లా అయి, ఎదో పుస్తకం తీసి, ఓ పావుగంట వరకూ దృష్టి ఆ పేజీమీదే ఆ మాటవద్దిరే ఆగిపోడం గమనించి, "ప్రాప్తం ఉంటే అదే ప్యాసవుతుంది" అని ఆలోచన్లో పడి, దీపం కాగ కాలాగ అల్లానే అట్టేపెట్టి కన్నుమూసి, ఎండొచ్చిన తరవాత, ఉలిక్కిపడి మేలుకుంటారు. సంవత్సరాదినుంచీ చదివి అప్పణ్ణించీ పండితుడైపోయి ఊరికే కూచునేకంటె, పరీక్ష నాలుగు రోజులూ అఖండత్వం వెళపెళ్ళాడిస్తే చాలనా అని వాళ్ల వాదన. కొందరు, పరీక్షాధికార్లున్న నూళ్ళ నించి అంచనాప్రశ్నలు తెప్పించుతారు. కొందరు, పేపర్లు కొనడానికి రహస్యసంఘాలు ఏర్పరించి పోషకులకోసం వెతుకుతారు. రెండువందలు ఇస్తే పోషకులకోసం వెతుకుతారు. రెండువందలు ఇస్తే పోషకులు, నాలుగువందలికి రాజపోషకులు, వెయ్యి యిస్తే మహారాజపోషకులు—ఇట్లా రేట్లు ఏర్పరుస్తారు. వాళ్ళు, ఒకవేళ నెగ్గితే, తమరు టోకున కొన్నారు గనక, వ్యాపారం లాభం చూసుకుని చిల్లర్ని అమ్ముతారు. అప్పుడు పేపరు పదిరూపాయలకి వస్తుంది. అల్లా కొనుకున్నవాళ్ళు మళ్లీ కసూర్తికోసం మరీ చిల్లరగా ప్రశ్న రూపాయికాడికి వేలం వేస్తారు. కొందరు, మేడీజీలూ, నోట్సూ, తీస్తారు పెద్దవి చూడ్డానికి టైం లేక. ఇల్లా, చివరగడియలో చదవడం హిందువుల్లో ఎక్కువ అంటారు—అందులో ఆంధ్రుల్లో. ఎంచేతంటే, సంవత్సరం మొదణ్ణించీ చీమలా చదువుకునేవాణ్ణి పిక్కాగాడని ఆంధ్రులు ఏడిపిస్తారు. ఇన్నిపాట్లూ ఆవేళకి పడడం ఎందుకంటే, అది సహజం. మానవుడియొక్క సంకల్పం; తనకి ఎంత ప్రజ్ఞ ఉందో అంతకంటె ఎక్కువ ప్రజ్ఞ తనకి ఉన్నట్టు తను లోకానికి కనపడాలని.

తయారీ ఏమో స్తరుద అయితేం; పరీక్షదినాలు వస్తాయి! కుర్రాళ్ళు రాతలు ప్రారంభిస్తారు. మొదటి పేపరుకి మాత్రం కొంత శ్రమించి చదువుతారు. తరవాతనించి, కలంలో సిరా పొయ్యడం, యంత్రంలా వెళ్ళిపోయి ఏవో వోటి రాసి చక్కారావడం. కొందరు, పరీక్ష ఇచ్చేవోటికి, వ్యవధానంలో చదువుకోడానికని మేటిడేసి పుస్తకాలు తీసుగెడతారు. పరీక్షకాలంలో వాచర్లకొత్తవాళ్ళు కొందరు వస్తారు. కొన్నిస్కూళ్ల గోడలమీద ఆ టైముకి, "కాపీ పట్టుగుంటే బుర్ర ఎగిరిపోతుంది," "చంపేస్తాం రోయ్, జాగ్రత్త" "బిల్లు రాసి మరీ కాపీ పట్టుగో" అంటూ వాక్యాలు రాసి ఉంటాయి. టేబులు తొగినవాళ్ళు కొందరు డొక్కోడం వగైరాలు ఉంటాయి. డబ్బోసి పేపర్లు కొనుక్కున్న వాళ్లకి అనుకున్న ప్రశ్నలు కనిపించక, కళ్ళు చీకట్లు కమ్ముచ్చు. పాపం కొందరు తమ కొచ్చిందంతా ఒక్క దెబ్బలో మరిచిపోయి, ఇవతల కొచ్చింతరవాత అంతా ఏకరు పెడతారు. కొందరు విద్యార్థులు, సమయం దొరకడంవల్ల, "మీరు ఇక్కడ నుంచోడం నాకు అడ్డండీ!" అనీ, "కాసిని నీళ్ళు కావాలండి మంచివి" అనీ వాచర్ల మీద అథార్టీ చేస్తారు. ఒకొక్కచోట పిల్లలూ స్కూలుతాలూకు వాచర్లూ ఏకమై, పరాయివాచర్ని గదులో పెట్టి తాళం వేసి, (అతనికి మంచి టిఫిన్ లోపల ఉంచుతారట!) నియమితకాలం గడిచినతరవాత ఆయన్ని తీస్తారు. వాచరు ఏమాత్రమైనా ఎదిరిస్తే దభిగిణతోం. పరిగెట్టుస పోబోతే, తరిమి వెంటాడించి పట్టుగుని గుండకింద కొడతారు. ఇక కాపీలల్లో రకాలు కావలిసినన్ని. కాపీతోపాటు కాపీకుడా ప్రబలింది. కొందరు కోటులోపలవేపున అంకెలూ గట్రా రాసుకుపోతారు. కొందరు ఫ్యానుచేత లోపలికి కిల్లీ తెప్పించుతారు, కాగితానికి చుట్టించి. ఒకడు చెప్పుల్లోగాని టోపీ లోపలగాని కాగితాలు ఇరికిస్తాడు. మరొకడు అచ్చు కాగితాలు చింపి జేబుల్లో వేసుకుపోయి, పేచీవస్తే నమిలి మింగేస్తాడు, అనుమానించినవాచర్ని తన్ని సమీపించేలోపల. ఒకొక్క నేర్పరి, తనపక్కవాడు సమాధానాలు రాస్తుంటే వాడిచెయ్యి కదలడాన్ని బట్టి అక్షరాలు పోల్చుగుని, తనుకూడా ఆ సమాధానమే రాసేస్తాడు. ఒకొక్కడు, వాచరు వెనక్కి తిరగ్గానే, పక్కవాడికి సంజ్ఞలు చేసి వాడిదగ్గిర్నించి కొంత లాగుతాడు. కొందరు బ్లాటింగుపేపరుమీద రాసి, దాన్ని నడిపిస్తారు. పరోపకారపరాయణుడైన ఒకడు తను సగం ప్రశ్నలకిమాత్రమే సమాధానాలు రాసుగుని, కడంవాటి సమాధానాలు పక్కవాడికిస్తే అప్పుడు ఆపక్కవాడు ఆకాగితాలు చూసి స్వహస్తూరీలో సమాధానాలు రాసి ఇచ్చేస్తాడు. అది పూర్తిగా నెగ్గినప్పుడు ఆకాపీదాత అన్నదాతప్రాణదాతలకంటె ఎక్కువ ఆనందపడతాడు, కాపీదానం పట్టినవాడు అవతలవాడిఋణం ఎన్నిజన్మలకైనా తీర్చుగోలేను గదా అని ఎంతో అంతగా ఇదవుతాడు. ఒకొక్కచోట, ఒకడే ఇద్దరిపేర సమాధానాలు రాస్తాడు. ఇంకోచోట ఓడిబదులు మరోడు వెళ్లి పరీక్షకి కూచోడంకూడా ఉంటుంది. ఒకొక్కడు భంట్రోతుల్ని పైవాళ్లనీ కట్టుగుని, కుట్టేసి సీలుచేసిన పాకెట్టు విప్పించి, లోగడ తను రాసినసమాధానాల కాగితం లాగెయించి, అస్థానే, తుడు పేనా లేకుండా నిండుసమాధానాలతో ఉన్న తాజా కాగితం జొనిపించి, మీసంమీద చెయ్యేసి ప్యాసవుతాడు. మరొకచోట, ఒక అల్పజ్ఞాని, తనగదిలోనే పరీక్షకి కూర్చున్న ఒక అఖండుడినెంబరు కనుక్కుని, తన సమాధానాలపుస్తకపు కవరు వాడిపుస్తకానికీ, వాడిపుస్తకపు-అట్ట తనపుస్తకానికీ ఫిరాయింపించి, తను ఫస్టుగా ప్యాసవడమే కాక, ఆ అఖండుణ్ణి హతమార్చేస్తాడు. ఎవడేనా వాచరు కాస్తంత రాల్చేస్వభావం కలిగి ఉన్నట్టు కనిపిస్తే, అతణ్ని పిల్చి కుర్రాడు రహస్యంగా 'భిక్షాం దేహి' అంటాడు. ఒకొక్కమర్యాదస్తుడు అంచనామీద రెండు మూడు ప్రశ్నలకి సమాధానాలు తయారై వెళ్లి, "ఇవి చాలా ముఖ్యం. మీరు పొరబడ్డారు" అని చెప్పడానికి గావును అవి అడక్కపోయినా సరే రాసి మరీవస్తాడు. కొందరు, ప్రశ్నలకి సమాధానం తెలియకపోయినా ఏదో మహారాస్తున్నట్టు అభినయించి, రామకోటి రాజకీయవిషయాలు గాని, బొమ్మలు గాని గియ్యడం.

కొందరు దిద్దేవాళ్ళకి అర్జీలు కొడుతూ కూచుంటారు ఒకడు, "నేను ప్యాసు కాకపోతే నాకు వచ్చిన ఒక ఎక్కాసంబంధం దూసుకుపోతుంది. ఆపాపంమీ మెణ్ని చుట్టుగుంటుంది, కాబట్టి, ఎదో వీలుచూసుగుని నూటికి ముప్ఫైఅయిదుప్రాప్తికి నాకు మార్కులు పారెయ్యించండి! ఇంతలో మీసొమ్మేమీ పోదు!" అని రాశాడు. ఈలాంటి పిటిషనులు వృత్తిపరీక్షలో మరీజోరు. మేష్టరీ ట్రెయినింగుపరీక్షల్లో ఒకడు "అయ్యా! మాకిచ్చిన ఈ పేపరు మాపై గ్రేడుపీనుగులకి సమేతూ కొరుకు పడేట్టు లేదుగందా, ఇది మాకే ఇవ్వడంలో మీరు ఏమన్న పెద్ద మనుష్యులు! ఒళ్లు మండుకొస్తుంది. ఫేలు చేస్తారు గాని అంతకన్న ఏం చెయ్యారుకదా!" అని రాసి కసి తీర్చుగున్నాడు. ఇంకోడు, "అయ్యా! నేను ఈ డ్రాయింగు పరీక్షకి, దీనిమొహం ఈడ్చా, ఆరుమాట్లనుంచి అహోరిస్తున్నాను. నాకూ బొమ్మలకీ పడదు. ఏవో గీస్తానుగాని వాటికి జీవంరాదు, పైగా ఓజంతువుగియ్యాబో తేమరోటి వస్తుంది. నాకు రెండుబళ్ల సంతానం. నేను ఈయేడు ఆ డ్రాయింగు గట్టెక్కించకపోతే నన్ను తీసేస్తామన్నారు. మీరు నాకు పట్టెడన్నం పెట్టిస్తారా? నోటిమట్టి కొట్టిస్తారా?" అని రాశాడు. అలాంటి అరవమోపడి విద్యార్థుల్ని చూస్తే చాలా జాలేస్తుంది. తులసీతీర్థం పుచ్చుగునేటైములో అతణ్ని విద్యనేర్చుగోమనడం ధర్మంలా కనపడదు. కొన్ని వృత్తిపరీక్షల్లో కాపీపట్టింపుతక్కువ. పెద్దమేష్టరీ ట్రెయినింగు ఉంది. ఆపరీక్షకి చదివినకొద్దీ నూతీపోతుంది, పరీక్షాపోతుంది. చదవనివాడికి నచ్చేపరీక్ష అది ఒక్కటే. ముందు, ప్రశ్నయొక్కసంఖ్య వేసుగుని మరీ మొదలెట్టాలి, సమాధానం. ఎంచేతంటే, ఏప్రశ్నకి మనం అసమాధానం రాశామో మనమేపట్టుగోలేం. కొందరు, ఆపరీక్షనిమిత్తం మూడో నాలుగో పాయింట్లు సంపాదించి, పేపరులో ఏప్రశ్నలున్నా సరే వాటికింద ఆపాయింట్లు మజాకాగా సర్దేస్తారు. ఇక ప్రైవేటుగా వెళ్లేవాళ్లు. వాళ్ళు పరీక్షప్యాస్ కాకపోతే ప్రమోషను ఆగుతోందని పరీక్షకిమళ్లీ కట్టడం, కట్టాం గదా అని పరీక్షఊరు పరీక్షవేళకి వెళ్ళడం, వెళ్లాంగదా అని ఏదో రాయడం, రాశాంగదాఅని ప్యాసవుతుందని అనుకోడం—ఇంతేగాని సాధారణంగా చదువుకునివెళ్ళడంఅంటూ ఉండదు. ఇల్లా వెళ్లి వెళ్లి కొత్తజ్ఞానం ఏమీ సంపాదించకుండానే—ఏపరీక్షకారుడు మారిన టైములోనో—గుభుక్కుని ప్యాస్ అవడం.

ఈవిధంగా, తెలిస్తే రాతలతోటో, తెలియపోతే కోతలతోటో పేజీలు నింపి, విద్యార్థులు తమపని తమరు కానిస్తారు. అస్పష్టసమాధానా లుండే ఇంగ్లీషులాంటి పేపరు అయింతరవాత, "ఎల్లా ఉందిరా, ఇంగ్లీషూ?" అంటే, "ఏం? బాగానే ఉంది," అంటాడు ప్రతీవాడూకుడా. అప్పటి జవాబులధోరణి చూస్తే, "ఈ ఇంగ్లీషులో ఎవ్వడూ ఫేలే అవడా ఏమిటి చెప్మా!" అనిపిస్తుంది. కాని, స్పష్టసమాధానాలుండే గణితంలాంటి పేపరు అయింతరవాత, "ఏంరా" అంటే కుర్రాడు ఉత్సాహంగా మాట్లాడమో, లేకపోతే మొహం వేలవెయ్యడమో జరిగి, కత్తీ దెబ్బా అని తేలిపోతుంది. ఇల్లా తత్క్షణం తేలిపోతుందనే కొందరు గడసర్లు తమకి ఏయే ఆన్సర్లు వచ్చాయో అవి మరిచిపోయాం అంటారు. కొందరు ఒక్కొక్క పేపరు అయిపోగానే ఇంటి కొచ్చి దానితాలూకు నియమితగ్రంథాలూ, నోట్సూ అన్నీ చక్కటిపొట్టులా చింపి గాడిపొయ్యిలో పోస్తారు. ఒకవేళ పేపర్లు గడువుకాలంలోపలే ఊరేగి పోవడంవల్ల పైవారు రొండోపరీక్ష పెడితే (ఖర్చుమూలాన్ని ఓపట్టాన్ని పెట్టరు) అప్పుడు చదవడానికి ఒక్కపుస్తకం ఉండదు. కొందరు జ్యోతిషం కనుక్కుంటారు—ఫేలయితే జ్యోతిష్కుడి మీదికి తొయ్యడానికి. కొందరు పరీక్షపలితాలు తెలియకపూర్వం శుభం జరగడం పరీక్షకి జయప్రదం అని ఆలోపలే శుభముహూర్తాలు పెట్టించుతారు. ఫలితాలు తెలిసేవరకూ కొందరు గడ్డం పెంచుతారు. కొందరు, తమకి ఒకొక్క పేపర్లో ఎన్నిమార్కులొస్తాయో అంచనాలు వేస్తారు. ఆ అంచనాల్లో ప్రతీవాడికీ ప్రతీపేపర్లోనూ ఎంత తక్కువగా చూసుగున్నా ముప్ఫైఅయిదుకంటె పైగానే మార్కులు వస్తాంటాయి—ఎన్నిమాట్లు కట్టినా. కొందరు, తమరికి ఏ ఒక పేపర్లోనేనా సందేహంగాఉంటేతమపేపరు ఎక్కడికివెళ్లిందో

తెలుసుగుని, ఎన్నివందలమైళ్లయినా సరే, ఆ ఊరు వెళ్ళిపోతారు. దిద్దేవాడిస్వభావం కనిపెడతారు. వాడి దగ్గిరికి వెళ్లేమార్గాలు చూస్తారు. ఆయన ఇంటిదగ్గిర లేని సమయం అయితే, ఇంట్లో తమ నెంబరూ కొన్ని వందలూ పారేసి పోతారు. లేకపోతే, ఆయనికి, ఆయనపై అధికారిచేతో, ఆయన అల్లుడిచేతో, ఆయన ఋణదాతచేతో, మరి ఇతర మొహమాటస్తుడుచేతో చెప్పిస్తారు. పేపరు దిద్దేవాడు విషమస్థితిలో పడతాడు. ఈ దిద్దేవాళ్లల్లో ఒకొక్కడు మార్కులబుధ్ధావధాన్లు. అతని ఉద్దేశం ఏమిటి?—సరే, పేపరుకి మొత్తంమార్కులు వంద. అందులో దేవుడివి పది. అవి ముట్టుగోడానికి వీల్లేదు. పది తనివి. పది పై అధికారివి. పది అందానికి మిగతావాటిల్లో తనకినచ్చినచోట సగం కంటె తక్కువగా ఇస్తాడు. ఇక కుర్రాడు తేలడం ఎల్లా? మరోడు, మార్కులసంతర్పి. ఈ రెండురకాల వాళ్ళనీ కూడా పైఅధికారి కాస్త కసిరి, మధ్యరంగంలో ఉండేటట్టు మార్కుల్ని మరమ్మతు చేస్తాడు. ఈరీతిగా బాధపడుతూ, "మనసాయం, అఖండుడికీ అక్కర్లేదు, శుంఠకీ అక్కర్లేదు. ఇటూ అటూ గాకుండా మార్కులు వచ్చినవాళ్ళకి కావాలి వీళ్ళని ముంచనా, తేల్చనా?" అని దేవుళ్లాడుతూ కుప్పనూర్పిడికింప ఒకొక్కడు పేపర్లు దిద్దుతాడు. కుప్పనూర్పిడి అంటే జ్ఞాపకం వచ్చింది—విద్యాధికుడూ వ్యవసాయదారుడూ అంటూ ఆరాలు తీస్తారు గాని, విద్యా వ్యవసాయమే. వ్యవసాయంలోఉన్న లావాలేవీలు యావత్తూ విద్యకీ అహోరించాయి. రెండింటల్లోనూ ముల్లుకర్ర పుచ్చుగోవాలి ఓమాటేనా, పశువుల్ని తోలాలి, విత్తనాలు చల్లాలి, కాపు కాయాలి, కోతలు కొయ్యాలి, కట్టలు కట్టాలి, కుప్పలు నూర్చాలి—ఫలితం దేవసహాయం. దిద్దేవాడి దగ్గిర్నించి కాగితాలు వెళ్లిపోయా యని తెలిసింతరవాత కూడా, కుర్రాళ్లు ఇంకా ఎక్కడ ప్రయత్నించాలో అక్కడ.

"త న్నేవైద్యుండు చికిత్సఁ బ్రోవఁగలడో, యేమందు రక్షించునో" అని చరమప్రయత్నాలు చేస్తూ, ఎంతేనా సంతోషంగా ఖర్చు చేస్తారు.

అక్కడితో ఫలితాలు వస్తాయి. కొందరు ప్యాసు, కొందరు ఫేలు. ప్యాసైనవాళ్లు తలెత్తుగుని నలుగురూ ఉన్నచోట నడుస్తూంటారు. వాళ్లకి అభినందనాలుకూడా వస్తూంటాయి. కొందరు, (వెనక) కొబ్బరికాయలు కొట్టడం, సత్యనారాయణవ్రతం చెయ్యడం ఉండేది. ఫేలయినవాళ్లలో కొందరు అది మరీ శిరచ్ఛేదంకింద భావిస్తారు. ఎవ్వడూ ఫేలవకుండా పరీక్ష ఎందుకు ఉండకూడదూ! ఎవ్వడూ ఫేలవకపోతే ఇక పరీక్షప్రయోజనం ఏమిటి అసలు అని కోప్పడుతూ మొదటికొచ్చే అధికార్లు కొంద రున్నారు. నూటికి ఏ తొంభైమందో ప్యాసవుతూంటే భరించలేక కళ్లమ్మట నీళ్లు పెట్టుగునేవాళ్లు కొందరున్నారు. కలకత్తాలో నూటికి ౧౫ మంది ఫేలవుతారు. అల్లాంటప్పుడు ప్యాసవడంకంటె ఫేలవడం కష్టం. ఎంచేతంటే నూటికి ౭౫ మందిలో ఉండడంకంటెనూటికి ౧౫ మందిలో సర్దుకోడం కష్టం గనక. అందుకని, మనలో మరీ ఎక్కువమందిని ప్యాసుచేసి, పరీక్షలపటుత్వం చెడగొట్టి, దేశాన్ని పాడుచెయ్యకుండా, కొద్దిమందినే ప్యాసు చేస్తూంటారు. కాని, పామరులకి లోసంగతులు తెలియవు. వాడు, ప్యాసైనవాడు మహానుభావు డనీ, ఫేలైనవాడు తెలివితక్కువవాడే గాక, తుంటరికూడానని భ్రమిస్తారు. అయితే, పరీక్షఫలితాలు వచ్చినకొత్తరికం అల్లా అనుకున్నా, ఫేలయినవాళ్లలో చాలామంది అఖండులు ఉండచ్చునని కాలక్రమాన్ని గ్రహిస్తారు. కొంతకాలం అయింతరవాత, పుస్తకాలు మళ్లీ చూడకపోతే, వారూ వీరూ ఒకటే అని తెలుస్తుంది. అంతమాత్రాన్ని ఈపరీక్షారాధన ఎందుకో బోధపడదు. ఫలితాలు తెలిసినకొన్నాళ్లు హడావిడిగానే ఉంటుంది. ఒకొక్కడు పిలక్కి తాడుకట్టి తెగభట్టీవెయ్యడం, పరీక్షలో ఏమార్కులో వచ్చి చచ్చిచెడి అత్తీసరుపదునుగా ప్యాసవడం, "ఆఁ, నేను చదివిందేదిరా? జస్టు ఊరికే లీలగాచూశాను, ప్యాసైంది. మనం రొండోసారి చూస్తేనా?" అనడం. అసలుసంగతి, అత డేం జేసినా, అతణ్ని ఏం జేసినా, అంతకంటె ఎక్కువ ఒక్క మార్కు రాదు. ఒకడికి నూటికి ౯౫ వస్తే, ఆకడం

అయినా తనికి ఇవ్వకపోయినందుకు పేపరు దిద్దిన వాడు నరకానికి వెడతా డని, ఓ ఫేలైన వాడిదగ్గర వాదించడం—వా డసలు ఫేలై చదవు తూంటే! ఒకడు ఏమీ చదవకుండానే మార్గాంతరాల వల్ల దాటి, తను బోలెడు చదివి పాడుం అయినట్టు “అబ్బ! మాచెడ్డ అప్సెట్ అయిందిరా సిస్టమ్? రెస్టు పుచ్చుగోవాలి” అనడం. ఒకొక్కడు పరీక్షఫలితాలు తెలిసినప్పుడు అత్తారింటిదగ్గిర ఉండడం తటస్థించి ఫేలయితే అద్భుతమైన కారణాలు చెబుతాడు— “చూడండీ అత్తా! మాసూక్లు తాలూకు సమాధానపు కాగితాలు ఒక కిరోక్కటకుడికి వెళ్లాయండి. అందులో కర్మం! నాబుక్కు ఆకాగితాలకట్టలో పైనే ఉందిట. ఆకరోక్కటకుడు అప్పుడప్పుడే ఇంట్లో ఏదో దెబ్బలాడి వచ్చాడేమో, ఆపళంగా నాపుస్తకం మొదట్లోనే ఉంది కాదూ, దానిమీద ఒక్కసున్నా పెట్టి, నన్ను బలేసి పారేశాట్ట” అని. మొత్తంమీద ప్యాసులూ, క్లాసులూ, వగైరా మూణ్ణాళ్ల ముచ్చటలు.

ఇన్ని సంగతులూ, ఇంకా లక్షా, జరిగిన తరవాత వచ్చినఫలితాలమీద ఆధారపడి తెలివితేటలూ, ఉద్యోగార్హతా నిర్ణయించడం న్యాయం అని చెప్పలేం. కొందరు అసలు పరీక్షలుతీసేస్తే పీడ వదుల్తుందనివాదిస్తారు. కాని, విద్య ఉన్నంతకాలం. పరీక్ష తప్పదు. ఎంచేతంటే, విద్యబోధించి చెప్పాలి. బోధనకి ప్రశ్నా, సమాధానం ఉండాలి. ప్రశ్న పరీక్షయొక్క చిహ్నం. అందుచేత, ఘనికులైన ఇతరదేశీయులు కొత్త పరీక్షలు కనిపెట్టి, ఆచరణలో పెట్టి, పైనిచెప్పిన అన్యాయాలు తగ్గించాలని చూస్తున్నారు. మన ప్రస్తుతపరీక్షలు కొండని ముక్కలకింద కొట్టమంటాయి. కొత్త పరీక్షలు, చినచిన్నముక్కల్ని గబగబాపోగుచేసి కొండలా పేర్చమంటాయి. మన పరీక్షలవిధానం మారాలీ అంటే, మనుష్యులు మారాలి. అనగా మనస్సులు మారాలి. కాలం జరిగితే గాని మనస్సులు మారవు పరీక్షలకోసం, మార్కులకోసంమాత్రమే బాధపడేవాడికి, విద్య అంటదు. విద్యకోసం పాటుపడేవాడికి పరీక్షవల్ల బాధే ఉండదు. ఎంచేతంటే, వాడు ప్రతీకొత్తసంగతీ పరీక్షవల్లే నేర్చుగోవలసిన అవసరం ఉండడంచేత, వాడికిపరీక్ష మామూలై పోతుంది. పరీక్ష నాలుగుపూటలూ ఏ అరువుముక్కలో ముక్కునెట్టుగుని తెలివిగలవాడికిమల్లే కనిపించి, ఆ కాలానికి పూర్వాపరాలు మూర్ఖుడై ఉండడంమానవుడు కోరుకోకూడదు. అసలు జీవితం ఒకపెద్ద నిత్యపరీక్ష. జీవితపరీక్షకి ఎప్పుడో తయారు అవుతానులే అనడం కాక, ఎప్పటికప్పుడు తయారుగా ఉండడం మానవుడి విధి. అటువంటిధన్యుడిజీవితం ఆదర్శం. నమస్కారం.

---

## జానకీనాథ యేల దర్శనము నీవు?

అధికార్ల సూర్యనారాయణరావుగారు,
B. A., B. L.

మొలక నగవుల చంద్రుని ముద్దుమోము
తొంగి చూచెడు విమలనౌ నింగినుండి
బాలు డాటల చాలించి పవ్వళించె;
దీప మొక్కటె తోడుగా తెలివికలల
కాల మెట్లొ పుచ్చుచు గాచియుంటి
జానకీనాథ! యేల దర్శనము నీవు?

౨

అంబునిధిలోన ఆణిముత్యంబు వోలె
కటికచీకటిలో దీపకళిక వోలె
కంటకములలోన గులాబికన్నె వోలె
నకట! నెమ్మది గ్రమ్ము నిరాశయందు
దాచి యుంచితి ప్రణయంబు తాళజాల!
జానకీనాథ! యేల దర్శనము నీవు?

---



ఛాయాచిత్రము

శ్రీయుత కే. రంగస్వామి అయ్యంగారు తీసిన ఫోటోనుండి.

# త్రాగుడు

పెద్దిభొట్ల వీరయ్యగారు B.A., B.L.

మనుజుని జీవితమునకు వాయువు ముఖ్యమనియు, పానీయము తరువాతను, తుదకాహారమును క్రమముగా నవసరమని యిదివరకు దెలియజేసియున్నాను. ఘనపదార్థమాహారములోను, ద్రవపదార్థము పానీయమునకు ముఖ్యమైయున్నవి. శరీరమునందలి జలపదార్థమును భర్తీచేయుటకు జలమే మొగటిసాధనము. జలమిశ్రితములగు ద్రవపదార్థములు, పాలు, మజ్జిగ మొదలగునవి దేహమున కారోగ్యమును, బలమునిచ్చునవై యున్నవి. కొన్ని ద్రవపదార్థములు తాత్కాలికముగ దేహమున నుద్రేకమును గలిగించుచు తుదకు నరములదుర్బలత్వమునకు కారణభూతములగుచున్నవి. అట్టివి కల్లు సారాయి మొదలగునవి. అట్టివానిని సేవించుటకే ముఖ్యముగ త్రాగుడుశబ్దము వాడబడుచుండును. మంచినీరు త్రాగెదరు, పాలు త్రాగెదరు అనుచోట్ల ద్రవపదార్థములకు త్రాగుట యను శబ్దము మామూలుగా వాడుకలోనున్నటుల తెలియగలదు. కాని త్రాగుడుశబ్దమమాత్రము కల్లు, సారా మొదలగు వానికే ప్రత్యేకించి వాడబడుచున్నది. ద్రవపదార్థములు కానిచోట్లగూడ త్రాగుడు యని వాడుటగలదు. 'పొగ త్రాగనివాడు దున్నపోతై పుట్టున్' అను చాటుపద్యచరణమువల్లను, 'గంజాయి త్రాగి నావా' యను చరణమువల్లను వాయుపదార్థమునకు, ఘనపదార్థమునకుగూడ 'త్రాగుట' నుపయోగించుచున్నటుల స్పష్టమగుచున్నది. కాని వీనిని త్రాగుడు తరగతిలో జనసామాన్యము చేర్చి వ్యవహరించుచున్నటుల గోచరము కాగలదు.

త్రాగుడొక దురభ్యాసము. మంచి అభ్యాసము పట్టుపడుట కెంతో శ్రమపడవలెను. దురభ్యాసములబడుట కట్టిశ్రమ యక్కరలేదు. ఒకసారి యలవాటుపడిన మానుట దుర్లభము. ఇది సాధారణముగా సాంగత్యదోషమువల్ల నేర్పడు దురభ్యాసమైయున్నది. దీనివల్ల నెన్నికొంపలో నాశనమగుచున్నవి. ఎందరో యకాలపు మృత్యువువాత బడుచున్నారు. ఈ త్రాగుడు పదార్థములలో మత్తు నిషా గలిగించు వస్తువు చేరియుండును. అది విషతుల్యము. అట్టి నిషాపదార్థము దేశమునందంతట నవీనకాలమున విరివిగ వ్యాప్తిగాంచుచున్న కాఫీ తేయాకునీరు మొదలగు వానిలో సహితము గలదని శాస్త్రజ్ఞులు కనుగొనియున్నారు. ౬ గిన్నెల తేయాకు నీరొక మనుజుడు త్రాగిన వానికి తెలివి తప్పగలదనియు, రెండు గిన్నెల తేయాకు నీటిని ఎలుక కిచ్చిన నది పరమపదము చెందునని శాస్త్రపరిశోధనకారులు వ్రాయుచున్నారు. అందుకు కారణ మా నీటియందుగల విషపదార్థము. ప్రతిదినము కాఫీ గాని తేయాకునీటిని గాని గ్రోలువారి శరీరములో క్రమముగా నట్టి విషపదార్థము చేరియుండ గలదుగదా! మనుజుని జీర్ణశక్తి సాధారణముగ విషమును జీర్ణింపజాలదు. అందుచేత దేహమున ప్రవేశించినవిషము పైత్యకోశమునందు నిలిచి యాకోశమునకు వికలతగలిగించును. త్రాగుడున కలవాటుపడినవారి 'లివర్' (పైత్యకోశము)లను పరీక్షించి డాక్టర్లు తీసిన ఫోటోగ్రాఫులవల్ల విషపదార్థ మెటుల ఆయవయవమును ధ్వంసముచేయుచున్నదియు తెలిసికొనవచ్చును. త్రాగుడువల్ల త్రాగెడునా డొక్కడే పాడగునెడల నంత యోచింపవలసినపని లేదు. కాని యది వానిసంతతిని సహచరులను బాధించును.

త్రాగుబోతులకు సంతానమే గలుగుట దుస్తరము. ఒకవేళ కలిగినను అట్టి సంతతికి బాలారిష్టములు తొలగుట దుర్లభము. కొందరు తప్పుదారి కొంచెమెక్కువకాలము జీవింపగలిగిరని యెంచినను వారు జీవచ్ఛవములవలె నుందురు. వీరికి నేరము లొనర్చుట కాసక్తి మెండగును. అట్టివారిని సంఘములో నుండనిచ్చుట సంఘమునకు హానికరమని లోకానుభవముకలిగినట్టి, ఫలాపేక్ష లేనట్టి మహర్షులు తలంచుటలో వింత లేదుగదా. ఇప్పటికిని కొన్ని

జాతులవారు నేరస్థులుగ పరిగణింపబడి ప్రత్యేకస్థలములలో పోలీసుకాపలాలో నుంచబడుట మనము చూచుచున్నాము. అట్టిజాతులబాలుర నితరబాలురతో గలుపజూచుటవల్ల ఆజాతులవారి యభివృద్ధిసంగతి యెటులున్నను ఇతరబాలురలో కొందరికైనను పైజాతులవారి గుణము లబ్బునగుటకు సందేహము లేదు. అందుచేతనే సంఘసంరక్షణకై మన పూర్వులు కొన్నికట్టుబాట్లు చేసియున్నారు. ఈ కలికాలమున పాశ్చాత్యనాగరికతావ్యామోహములో జిక్కిన వారికీ కట్టుబాట్లు వెగటుగదోచుటలో నాశ్చర్యము లేదు. సంఘనియమములను సమర్థించుటకై యీవ్యాస ముద్దేశింపబడనందున నిందును గురించి విస్తరింపదలచలేదు. త్రాగుబోతులసంతతిలో పారంపర్యముగా వచ్చెడు దుర్గుణము లుండగలవని, యట్టివారు సంఘబాహ్యులుగ నుండుట సంఘమునకు శ్రేయస్కరమని విన్నవించుచున్నాను.

జననమునకు కారణమగు మాతాపితల ప్రాథమికాణువులయందు వారిగుణగణములు మూర్తీభవించియుండి వారి సంతానమున నాగుణములు కలుగునని పారంపర్య (హెరిడిటీ) శాస్త్రవేత్తలు తెలియజేయుచున్నారు. 'అణోరణీయాన్ మహతో మహీయాన్' అను ఆత్మను గురించినసంగతి శరీరమునకు సహితము వర్తించునని స్పష్టమగుచున్నది. అందుచేత తండ్రికి ఉబ్బస మున్నయెడల వానిసంతతికా జబ్బు వచ్చుట సహజమని నిరూపింపబడుచున్నది. ఏలననగా తండ్రియొక్క శ్వాసకోశములం దేర్పడినలోపము రేతస్సుయొక్క ప్రాథమికాణువునందు నదేవిధముగ నుండునని సూక్ష్మదర్శని యంత్రసాహాయ్యమువల్ల పరిశోధనచేసి పాశ్చాత్యశాస్త్రజ్ఞులు నిర్ణయించుచున్నారు. అదేవిధముగ తలిదండ్రులకుగల ఇతరజబ్బులు అపస్మారము, కుష్ఠు మొదలగునవి వంశపారంపర్యముగ రాగలవై యున్నవి. ఒకప్పుడు తండ్రికుండెడి జబ్బుమాదిరి మరియొక్కజబ్బు శిశువునకు వచ్చుట గలదు. త్రాగుబోతుల సంతతికి నేరములు చేయు స్వభావము గలుగుట పైకారణమువల్లనని విశదముకాగలదు. త్రాగుబోతులకు నరములయందు పట్టు తప్పి వారి ననేక దుర్మార్గములకు నీడ్చును. త్రాగుబోతుల నరముల దుర్బలతయే వారికి సరియైన సంతతి లేకుండుటకు కారణమై యున్నది. ఐరోపా అమెరికాఖండములందు నానాటికి జననముల సంఖ్య తగ్గుట కచ్చట ప్రబలియున్న త్రాగుడే కారణమని తెలియుచున్నది. త్రాగుడువల్ల సంతానహేతువగు ప్రాథమికాణువులు దుర్బలమై యుండును.

సారాయి మొదలగు మత్తుపదార్థములలోవలె కాఫీ, తేయాకు, పొగాకు, గంజాయి, మొదలగు వానిలో విషపదార్థము లున్నవి. కాఫీలో నున్నది కాఫీను అని తేయాకులో నున్నది తేను అనియు, పొగాకులోనిది కొటీను అని వేర్వేరు పేర్లతో నీవిషపదార్థములు తెలియబడుచున్నవి. ఒక గ్రెయినులో ఎనిమిదవవంతు తీను ఒకకప్పను చంపుననియు, అదే 34 గ్రెయినులైన ఒక పిల్లిని చంపుననియు శాస్త్రజ్ఞులు తెలియజేయుచున్నారు. నవీనకాలమున ప్రతిబస్తీలోను, తుదకు పల్లెలలోను లెక్కకు మిక్కుటముగ కాఫీ అంగళ్లు వెలయుచున్నవి. ఎందరో, ముఖ్యముగ నాంగ్లవిద్య నభ్యసించినవారు కాఫీపానమునకు దాసులగుచున్నారు. విద్యార్థులలో పొగచుట్ట కాల్చువారిసంఖ్య తక్కువగ నుండినను ఇటీవల బీడీ సిగరెట్లనుపయోగించువారి సంఖ్య హెచ్చుచున్నది. పొగాకును హెచ్చుగా వాడువారికి బుద్ధిమాంద్యమే గాక యుక్తాయుక్త పరిజ్ఞానము నశించుటకూడ సంభవించును. వీరు తాము చేయునది తప్పని తోచినను అభ్యాసమును వదలజాలకున్నారు. నరములు దుర్బలమైనకొలది త్రాగుడునందాసక్తి హెచ్చును. ఈ ఆసక్తి అన్నివిధములను దురభ్యాసములను వర్తించును. పొగా కధికముగా వాడువారికి దృష్టిమాంద్య మేర్పడునని స్కాట్లాండులోని డాక్టరు మన్రోగారున్ను, మాంచెస్టరు రాయల్ కంటి ఆసుపత్రి డాక్టరగు మినాగా రున్ను చేసిన పరిశోధనవల్ల తెలియబడుచున్నది. పొగాకువల్ల మూత్రమునందు ఆల్బ్యుమెను అనుపదార్థము ఎక్కువగా పోవునని రూఢిపడుచున్నది. ఎక్కువగా పొగాకు గాని సారాయి గాని వాడువారికి మతిస్థిమితము తప్పునని శాస్త్రజ్ఞులు స్థిరపరుచుచున్నారు. మత్తుపదార్థములను సేవించువారు సుఖానుభవములకు దూరమగుచున్నారు. సారాయము రక్తనాళముల గమనమునకు ప్రతి

బంధకముగా నుండును; గుండెను బలహీనముచేయును. శరీరమునందు జీర్ణ కాలమున ఉత్పత్తిగావలసిన ద్రవపదార్థములను తగ్గించును. అందువల్ల ఆకలి మందగించి అజీర్ణవ్యాధి యంకురించును. సామాన్యముగా నరముల వేగము సెకండునకు ౯౧ అడుగు లుండును. త్రాగినవాని కావేగము సెకండుకు ౧౩ అడుగులకు తగ్గును. అందుచేత త్రాగిన వారికి సంగతు లాకళింపు చేయవలెనన్న నెక్కువ కాలము పట్టును.

త్రాగుడును మాన్పించుట కనేక ప్రయత్నములు ప్రపంచములో జరుగుచున్నవి. అన్నివిధములగు దురభ్యాసములు పోయి సంఘము తోలికట్టుబాట్లకు తిరుగు నెడల దేశము మంచిస్థితిలో నుండుటకు సందేహము లేదు. అయ్యది సాధ్యమా? కాలప్రవాహములో ముం దెట్టిమార్పులు రాగలవోగదా! త్రాగుడు కలవాటుపడినవారికి దాహము మెండు. వారిశరీరమున వ్యాపించియున్న సారాయము అన్నకోశమున కుద్రేకము గలిగించును. అందువల్ల దాహ మధిక మగును. దానికి త్రాగుడే వారి కుపశమనము తాత్కాలికముగ గలిగించి, వెంబనే తిరిగి ఎక్కువగ దాహమును గలిగించును. 'పీత్వా పీత్వా పునః పీత్వా' యని కల్లంగడికి పోవువారు ఒకముంతతో తృప్తి జెందరని యనుభవశాలు లెఱింగిన సంగతియై యున్నది. సారాయి తాగువారిలో పైత్యకోశములు చెడనివా రరుదు. సర్ పాట్రిక్ మాన్సను అనువారు పరిశీలించినయట్టి పైత్యకోశములలో నూటికి ౬౩ త్రాగుబోతులవని తేలినది. విషము జీర్ణముకాజాలదు గనుక లివర్ వరకుచేరి యచ్చట నిలిచిపోవును అప్పుడప్పుడు స్వల్పముగ పుచ్చుకొనబడి విషమంతయు నొకచోట చేరుచున్నది. అంత విషపదార్థము నొక్కసారే పుచ్చుకొనినయెడల వెంటనే మృత్యువాతబడుట నిశ్చయము. అందుచేతనే శివుడును గరళమును కంఠము దాటిపోనివ్వక అచ్చట నిలిపియుంచెను. పొగాకును విశేషముగ నుపయోగించువారిలో జననముల సంఖ్య క్రమముగా తగ్గిపోవునని, వారిసంతతిలో పిచ్చివారు బయలుదేరుదురని డాక్టరు క్రెస్సు అనువారు తెలియజేయుచున్నారు. సర్ బెంజెమన్ బ్రాడీగారు పొగాకును విశేషముగా వాడువరికి సంతానమే గలుగ నెడల వారు బలహీనులై యల్పాయువు గలవారై యుందురని, తరుచుగ రోగగ్రస్తులు కాగలరని వ్రాసియున్నారు. అమెరికాలో గవర్నరుగా నుండిన స్టబ్సు అనువారు కాన్సాసురాష్ట్రమునందలి జైళ్లు ఖాళీగా నుండుటకు కారణము అచ్చట సారాయి పొగాకు నిషేధింపబడుట యని తెలియజేయుచున్నారు.

పూర్వకాలమున పొగాకు మనదేశములో లేదని, కొన్నివందలసంవత్సరముల క్రిందట రాబడినదని చరిత్రకారులు దెలుపుచున్నారు. పూర్వము రషియాదేశములో పొగాకు నుపయోగించినవారి ముక్కులు చెక్కివేయబడుచుండినటుల దెలియుచున్నది. రోముపట్టణములో నెవరైన పొగాకును గుడియందు వాడినచో వారిని సంఘమునుంచి బహిష్కరించుటకు అక్కడి మతగురువగు పోపుగారు ఉత్తరవుచేయుచుండిరి. స్విట్జర్లాండు దేశములో వ్యభిచార మెట్టినేరమో పొగాకు నుపయోగించుట అట్టినేరముగా పరిగణింపబడుచుండెను. నాల్గవ అమరాత్ రాజు పొగచుట్ట కాల్చినవారికి ఉరిశిక్ష విధించుచుండెనట. పొగాకుసారమునుంచి యొకబొట్టు పిల్లియొక్క నాలుకపై వేయుగా వెంటనే యది మృతినొందినటుల తెలియుచున్నది. ప్లాడిహోక్ అనుశాస్త్రజ్ఞుడు సూక్ష్మదర్శనియంత్రముతో పొగ త్రాగువారి కొన్ని మెదడులను పరీక్షించిచూచి వానియందలి నరములపటుత్వ మెటుల తగ్గిపోవుచున్నది కనుగొనియుండెను. వస్తాదులగు వారిలోగాని, గొప్ప బంతిఆట మొదలగువానిలో మెలగు వారిలోగాని పైవ్యసనములకులోబడినవా రగ్రస్థానమును జెందుటరుదు. ఇందునుగురించి ౧౯౧౧ సంవత్సరములో నొక విమర్శన జరిగియుండెను. మద్యపానమునకు మన చెన్నపురిరాజధానిలో గల వీల్లు ఇతరరాష్ట్రములందు లేవు. ఇచ్చటి తాటిచెట్లు, ఈతచెట్లు, కొబ్బరిచెట్లు హిందూదేశమున మరెచ్చటను లేవు. కాబట్టి త్రాగుడు కెక్కువ అవకాశము మనరాజధానిలో గలదు. ఇదిగాక పొగాకుపైరునకు మనరాజధానిలోని నేలలు ప్రశస్తమని పాశ్చాత్యులెందరో యీనాఁటవాయువున కృషిచేయుచున్నారు. అందుచేత మనరాజధానివారు త్రాగుడువల్లగల అపాయములనుగురించి హెచ్చుగా తెలిసికొనవలసియున్నది.

ప్లూటార్కు అను చరిత్రకారుడు త్రాగుబోతుల సంతానములో త్రాగుబోతు లుండెదరని వ్రాసియున్నాడు. ప్లేటో నూతనదంపతులు మద్యమును వాడకూడదని శాసించియుండెను. సర్ పియుర్స్ గౌల్డు అనువారు త్రాగుబోతులగు స్త్రీలనుగురించి వారికి గలుగు శిశువులు మాతృగర్భమునందేగాని, పుట్టినవెంటనేగాని మృతిజెందుట గలదని వ్రాసియున్నారు. డాక్టరు సల్లివాను అను శాస్త్రజ్ఞుడు అనేకమంది త్రాగుబోతులనుగురించి పరిశీలించి కనుగొనినదేమనగా, నొక త్రాగుబోతుకు ౬గురు పిల్లలుండిన, మొదటి ముగ్గురు సామాన్యమైన ఆరోగ్యము కలిగియుండగా నాల్గవశిశువు బుద్ధిహీనుడుగను, అయిదవ శిశువు పిచ్చివాడుగను, ఆరవశిశువు పుట్టినవెంటనే మృతినొందునటులుగను ఉండెనని తెలియవచ్చుచున్నది. పొగాకు నుపయోగపరుచువారిని కొందరిని, పొగాకు వాడనివారిని కొందరిని పరీక్షింపగా, పొగాకు వాడనివారు పొగాకును వాడెడివారికంటె నూటికి ౧౦ వంతున బరువున, ౨౬ వంతున ఎత్తున, ఛాతీకొలతలో ౨౬ వంతున, శ్వాసకోశముల శక్తిలో ౭౭½ వంతున హెచ్చుగా నున్నటుల కనుగొనబడినది. అమెరికావారికి సాలుకు 3 కోట్ల పౌనుల ముక్కుపొడి, ౧౧౩ కోట్లచుట్టలు కావలెనట! మెడగాస్కరు దేశపురాణి వివాహమునకు బూర్వము తనరాజ్యములో త్రాగుడువల్ల నెట్టిసుంకమును వసూలుచేయనని రాజు వాగ్దానము చేసిననే వివాహమాడెదనని పట్టుపట్టి సాధించినటుల తెలియుచున్నది. త్రాగుబోతుయొక్క కూతురునకు శిశువుకు పాల నిచ్చు యోగ్యతయుండదట.

త్రాగుడువల్ల నెన్ని సంసారములు దుఃఖపడుచున్నవో లోకానుభవము గలవారికి విశదము. విద్యార్థు లగువారు పెక్కండ్రు స్వమతమునందు లక్ష్యము లేక సంచరించుచు, పాఠశాలలందు వారి కేర్పడిన సహవాసదోషముచేత దురభ్యాసములకు బాల్పడి, పిదప నవి కూడదని తెలిసియుండియు నట్టియభ్యాసములకు దాసులై వానిని వదలజాలక తమస్థితికి చింత నొందువారి నెందరినో జూచుచున్నాము. సారాయము మొదలగు మొదటితరగతి పానీయములు గాని, పొగాకుసంబంధమగు రెండవతరగతి దురభ్యాసములుగాని లేనివా రెందరో మూడవతరగతిలో చేరిన మన కాఫీక్లబ్బులకు దాసులగుచున్నారు. వీరికి నిద్రమంచము వదలకపూర్వమే కాఫీ కావలెను. కొన్ని పల్లెలలో రహితులు సమీపపట్టణములకు రైళ్లమీద ఉదయం కాఫీనిమిత్తమే గుట తెనాలి మొదలగుపట్టణముల వారికి తెలిసినసంగతే. స్వల్పజీతగాం డ్రెందరో జీతములనుంచి యింటిఅద్దెతోపాటు కాఫీహోటళ్లకు ఇయ్యగా మిగిలినది పోను శేషించిన సొమ్ముతో జీవయాత్ర జరుపజాలక తంటాలుపడుచున్నారు. కొందరు తేయాకు నీటిని త్రాగి రాత్రులందు నిద్ర పట్టక బాధపడువారిని జూచుచున్నాము. పూర్వము సారాయము మొదలగు మొదటి తరగతి పదార్థములను సేవించువారు చాటుమాటుగ జేయుచుండెడివారు. మన విద్యార్థు లన్ననో, రిఫ్రెషుమెంటు గదులలోను, తెల్లవారికై జరుగువిందులలోను బహిరంగముగ త్రాగుచున్న సంగతి మనము కన్నులారా చూచుచున్నాముగదా. అటులనే పొగాకు నుపయోగించువారు చాటుమాటుగ చుట్ట గాల్చుచు పదిమందిలో నట్టిపని చేయకుండుట జూచియుంటిమి. మన విద్యార్థు లన్ననో, నోట సిగరెట్టు బహిరంగముగ వీథులవెంట నడుచునప్పుడు, మోటారులందు, రైళ్లప్రయాణములలోను, క్లబ్బులందు విరివిగా నుపయోగించుట నిప్పుడు గనుచున్నాము. ఇదివరకు కాఫీ, తేయాకునీరు మొదలగు మూడవ తరగతి వానిని ఏహోటలులోనో త్రాగెడువారు తమ ఇండ్లలోనే కార్ఖానా లేర్పరిచి, కాఫీపొడిని ప్రత్యేకించి చెన్నపట్టణంనుంచి రప్పించి, యింట నుండు నాబాలగోపాలమునకు కాఫీ నందజేయుచున్నారు. అతిథిఅభ్యాగతులకు పూర్వకాలమున నిచ్చుచుండిన పాయసాన్నములకు బదులు నవీనకాలమున కాఫీత్రాగుడు నేర్పరుచుటయే ప్రధానముగా నెన్నబడుచున్నది. ఇప్పుడు పై మూడు తరగతుల వ్యసనములనుగురించి విపులముగా చర్చించుటయొక్క ముఖ్యోద్దేశ మీవ్యాసము చదివెడివారిలో కొందరు నన్ను దూషించినను కొందరైనను సరియైన స్థితిగతులను తెలిసికొని తమ అభ్యాసములను విమర్శనచేయ గలుగుదు రను దృఢవిశ్వాస మని విన్నవించుచున్నాను.

# కపోతదాంపత్యము

శ్రీ శేషాద్రి రమణకవులు

చంచువులలోన ధాన్యంబు సంతరించి
పోవఁగా నుండె నొక్క కపోతయుగళి
గూఁటిలో నుండి వాపోవు కూనపులుఁగు
లింత కేమౌనో యను చింత యెదఁ గలంప.

౨

అది మనోహర సాంధ్యరాగాభిరామ
చంద్రికా వేష్టితంబు నిశాముఖంబు
సగము సమలిన మృదుకుశాంచలము జాఱఁ
దెరువునల్గెలఁకుల నిండె ధేనుపంక్తి.

౩

పసరుకాయఁ తొట్టియపై వసించి
తీగచేరుల బిగఁబట్టి తెఱవతోడ
నొకపతంగక ముయ్యాల లూఁగుచుండె
నెంత యానందకరమొ సాయంతనంబు.

౪

తఱుముకొని వచ్చు మృగయుని తలఁపఁబోక
బాలహరిణంబునకుఁ జేపుపాలొసంగ
హరిణిఁ జేరఁగ నుండెఁ గుంజాంతరంబు
కడుపుతీపున్నఁ దోఁచునే కష్టవితతి.

౫

తల్లిదండ్రులు వచ్చెడి తరుణ మయ్యె
బాలులుగ నిల్లుఁ జేరెడిఁ బతగవితతి
అనుచు మెడ సాచి బాలవిహంగయుగళ
మరయుచుండె సమీపవృక్షాంతరంబు.

౬

గూఁటిలో నుండి కలకల కూనపులుఁగు
లఱచుటలు చెవి పండువు లగుటఁ జేసి
పూలతీవియపైని గపోతయుగము
వ్రాలెఁ జిఱుపుల్గు లఱచె నవారితముగ.

౭

మృదుతరావ్యక్తరవమున మెల్ల మెల్లఁ
గూనపులుఁగులు గొనగొన కూయుచుండె
ముగ్ధమై వినుచుండెఁ గపోతయుగము
పరవశోన్మాదసంతానభావగీతి.

౮

కదల మెదలక యొండొరుఁ గలసి మెలసి
బొమ్మలట్టుల నున్న కపోతయుగము
నెలమి గుఱి చేసి వేటకాఁ డలుఁగు వైచెఁ
గలకలాక్రందనంబున నిలకు వ్రాల.

౯

మొగము మొగమునఁ జేరిచి మోకరించి
యొఱ నొసంగెడి తలిదండ్రు లిలకు వ్రాలెఁ
బులుఁగు కూనలు విస్మయంబున మునింగి
తల్లిదండ్రులతోఁ బాటు ధరణిఁ బడియె.

౧౦

అలుఁగు నెమ్మేన నాటిన సంగకములు
రక్తసిక్తంబు లగుచున్నఁ, బ్రాణ మేఁగు
చున్నఁ, బులుఁగులు కూనల కొసఁగె నెఱను
గర్భమోహంబు ఖండింపఁగాఁ దరంబె.

౧౧

చిరతర వియోగదుర్వ్యథాశీర్ణ మైన
భావములతోడ నానందపరవశతను
నధికతరమైన సంతోష మనుభవించు
పతగముల కంత్యకాలంబు ప్రాప్త మయ్యె.

౧౨

అంత నులుకుచు వేఁటకాఁ డరుగుదెంచి
పొదివి పట్టెను నాల్గుకపోతములను
కఠినకరతలఘట్టనక్రకచహతిని
దొలఁగె నుసురులు పక్షిచతుష్కమునకు.

౧౩

బుద్ధగీతలఁ జదివిన భూతహితుఁడు
పతగహృదయం బెఱింగిన భావసుకవి
బాటసారి యొకం డీయవస్థఁ జూచి
నిలువు నీరయి ప్రమాన్పడె నీరవమున.

౧౪

ఇదియ సంక్రాంతికాన్కగా నిచ్చువాఁడఁ
బులుఁగుల నటంచు వ్యాధుండు పోవుచుండె
అయ్యయో గువ్వలను వీడు మయ్య యంచుఁ
బథికుఁ డఱచిన వినకేఁగె వ్యాధుఁ డెటకొ.

౧౫

గర్భమోహంబుచే నెఱ కఱచి తెచ్చి
కూనల కొసంగుతఱి విధి కూల్చి పైచెఁ
బడుచుగువ్వలఁ; బ్రేమమే పరిణమించె
ఖగయుగంబున కకట యకాలమృతిగ.

౧౬

తల్లి గర్భంబు వెలువడుతఱిని దక్క
కూడిక తొలంగ కున్న యాగువ్వపుల్గు
లిహము చాలించి పరలోక మేలఁ బోవు
తఱి నయిన జంట విడమి యచ్చెరువు గూర్చె.

---

## ద్వంద్వసంబంధము

శ్రీ విక్రమదేవవర్మగారు

అహి శిరంబున మణికడ నమరు విషము
ధనము గలచోటనే వివాదంబు దనరు
దివియదిగువనె చీఁకటి గవిసి యుండు
పగలునకు నంటియే రేయి పరఁగు చుండు
ఇహసుఖంబుతుదినె దుఃఖ మెసఁగు నెపుడు
భోగమునకుఁ దర్వాతనే రోగ ముండు
యౌవనానంతరమె జర యలవడెడిని
జననసహితంబ మరణంబు జంతుతతికి.

---






# కాంచీపుర కైలాసనాథాలయము

క. రామమోహనశాస్త్రిగారు

పాషాణ నిర్మిత దేవాలయములు, లోహ, శిలామూర్తులు కాల గర్భమున లీనమై పోవుచున్నతరి సున్నిత వర్ణాలేఖ్యము లొక లెక్కయా?

భాగ్, ఎల్లోరా గుహాలయందువలె దక్షిణమున కంచి (చెంగల్పట్టుజిల్లా) యందలి కైలాసనాథాలయమున ఈ మధ్య కనుగొనబడిన చిత్తరువులు పాళ్లు నశించిపోయి, అక్కడక్కడ ఒకచో పద్మహస్తము, ఇంకొకచో నొక యిందీవరాక్షిదృగంచలములు, మరియొకచోట డమరుమధ్య యొకరాణి పరిచారికలతోను, సేవకులతో నున్నట్లును, మొదలగునవి చిన్నచిన్నముక్కలుమాత్రము మిగిలియున్నవి. ఇటులనే మరి ఎన్నిచోట్ల ఇట్లు చిత్రింపబడి యీమాత్రము చిన్నముక్కలు అయినను మిగులక పూర్తిగా రాలిపోయిన శూన్యకుడ్యములు ఈనాడు గలవో ఏరికి తెలియును?

కాంచీపురమున కొక సుముహూర్తమున ప్రొఫెసరు దుబ్రొయిల్ అను ఫ్రెంచి కళావిదుడు కైలాసనాథాలయమున విశ్రమించుతరి అచ్చట గోడలమీదనున్న సున్నపుపూతలయడుగున చిత్రము లున్నవేమో అని, తన వెనుకటి 'సిత్తన్నవాసలు' గుహాల యనుభవము మీద, చేత తట్టగా సున్నపుబెత్తికలూడిపడ, అడుగున ఈ ప్రాచీన చిత్రముల ముక్కలు కనుపించెను. ఇవి అన్నివిధముల అజంతాచిత్తరువుల పోలియున్నవి. మరియు అజంతాయందలి అత్యుత్తమ ఆలేఖ్యములతో సరితూగుచు, ఆసిద్ధహస్తుడే యిచ్చటను చిత్రరచన గావించెనా అని అనిపించుచున్నవి.

అజంతాయందు అచ్చటచ్చట ముక్కలూడి పడిపోవుటచే పూర్తిచిత్తరవు పూర్వమెట్లుండెడిదో భావపథమున నూహించ వీలగుచున్నది. ఇచ్చటనో పూర్తిగ అంతయుపోయి యొక్కొకగోడమీద నొక్కముక్కమాత్రముచొప్పున మిగిలియుంట, అది ఏకథాభిధానసందర్భమో ఏమాత్రము తెలియుట లేదు. వర్ణములుకూడ అజంతాయంతమాత్రముకూడ లేక తెల్లపారియున్నవి. అక్కడ

రంగులు నల్లబారినవి; యిచ్చట రంగు రాలిపోవుచు క్రింద (Matt Color) అందగుండా కనిపించుచున్నవి. కాని ఆయసమాన రేఖాలాలిత్యము అద్భుతము గొల్పెడిని.

కంచి అని పిలువబడు కాంచీపురము మద్రాసునకు ౪౨ మైళ్లదూరమున నున్నది. ౭ వ శతాబ్దమున పల్లవులు దక్షిణదేశమంతయు పాలించుచున్నతరి కాంచీపురము వారల రాజధానిగ నుండెడిది. ఇచ్చట ననేక గోపురములు కలవు. అందులో ౬ ముఖ్యములు; కామాక్షీయమ్మదేవళము, వరదరాజస్వామి (హిందూసంప్రదాయము), కైలాసనాథ, వైకుంఠపెరుమాళ్లు మొదలగునవి. నరసింహవర్మమునిమను డగు రాజసింహుని కుమారులు ఈ దేవాలయముల నిర్మించినటు లొక శిలాశాసనముబట్టి తెలియుచున్నది. ముక్తేశ్వరదేవళము, క్రీ.శ. ౭౦,౦౦౭౫ A. D. నడుమ నిర్మితమై యుండవచ్చును. కైలాసనాధాలయము కట్టడము చిన్న పరిమాణమున ఎల్లోరాయందలి కైలాసనాథాలయమును పోలియున్నది. కాని అది కొండ దొలిచి నిర్మింపబడెను. ఇది రాళ్లచే కట్టబడెను. దక్షిణదేశమందలి యీగాలిగోపురములమధ్య ఇటువంటికట్టడ ముండునని సాధారణముగ తోచక పోవుట సహజము.

కంచి చేరుమునుపు ౩౪ మైళ్లుండగనే గోపురములు ఆకాశపథము నంటి యొకటి తర్వాత నింకొకటి కనిపించుచు, ఇది గోపురములకు ప్రసిద్ధిగన్న దక్షిణదేశమందలి ముఖ్యయాత్రాస్థానమని మనస్సునకు వచ్చును. ఈ మధ్య "హావెలు"పండితుడు Himalayas in Indian 'Art' అను తనపుస్తకమున ఎల్లోరా కైలాసగుహాయొక్క వెలుపలి ఆకారము అత్యుత్తమ హిమాలయశిఖరమగు కైలాసపర్వతసంస్తులపోలియున్నదని నిర్ధారణచేసెను. అది ఎంతయు సమంజసము. కాంచీపుర కైలాసనాధాలయమును చూడగనే మాకు ఎల్లోరాగుహ జ్ఞాపకమువచ్చెను. మరియు అనేకములగు ఊహాలకు ఇది తావిచ్చుచున్నదికూడను.

గుడి ప్రాకారము చుట్టునను సుమారు ౪౦ (Niches) గూడులు కలవు. అందొక మనిషి కూర్చుండుటకు మాత్రము సరిపోవును. బయటికి కూర్చున్నమనిషి కనిపించడు కాని లోపలకు వెలుతురు వచ్చునటుల ఇవి నిర్మింపబడెను. ఈ చిత్తరువులు నాలుగు గూడుల (Niches) యందు నాలుగు ముక్కలు కనిపించుచున్నవి. గర్భగుడియందొక చీకటి గదియందు అయిదు చక్కని రాతివిగ్రహములు గలవు. బహుశః అవి యీ దేవళము కట్టించిన భక్తుల రూపప్రతిమలయి యుండనోపు. ఎల్లోరాకువలెనే దేవాలయము బైట మకరతోరణములు ఇంపుగొల్పుచున్నవి. కాని ఎల్లోరాయందలివి మిక్కిలి ప్రశస్తములు అని మాఅభిప్రాయము. ఇందుతో ప్రచురించబడిన చిత్తరువులు అసలువాటినుంచి చూచి వ్రాయబడినవి.

---

# కాంచీపుర కైలాసనాథాలయము-చిత్రములు



౧. కైలాసనాథాలయము, కాంచీపురము

సంపాదకుడు యండమూరి సత్యనారాయణరావుగారు

చందమామా ;

ఒక్కా సింహాచలము
అంగళ్ళలోను
లచ్చిమికి గట్టించు
లక్కటివ్వారో చందమామా.

లక్కటివ్వారిలో
పట్టిమంచాలో చందమామా.

సింహాద్రిచీరెలు
ఆపఱుపుపైనో చందమామా.

మాదుగులు మడతాలు
ఆపరుపుపైనో చందమామా.

ఒల్లే లొత్తకుండ
మల్లేలుపోసో చందమామా.

నాలూగుకోళ్ల కాడ
దివనాటకాలో చందమామా.

పచ్చిచి పోకాలు
పంచూటాకూలో చందమామా.

లచ్చిమి అప్పాపు
పఱుపెక్కినారో చందమామా.

సున్నాన్ని ఒకజాము
జూజా మాడేరో చందమామా.

ఆకుల్ని ఒకజాము
అందాడినారో చందమామా.

లచ్చిమి అప్పాడు
పంచూకున్నారో చందమామా.

* * * *

వృత్తాలు పత్తూలూ
వియ్యాముందేల్లో చందమామా.

పసిబిడ్డతల్లూలో
పాలివ్వనేల్లో చందమామా

లచ్చిమిఁదురించి
అప్పాడెల్లంగో చందమామా.

మంచాలకాడాది
కుంచాలముంతో చందమామా.

కుంచాలముంతాతో
ఉదకామిచ్చుకూనో చందమామా.

వెళ్లేను అప్పాడు
వేశ్యావాడలకో చందమామా.

సాగేను అప్పాడు
సానివాడలకో చందమామా.

* * * *

"మూలాని ఉన్నావు
ముత్యాలరాశో చందమామా.

రాశీ నువ్వొఱుగుదువా
"రాజెల్లిడామో?" చందమామా.

ఎఱగాము లచ్చీమి!
మే మెఱుగమమ్మో చందమామా.

ఎఱుగుంటే అప్పడ్ని
యేలా పోనిస్తో చందమామా.

చూసుంటే అప్పడ్ని
చుట్టాఱుకోమా" చందమామా.

"పంచానియున్నావు
వగడాలరాశో చందమామా.

రాశీ నువ్వెఱుగావా
రాజూ వెళ్లాడమ్మో" చందమామా.

"యెఱుగము లచ్చీమి
మే మెఱుగమమ్మో చందమామా.

యెఱుగుంటే అప్పడ్ని
యేలా పోనిస్తో చందమామా.

చూచుంటే అప్పడ్ని
చుట్టాఱుకోమా" చందమామా.

"పదిమంది దాటేటీ
దేవిల్లీ గడపో! చందమామా.

గౌరీ నువ్వెఱుగావా
అప్పాడెల్లాటమో?" చందమామా.

"యెఱగాము లచ్చీమి
మే మెఱగమమ్మో చందమామా.

యెఱుగుంటే అప్పడ్ని
యేలా పోనిస్తో చందమామా.

చూచుంటే అప్పడ్ని
చుట్టాఱుకోమా" చందమామా.

"దొడ్డిలో నున్నావు
ఓమల్లిమానా! చందమామా.

మానూ నువ్వెఱుగావా
అప్పడెల్లాడమో" చందమామా.

"యెఱుగుదుము లచ్చీమి
మే మెఱుగుదుమమ్మో చందమామా.

మామల్లి పువ్వులన్ని
సిగజుట్టుకోనో చందమామా.

మాసానగందాలు
పై జల్లుకోనో చందమామా.

మంచాలకాడాది
కుంచాలముంతో చందమామా.

కుంచాల ముంతాతో
ఉదకాముచ్చుకునో చందమామా.

వెళ్లేను అప్పాడు
వెశ్యావాడాలకో చందమామా.

సాగేను అప్పాడు
సానివాడాలకో." చందమామా.

* * * *

పట్టూచీరెలు విప్పి
పాంచీరెలు గట్టి చందమామా.

పట్టురవికా దీసి
పాతరవికా దొడిగో చందమామా.
నొష్టకుంకుమ దీసి
బరిణానిబోసో చందమామా.
కళ్లా కాటుక దీసి
కరటాన్ని బోసో చందమామా.
కుక్కీమంచము మీాదా
కూలాబడ్డాదో చందమామా.
తలుపు దగ్గఱ వేసి
తా బండుకుందో చందమామా.

*    *    *    *

"తలుపూ దియ్య లచ్చిమి
తలుపు దీయగందే" చందమామా.
"సీతలుపు సానోరు
సుబ్బీ తియ్యాదా?" చందమామా.
"సుబ్బీవాడల నేను
వెళ్లాలేదులచ్చో చందమామా.
యేలూరూ నుంచి
యెడ్లమ్మ వచ్చో చందమామా.
యెడ్లూ నే బేరాలూ
చెయ్యొల్లినానో చందమామా.
తలుపూ దియి లచ్చిమి
తలుపూ దీయగందే" చందమామా.
"సీతలుపు సానోరు
సుబ్బీ తియ్యాదా?" చందమామా.
"సుబ్బీవాడల నేను
వెళ్లాలేదు లచ్చో చందమామా.
పెద్దాపురంనుంచి
పెట్టమ్మవచ్చో చందమామా.
పెట్లూ నే బేరాలు
చెయ్యొల్లినానో చందమామా.
తలుపూ దియి లచ్చిమి
తలుపూ తీయగందే" చందమామా.

*    *    *    *

# రౌండ్ టేబిల్ రెండవ సమావేశము — హిందూ మహమ్మదీయ సమస్య

శంకర వేంకటరావుగారు.

గత సంవత్సరములో మనభారతదేశ రాజకీయ పరిస్థితులు బహు విషమస్థితిందాల్చి యిప్పుడిప్పుడు గాంధి యిర్విన్ల యొడంబడికతో స్థిమితపడుచున్నవి. ప్రస్తుతము కానున్న రెండవ రౌండ్ టేబిల్ సమావేశమున శాశ్వత సమాధానావకాశమున్నట్లు గూడ గన్పట్టుచున్నది. కాని హిందూమహమ్మదీయసమస్య నిర్ణయముగానంతవఱకు, రౌండ్ టేబిల్ సమావేశము, ఇండియాలో గాని, యింగ్లాండులో గాని కూడుట యనవసరమనియు, కూడినను నిష్ప్రయోజనమనియు నంద రూహించుచున్నారు. అందుచేతనే నేడు హిందూమహమ్మదీయ సమస్యానుకూల పరిష్కార మత్యంత ప్రాముఖ్యస్థానము నాక్రమించుచున్నది.

భారతీయులయందరి యాశయము లును దేశమునకు నూతనోన్నతస్థానము సంపాదించుటకేకాన నెన్నికష్టములనైనను నోర్చి తక్షణమే మనమీ సమస్య పరిష్కరించుకొనవలసిన యావశ్యకత కన్పించుచున్నది. హిందూమహమ్మదీయ సంయోగము కుదిరిన గాని స్వరాజ్యసంవిధానమునకయి పాటుపడుటవలన విశేషపు ప్రయోజనము లేదను సంగతి యందరకును దెలిసిన విషయమే.

ఈ సమస్య పరిష్కరించుట యందు, హిందూ మహమ్మదీయుల మత భేదములను దలంపక యవసరమగుచో గాంధిమహాత్ముడు నుడివినటుల హిందువులు, మహమ్మదీయులేక గ్రీవముగ గోరినదానినంతయు నిరాతంకముగ నవర్పించుటకు గూడ సంసిద్ధులయి యుండి పనిచేసినగాని పరిస్థితులు చక్కబడవు. ఇట్టివిషయమున నుభయపక్షముల వారును కక్షలు వహింపక, విశాల హృదయులును, యెంత త్యాగమునకైనను సిద్ధమయి యుండవలెను. కాన్పూరు, ఆగ్రా మున్నగుచోట్ల జరిగిన పోరాటములకు ఏ సంఘమువారు బాధ్యులని దీర్ఘచర్చలు గావింపక యయిన దేదోయయినదని, వానిని పూర్తిగామఱచి, పరస్పర సద్భావమును గుదుర్చుకొననిచో మనకీ సమస్య దుర్భేద్యమగును.

సాంఘికవిభేదములు దొలగించి హిందూమహమ్మదీయ సమస్యను జేపట్టుట కెట్టిమార్గ మనలంబించుట యనుప్రశ్న మనమిప్పుడు విచారింపవలసి యున్నది. కాంగ్రెసుమహాసభ వారు, వారికోర్కెల నన్నిటిని బాగుగ విచారించి, ప్రధానసూత్రముల నిర్ణయించి తీర్మానముల గావించిరి. అందుచే గాంధిమహాత్ము

పోక్కడే రౌండ్ టేబిల్ సభకు ప్రతినిధిగా బోవుచున్నను, నేకగ్రీవముగ దేశమంతయు కాంగ్రెసుద్వారాన నంగీకరించిన భారత దేశ వాంఛలను స్పష్టముగ బ్రిటిషువారికి దెలియ బరచి, వానిని వారామోదించునట్లు జేయు టకు వీలు గలిగినది. అట్లే మహమ్మదీయు లందుగల సర్వపక్షములవారును నొకచోగూడి సంప్రదించి వారివారి వాంఛలనుగూడ నిశ్చ యముగా నిర్ణయించుకొనవలసి యున్నది. కానివారిలో వారికే పొందక, యూరక కాల యాపనము చేయుటవలన లాభము లేదు. భారతదేశమునందు గల యావన్మంది మహ మ్మదీయుల కనుకూలమగువారి యాశయము లను దెలిసికొనుట రౌండ్ టేబిల్ సమావేశ మునకుముందు ముఖ్యావసరము. ఏకాభిప్రా యము దెలుపనిచో నెన్నటికిని హిందూ మహమ్మదీయసమస్య గుదురని సమస్యయే యనిపించుకొనును.

కాన నన్నిపక్షముల మహమ్మదీయులును వారివారి ప్రతినిధుల నందరను సమకూర్చి యొకచోట త్వరలో నొకసభ యేర్పాటు చేయుటయును, అందు నేకగ్రీవముగా మహ మ్మదీయ వాంఛలవిషయము తీర్మానముల గావించుటయును, వానిని వీరువారనక నన్ని పక్షములవారు నొప్పుకొనక తప్పనట్లును, ఏర్పాటు చేసుకొనుట యావశ్యకమని తోచు చున్నది. ఈ సభాసమయమున మహాత్ము డును, తదితర వివిధపక్షనాయకులును నుం డుటగూడ నవసరము. వీరుండుటంబట్టి, సభా సమయమందు గావించు తీర్మానములలో హిం దువుల కవసరమగు మార్పులనుజేయు విష యముగూడ విచారించుట కవకాశముండును. తరువాత, మహాత్మునివలె, అఖిలభారత మహ మ్మదీయుల పక్షమున నవసరమునుబట్టి యొక ప్రతినిధిగాని, కొందరు ప్రతినిధులుగాని రౌండ్ టేబిల్ సమావేశమునకు బోయి మహమ్మదీ యుల పరతులను నిష్కర్షగా చెప్పి వాదిం చుట కవకాశముండును. హిందువులుగూడ దానికి మారాడుటకు వీలుండదు. అట్లుచేయు టచే బ్రిటిషువారి సహాయములేకుండ మనలో మనము సాంఘికవిభేదక్లిష్ట సమస్య పరిష్క రించుకొనుటకు ననువుపడును. ఈసభయందు నే సమష్టి నియోజకవర్గము (Joint Electorates) లవసరమో, వేర్వేరు నియోజక వర్గము (Seperate Electorates) లవసరమో యనునది గూడ నిశ్చయింపవచ్చును. భారతదేశ స్వాతం త్ర్యమునకై పాటుపడుచున్నవా రందరకు నీ మార్గము కడుంగడు సముచితముగ నుండక తీరదని నొక్కి చెప్పవచ్చును. సమయము బో గొట్టుకొనక ప్రపంచమంతకును భారతదేశ మందుగల హిందూమహమ్మదీయ జనసంఘ మంతయు స్వరాజ్య సంపాదనమందు నేకీభ వించి యున్నదని ఋజువు చేయవలసి యు న్నది.

అంతేకాని కొందరు ప్రస్తుత మనుకొను చున్నట్లు, మహాత్ముడు లండనునగరమునకు బోయి, యచ్చటిపరిస్థితులలో, జిన్నా, షెక్డొ నాల్డు, మొదలగువారి సహాయమున రౌండ్

టేబిల్ సభయందే సాంఘికసమస్య సంప్రదింప వీలుండుననని, ప్రస్తుత మేమియుజేయక యూరకుండుట కడు శోచనీయము. మన దేశమందు కుదురని సమస్య యింగ్లాండునందు గుదురునా! మనలో మనమిట్టిసమస్యను సాధించుకొనలేక యితరుల పరిష్కరించుమనుట హాస్యాస్పదము కాదా! మనలోమనమే సంప్రదించుకొని మనకు గావలసిన ప్రధానాంశముల నేకగ్రీవముగ వీరువారనక సన్నిపక్షములవారు రౌండ్ టేబిల్ సభయందు గోరినచో బ్రిటిషువా రేమనగలరు? కాబట్టి మీద సూచించిన చొప్పున ముందుగా భారతదేశమందే యన్నిపక్షముల మహమ్మదీయ సంఘ ప్రతినిధులును, హిందూ సంఘప్రతినిధులును తమలోతాము చర్చించుకొని, యేకగ్రీవముగ నిశ్చితాభిప్రాయము తెల్పినపిమ్మట రౌండ్ టేబిల్ సభకు బోయి పనిచేయుట సమంజసమని తోచుచున్నది.

---

# సెలయేటి గీతి

కె. అన్నమరాజశర్మగారు

౧

వేల్పుసానులు పరమార్థ విస్తృతముగ
కిన్నరల మేళవించెడు గీతమటుల
భౌతికోన్మాద కలుషప్రపంచమునకు
ఏమి సందేశ మొసఁగెదో యెఱుఁగను సెల.

౨

జంగమస్థావరాత్మక జగతి రాత్రి
పగటి సుఖదుఃఖచింతలఁ బాసి స్వప్న
డోల హాళిని నూఁగంగ జోలపాట
నించెదే రహస్థ్సలి రామణీయకముగ.

౩

సృష్టిసౌందర్యతత్వమ్ముఁ జింత సేయు
కవివతంసునిరీతి నేకాంతగతిని
భావగోచరమర్మముల్ బయలుపఱచి
స్వీయజీవితకథ వినిపింపఁ దలఁతొ.

౪

ఎదల ద్రవియింపఁజేయు నీ మృదులగీతి
పారతంత్ర్యాంధకారకూపంబునందు
మునిఁగి యార్తిని స్వాతంత్ర్యమును వహింప
రోదనముచేయు ప్రజలఘోష మేమొ.

౫

సంతత వియోగ వేదనాసాగరమున
తతవిషాదోర్మిపంక్తుఁ దాఁకులాడు
ప్రియులు విలపించు గాథ నిర్వేదనంబొ
నిర్ఝరమ నీవు శ్రుతి నించు నిస్వనంబు.

౬

తల్లిదండ్రులఁ బాసి నితాంతదుఃఖ
వేగమున దేహయాత్రపై విసుగుఁ జెంది
పరితపించుచు నావలెం దిరుగులాడు
మందభాగ్యుని గానంబు మాడ్కిఁ దోఁచు.

---

# ద్రావిడవాఙ్మయము: *తిరుపతి వేంకటేశ్వర ప్రశంస

అమరవాది హనుమచ్ఛాస్త్రిగారు, M. A.

"తిరుమల తిరుపతి ఆదిదేవస్థానము"న కాస్థానముసు, కలియుగవైకుంఠము నగు తిరుపతిదివ్యక్షేత్రమునుగుఱించి ద్రావిడవాఙ్మయమునఁ గొంత ప్రసక్తి గానుపించుచున్నది. విచారించుట కారంభించినచో, నియ్యది నవీనవాఙ్మయమునందే కాక, ప్రాచీనవాఙ్మయమునందుఁగూడ సల్పఁబడినట్లు విశదమగుచున్నది. ద్రావిడవాఙ్మయకర్తలు వేంకటాచలమును (తిరుమల పర్వతమును) 'వేంగడం' లేక 'తిరువేంగడం' అనియు, తదధిష్ఠానదైవమగు శ్రీ వేంకటేశ్వరస్వామివారిని 'వేంగడత్తాన్' లేక 'తిరువేంగడత్తాన్' అనియు వ్యవహరించియున్నారు. కేవల మొక్క తిరుపతిపర్వతాళి నభివర్ణించుటయే కాక, యీరచయితలు, స్వామివారిని గుఱించికూడ బాగుగ గానము చేసియున్నారు. దీనికిఁదోడు, దక్షిణదేశముయొక్క స్థానవర్ణనము (Topography of Deccan) సలుపు సందర్భమునఁగూడ, వేంకటాచలము కలుమాఱును, పేర్కొనఁబడియున్నది. ఈతిరుపతిక్షేత్రమును, ఆర్య ద్రావిడనాగరకశలయొక్క సంగమస్థానముగాఁ గొందఱు ద్రవిడగ్రంథకర్తలు నిరూపించియున్నారు. ఏవిధమయిన యీతిరుపతిప్రశంస ద్రావిడవాఙ్మయమున నెప్పుడు పుట్టినదో, యెట్లభివృద్ధి నొందినదో విచారించుటయే ప్రకృతోద్దేశము.

## వాఙ్మయారంభ కాలము

ద్రావిడవాఙ్మయములో మొట్టమొదటిదని చెప్పఁబడు గ్రంథమునకు "తొల్కాప్పియం" అని వ్యవహారము. కావ్యపదమునకు వికృతి 'కప్పియం' అయినది. కనుక, 'తొల్కాప్పియం' అనఁగా, ఆదికావ్యమని అర్థము. ఈగ్రంథరచనాకాలము మహాప్రాచీనుఁడైన పాణిన్యాచార్యులవారికంటెఁగూడ, పూర్వమని తమిళవాఙ్మయవిమర్శకులభిప్రాయపడుచున్నారు. ఇట్టి యీగ్రంథరాజములో, ద్రావిడదేశముయొక్క యెల్లలగుఱించి యిట్లు తెలుపఁబడియున్నది:

"వడ వేంగడం తెన్కుమరి ఆయిడై తమిళ్ కూఱు నల్లులహం" (ఉత్తరమున 'వేంగడ' (తిరుపతియేడుకొండలు) మొదలుకొని, దక్షిణమున కన్యాకుమారి అగ్రము వఱకు మధ్య నున్న దేశము తమిళభాష మాటాడుదేశము అని దీనిభావము.)

దీనిఁబట్టి ద్రావిడవాఙ్మయములో, తిరుపతిప్రశంస చాల ప్రాక్కాలికమయినదనియే తేలుచున్నది.

## సంగకాలము

ఇఁక విచారింపఁబడఁగినది సంగకాలము; లేక 'శంగ' యుగము. ఆకాలమున రచింపఁబడిన గ్రంథములలో సుప్రసిద్ధములైనవి "పత్తొప్పాట్టు," "పురనానూరు", "శిలప్పదికారం" "మణిమేఖలై" మున్నగునవి. వీనిలో, "శిలప్పదికారం"అను కావ్యమునందు వేంకటాచలప్రశంస కొంత గానవచ్చుచున్నది. ఈ గ్రంథము క్రీస్తుశకము ద్వితీయశతాబ్దిలో రచింపఁబడినదని తలఁపఁబడుచుండెడిది గాని, యిటీవల, కొందఱు సుప్రసిద్ధద్రవిడకావ్యవిమర్శకులచే, అష్టమశతాబ్దినాఁటిదని సప్రమాణముగ నిరూపింపఁబడియున్నది. రచనాకాల మెప్పుడైనను,

* ఈ వ్యాసము రచించుటలో, మాయూరులలో నుపాధ్యాయులును, మంచి ద్రవిడభాషాజ్ఞానము కలవారునైన శ్రీయుత S. శ్రీనివాసయ్యంగారి తోడ్పాటు ఘనమైనది. మఱువరానిది. ముఖ్యమైన ద్రావిడపాశురముల కర్థము విప్పి చెప్పి నాకుఁ జాల సాయ మొనర్చిరి.

ఈకృతి యందు, తిరుపతి కొండలు "నెడియోన్ కున్రం" (మహావిష్ణువుయొక్క పర్వతము) అని పేర్కొనఁబడి యున్నవి. ఈ తిరుపతి దివ్యక్షేత్రమందలి స్వామివారిని గూర్చి, యిట్లభివర్ణింపఁబడి యున్నది.

"ఇరుపంకల, కూలంకషములై ప్రవహించు నిర్ఝరు లొకవింతయందము గూర్చుచుండ, సూర్యచంద్రుల కిరణజాలము లీకొండ నంతయు సువర్ణకాంతులంగు ముంచి వైచుచున్నవి. ఇట్టి యీతిరుమలపై, పద్మాక్షుఁడగు శ్రీమన్నారాయణుఁడు నిలువఁబడియున్నాఁడు. కటిపై కనకాంబర మొప్పుచుండ; వక్షస్థలంబున మనోజ్ఞమైన వనమాల వ్రేలాడుచుండ; కరారవిందములయందమోఘమైన చక్రమును, ధవళమైన (పాంచజన్యము) శంఖమును మెఱయుచుండ, విద్యుదింద్రధనుర్గర్భితమైన నీలతోయదముభంగి ఒప్పారుచున్నాఁడు." ఇదేగ్రంథమున మఱియొకచోట, శ్రీరంగము, తిరుపతి, 'తిరుమాళ్ కుంద్రం' అను నీదివ్యస్థలత్రయము ప్రశంసింపఁబడియున్నది. ఈ మూఁడింటిలోఁగూడ, తిరుపతియే యధికముగఁ బ్రస్తావింపఁబడి యున్నది.

## దివ్యప్రబంధరచనాకాలము

ఇటుపైఁ బరిశీలింపఁదగినది ద్రావిడదివ్యప్రబంధ రచనాకాలము. ఈకాలములోనే ఆళ్వారు లను వైష్ణవభక్తులు తమ "నాలాయిరప్రబంధమును, శైవులగు నాయనారులు తమ "తేవారము"ను విరచించియుండిరి. ఆళ్వారనఁగా దివ్యసూరి అని అర్థము. ఈపదము పన్నిద్దఱు వైష్ణవభక్తుల కొసంగఁబడినది. ఈపండ్రెండుగు రాళ్వారులచే రచితములయిన ద్రావిడదివ్యప్రబంధము లన్నియుఁ గలసి "నాలాయిరప్రబంధ" మను గ్రంథమయినది. ఇందులో 4,000 దివ్యపాశురములు (ఒక్కొక్క దివ్యప్రబంధమున కొకపాశుర మని ద్రవిడభాషావ్యవహారము కనుక సూక్తమునకు సమాన మయిన దనవచ్చును) కలవు. వీనియన్నిటిలోను శ్రీమన్నారాయణుని దశావతారములు మొదలగు మహిమాతిరేక విషయముల గుఱించి గానము చేయఁబడియున్నది.

ఇట్టి యీ ద్వాదశాళ్వారులలో "మధురకవి", "తొండరడిప్పొడి" అను ఆళ్వారు ద్వయము మాత్రమే తిరుపతినిఁగూర్చి యేమియుఁ బ్రస్తావించి యుండలేదు. తక్కుంగల పదిమందియుఁ గొలఁదిగనో, గొప్పగనో తిరుపతిక్షేత్రమును గీర్తించియే యున్నారు.

ఈపదిమందిలో మొదటివాఁడుగఁ బరిగణింపఁబడినవాఁడు పొయ్‌గై యాళ్వారు. పొయ్‌గై యాళ్వారు, పూదత్తాళ్వారు, పేయాళ్వారు అనువీరు మువ్వురు సమకాలికు లనియు, తిరుపతికి దక్షిణభాగమునం దున్న తొండమండలము వీరిజన్మభూమి యనియును దెలియ వచ్చుచున్నది. ఇప్పటి నార్తార్కాటు చెంగల్పట్టు జిల్లాలు కలసినచో, అప్పటితొండమండల మేర్పడుచున్నది. వీరలకాలమునుగూర్చి నిష్కర్షించుటకు వీలు గాకపోయినను, ఏడవశతాబ్దికి సామీప్య మనుట చరిత్రకు విరుద్ధము కాఁజాలదు. వీరిలో నొక్కొక్కరు నూఱేసిచొప్పున ద్రావిడదివ్యప్రబంధముల రచియించి యున్నారు.

పొయ్‌గై యాళ్వారు రచితమయిన ప్రబంధశతకములో నొక తొమ్మిదింటిలో 'వెంగడము'ను గుఱించిన ప్రశంస కలదు. అక్కాలమునఁ బ్రసిద్ధిలోనున్న దివ్యస్థలములలోఁ దిరుపతి యొక్కటి యని యీ వైష్ణవశిఖామణి నుడువుచు నిట్లు సెలవిచ్చియున్నాఁడు:

"సకలదేవతలకుఁగూడ జ్ఞాన మొసగువది వెంగడమే. బ్రాహ్మణపూజ యొనర్చుట ఉత్కృష్టధర్మమని తెలియఁజేసినదికూడ నీపర్వతరాజమే. వేంగడనాథుఁడే చతుర్వేదముల కధినాథుఁడు. సకలచరాచరముల కధిపతి......"

ఇతని సమకాలికుఁడైన పూదత్తాళ్వారు తనపాశురశతకములో నెనిమిదింటినిమాత్రము తిరుపతి ప్రశంస కొఱకు వినియోగించియున్నాఁడు. సర్వకామ్యవస్తువులలోను గామ్యతమ మయిన దీవేంకటాచలమే అనియు, వేంకటాచలపతియే సకలచరాచరాత్మకమగు జగత్తునకెల్ల మూలదైవమనియు నీయన పేర్కొనుచున్నాఁడు.



శ్రీ చేమకూర సత్యనారాయణగారు

(పెన్సిల్ స్కెచ్చినుండి)



పున్నమచంద్రుడు

చిత్రకారుడు : శ్రీ. జి. హనుమంతరావుగారు, చెన్నపురి.

ఈ యాళ్వారుత్రయములోని మూఁడవవాఁడగు పేయాళ్వారు, తిరుపతినిగూర్చి పదునైదు దివ్యపాశురముల రచియించియున్నాఁడు. "తిరుమలై" అను పదము తొలిసారి, యీదివ్యసూరిచేతనే ప్రయుక్తమయి, యీయనకృతము లగు కొన్ని దివ్యపాశురములలోఁ గానఁబడుచున్నది. ఇంకొకవిశేషముగూడ నిచ్చటఁ గలదు. ఈయాళ్వారు, ఒకానొకచోట, తిరువేంగడాధిష్ఠానదేవత శివకేశవరూపమున వెలయుచుండెనని మాకుఁ దెలియఁజేసియున్నాఁడు.

"సొంగి పారలు సెలయేళ్లతో నిండియున్న, యీతిరుమలయందు నేఁ గొల్చుదేవుఁడు హరిహరమూర్తియై యొసఁగుచున్నాఁడు. ఒకవంక విశాలమైన జటాజూటము ధరించి; వేఱొకవంకఁ గిరీటధారియై, ఒకప్రక్కఁ దేజరిల్లుచున్న పరశువును, రెండవప్రక్క దివ్యమైన చక్రమును ధరించి, ఒకపార్శ్వము కుండలీంద్రునిచే నలంకృతమై యుండ, అన్యపార్శ్వము కనకసూత్రాంచితమై యుండ, నేఁ గొల్చుదేవుఁ డొప్పారుచున్నాఁడు."

వెంగడము వైకుంఠముతోను, పాల్కడలితోను సమానమైనమహత్తు గలిగి యున్నదగుటయే కాక, వాని నతిశయించి యున్నదనిగూడ నీవైష్ణవశిరోమణి పలికియున్నాఁడు. "వేంగడత్తాన్" సాక్షాన్నారాయణుఁడే యని యీయన చెప్పియున్నాఁడు.

"పలుసెలయేళ్లతోఁ గూడుకొని యున్న యీ తిరుమలపర్వతముపై నివసించియుండు వేంగడత్తానే సర్వేశ్వరుఁడు. అతఁడే విశ్వమయుఁడు. అష్టదిగంతములు గూడ నతఁడే. వేదములు, వేదరహస్యములుగూడ నాతఁడే. అంచజీహ్వలయందుఁ గూడ నిలిచియున్న పరంధాముఁ డతఁడే." అని యీ భక్తుఁడు గానము చేసియున్నాఁడు.

ఇతని తరువాతివాఁడగు తిరుమలిశై యాళ్వారు వేంకటేశ్వరుని నుతించి, 'తిరుచ్చంద విరుత్తం', "నాన్ముగం తిరువందాది" అను ప్రబంధద్వయములోఁ బ్రస్తుతించియున్నాఁడు.

"సకలదేవతలు భజించున దీవెంగడమునే. రోగపాపాది సకలబంధములనుండి మనల విముక్తుల నొనరించున దీవెంగడమే. చక్రము చేతఁబూని దానవుల సంహరించి దేవతలం గాపాడిన మనదేవదేవునినిలయమైన దీవెంగడమే." అని యీయనచేఁ బై ప్రబంధద్వయములో నొకచోటఁ గీర్తింపఁబడియున్నది.

తిరుప్పాణాళ్వారు ఇఁక విచారింపఁదగినవాఁడు. అంత్యకులమగు పాణాకులములో నుద్భవించినవాఁడయ్యు, కులవర్ణాదిభేదాతీతుఁడైన యీవైష్ణవశిఖామణి తిరుపతిప్రశంస యొనర్చుటలోఁ దనవంతు దాను నెఱవేర్చికొనియున్నాఁడు. ఈయన పదిదివ్యపాశురములలో వేంకటనాథునిఁ గొనియాడియున్నాఁడు. వెంగడము శ్రీరంగము, ఈరెండుమాత్రమే, యీయనచే దివ్యక్షేత్రములుగఁ బరిగణింపఁబడినవి.

"నాలాయిరప్రబంధము"లోని అధికసంఖ్యాకములైనదివ్యప్రబంధముల రచియించినవాఁడును, మంచి విద్యావంతుఁడు నైనదివ్యసూరి తిరుమంగై యాళ్వారు. ఈయనసుమారు 1361 ద్రావిడదివ్యపాశురముల నొనరించియున్నాఁడు. ఇందులోని 63 పాశురములలో వేంకటాచలమాహాత్మ్య మభివర్ణింపఁబడియున్నది. ఈయన రచనాభాగములలో నందివర్మపల్లవమల్లుని యొక్క యుద్ధయాత్రాప్రశంస గనఁబట్టుచున్నది. కావున నీ వైష్ణవపుంగవుఁ డాతనికాలముననే (నందివర్మకాలము క్రీ. శ. 715–765 అని ఫ్లీటుదొరగారిచే నిర్ణయింపఁబడియున్నది) అనఁగా నష్టమశతాబ్దిమధ్యభాగమున జీవించియుండవచ్చునని నిరూపింపఁబడుచున్నది. ఈయైహికబాధలనుండి తన్ను విడిపింపుమని శ్రీ వేంకటేశ్వరుని ప్రార్థించుచు నీక్రిందివిధమున నుడివియున్నాఁడు:

"ఇంతదనుక తల్లి, తండ్రి, భార్య, పిల్లలు, అను ఐహికబంధములలోఁ దగుల్కొని యుంటిని. కుసుమితవాసంతోద్యానములలో శోభిల్లువేంకటాద్రిపై నధివసించు నోస్వామీ! నీదర్శనాపేక్షాతిరేకముచే నిటకు వచ్చితిని. అనుగ్రహించి నాయెడఁ బ్రసన్నుఁడవు గమ్ము."

ఇతనికిఁ దరువాతఁ దెలిసికోఁదగినవాఁడు కులశేఖ రాళ్వారు. కేరళదేశమునందు విలసిల్లినరాజులలో నొకఁడైన యీదివ్యసూరి క్రీ. శ. 780-890 మధ్యకాలమున జీవించియుండు నని ద్రావిడవాఙ్మయవేత్తల యభిప్రాయము. ఇతఁడు మొత్తముమీద 105 దివ్యప్రబంధముల రచించియున్నాఁడు. వానిలోఁ బదునొకండు పాశురములు తిరుపతి దివ్యస్థలమునుగురించి రచింపఁబడినవియై యున్నవి. ఈయాళ్వారు దక్షిణదేశమందలి దివ్యక్షేత్రముల నెల్ల సందర్శించుకొని, ఉత్తరదేశస్థవైష్ణవక్షేత్రములఁ బరికింపఁదలంపుతో యాత్ర వెడలఁగా మార్గమధ్యమున నీతనికి శ్రీ వేంకటేశ్వరుఁడు ప్రత్యక్షమై దర్శన మొసంగె ననియు, నంతతో నుత్తరదేశయాత్రాభిలాషను త్యజియించి శ్రీపదపురము (తిరుపతి) నకుఁ జనుదెంచె ననియు నొకగాథ కలదు. ఇట్లు తిరుపతికి వచ్చి యేడుకొండలు నెక్కి పోయి తిరువెంగడనాథుని దర్శించి ధన్యత నందెనఁట! అత్తఱి నాదేవదేవుని గర్భాలయము శిథిల మయి యుండుటఁ గాంచి దానిని దృఢతరఁబుగ నిర్మింపఁజేసినాఁ డనియు, అప్పటినుండియు నాదేవాలయభాగము "కులశేఖరప్పడి" లేక "కులశేఖరగర్భగృహము" అని పిలువఁబడుచున్న దనియు, అనుశ్రుతముగా నొకకథ తెలియవచ్చుచున్నది. ఈ కులశేఖరాళువారు శ్రీ వేంకటరమణుని మనసార స్తుతించి, యంతతోఁ దనివి నెందక ఆపరమాత్ముని నిలయమగు వెంగడమును (తిరుమల) గూర్చిగూడ నభివర్ణించి యున్నాఁడు. రసవంతమయిన యొకపాశురములో నీదివ్యసూరి తిరుమలయందుఁగల పశుపక్షిమీనవృక్షలతాదికములఁ బేర్కొని, అచ్చట జన్మ మందఁగలిగినందులకు వానిభాగ్యంబు గొనియాడి, తనకుఁగూడ, తిరువెంగడమున నట్టిపుట్టువు లభించుప్రాప్తికై ప్రార్థన లొనరించెను. ఒకచోట, కులశేఖరసూరి యిట్లనుచున్నాఁడు:

"నాపాపము లన్నియుఁ బోఁగొట్టఁజాలిన తిరువేంగడముపై నధివసించిన ఓజగన్నాథా, వేంకటనాథా! అనుదినము నీసేవకై చేరుచుండు దేవతలు, గంధర్వాంగనలు మున్నగువారిచే నిబిడీకృత మగుచున్న నీయాలయమందలి ఒకసోపానముగా నుంటయైనను నాకుఁజాలునే. అట్టు లుండినచో నీదివ్యమైన ప్రవాళోష్ఠములఁ దిలకించుభాగ్యము నా కబ్బుఁగదా!"

పెరియాళ్వారు తమిళనాడునకు దక్షిణపుఁగొననున్న శ్రీవిల్లిపుత్తూరువాసి. ఈయన 473 దివ్యప్రబంధములలోఁ బదునాలు వైష్ణవక్షేత్రములఁ బొగడియున్నాఁడు. ఇందులో వేంగడ మొకటి. ఈయన కాలము సరిగాఁ దెలియకపోయినను రచనాపద్ధతిం బట్టియు, సంస్కృతపద ప్రయోగబాహుళ్యమును బట్టియు చాల నర్వాచీనుఁ డని గ్రహింపఁబడుచున్నది. సకల వేదాధినాథుఁడైన శ్రీ వేంకటాచలపతియే పాపములనుండి తన్ను ముక్తు నొనర్చె నని యీభక్తాగ్రేసరుఁడు పలికినాఁడు.

ఇతనికిఁ దరువాత నితనికుమార్తె యని లోకప్రసిద్ధ నందిన ఆండాళ్ భక్తురాలు తాను రచియించిన 173 పాశురములలోఁ బదునాలింటియందుఁ దిరుపతిప్రశంస యొనర్చినది. ఇందులో నొకదానిలోఁ దనప్రణయ సందేశమును (భక్తిప్రేమలు రెండును మిళితములు) తిరుపతినాథుని కందఁజేయు మని మేఘునిఁగూర్చి పలికియున్నది. ఇది కాళిదాసుని మేఘదూత కనుకరణ విశేష మనుట సర్వవిదితమే!

పాండ్యదేశీయుఁడైన నమ్మాళ్వారను భక్తశిఖామణి ఈయుగములోని కడపటివాఁడు. ఈయనవిశేష దివ్యప్రబంధరచయిత. ఏఁబదినాలుగు దివ్యపాశురములలోఁ దిరుపతిదివ్యక్షేత్రమునుగురించి గానముచేసియున్నాఁడు. తిరుమంగైయాళ్వారు తరువాత, అధికసంఖ్యాకములగు దివ్యప్రబంధముల రచియించినవాఁడీ నమ్మాళ్వారు దివ్యసూరియే. ఈవైష్ణవభక్తుఁడు కలియుగాదిని (3102 బి.సి. కాలమున) నుండినట్టు లోకప్రతీతి ప్రచారములో నున్నది. కాని చారిత్రకదృష్టితోఁ బరిశీలించిన పలువురువిద్యాధికులు దశమశతాబ్దిపూర్వభాగమున నీభాగవతోత్తముఁడు జీవించియుండనోపు నని నిర్ణయించుచున్నారు. శ్రీవేంకటాచలపతియే ఆదిమూర్తియనియు, వేంకటాచలమే మోక్షదాయకమైనట్టి దనియు నీయాళ్వారు వచియించియున్నాఁడు. తిరుపతి శ్రీవేంక

టేశ్వరస్వామిని "అలమేలుమంగాపతి"యనియు, "శ్రీనివాసుఁడు"అనియుఁ బేర్కొనుట కీయనయే మొదటివాఁడు. ఒకచోట "అలర్ మేల్ మంగై యుఱై మార్బా" (అనఁగా, పద్మావతిని ఉరస్సునందు నిల్పినవాఁడా) అని సంబోధించియున్నాఁడు. దీనినిఁబట్టి, నేఁటి "చిఱుతానూరు"నందలి పద్మావతీదేవ్యాలయము రమారమి ఈ కాలమునందే నిర్మింపఁబడిన దేమో అని యూహింపఁబడుచున్నది.

## కావ్యయుగము

సంఘకాలము తరువాత మనకు ముఖ్యమయినది కావ్యయుగము—అనఁగా కంబ రామాయణాది గ్రంథరచనాకాలము. కంబరామాయణమే ఈ కాల గ్రంథరచనలోని ప్రధానగ్రంథము. ఇయ్యది శాలివాహనశకము 807 సం. (క్రీ. శ. 885) లో రచింపఁబడిన దని పూర్వ్వుల విశ్వాసము. కాని వాస్తవికముగఁ బరిశీలించినచో నేతద్గ్రంథకర్త యగు "కంబనాట్టాళ్వార్" ద్వితీయ కుళోత్తుంగ చోడునకును, తత్కాలీనుఁడే యగు ఓరుగంటి ప్రతాపరుద్రునకును సమకాలికుఁడైనట్టు నిదర్శనములు గన్పడుచున్నవి. ఈరాజు లిద్దఱియొక్క కాలము ద్వాదశశతాబ్ది యని శాసనాదిసాధనసంపత్తిచే నిర్ణయింపఁబడియున్నది. కావున, కంబరామాయణము గూడ నాశతాబ్దిలోనే రచితమయి యుండు నని పలువురు విమర్శకులనిశ్చయము. ఈరామాయణములోని కిష్కింధాకాండలో వేంకటాచలమునుగూర్చియు, తదధిపతినిఁగూర్చియు నీక్రిందవిధమున నభివర్ణింపఁబడియున్నది.

సీతాన్వేషణముకొఱకై వానరసేనఁ బలుతావుల కంపుసందర్భమున సుగ్రీవుఁడు హనుమంతునితో నిట్లనుచున్నాఁడు.

"జుమ్మని నినదించు తేంట్లకులములతో నిండియున్నవనముల కునికిపట్టును; ఉత్తర దక్షిణభాషా కుటుంబములకు మధ్యసరిహద్దును; వేదశాస్త్రాదులయందలి పరమార్థమైన 'సత్య' మున కాస్థానభూతమును; పుణ్యకర్మముల కెల్ల నివాసభూమియు; శాశ్వతమైన "సత్తు" యొక్క స్వరూపమును నైన, ఆవేంకటాచలమును, శీతలమారుతప్రసారకలితమైనదానిని నీవు చేరఁగలవు.

ఇచ్చటనుండియే మన మావేంగడనివాసు లయిన మహాత్ముల నర్చింపవలసి యున్నది. వా రందఱును, ఫలాపేక్ష లేకయే సత్కర్మముల నాచరించువారును, కర్మబంధవిచ్ఛిత్తిఁ గాంచినవారును అయియున్నారు. ఐహికములైన సుఖదుఃఖాదులయందు వారికిసమానమైన నిరసనభావము. మహానందము వారికిఁ జేకూరి యున్నది.

"ఈతిరువెంగడమునందు భూసురకోటి నిత్యము స్నానమాచరించు నదులు పెక్కు ప్రవహించుచున్నవి. వేదవేదాంతవేత్తలు, తపోధనులు నైన మహానుభావుల యాశ్రమము లనేకము లిచటఁ గలవు. ఈకొండలయొక్క కోనలయందును గోనలయందును వివిధములైన నవరత్నము లనేకములు లభింపఁగలవు. ఇచ్చటిమృగములు తమతమ సైజవిరోధముఁ బాసి స్నేహభావమున మెలఁగుచు దివ్యకాంతల మనోజ్ఞకిన్నరాలాపములకు సాక్షి నిచ్చుచున్నవి."

ఇప్పటికి శ్రీమద్రామాయణమును బరికించినచో నీ కథాభాగమున నేతాదృశమైన వేంకటాచలాభివర్ణనము గాన్పించుటలేదు. కావున నీ వర్ణనము ద్రావిడగ్రంథకర్తల స్వతంత్రోక్తియే, యని యంగీకరింపవలసి యున్నది. ఈ పై వర్ణనములోని తుది భావమునకు సాదృశ్యము, ఆంధ్ర భారతమునందలి కణ్వాశ్రమ వర్ణనమునం దొకమాదిరిగ గన్పించుచున్నది. చూడుఁడు:

" శ్రవణ సుఖంబుగా సామగానంబులు
చదివెడు శుకముల చదువు దగిలి
కదలక వినుచుండు కరులయుఁ గరికర
శీతలచ్ఛాయఁ దచ్చీకరాంబు
కణములవల్లనిగా డ్పాసపడి వానిఁ
జెంది సుఖం బున్నసింహములయు
భూసురప్రవరులు భూతబలుల్ దెచ్చి
పెట్టునీవారాన్నపిండతతులు

గడఁగి భక్షింప నొక్కటఁ గలసి యాడు
చున్నయెలుకల పిల్లల యొండుసహజ
వైరిసత్వంబులయు సహవాస మపుడు
సూచి మునిశక్తి కెంతయుఁ జోద్య మంది."

భారతము: ఆదిపర్వము, ౪ ఆశ్వాసము, ౨౨ పద్యము.

ఇట్లిది యంతయుఁ బరికించినచో వేంకటాచల మాహాత్మ్య మెట్టిదో, దాని కున్న యీ ప్రాధాన్య మెంతటి ప్రాక్కాలికమైనదో విదిత మగుచున్నది. కలియుగవైకుంఠనాథుఁ డగు శ్రీతిరుపతివేంకటేశ్వరుఁడు భక్తవశంగతుఁ డనియు, కొలిచెడువారికిఁ గొంగుబంగారమనియు, ఆసేతుహిమాచల భారతభూమియం దున్నభక్తకోటి సదా శ్రీవారిసన్నిధికి వెంచేసి భగవత్పాదసేవ నాచరించి ధన్యత నందుచుండి రనియుఁ దెలియవచ్చుచున్నది. "కలౌ వేంకటనాయకః" అన్నసూక్తి అందఱెఱిఁగినదే కదా!

---

# దైవ మహిమ

మహోపాధ్యాయ
వేదము వేంకటరాయ శాస్త్రిగారు,
కళాప్రపూర్ణ

ఏమను దోమను సైతము
సోముని భీముని సృజించుచొప్పననే యో
సామీ, సృజింతు వేలెద
వేమో నీగుట్టు తెలియ నెట్లగు మాకున్.

ఏమి ప్రయోజనమునకై
భూమిని జలవహ్న్యనిలనభోభూతములన్
సామి, సృజించి యడంచెదు
పామరులకు మాకుఁ దెల్పు పరమేశ కృపన్.

ఈ సంసృతిక్లేశంబుల
నో సామీ, మమ్ము నెంతయున్ సుడియంగా
చేసితి వంతముఁ జూపవు
శ్రీసఖ, యీ యాత్మకేల చేయవు శాంతిన్?

---

# ఉరిశిక్ష పోవలెను

దేశిభట్ల లక్ష్మీనరసింహంగారు, M. A.

ప్రపంచమున నిటీవల ఉరిశిక్షలు మెండగుచున్నవి. దౌర్జన్యముతోఁ గూడిన రాజకీయకల్లోలములు అనేకదేశములందు ప్రబలుచుండుటయును, ఆయాప్రభుత్వముల వారు ఘోరములగు నేరములు సల్పిన నేరస్థులకు మరణదండనమువంటి శిక్షలు, ప్రజాశాంతి పేర, విధించుచుండుటయును జూచుచున్నాము. నేరస్థుల ప్రాణములు దీయుటవలన సంఘమున మఱి యట్టి నేరములు జరుగకుండు నను న్యాయపాలకుల యాశయము సాఫల్యమగుచున్నదా యనువిషయము, గత 60-70 సంవత్సరములనుండి చర్చనీయాంశమైనది.

వ్యక్తులను జంపునటువంటి హంతకులకును, పురములను గ్రామములను గొల్లకొట్టి వందలకొలఁది జనులను నఱికివేయునట్టి ఘాతకులకును, యుక్తదండనము విధించుటవలన ఇతరులు అట్టినేరముల నొనర్చుటకు వెనుదీయుదు రనువాదము సయుక్తికముగ నున్నట్లు కాన్పించును. కాని కఠోరమగు శిక్షలు విధించుటవలననే ప్రపంచమందు నేరములు తగ్గిపోవుచున్నవని చెప్ప వీలగునా? వేలకొలఁది సంవత్సరములనుండి మరణశిక్షలు విధింపఁబడుచున్నను హంతకులసంఖ్య తఱుఁగుచున్నదా?

సామాన్యముగ హత్యనేరము దీర్ఘాలోచన చేసి జరుపునది కాదు. తాత్కాలిక కామక్రోధాది యుద్రేకములచేతఁగాని, మత్తుపదార్థసేవవలనఁ గలుగు నపస్మారకము చేఁగాని మానవుఁడు తనతోడిమానవునిఁ జంపఁబూనును. వానికి, ఉరిశిక్ష ప్రాప్తమగు ననుభయము మనసునఁ బొడసూపదు. *1905 సం॥న ఇంగ్లండులోని సర్కారువారు తయారుచేసిన నేరములపట్టికను జూచినచో నాదేశమున నూటికి 30 నేరములు మద్యపానోద్రేకమువల్లను, పట్టరాని కోపాగ్నివల్లను జనించినవనియు, 30 నేరములు స్త్రీలోలత్వము, కుట్రలు మొదలుగాఁగల కారణములవల్లను, మిగిలినవానిలోఁ గూడ చాలవరకు బుద్ధిమాంద్యముచేతనే జరిగినవనియు తెలియవచ్చుచున్నది.

ఉరిశిక్షమూలమున నేరస్థుల ప్రాణములు నిలువకపోవుటయే కాక ఉరిశిక్షలఁగూర్చి విన్నవారియొక్కయు, చూచినవారియొక్కయు మనస్సులు చెడిపోవును. శిక్షను విధించు న్యాయమూర్తుల మనోమార్దవము ఘనీభవించును. ఉరిత్రాడును లాగునట్టి కింకరుని సుకుమారమనోభావములు క్రమముగా నశించి తాను కటికవానికన్న నిర్దయుఁడగుట కవ

* Law College Magazine, 1928.

కాశ మేర్పడును. ఉరికింకరులలో ననేకులు తమ కార్యముల నిర్వహింపవలసి వచ్చినపుడు కన్నీరు పెట్టుకొని, తమజన్మము పాపభూయిష్ఠమైనదిగదా యని విలపింతురఁట. 1923 వ సం॥న ఇంగ్లండులో ఎల్లిసు అనునొక కింకరుఁడు ఇద్దరు నేరస్థుల నురిదీసినపిమ్మట అత్యంత మనఃఖేదము నొంది యాత్మహత్య సల్పుకొనఁ బ్రయత్నించెనఁట. మరియొకఁడొక స్త్రీని ఉరి దీయవలసివచ్చి తనగొంతుకను తానే నఱకుకొనెనఁట.

ఇట్లు ఉరిశిక్షాఫలితములు ప్రజాసంఘము మీఁద మిక్కిలి వ్యసనకరములుగాఁ బరిణమించును. ఉరిశిక్షకు నర్హుఁడని నిరూపింపబడిన వ్యక్తి వాస్తవముగ నిర్దోషియైనచో నెట్టి విషాదము సమకూడునో చెప్ప నలవి గాదు. దైవభక్తితో న్యాయమూర్తులు తమ న్యాయపరిపాలనకార్యములను నెరవేర్పఁబూనినను వారు కొన్నియెడల నిజము కనుఁగొనుట దుస్సాధమగును. 1869-వ సం॥న ఇంగ్లండులో నొకస్త్రీ తనభర్తను విషము పోసి చంపెనని నిందితురాలై మరణశిక్ష నొందెను. తర్వాత కొన్ని సంవత్సరములకు ఒకపురుషుఁడు రోగపీడితుఁడై తనయవసానకాలము సమీపించు సమయమున తాను చేసియుండినపాపములన్నిటిని జ్ఞప్తికిఁ దెచ్చికొనుచు, ఆస్త్రీమీఁద నారోపింపఁబడిన హత్యానేరము తాను చేసెననియు, తాను పట్టుఁబడనికారణమున ఆదౌర్భాగ్యపుస్త్రీ ఉరిశిక్షకుఁ బాలయ్యెననియు విలపించెనఁట. న్యాయపాలకులీవిషయమును గూర్చి సవిస్తారము విచారణము సేయఁగా నీపురుషుఁడు పలికినది నిజమని తేలెనఁట. 1876-వ సం॥న విల్లియం హాబ్రోసు అను నాంగ్లయువకుఁడు ఒకపోలీసువానిని జంపెననుకారణమున మరణశిక్షకుఁ బాత్రుఁడయ్యెను. అదృష్టవశమున నతనికి మైనరు తీరనందున న్యాయమూర్తులు మరియొక తేలికశిక్షను విధించి యతనిని వదలివేసిరి. 3, 4 సం॥ల తర్వాత చార్లసుపీసు అను నొకహంతకుఁడు న్యాయమూర్తులయెదుర వచ్చి తానా నేరమును జేసితి ననియు, హాబ్రోసు అన్యాయముగ శిక్షితుఁడయ్యెననియు ఋజువు చేసికొనెను. న్యాయమూర్తులు విస్మయమొంది తమ యల్పజ్ఞతను నిందించుకొనుచు హాబ్రోసునకుఁ గొన్ని వేలరూపాయల పరిహారము నిప్పించిరఁట. 1924-వ సం॥న పోలండుదేశములో నొకయువకుని యుంపుడుకత్తెకు జన్మించిన బిడ్డడు అకస్మాత్తుగఁ గాన్పింపకపోయెను. తరువాత నేదోయొక కళేబరము పోలీసువారు చూచి యది యాబిడ్డనిదే యని నిశ్చయించి యాయువకునిమీఁద బిడ్డను జంపిననేరము మోపిరి. న్యాయాధిపతులు వానికి మరణశిక్ష విధించిరి. ఇట్లు వాని ప్రాణము తీయఁబడిన తర్వాత కొన్ని సంవత్సరములకు ఆబిడ్డయొక్క వృద్ధమాతామహి తన యవసానకాలమున "అయ్యో! బిడ్డతండ్రి గాదు. నేనే ఆచిన్నబిడ్డను జేతులార కుతికకుఁ ద్రాడు బిగించి చంపితిని. ఈశ్వరుఁడు నా కెట్టిదండన విధించునో" యని పశ్చాత్తాపము నొందఁగా వాస్త

వము తేటఁబడెనఁట. ఇటీవల అమెరికాలో నొకయువకుఁడు మరణశిక్షాపాత్రుఁడని నిరూపింపఁబడి యూపస్తంభమునకుఁ గొంపోఁబడఁగా అనుభవశాలియైన ఒక ఉరికింకరుఁడు వానిమోముఁజూచి, "ఇతఁడు నేరస్థుఁడు కాఁజాలఁడు. వీనిమోమునందు నిర్దోషత స్పష్టముగఁ గాన్పించుచున్నది. నేను ఉరిత్రాటిని లాగను" అని మూర్ఖతతో నూరకుండెనట. న్యాయమూర్తులు ఆకింకరునియొద్ద వాఙ్మూలము పుచ్చుకొని తిరిగి యానేరస్థునిపై నారోపింపఁబడియుండిన నేరమును గూర్చి విచారణ సల్పఁగా నిజము తెల్లమయ్యెనఁట. కింకరుని సూక్ష్మజ్ఞానసాహాయ్యమున వాని ప్రాణములు రక్షింపఁబడెను. ప్రపంచమందంతట నిట్టియుదాహరణములు మరి యెన్నియో కాన్పించును. సారాంశము స్పష్టము.

పై కారణముల వల్ల సమగ్రముగఁ దర్కించి పెక్కు ప్రభుత్వములవారు మరణదండనను తమశిక్షాస్మృతినుండి తొలఁగించియున్నారు. ఈక్రిందిపట్టిక ఆయా ప్రభుత్వముల వారు మరణదండనము నెప్పుడు రద్దుపఱచిరో తెలుపుచున్నది.

| | సం॥లు | | సం॥లు |
|---|---|---|---|
| ఆర్జంటయిను | 1922 | ఇటలీ | 1889 |
| ఆస్ట్రియా | 1918 | లితువేనియా | 1926 |
| బెల్జియము | 1863 | నార్వే | 1905 |
| బ్రెజిలు | 1891 | పెరు | 1896 |
| కొలంబియా | 1910 | పోర్చుగలు | 1867 |
| కోస్టారీకా | 1926 | రొమేనియా | 1865 |
| డెన్మార్కు | 1892 | స్వీడను | 1921 |
| ఈక్వేడారు | 1895 | క్వీన్సులాండు | 1922 |
| ఫినులాండు | 1826 | ఉరుగ్వే | 1896 |
| హాలండు | 1870 | వినిజివీలా | 1876 |
| | | ఆస్ట్రేలియా | 1930 |

అమెరికాలోని కొన్ని స్టేటులలో నిటీవల మరణశిక్ష కొట్టివేయఁబడినది. ఈసంవత్సరమున ఆంగ్లదేశమునసైతము నొక సర్కారు కమిటీవారు మరణశిక్షవిషయము బాగుగఁ దర్కించి, ఆంగ్లరాజ్యమున దానిని రద్దుపఱుపవలెనని సిఫారసు చేసిరి గాని ప్రభుత్వమువా రింకను కమిటీవారిసిఫారసును ఆచరణలోనికిఁ దెచ్చుట కొప్పుకొనలేదు. స్విట్జరులాండులో శిక్షాగృహములు (చెఱసాలలు) తీసివేసి వానికి మారుగ సంస్కారగృహములు ఏర్పఱచు నేర్పాటులు జరుగుచున్నవి. ఈసంస్కారభవనములలో నెట్టినేరస్థులైన విచ్చలవిడిగఁ దిరుగవచ్చును. వీరికి సర్వదా సద్విషయములు గోచరమగునట్లును సత్సాంగత్యము ఒనగూడునట్లును పరిస్థితు లేర్పఱుపఁబడుచున్నవి. ఉన్మాలమున వారు సుహృదయులై సత్ప్రవర్తనముఁ బెంచుకొని దేశోపకారులు కాఁగల రనువిశ్వాసము ప్రభుత్వము వారికిఁ గలదు. అచిరకాలముననే భారతదేశముకూడ మరణదండనపిశాచమునుండి విముక్తమగునని భగవంతునిఁ బ్రార్థింతము.

అబ్బోయి! పట్టణాల బళ్ళ వాళ్ళో!!



# కర్షకా

పరుచూరి భువనేశ్వరిగారు

నిరుపేదనని కంట నీరు పెట్టకుమోయి!
ఘనరత్నగర్భ నిన్గన్నతల్లి
క్షుత్పిపాసలనెంచి క్షోభపడకుమోయి!
ఘనుఁడు జీవనుఁడు నీకన్నవాఁడు
నిస్సహాయుఁడనంచు నీరసింపకుమోయి!
జోడుగిత్తలు నీదుతోడునీడ
తెలివిహీనుఁడనని దిగులుసెందకుమోయి!
నాగేటికఱ్ఱు నీసాగువాఁడు
చంద్రసూర్యులు నీవెట్టిచాకిరీలు
నిఖిలలోకాలు నీలోన నిలిచియుండుఁ
బరమపితకంట మోదబాష్పంబ వీవు
మధురజీవన! కర్షకా! వగచెదేల?

---

# విశాఖపట్టణదృశ్యములు



౧. మేరీ కొండపయినుండి

శ్రీ ఆమంచి శ్రీరామరావుగారు తీసిన ఛాయాచిత్రముననుండి.



౨. భవానీకొండపయినుండి

శ్రీ సి. రాజగోపాలరావుగారు తీసిన ఛాయాచిత్రముననుండి.

# కరాచీకాంగ్రెసు తీర్మానములు · ప్రతివాదిభయంకరం రంగాచార్యులుగారు

## కరాచీ తీర్మానముల ప్రాముఖ్యము

1885-సం. ము మొదలుకొని యిప్పటివరకు వెలువడిన కాంగ్రెసు తీర్మానములలో, ఈయేడు కరాచీలో సమావేశమైన కాంగ్రెసుమహాసభ తీర్మానముల వలె ప్రజలదృష్టి నాకర్షించినవేవియు లేవు. హిందూదేశములోని వారికే తీర్మానముల ప్రాముఖ్య మెంతగొప్పదో ఇంగ్లీషువారికిగూడ నదియంత గొప్పదయ్యెను. ఇందుకు కారణము లేకపోలేదు. ప్రస్తుతము ఇంగ్లాండ్ భారత దేశములకు గల సంబంధమునుబట్టి చూచినచో కాంగ్రెస్ ఉద్యమము ఈరెండు దేశములవారికినిగూడ, ఒకవిధముగ, చావుబ్రతుకులతోగూడిన సమస్యయని స్పష్టపడును. అందుచే, కాంగ్రెసు ఉద్యమము మరింతబలపడుటయే హిందూదేశీయులకు గావలసినది. అదియెట్లయిన నంతరించుటయే బ్రిటీషువారికి గావలసినది. కాంగ్రెసు ఉద్యమము అణగిపోయినచో హిందూదేశమున కింక రాజకీయ స్వాతంత్ర్యము సున్న. అది జయమందినచో బ్రిటీషుజాతి భవిష్యజ్జీవితము సందేహాస్పదము. ఈయంశమునే వివరించుచు ప్రమోదసంవత్సరాదిసంచికలోని "హిందూదేశములో ఆంగ్లేయుల ఆర్థికనీతి" అను తమవ్యాసమున డాక్టర్ భోగరాజు పట్టాభిసీతారామయ్యగారిట్లు వ్రాసియున్నారు:

"ఈవిధముగ, ఇంగ్లాండు తన జాతీయజీవితము విషయమున నిరాశాపూర్ణమగు నవస్థకువచ్చినది. దాని వ్యాపారమంతయు కట్టుబాట్లు తప్పిపోయినది. యుద్ధములో విజయము దాని ప్రజలకు నిరుద్యోగ సమస్యను మాత్రమే తెచ్చిపెట్టినది. ఇంతకుమునుపు ఇంజన్లు, ఇనుము, బొగ్గు ఇంగ్లాండునుండి కొనుచుండిన ఫ్రాన్సు, తనకు జర్మనీనుండి రావలసిన నష్టపరిహారములకు బదులుగ, ఈవస్తువులను, ఏకిరీదును లేకుండగనే, యిప్పుడా దేశమునుండి తెచ్చుకొనుచున్నది. ఈవిధముగ ఓడిపోయిన జర్మనీదేశము రాత్రింబవళ్లు, నిరుద్యోగమననేమో యెరుగక, పనిసందడితో గింగురుమనుచుండ, ఇంగ్లండు ఫ్రాన్సు విక్రయశాలలను గోల్పోయి, విజయముచేగలిగిన దుష్ఫలితముల మూలమున నవస్థపడుచున్నది. ఏవైపు చూచినను, ఇంగ్లండ్ స్థితిగతులు మిగుల దుఃస్థితికి వచ్చియున్నవి. నేడు అధినివేశ ప్రతిపత్తినాధారముగా గొని ఆంగ్లరాజ్యాంగవేత్తలు హిందూదేశముతో సంధికి వచ్చుచున్నారన్న, దానియాశయము ఒకవేళ హిందూదేశపు లాభమే ఐయుండినను, ఆమేరకు ఇంగ్లండ్ లాభములు గూడ నందిమిడియేయున్నవి."

(ప్రమోద ఉగాదిసంచిక: పుట 72 ఉ).

కాని, ఇట్లు "అధినివేశ ప్రతిపత్తి నాధారముగాగొని" బ్రిటీషువారొకవైపునుండి భారతీయులతో సంధికివచ్చుచుండ, భారతీయులకు మాత్రము బ్రిటీషు వారిపై విశ్వాసము నశించినది. వారు అధినివేశ ప్రతిపత్తినిచ్చెదరను నమ్మకము భారతీయులకు లేదు. 1929 సం. లోనే భారత జాతీయమహాసభవారు "కాంగ్రెసు ఆదర్శమందలి స్వరాజ్యపదమునకు సంపూర్ణ స్వాతంత్ర్యము" అను అర్థము నిర్వచించి "అధినివేశ ప్రతిపత్తికిగా నిర్మింపబడిన నెహ్రూప్రణాళిక ఇంతటితో రద్దయిన" దని ప్రకటించిరి. నాటివరకును డొమినియన్ ప్రతిపత్తి లభించినచో సంపూర్ణస్వాతంత్ర్యమునకై పెనగులాడుట తనకిష్టము లేదని విస్పష్టముగ ప్రకటించుచుండిన గాంధిమహాత్ముడు తనయభిప్రాయమును మార్చుకొని, హృదయపూర్వకముగ లాహోరు కాంగ్రెసు తీర్మానము నామోదించెను. తననమ్మకములో గలిగినయీ మార్పునుగూర్చి కరాచీలో స్టేట్స్మన్ పత్రికవిలేఖరితో గాంధీజీచెప్పినమాటలు గమనింపదగినవి. ఇంగ్లండ్తో సమాన భాగస్వామిత్వమనగా (equal partnership) బ్రిటీషుసామ్రాజ్యాంతర్గత మగు అధినివేశ ప్రతిపత్తికాదని చెప్పుచు ఆయన యిట్లనెను:

"కొన్నాళ్లకు పూర్వము ఆస్ట్రేలియా వంటి అధినివేశప్రతిపత్తి భారతదేశమునకు తగియుండునని నేనను కొంటిని. కాని యీప్రతిపత్తి నంగీకరించుటకు కొన్ని విషయములు ప్రతిబంధకములుగా నున్నవని నాకిప్పుడగపడుచున్నది. బ్రిటీషు ప్రజాసామ్రాజ్యములోని జాతులన్నియు, చాలవరకు, ఆంగ్లేయులతో రక్తస్పర్శగలవిగానున్నవి. దక్షిణాఫ్రికావంటిజాతులు కొన్ని ఆంగ్లేయభావముతోడను, విజ్ఞానముతోడను నిండియున్నవి. జాతియందును, రాజకీయ ప్రతిష్ఠాపనలయందును ఆంగ్లేయులును, సామ్రాజ్యములోని యితర జాతులవారును ఒక్కటే యైయున్నారు. భారతదేశమిట్లు కాదు. మా విజ్ఞానమును పాశ్చాత్యవిజ్ఞానముతోను బ్రిటీషువిజ్ఞానముతోను ఏకముచేయు నభిప్రాయము మాకెన్నటికిని లేదు. మావిజ్ఞానవృక్షమును, సాంఘికపద్ధతులను అంటిపెట్టుకొని యభివృద్ధిచేయ మేము గాఢముగాకోరుదుము. మా విజ్ఞానముతో మేము సంతృప్తులమైయున్నాము. కావున భారతదేశముయొక్క భావిదశకును ఆస్ట్రేలియా ప్రతిపత్తికిని పోలిక యేమాత్రమును లేదు. కాని అనేకవిషయములలో పరస్పర సహాయముకొరకును, పరస్పర బాధ్యతలకొరకును ఆంగ్లభారతదేశములకు అన్యోన్యసంబంధముండవచ్చును."

ఇట్టి గాఢమైనయవిశ్వాసముమీదనే నేటి కాంగ్రెసు ఉద్యమమును తీర్మానములును ఆధారపడియున్నవి. ఈ యవిశ్వాస మొక్క అతివాదులకే కాదు, మితవాదులకుగూడ కలదు. మరి దీనికి కారణమును లేకపోలేదు. ఇందలిరహస్యమిది: డొమినియన్ ప్రతిపత్తి యనుమాటను మాత్రము పైకితెచ్చి, ఆచరణలోమాత్ర మది లేకుండచేసి, భారతీయులకళ్లలో మసిపూసి మారేడుగాయ చేయవలయునని బ్రిటీషువారి సంకల్పము. ఇది భారతీయులకు బాగుగ తెలిసివచ్చినది. కాబట్టియే మొట్టమొదట చెప్పినట్లు "కాంగ్రెసు ఉద్యమము ఎట్లయిన నంతరించుటయే బ్రిటీషువారికి గావలసినది. అది మరింతబలపడుటయే హిందూదేశీయులకు గావలసినది." ఇట్టి స్థితిగతులలో కరాచీకాంగ్రెసు సమావేశమగుటచేతనే యీకాంగ్రెసు తీర్మానముల కింతటి ప్రాముఖ్యము.

మొత్తముమీద కాంగ్రెసువారు 15 తీర్మానముల గావించిరి. వీనిలో ఎక్కువగా చర్చకవకాశమిచ్చినవి, ప్రధానమైనవి, మూడుతీర్మానములుగలవు. ౧. భగత్సింగు తీర్మానము, ౨. గాంధి-ఇర్విన్ ఒడంబడిక తీర్మానము, 3. స్వరాజ్యప్రణాళిక తీర్మానము. ఈమూడింటిలోను గూడ ముఖ్యమయినది స్వరాజ్యమునందు ప్రజలకుండవలసిన హక్కులగూర్చినది. (స్వరాజ్యప్రణాళిక.)

## స్వరాజ్యప్రణాళిక:

ఇదివరకెప్పుడును కాంగ్రెసువారు ఇట్టి తీర్మానముగావించి యుండలేదు. 1920 సం. లో కాంగ్రెసు సహాయనిరాకరణము నవలంబించినది. ఆయేడు కాంగ్రెసు ఆశయములోగూడ మార్పువచ్చినది. అదివరకు బ్రిటీషు సామ్రాజ్యమునకులోబడియుండినస్వాతంత్ర్యమే హిందూదేశమునకు కావలయునని కాంగ్రెసు కోరుచుండెను. కాని ఆయేడు "స్వరాజ్యసంపాదనము కాంగ్రెసు మహాసభయాశయ" మని క్రొత్తగా తీర్మానింపబడినది. ఈతీర్మానమునను సరించి భారతదేశస్వాతంత్ర్యము బ్రిటీషుసామ్రాజ్యమునకు లోబడినదే యైయుండవలె నన్న నిర్బంధము తొలగిపోయినది. అప్పటినుండియు కాంగ్రెసువారు తను స్వరాజ్యస్వరూపమును నిర్ణయింపవలయునని యెందరోకోరియుండిరి. కాంగ్రెసు పెద్దలలో నే చాలమందికి అట్టి నిర్వచనమొకటి యవసరమనితోచెను. కాని గాంధీజీమాత్ర మట్టియవసర మింకను రాలేదనిచెప్పుచుండెను. తరువాత, 1928 సం. లో వెలువడిన నెహ్రూ నివేదిక విషయమున కాంగ్రెసువారి బాధ్యత కొంతవరకుగలదు. కాంగ్రెసువారే అఖిలపక్షమహాసభను సమావేశపరచియుండిరి. ఈసభవారేర్పరచిన నెహ్రూసంఘము వారే పైరాజ్యాంగప్రణాళికను (నెహ్రూనివేదికను) తయారుచేసిరి. కాని యిప్పుడైనను పైప్రణాళికను కాంగ్రెసు వారంగీకరించి తీరవలయునను నిర్బంధమేమియు లేదు. దానిని పూర్తిగా త్రోసివేయుటకుగాని, మార్చుటకుగాని వారికవకాశముండెను. అందుచే ఈసందర్భమునందైనను కాంగ్రెసువారు రాజ్యాంగవిధానము విషయమున తాము ఫలానా నియమములకు కట్టుబడియుండు నట్లేమియు స్పష్టపరుపలేదు. కాబట్టియే 1928 సం,

లో, తాత్కాలికముగ, నెహ్రూనివేదికను కాంగ్రెసు వారామోదించినను, 1929 సం. లో దానిని పూర్తిగా త్రోసివేయుటకు మరల నవకాశముండినది. కాని యిప్పుడు కాంగ్రెసువారు స్వయముగా రౌండ్ టేబిల్ సభలో పాల్గొని రాజ్యాంగవిధాన నిర్మాణము గావింప నుండుటచే స్వరాజ్యవిధానమున తామవలంబింపబోవు ప్రధాననియమములనుగూర్చి వారు ముందుగ ప్రజలకు తెలియజేయుట యావసరమైనది. ఇదియే యీతీర్మానము నకు గల యాశయము.

ఇట్టిచో, నిది చాలముఖ్యమైన తీర్మానము. మరియు, వివాదాంశము లిందనేకములుగలవు. అయినను అన్ని తీర్మానములు ముగిసినతరువాతనే యిది చర్చకు తేబడెను.

ఈతీర్మానము విషయమున కాంగ్రెసు ప్రతినిధు లలోనే యభిప్రాయభేద మెక్కువగానుండినది. ఇందలి నియమములను వివరముగ చర్చించుటకు తగినంత యవ కాశము లేకపోయెను. ఐనను కాంగ్రెసుమహాసభ దీని నామోదించినది. ఈతొందరపాటు చాలమందికిష్టము లేకపోయినది. కాబట్టియే, "పైనియమములందు నిబద్ధ మైన విధానమునకు భంగమురాకుండ వానిని దిద్దుటకు గాని, సవరించుటకుగాని, చేర్చుటకుగాని అఖిలభారత కాంగ్రెసు స్థాయిసంఘమున కధికారముమగలదు" అని పైనియమములపై నింకను కొంత వివరముగ చర్చజరుగు టకు మరల కొంతయవకాశము గలిగింపవలసివచ్చెను. పైనిర్ణయము ననుసరించి, ఆయారాష్ట్ర కాంగ్రెసు సంఘములవారితో సంప్రతించి యీ నియమములను తగు సవరించుటకై కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గమువా రొక యుపసంఘమును నియమించిరి.

## గాంధి - ఇర్విన్ ఒడంబడిక

దీని తరువాతిది గాంధి-ఇర్విన్ ఒడంబడికను గూర్చిన తీర్మానము. ఈతీర్మానములో పైదానిలోవలె వివాదకు అవకాశమిచ్చునంశము లంతగాలేవు. కాని యిదియే కాంగ్రెసువారిచర్చలో అన్ని తీర్మానములకన్న నెక్కువకాలము నాక్రమించినది. ముఖ్యముగా నాలుగు సూచన లీతీర్మానములో నిమిడియున్నవి.

(౧) కాంగ్రెసువారు రౌండ్ టేబిల్ సభలో పాల్గొనవలెను.

(౨) కాంగ్రెసువారి ఆదర్శము పూర్ణస్వరాజ్య మై (సంపూర్ణ స్వాతంత్ర్యము) ఉండవలెను.

[తమయిష్టము వచ్చినప్పుడు తమ పరస్పరసంబంధ మును వదలిపెట్టుకొనుటకు రెండుజాతులవారికిని అధి కారము ఉండవలెను.]

(3) రౌండ్ టేబిల్ సభలో కాంగ్రెసు వారు కావింపబోవునట్టి కాని, ఆమోదింపునట్టి కాని సూచనలు పైసంపూర్ణ స్వాతంత్ర్య సిద్ధాంతమునకు సరిపడినవై యుండవలెను.

[ఐనను ఈ సందర్భమున భారతదేశపు క్షేమము నకై యేవైన కొన్నిసర్దుబాట్లు (అధికారములలో మిన హాయింపులు) అవసరమైనచో అట్టి సర్దుబాట్ల నంగీక రించుటకు కాంగ్రెసు ప్రతినిధివర్గమువారి కధికార ముండవలెను.]

(౪) హిందూదేశములో బ్రిటిషుప్రభుత్వము వారుచేసిన అప్పుసొప్పులనుగూర్చి విచారించి వానిలో భారతీయులెంత యిచ్చుకొనవలయునో, బ్రిటీషువారెంత యిచ్చుకొనవలయునో నిర్ణయించుటకు నిష్పక్షపాతమగు నొకవిచారణసంఘ మేర్పడవలెను.

## అధికారముల మినహాయింపులు

కాంగ్రెసువారు రౌండ్ టేబిల్ సభలో పాల్గొని, అవసరమైన కొన్ని అధికారముల మినహాయింపులతో, సంపూర్ణ స్వాతంత్ర్యమును సాధించుటకు ప్రయత్నింప వలయునని యిందలి మొదటి మూడుసూచనల సర్థము. ఇదిచాల విలక్షణముగ గన్పడును. సంపూర్ణ స్వాతంత్ర్య ములో అధికారముల మినహాయింపులన్నప్పుడు అందుకు కోరబడిన ప్రభుత్వవిధానమే రావలయునుగదా యను సంశయము గలుగుచున్నది. ఈయంశమునే జమ్నాదాసు మెహతాగారు కాంగ్రెసు మహాసభలో వెల్లడించిరి.

కాని యిట్టి మినహాయింపులు కొన్ని భారతదేశక్షేమమునకు అవసరమై యుండవచ్చునని తీర్మానము తెలుపుచున్నది. భారతప్రభుత్వము వారి యధికారమునుండి కొన్ని యంశములను మినహాయించినప్పుడు, ఆమినహాయించిన యధికారములు బ్రిటీషుప్రభుత్వమువారికి చెంది యుండవలయునని యే యర్థము. కాని, యీవిధముగ భారతీయుల క్షేమములకు సరిపడునట్టి యధికారములను బ్రిటీషుప్రభుత్వమువారి కప్పజెప్పుటలో నర్థమేమి? ఆయధికారములను మనము సరిగ నిర్వహింపజాలమనుటయే దానిభావము. ఇట్టివానిలో సైన్యమును, విదేశీయవ్యవహారములను మనవారు సాధారణముగ ముందుకు గొనివచ్చుచుందురు.

కాంగ్రెసు తీర్మానములో నిట్టి యధికారములేవియు ఇదమిత్థమని నిర్ణయింపబడి యుండలేదు. కాని మినహాయింపులు తప్పని సరిగా నుండవలయునని యభిప్రాయపడువారు సాధారణముగా నీయంశముల రెంటిని ఉదాహరించుచుందురు.

విదేశీయ వ్యవహారములను బ్రిటిషువారి కప్పజెప్పుట భారతీయుల క్షేమమున కెట్లు తోడ్పడునో బోధపడుటలేదు. ఒక చీనాతో గాని ఆఫ్ఘనిస్థానముతో గాని ఒడంబడిక గావించుకొనుటకు, లేక యుద్ధము సాగించుటకు ఏపద్ధతు లనుసరింపవలయునో అది యంతయు నిర్ణయించుటకు ఇండియా ప్రభుత్వముకాక కొన్ని వేలమైళ్లదూరములోనున్న విదేశ ప్రభుత్వమునకెక్కువ యర్హత లుండుట యెట్లో బోధపడదు. ఇంక సైన్యముల విషయమున, మనవారికి యుద్ధ పాండిత్యము చాలకపోయినచో, అట్టి దలవడుదాక, మన క్షేమమును గోరి మనము కొంతమంది బ్రిటిషుసైనికులను సేనలో ఉంచుకొనుట యవసరము కావచ్చును. కాని యీయంశములోనైనను తప్పని సరిగా మనము బ్రిటిషుసైనికులనే తీసికొనవలయునను నిర్బంధముండగూడదు. మనపరతులకు, మనమిచ్చు జీతములకు వారంగీకరింపకపోవచ్చును. లేకపోయినచో, అంతకన్న మన కెక్కువ యనుకూలముగా నుండు షరతులపై ఏజర్మనీవారో, ఫ్రెంచివారో మనకు లభింపవచ్చును. ఇట్టి సందర్భములలో మన కెక్కువ యనుకూలములయిన పద్ధతుల నవలంబించుటకు హక్కుండవలెను. కాబట్టియే, యీ యంశమునుగూర్చి చెప్పుచు గాంధీజీ స్టేట్స్‌మన్ పత్రిక ప్రతినిధితో "మీ పెద్ద ఉద్యోగీయులును, సాధారణ సైనికులును మా ప్రభుత్వముక్రింద పనిచేయ నిరాకరించుచో వారు లేకుండ మేము గడుపుకొనవలెను" అని చెప్పెను.

దీనిని బట్టిచూచినచో, ఇట్టి మినహాయింపు లను నవి మన క్షేమము ననుసరించి, మనమే నిర్ణయించుకొనుటకు హక్కు మన కుండితీరవలయునని అర్థము తేలుచున్నది. ఇట్లుకానిచో, బ్రిటిషువారి యిష్టము ననుసరించి నిర్ణయింపబడునో, నవి "భారతదేశపు క్షేమమునకవసరము" లైనవిగా నంగీకరించుటకు వీలులేదు.

అల్పసంఖ్యాక సంఘముల విషయమునగూడ కొంతకాలమువరకీ మినహాయింపు లవసరమని కొందరి యభిప్రాయము. కాని యీసమస్య ముఖ్యముగా హిందువులకును మహమ్మదీయులకును సంబంధించినది. అవశిష్టాధికారములు (రాజ్యాంగవిధానములో నిర్వచింపబడని యధికారములు-(Residuary powers) రాష్ట్ర) ప్రభుత్వముల కుండవలెనా, కేంద్రప్రభుత్వమున కుండవలెనా అను ప్రశ్నతో నిది యంతయు నిముడుచున్నది. దీనికి బ్రిటిషు ప్రభుత్వమువారిజోక్య మేమియు నవసరముకాదు.

ఇంక మిగిలినది సంస్థానాధిపతుల సమస్య. బ్రిటిషువారు సంస్థానములపై సర్వాధికారము బ్రిటిషు ప్రభుత్వమునకే చెందినదికాని ఇండియా ప్రభుత్వమునకు దానితో సంబంధ మేమియు లేదందురు. సంస్థానాధిపతులు గూడ నీసిద్ధాంతము నామోదించుచు వచ్చిరి. కాని ఇండియాలో ఫెడరల్ ప్రభుత్వ మేర్పడినచో కొన్ని షరతులపై అందుచేరుటకు వారిప్పుడు సంసిద్ధత జూపుచున్నారు. కాని వెంటనే అందరును ఇండియా ప్రభుత్వపు సర్వాధికారము నొప్పుకొందురన వీలులేదు. ఇట్టి సందర్భములలో ఫెడరల్ ప్రభుత్వములో చేరని సంస్థానముల విషయమున కొంత యధికారమును సంస్థానాధిపతుల యభిప్రాయము ననుసరించి బ్రిటిషు

ప్రభుత్వమువారి వశమునందుంచుట యావశ్యకమగును. ఈ మినహాయింపైనను తాత్కాలికముగ నుండవలసినదే కాని స్థిరముగ నుంచుటకు వీలులేదు. ఐన నిదియంతయు సంస్థానాధిపతులకును బ్రిటిష్ ఇండియా నాయకులకును ఏర్పడగల పరస్పర సామరస్యముపై నాధారపడియుండును. అందును, ముఖ్యముగ సంస్థానాధిపతుల యభిప్రాయములనుబట్టియే, వారికి బ్రిటిష్ ఇండియా ప్రజల యాశయములపట్ల గల సానుభూతినిబట్టియే, యిట్టిసామరస్యము కుదురుట కవకాశము గలదు.

## పూర్ణస్వరాజ్యము

కాంగ్రెసువారి యాదర్శము పూర్ణ స్వరాజ్యమై యుండవలె నని తీర్మానమునగలదు. దీనితోపాటుగనే తమ యిష్టమువచ్చినప్పుడు పరస్పరసంబంధమును వదలుకొనుటకు రెండుజాతులవారికి నధికారముండవలెను అని కూడకలదు. పూర్ణ స్వరాజ్యము కావలయునన్నప్పుడు పరస్పరసంబంధము వదలుకొనుటకు గల యధికారమునుగూర్చి మరల చెప్పవలసిన యవసరము కనబడదు. అసలు, అధినివేశస్వాతంత్ర్యములోనే యీయభిప్రాయమిమిడియున్నది. దీనిబట్టి కాంగ్రెసువారు, ప్రస్తుతము, తాము సంపూర్ణస్వాతంత్ర్యమునే కోరుచున్నను, బ్రిటీషువారితో నేదియో యొక యనుబంధము నుంచుకొనుటకే కోరుచున్నారని యూహించుట కవకాశము కలదు. ఐనచో, నీయనుబంధమెట్టిదిగా నుండవలయునను సందేహము గలుగుచున్నది. లాహోరు కాంగ్రెసు తీర్మానము "గతవత్సరము కలకత్తాలో గావింపబడిన తీర్మానము ననుసరించి యీకాంగ్రెసువారిప్పుడు కాంగ్రెసు ఆదర్శమందల్లి స్వరాజ్యపదమునకు సంపూర్ణస్వాతంత్ర్యము అను నర్థము నిర్వచించుచున్నారు. కావున అధినివేశప్రతిపత్తికిగా నిర్మింపబడిన నెహ్రూప్రణాళిక యింతటితో రద్దయినదని ప్రకటించుచున్నారు." అని చెప్పుచున్నది. ఇంక కరాచీకాంగ్రెసు తీర్మానములో "కాంగ్రెసువారికి బ్రిటీషుప్రతినిధులతో గలిసి యాలోచించుట కవకాశము గలిగినచో, కాంగ్రెసుప్రతినిధులు పైయాశయమును (అనగా సంపూర్ణ స్వాతంత్ర్యమును) సాధించుటకై ప్రయత్నింపవలెను." అని కలదు. ఈరెంటినిబట్టియు కాంగ్రెసువారు బ్రిటీషు సామ్రాజ్యముతో రాజ్యాంగసంబంధ మైన యెట్టి యనుబంధమును ఉంచుకొనుట కంగీకరింపజాలరని స్పష్టపడుచున్నది. "భారతదేశముయొక్క భావిదశకును, ఆస్ట్రేలియా ప్రతిపత్తికిని పోలిక యేమాత్రమును లే" దని మహాత్ముడు చెప్పినప్పుడు పైయంశమునే మహాత్ముడు స్పష్టపరిచెను. ఇంక బ్రిటీష్ భారతదేశముల కుండవలసిన సంబంధమునుగూర్చి స్టేట్స్మన్ పత్రిక ప్రతినిధితో మాట్లాడుచు, ఇంగ్లాండ్ ఫ్రాన్స్ దేశములకు యుద్ధవ్యవహారముల విషయమున గల యనుబంధమువంటిదే అవసరమైన విషయములలో ఇంగ్లాండ్ హిందూదేశములకు గూడ నుండవలయునని మహాత్ముడు సూచించెను. ఇదియే కాంగ్రెసువారి యభిప్రాయమైనచో, కరాచీ తీర్మానములో ప్రత్యేకముగా ఇంగ్లండ్‌తో సంబంధమును వదలుకొనుటనుగూర్చి యుదాహరింపవలసిన యవసరము గన్పింపదు కాని అధినివేశప్రతిపత్తి తగినదని ఒప్పింపగలవారున్నచో, దానిని తామంగీకరించెదరనియు, ఎట్లయినను వట్టిమాటలమీద తగాదాలు పెట్టుకొనక, అర్థమును భావమునుమాత్రమే కాంగ్రెసువారు పరిగణింతురని కూడ మహాత్ముడు స్పష్టపరిచెను. దీనినంతనుబట్టిచూచినచో, ఇష్టమువచ్చినప్పుడు బ్రిటీష్‌సంబంధము త్రెంపుకొనుట కధికారమున్నచో, అధినివేశప్రతిపత్తి నైనను సరే కాంగ్రెసువారంగీకరించెదరనియు, దానిని సంపూర్ణస్వాతంత్ర్యముగనే భావించుకొందురనియు తోచుచున్నది. ఇట్లయినచో, కరాచీతీర్మానములో పైసూచనను ప్రత్యేకముగ చేర్చుటలో గల యభిప్రాయమిదియే యై యుండవచ్చును.

## ప్రభుత్వ ఋణములు

ఇంక నీతీర్మానములోని నాల్గవభాగము, ఇండియా ప్రభుత్వపు ఋణములకు సంబంధించినది. దీనిని గూర్చి కొంతవివరముగ దెల్పుట యవసరము. హిందూదేశముపేరున బ్రిటిషుప్రభుత్వమువారు కావించిన ఋణములన్నియు న్యాయమైనవా కావా అను సంశయమును

గూర్చి ౧౯౨౨ సం. మునకుపూర్వ మెన్నడును కాంగ్రెసువా రాలోచించియుండలేదు. కాని ౧౯౨౨ సం. గయలో జరిగిన కాంగ్రెసుమహాసభయే, మొట్టమొదటి సారిగ, ఇండియాప్రభుత్వము పేరిట ప్రస్తుతమునగల ఋణములలో కొన్నింటిని, రాబోవు స్వరాజ్యప్రభుత్వము భరింపజాలదని తీర్మానించియుండెను.

కాని మరల ౧౯౨౯ వరకును జరిగిన కాంగ్రెసు సమావేశములలో నీతీర్మానముసంగతి యేమియు రాలేదు. గయ కాంగ్రెసు తీర్మానమును బ్రిటిషుప్రభుత్వమువారు గూడ నిర్లక్ష్యభావముతోనే చూచిరి. దేశములోని రాజకీయపక్షముల విభేదము లెక్కువై పోయి యేకముఖమున కొనసాగింపదగిన రాజకీయ కార్యక్రమ మేదియు లేకుండుటయే దీనికి కారణము. మరల ౧౯౨౯ సం. లో లాహోరుకాంగ్రెసు మహాసభవారు వెనుకటి గయకాంగ్రెసు తీర్మానమును స్థిరపరచుచు ఇండియాప్రభుత్వమువారి యీ ఋణముల న్యాయాన్యాయములను గూర్చి విచారించుటకు స్వతంత్రము, నిష్పక్షపాతమునగు నొకవిచారణసంఘ మేర్పడవలయునని తీర్మానించిరి. ఈసారి కాంగ్రెసుమహాసభవారు మరల నీప్రసక్తికి దిగుటయు, గాంధీజీకూడ పైతీర్మానమునకు హృదయపూర్వకముగ దన యామోదము దెలుపుటయు బ్రిటిషువారిలో కొంత యలజడి గలుగజేసినది. పైఋణములను ఎంతమాత్రమును నిరాకరించుటకు వీలులేదనియు వానినిగూర్చి పునర్విచారణ గావించుటకు వీలులేదనియు వారాందోళనము సాగించిరి. ఇది భారతీయులకు బ్రిటిషువారిపైగలయవిశ్వాసమును మరింత దృఢపరిచినది. ఋణములు న్యాయ్యములా యన్యాయ్యములాయను వంశమునుగూర్చి విచారణ సాగించుటకే బ్రిటిషువారంగీకరింపకుండుటవలన కాంగ్రెసువారికోరిక న్యాయ్యమైనదనియు, ఈఋణములవిషయమున రహస్యమేమో యుండవలయుననియు ప్రజలలో నొక నమ్మకము కలిగినది. కాంగ్రెసువారైన వెనుకముందు లాలోచింపక అన్ని ఋణములను నిరాకరింపవలయునని కోరుటలేదు కదా? నిష్పాక్షికమైన విచారణయే కదా వారు కోరుచున్నది.

ఇట్టిచో బ్రిటిషువారు విచారణకేల యంగీకరింపరాదను సంశయము మితవాదులకుగూడ కలిగినది. ఇట్టిసందర్భములలో బ్రిటిషువారితో నొడంబడిక కుదురుట కిది యొక ముఖ్యమైన షరతుగా పరిణమించినది. సప్రూ జయకరు రాయబారముల సందర్భమునగూడ నిది ప్రధానస్థాన మాక్రమించినది. అప్పుడు నాయకులందరును ఎఱవాడ చెరసాలలో కలిసికొని రాజ్యాంగప్రణాళికను గూర్చి తమషరతులను వైస్రాయిగారికి పంపిన సందర్భమున, నీయంశమునుగూర్చి వారిట్లు వ్రాసిరి:

"బ్రిటిషువారికి ఈదేశములోగల ప్రత్యేకపు హక్కు సౌకర్యముల న్యాయాన్యాయములనుగూర్చియు స్వరాజ్యప్రభుత్వమువారికి ఆఋణముల యందుండదగిన బాధ్యతనుగూర్చియు విచారణచేయుటకొక నిష్పాక్షిక విచారణసంఘమును నియమించుటకు అధికారావకాశము లారాజ్యాంగ ప్రణాళికలో నుండవలెను."

ఇట్లు కాంగ్రెసువారీ ఋణముల విషయమున నిష్పాక్షికమగు విచారణ గావలయునని కోరుచుండగా ప్రభుత్వమువారుమాత్ర మందుకు తమ యంగీకారము దెల్పక తప్పించుకొనుటకు బ్రయత్నించుచుండిరి. కాంగ్రెసువారి పైకోరికకు సమాధానముగ ప్రభుత్వమువారి యభిప్రాయము, సప్రూజయకరుగార్లు వైస్రాయిగారితోడి తమసంభాషణనుగూర్చి కాంగ్రెసునాయకులకు తెలియజేసిన యంశములలో, నీక్రిందివిధముగ దెలుపబడినది:

"ఋణములన్నిటిని పూర్తిగా నిరాకరించునట్టి సూచనకును రాజప్రతినిధి యొప్పుకొనజాలడు. అయినను ఇండియాయొక్క ధనవ్యయభారమునకు సంబంధించిన యెట్టిప్రశ్నయైనను ఎవరైనను రౌండుటేబిల్ సమావేశములో పరీక్షార్థము గొనిరావచ్చును."

ఈవిధముగ, కాంగ్రెసువారు తమయభిప్రాయమును మరల స్పష్టముగ దెల్పుచు, నిష్పాక్షికమగు విచారణజరుగవలయుననియు అట్టి విచారణసంఘమును నియమించుటకు గల యధికారమునుగూర్చి రాబోవు రాజ్యాంగ ప్రణాళికలో స్పష్టముగా నుదాహరింపబడవలెననియు

కోరియుండ, దీనికిసరియైన సమాధానమీయక, రౌండ్ టేబిల్ సమావేశములో దీనినిగూర్చి చర్చింపవచ్చునని వైస్రాయిగారనిరి. పైపెచ్చు, కాంగ్రెసువారు పూర్తిగ ఋణములను నిరాకరించెదమని చెప్పకుండగనే, "గుమ్మడికాయలదొంగయన్న బుజములు తడుముకొనె" నన్నట్లు, ఋణములన్నిటిని పూర్తిగ నిరాకరించు సూచనను తామంగీకరింపజాలమని ప్రభుత్వమువారు ప్రకటించుకొనిరి. ఇట్టిస్థితిలో, నీధోరణి ప్రజలకు ప్రభుత్వముపై గల యవిశ్వాసమును మరింతబలపరచుటలో నాశ్చర్యముండదు. కాబట్టియే నిష్పాక్షికమగు విచారణసంఘమేర్పడవలయునని కరాచీకాంగ్రెసువారు మరల తీర్మానించిరి.

## భగత్సింగు ప్రశంస

ఈరెండుతీర్మానముల తరువాత రాదగినది భగత్సింగు మున్నగువారి ధైర్యత్యాగముల ప్రశంసకు సంబంధించినతీర్మానము. కాంగ్రెసుమహాసభవారిదివరలో, నిట్టితీర్మానమును, అనగా, దౌర్జన్యమార్గము నవలంబించు విప్లవవాదులను ఏవిధముగగాని ప్రశంసించు తీర్మానమును, ఎప్పుడును ఆమోదించియుండలేదు. వెనుక 1924 సం. లో డే యను నాంగ్లేయుని హత్యగావించినందుకై కలకత్తాలో గోపీనాథ్ సాయను నొకయువకు డురితీయబడెను. ఆతడు న్యాయస్థానములో దా నొక యూరపియన్ పోలీసు ఉద్యోగిని చంపవలయునను ప్రయత్నమున నంటిననియు కాని దురదృష్టవశమున మరియొకరిప్రాణములను దీయవలసివచ్చినందుకు విచారించుచుంటిననియు నిర్భయముగ తననేరము నొప్పుకొనెను. ఆసందర్భమున, కీ. శే. దేశబంధు చిత్తరంజనదాసుగారి యాజమాన్యమున జరిగిన వంగరాష్ట్రమహాసభలో ఇప్పటి కరాచీ కాంగ్రెసువారి భగత్సింగు తీర్మానము వంటిదే, యొక తీర్మానముగావింపబడినది. కాని అటు తరువాత మరల నందుకు కాంగ్రెసువారి యసమ్మతి దెలియజేయుచు అహమదాబాదులో సమావేశమైన అఖిల భారత కాంగ్రెసుసంఘమువారు తీర్మానించిరి. అ. భా. కాంగ్రెసుసంఘమువారీతీర్మానము గావించుటకు ఆసందర్భమున మహాత్మునిపట్టుదలయే కారణమయ్యెను. కాంగ్రెసుమహాసభ తననాయకత్వమున నున్నంతకాలము దానికి దౌర్జన్యముతో నెట్టిసంబంధము నుండగూడదని ఆయన దృఢాభిప్రాయము. రాజకీయముగ నెట్టిదౌర్జన్యము జరిగినను, దానిపట్ల కాంగ్రెసువారు తమయసమ్మతి బ్రకటించి స్వరాజ్యమును సంపాదించు విషయమున నహింసామార్గమునందు తమకుగల నమ్మకము బ్రకటింపవలయునని ఆయన దృఢనిశ్చయము. కాబట్టియే 1929 స. డిసెంబరునెలలో, వైస్రాయిగారి రైలుబండిక్రింద బాంబునుంచినవారితో కాంగ్రెసు కెట్టిసంబంధమును లేకపోయినను, ఈసంఘటననుగూర్చి లాహోరు కాంగ్రెసుమహాసభవారీక్రిందితీర్మానము గావించిరి :

"ఈ సభవారు వైస్రాయి బండిమీద గావింపబడిన బాంబుప్రయోగమును నిరసించుచు, ఇట్టి చర్యలు కాంగ్రెసు సిద్ధాంతమునకు వ్యతిరేకమనియు, జాతీయసమరమునకు నష్టకరమనియు తమకుగల యభిప్రాయమును తిరుగ దృఢపరచుచున్నారు. మరియు దైవవశమున, ఇర్విన్ దంపతులు వారిపరివారము ప్రాణోపద్రవము లేకుండ తప్పించుకొనగలిగినందులకు వారి నభినందించుచున్నారు."

తీర్మానము గెలిచినది. కాని యిట్టితీర్మాన మనవసరమని భావించినవారుగూడ చాలమంది యుండిరి. ఇది లాహోరుకాంగ్రెసువారామోదించి యిప్పటికి ౧౬ నెలలు గడచిపోయినవి. ఈపదుమూడు నెలలలోను ప్రభుత్వమువారి చర్యల విషయమున ప్రజలలో గలిగిన ద్వేషభావమునకు వారిసద్భావముల పట్ల గల యవిశ్వాసమునకు దోహదమొసంగిన సంఘటన లనేకములు జరిగినవి. ఇట్టివానిలో చిట్టచివరిది భగత్సింగ్ మున్నగువారి నురిదీయుటయే. ఈయురివార్త విన్నప్పుడు దేశమంతయు గగ్గోలెత్తిపోయినది. ప్రభుత్వమువారి చర్యలపట్ల ప్రజలకుగల నిరసనభావ మీసందర్భము నందువలె మరియెన్నడును స్పష్టముగా లేదు. ఈనిరసనభావమునకు ఫలితమే కరాచీకాంగ్రెసువారి భగత్సింగు తీర్మానము. పైనుదాహరింపబడిన లాహోరు తీర్మానమునకును దీనికినిగలభేద

ము గమనించినచో ప్రజల యభిప్రాయములో సంభవించిన యీ నూతనపరిణామము స్పష్టపడగలదు. కరాచీ కాంగ్రెసుతీర్మాన మీక్రిందివిధముగ నున్నది.

“రాజకీయమయిన కార్యసిద్ధిని బడయుటకు ఎచటనైనను, ఏరీతిగనైనను దౌర్జన్యమును సాధనముగా గొనుటకు కాంగ్రెసువా రెంతమాత్రమును సమ్మతింపజాలరు; అట్టివారితో నెన్నడును కలిసి పనిచేయజాలరు. కాని స్వర్గీయులగు భగత్సింగు, రాజగురు, సుఖదేవ్ గార్లు వెల్లడించిన ధైర్యత్యాగముల ప్రశంసించుచు వీరిమరణములవలన సంతాపమునకు గురియైన వీరికుటుంబములకు తమ సంతాపమును సానుభూతిని వెల్లడించుచున్నారు. వీరిముగ్గురిని ఉరిదీయుట కేవలము బుద్ధిపూర్వకమగు ప్రతీకారమే యగును. శిక్షను రద్దుపరుపవలెనని దేశీయులందరును గూడ కోరుచుండినను వీరి నురిదీయుట దేశీయులకోరికను బుద్ధిపూర్వకముగ తిరస్కరించుటయే యగును. ప్రస్తుతసమయమున బ్రిటన్ భారతదేశముల వారిలో సద్భావమును వృద్ధినొందించుట అత్యావసరమని యంద రంగీకరించియేయుండినను, అందులకు కలిగిన గొప్పయవకాశమును దొరతనమువారు వ్యర్థమొనరించిరి. తీవ్రమగు నిరాశవలన దౌర్జన్యమునకు గడంగుచున్న పక్షమువారిని శాంతిమార్గమున మరల్చుటకు దగిన గొప్ప యవకాశమునుగూడ దొరతనమువారు వ్యర్థపరచిరని కాంగ్రెసువారు తలచుచున్నారు.”

ఇట్టితీర్మానము కాంగ్రెసువారికి అహింసామార్గమునందుగల నమ్మకమును వెల్లడించుచునే, ప్రభుత్వమువారి సద్భావముపై ప్రజలకుగల యవిశ్వాసమును స్పష్టముగ ప్రకటించుచున్నది.

## మిగిలిన తీర్మానములు

ఈ మూడింటితరువాత ముఖ్యమయినది సరిహద్దు ఆక్రమణవిధానమునకు సంబంధించిన తీర్మానము. మొట్టమొదటినుండియు ఇంగ్లీషువారికి రష్యావిషయమున నొక యనుమానమును భయమును గలవు. రష్యావారెన్నటికైన ఈ పశ్చిమోత్తరప్రాంతములద్వారా భారతదేశముపై వచ్చిపడుదురని వారి భయము. అందుచే సాధ్యమయినంత వరకు తమబలగములనన్నిటిని వారచ్చట చేర్చుచుండిరి. హిందూదేశపురక్షణ విషయమున వారికి తక్కిన దిక్కులన్నియు నొకయెత్తు; ఈ పశ్చిమోత్తరపు సరిహద్దు లొకయెత్తు. ఇటు చీనావారివిషయమునగూడ నింతటి భయమున కవకాశమున్నను, చీనాదేశపు ప్రస్తుతస్థితిగతుల ననుసరించి దానికి వారింత భయపడరు. ఇట్లు సరిహద్దు ప్రాంతములను రక్షించుకొను నుద్దేశముతోనే ఇండియా ప్రభుత్వమువా రీనడుమ అచ్చటనున్న ప్రదేశములను- ఇదివరలో తమయధికారము క్రిందికి రానివానిని- క్రొత్తగా ఆక్రమణగావించుకొనుట మొదలిడిరి. కాని యీ విధానమువలన ఇక ముందు నష్టపడునది భారతీయులు కాని ఆంగ్లేయులుకారు. ప్రభుత్వమువారి యీచర్య అచ్చటనున్న ప్రజలకు—వారేయితర ప్రభుత్వములకును లోబడక యింతవరకు స్వాతంత్ర్యము ననుభవించుచున్నవారు—భారతీయులపై ద్వేషభావము రగుల్కొల్పుటకు తోడ్పడును. ఇది ముందుముందు భారతీయులకే నష్టము. అంతేకాక, నిజమునకు, భారతీయులు స్వక్షేమమునకై యిరుగుపొరుగు దేశములవారితో స్నేహభావము గుదుర్చుకొనియుండుట యవసరము. బ్రిటిషువారికై వారు ఈదేశములతో విరోధము దెచ్చిపెట్టుకొనజాలరు. ఇట్టిస్థితిలో కాంగ్రెసువారు ఈవిషయమున తమయభిప్రాయమును స్పష్టపరచుట యవసరమైనది. అందుచేత కరాచీలో కాంగ్రెసుమహాసభ దీనినిగూర్చి యీక్రింది తీర్మానముగావించెను:

“హిందూదేశపు సరిహద్దులలోనున్న దేశములతో గాని ప్రజలతోగాని భారతీయుల కెట్టివిరోధమును లేదని యీకాంగ్రెసుమహాసభవారు ప్రకటించుచున్నారు. వారితో స్నేహము గుదుర్చుకొనుట కాంగ్రెసువారి యభిప్రాయము. సరిహద్దు ప్రాంతములలోని ప్రజల స్వాతంత్ర్యమును నశింపజేయుటకై పశ్చిమోత్తర ప్రాంతములలో ఇండియాప్రభుత్వమువారు కొనసాగించుచున్న ‘ఆక్రమణ’ పద్ధతిని (Forward policy) కాంగ్రెసువారు నిరసించుచున్నారు. హిందూదేశపు ధనమును గాని సైన్యమునుగాని పైపద్ధతిని కొనసాగించుటకై యుప

## షౌకతాలీ, చర్చిలుగార్లు మహాత్ముని బెదరించుట




---

## హైకోర్టు బీచి, చెన్నపురి



చి. ఓ. సుందరేశం (౧౨ ఏండ్లు) తీసినది.

---



శ్రీ పండిత జవాహర్‌లాల్ నెహ్రూగారు, వారి సతీ సుతలు, సోదరియు.



పరీక్షరోజుల్లో
(రాత్రి తీసిన చిత్రము) శ్రీ బొడ్డు బాపిరాజుగారు పంపినది.

యోగించుటకు వీలు లేదనియు, సరిహద్దు ప్రదేశముల యాక్రమణమును వెంటనే మానివేయవలయుననియు కాంగ్రెసువారి దృఢాభిప్రాయమై యున్నది."

ఈయంశ మసలు 1927 సం. న మదరాసులో జరిగిన కాంగ్రెసులో చర్చకువచ్చినది. అప్పుడుగూడ కాంగ్రెసువా రిట్టితీర్మానమునే యొకదానిని చేయుచు అందుకుగలకారణముల నాతీర్మానములో నిట్లు వివరించి యున్నారు:

"భారతదేశమునందును, ప్రాక్సముద్రములయందును, అంతముఖ్యముగా, భారతదేశమున పశ్చిమోత్తర పరగణాలయందును, బ్రిటీషుప్రభుత్వము వారు గావించుచున్న అసాధారణమగు విస్తారసమరసన్నాహముల నీసభ వారపరిమితాందోళిత హృదయములతో పరికించుచున్నారు. ఈ సంగ్రామసన్నాహములు భారతీయుల స్వాతంత్ర్యప్రయత్నములను అణచివైచి భారతదేశమున బ్రిటీషుసామ్రాజ్యాధికారమును దృఢతరముగ నొనర్చుకొనుట కుద్దేశింపబడుటయేకాక ఇందువలన వినాశకరమగు సంగ్రామ మనతికాలమున సంభవించి, ఆసమయమున విదేశీయులు (ఆంగ్లేయులు) తమ సామ్రాజ్యమును విస్తరింపజేసికొనుటకు భారతదేశమును సాధనముగ నొనర్చుకొన బ్రయత్నించెదరు."

తరువాత కలకత్తాలో సమావేశమయిన కాంగ్రెసు మహాసభవారుగూడ నిట్టితీర్మానమే యొకటికావించిరి. లాహోరులోమాత్ర, మెందుచేతనో, మరల నీతీర్మానము ప్రసక్తియే లేకపోయినది.

దీనితరువాత నెన్నదగినది బర్మావిభజనమునకు సంబంధించినతీర్మానము. బర్మావిభజనము విషయమున మొదటినుండియు నచ్చటిప్రజలలో రెండభిప్రాయము లుండినవి. బర్మానాగరకతయే వేరనియు, బర్మాకును భారతదేశమునకును గల సంబంధము భారతదేశములోని యితర ప్రాంతములపరస్పరసంబంధమువంటిది గాదనియు, బర్మాదేశపు విజ్ఞానమే వేరనియు, నందువలన బర్మా భారతప్రభుత్వమునకు లోబడక స్వతంత్రముగ నుండదగుననియు నొకపక్షమువా రందురు. ఇట్లుకాక బర్మా విజ్ఞానము భారతీయవిజ్ఞానముతో సంపూర్ణమగు సనుబంధము గలదనియు, సమీపస్థమగు భారతదేశముతో గలిసియుండుటయే బర్మాకు క్షేమకరమనియు రెండవ పక్షమువారివాదము. ఈయభిప్రాయభేదములమాట యటుండ వేలకొలదిమంది భారతదేశీయు లక్కడ నివాస మేర్పరచుకొని యిదివరకెన్నాళ్లనుండియో కోట్లకొలది రూపాయల వర్తకవ్యాపారములను కొనసాగించుకొనుచున్నారు. ఇట్టిస్థితిగతులలో బర్మాను భారతదేశము నుండి విడదీయవలచుకొన్నప్పుడు ముందుగ రెండుసంగతులను ముఖ్యముగ పరిశీలింపవలసియుండును. మొదటిది బర్మాప్రజల యభిప్రాయము; రెండవది హిందూదేశమునకును బర్మాకును, ఇదివరకవి కలిసియుండుటచే, గల యార్థికసంబంధములు. కాని ప్రభుత్వమువారీ రెండు సంగతులను లక్ష్యపెట్టలేదు. రెండవయంశము నొకవేళ తరువాత నిర్ణయింపకొనవచ్చు ననుకొన్నను, మొదటి సంగతినిమాత్రము ముందుగ తేల్చవలసియుండెను. కాని ప్రభుత్వమువారు బర్మావిభజనమునే యభిమానించుచుండుటచే, వారు తమ కనుకూలాభిప్రాయముగలవారిని ప్రతినిధులుగా నియమించి రౌండ్ టేబిల్ సభకు గొనిపోయిరి. అచ్చట బర్మాప్రతినిధులు, ప్రభుత్వమువారను కొన్నట్లు, విభజనమునే కోరిరి. కాని దానితోపాటు అదినివేశ స్వాతంత్ర్యమునుగూడ వారు కావలెననిరి. ఇంతటితో వ్యవహారమంతయు తలక్రిందైనది. బర్మాను భారతదేశమునుండి విడదీయుటయే ప్రభుత్వమువారి యభిలాష. కాని వెంటనే దానికిస్వాతంత్ర్యమిచ్చుటకు వారికి మనసు లేదు. ఈసమస్య యింతతీవ్రముగ తమ్మెదుర్కొనునని వారు తలచియుండరుగూడను. భారతీయసభ్యులుగూడ బర్మావిభజనమునుగోరుటకు బర్మాప్రజలకు హక్కుగలదని యంగీకరించుచు, వారికి వెంటనే స్వాతంత్ర్యము నొసంగిననేకాని యట్టివిభజనము జరుగగూడదని మాత్రము తమ యభిప్రాయమును స్పష్టపరచిరి. అంతటితో బర్మావిభజనవ్యవహారము స్తంభించిపోయినది. దానిగూర్చి రౌండ్ టేబిల్ సభలో ఇదమిత్థమని నిర్ణయింపబడనే లేదు. ఇదియిట్లుండ, భారతదేశమునందు ఫెడరల్ ప్రభుత్వమేర్పడ నుండుటచే, ఒకవేళ భారతదేశము

నుండి విడిపోవుటకన్న, దానితో గలిసియుండుటయే లాభకరమేమో యను సందేహము, విభజనవాదులగు బర్మావారిలో కొంతవరకొక సందేహము గలుగజేసినది. బర్మాప్రతినిధులు, కాంగ్రెసుకువచ్చినవారు, బర్మాలో విభజన మక్కరలేదనువారే చాలమంది కలరనియు, అందుచే బర్మావిభజనము జరుగగూడదనియు గట్టిగ వాదించిరి. అందుపై విభజనము పూర్తిగ బర్మాప్రజల యిష్టమునుబట్టియే జరుగవలయునని కాంగ్రెసువారొక తీర్మానము గావించిరి:

“హిందూదేశమునుండి విడిపోవుటకుగాని, తమ యిష్టమువచ్చినప్పుడు వీడిపోవునధికారముతో, స్వతంత్ర భారతదేశమున స్వపరిపాలనగల రాష్ట్రముగానుండుటకు గాని బర్మాకుగలహక్కును ఈకాంగ్రెసువారు గుర్తించుచున్నారు. కాని బర్మావారికి స్వీయాభిప్రాయముల బ్రకటించుకొనుటకవకాశమొసగక ఎన్నికగన్న బర్మా ప్రతినిధులయిష్టమునకు కేవలము విరుద్ధముగ బలవంతము చేసి బర్మాను విడదీయుటకు బ్రిటిషుప్రభుత్వమువారు చేయుప్రయత్నమును ఈకాంగ్రెసువారు నిరసించుచున్నారు.”

ఇంతేకాక బర్మాకు స్వాతంత్ర్యమొసంగు నభిప్రాయముతోగాక దానిని “ఆసియా ప్రాచ్యప్రాంతమున సామ్రాజ్యమునకు గట్టిపట్టుగాజేసికొని బ్రిటిషునిరంకుశాధికారమును శాశ్వతమొనరించుకొనుటకే యీ విభజన ప్రయత్నము” జరుగుచున్నదనికూడ కాంగ్రెసువారభిప్రాయపడిరి.

తరువాత ముఖ్యమైనతీర్మానము రాజకీయనిర్బంధితుల విడుదలకు సంబంధించినది. గాంధి - ఇర్విన్ ఒడంబడికలో నుదాహరింపకపోయినను, అన్నివిధముల రాజకీయనిర్బంధితులను విడుదలగావింపవలయుననియు వారిపై గలనిర్బంధములను తొలగింపవలయుననియు నీతీర్మానము కోరుచున్నది. ఇందువల్ల బ్రిటిషుభారతదేశముల సుహృద్భావము పెంపొందుననియు, ఒడంబడిక చేసికొనుటలో ప్రభుత్వమువారు హృదయపూర్వకముగ బ్రవర్తించిరని విశ్వాసముగలిగించుటకది తోడ్పడుననియు తీర్మానము తెలుపుచున్నది.

అటుపై సాంఘికసమస్యకును, కాన్పూరు మున్నగుచోట్ల జరిగినయల్లరులకును జెందిన తీర్మానములు మూడు కలవు. వీనిలో ముఖ్యమైనది పశ్చిమోత్తర ప్రాంతమునకు సంబంధించినది. ఇంతవరకును హిందూదేశమునకు స్వరాజ్యమువచ్చినప్పుడు తక్కినరాష్ట్రముల యందలి ప్రభుత్వవిధానమే పశ్చిమోత్తర ప్రాంతములలో నుండవలయునా అక్కరలేదా యను నంశమును గూర్చి కొంత తగాదాయుండెను. ఉండవలయునని మహమ్మదీయులును, కూడదని కొందరు హిందువులును వివాదపడుచుండిరి. రౌండ్ టేబిల్ సభవారు ఆరాష్ట్రమునకు ప్రత్యేకముగ నొకప్రభుత్వవిధానమును సూచించిరి. ఇది మహమ్మదీయులలో చాలమంది కాగ్రహము గలిగించినది. ఇట్టిస్థితిలో నీయంశమునుగూర్చి కాంగ్రెసువారు తమయభిప్రాయము బ్రకటించుట యవసరమయ్యెను. అందుచే వారు “ఇటుపై రాబోవు ఎట్టి రాజ్యాంగవిధానములోనైనసరే, తక్కినరాష్ట్రములలో నెట్టి ప్రభుత్వమేర్పడునో సరిహద్దుప్రాంతములలోగూడ నట్టిప్రభుత్వమే యేర్పడునని యీకాంగ్రెసువారు స్పష్టపరచుచున్నారు.” అని తీర్మానించిరి.

తరువాత నిర్మాణకార్యక్రమమును కొనసాగించుటకు సంబంధించినవి రెండుతీర్మానములున్నవి. వీనిలో నొకటి మామూలుగా ఖద్దరుప్రచారమునకై ప్రయత్నింపవలయునని సూచించుటయేకాక, కాంగ్రెసువారి స్వదేశీప్రచారమునకు హిందూదేశములోని మిల్లుయజమానులును, సంస్థానాధిపతులును, విదేశములనుండి భారతదేశముతో వ్యాపారము సాగించుకొనుచున్నవారునుగూడ తోడ్పడవలయునని కోరుచున్నది. ఈకడపటిసందర్భమున “విదేశములలోని వ్యాపారులు హిందూదేశమునకు విదేశవస్త్రబహిష్కారమును కొనసాగించకొనుట యవసరమనియు, ప్రయోజనకరమనియు గ్రహించుకొని హిందూదేశములోని తమ వ్యాపారమును మానుకొనవలయునని కాంగ్రెసువారు వారినికోరుచున్నారు” అని తీర్మానమున్నగలదు. రెండవతీర్మానము గాంధి - ఇర్విన్ ఒడంబడిక ననుసరించి విదేశవస్త్రముల దుకాణముల యొద్దను, కల్లుసారాయిదుకాణములవద్దను పికెటింగు సాగింపవలయునని కోరుచున్నది.

ఇంక మామూలుగ నేటేటవచ్చు తీర్మానములు రెండుకలవు. మొదటిది కీర్తిశేషులయిన కాంగ్రెసు పెద్దలనుగూర్చినది. రెండవది తూర్పు దక్షిణఆఫ్రికాల భారతీయులకు సంబంధించినది. ఈ రెండవతీర్మానము ఇంచుమించుగా కాంగ్రెసు ఏర్పడిననాటినుండియు వచ్చుచునే యున్నది. కాంగ్రెసువా రెన్నిసారులు తీర్మానముల గావించినను ఆదేశములలోని ప్రభుత్వమువారు భారతీయులపట్ల న్యాయముగ ప్రవర్తించుటకాని, బ్రిటిషు ప్రభుత్వమువా రీవిషయమున బాధ్యత వహించుటగాని జరుగలేదు. నిజమున కీసమస్య భారతదేశమునకు స్వాతంత్ర్యము లభించిననాడే యనుకూలముగ బరిష్కారమునకువచ్చునని చాలమందినమ్మకము. అందుచే బహుశః "పూర్ణస్వరాజ్యము"ను కాంగ్రెసు ప్రకటించిననాడే, యీ తీర్మానముయొక్క యావశ్యకతకూడ తొలగిపోవచ్చును.

ఇవియన్నియుగాక సత్యాగ్రహములో పాల్గొన్నవారి నభినందించు తీర్మాన మొకటికలదు.

వీనిలో, కీర్తిశేషులయిన వారిపట్ల సంతాపము దెల్పునదియు నీ కడపటిదియుదప్ప, తక్కినవన్నియు తీవ్రచర్చకు బాలయినవి. కాని యింతచర్చజరిగినను, ఇన్ని యభిప్రాయభేదములుండినను కరాచీకాంగ్రెసువలె ప్రజల కార్యాచరణదీక్షను, సామర్థ్యమును మరియొక కాంగ్రెసుసమావేశ మేదియు బ్రకటింపగలిగియుండలేదు. ప్రస్తుత స్థితిగతులలో కాంగ్రెసులోని వివిధపక్షములవారు నింతటి యైకమత్యము బ్రకటించుట, అందరికన్న ముఖ్యముగ, ప్రభుత్వమువారి కాశ్చర్యకరముగ నుండియుండవచ్చును.

---

## సమయరంగము

కాశీభట్ట కృష్ణరాయశాస్త్రిగారు

విభుతాన్యాన విలాసముల్చెలగఁ బృథ్వీహస్తసంవాహనా
ప్రభవఖ్యాతులఁ జైత్రయాత్ర సలుపం బ్రస్ఫీతవాసంతికా
దిభరప్రేమరసాస్పదక్రమము నుద్దీపింప నేతెంచునీ
యభయోదార మనోహరంబగు సురూపౌజ్జ్వల్య మీక్షింతుమే.

నన చెలువ ల్వాలంతులయి నంటుతనాన ననంటిజోదెలన్
జనువునఁ గూర్చి గొజ్జఁగుల చల్లనినీటను నాడియాడి యా
మని మనవు ల్దుబాసి కని మావుల కొమ్మలమాటు డాఁగి పి
ల్చిన తతి నెట్టవేలుపును జేరియు రావె తెలుంగు సీమకున్.

నవభావంబులు నవ్యకాంతులును నానా దేశము ల్నిండ నీ
రవగాఢక్షణదాంగనాలపితస ద్రాగప్రభాభాసుర
చ్ఛవిపూరంబునఁ దేలియాడ సమయస్వాచ్ఛస్వకాయాభిధో
త్సవము ల్వేడుకఁ జూడ రమ్ము రుచిరాబ్జప్రోత్థగానంబుతోన్.

ప్రాఁతవైనను క్రొత్తలై రహిఁ జెలంగు
నే ప్రభావంబుననొ యెవ్వఁ డెఱుఁగుననుచుఁ
బ్రణవ మొఱుకయై క్రొత్తగాఁ బెరఁగునట్లు
తనుమ క్రొంగ్రొత్తల యుగాది గానవచ్చె.

---






శ్రీమతి రత్నాల కృష్ణాబాయిగారు,
బి. యే., యల్. టి.

ఈమె రత్నాల అబ్బాయి నాయుడుగారి జ్యేష్ఠ తనయ. సుమారు ఇరువదియైదు సంవత్సరములు ఈమె ప్రాయము. ప్రాచీనమును, గౌరవాస్పదమును అను బలిజ కులము ఈమెజన్మస్థానము. వీరిపూర్వులు తంజావూరు నాయకరాజులకు అంగరక్షకులుగా నుండి స్వామిహితైక జీవనులయి క్షాత్రధర్మము నడపి మన్ననల నంది ఖ్యాతి గాంచిరి. తండ్రిగారీమెకు బాల్యముననే బాలునికి గావించినట్లు విద్యాభ్యాసము చేయించి చదువు చెప్పించిరి. గురువుకడ నేర్వకయే స్వయముగ కృషిచేసి తన ఊహ వలన ఈమె చిత్తరువులు వ్రాయుటయందు మరింత నైపుణ్యము సంపాదించుకొన్నది ఈమె రంగులతో రచించిన చిత్తరువులుకొన్ని పాశ్చాత్యదేశములందు జరిగిన 'లలితకళా' ప్రదర్శనములందు మిక్కిలి ప్రశస్తము లయి యున్నవని పొగడ్త గాంచియున్నవి: బహుమతు లందియున్నవి. మద్రాసు పార్కు ఫెయిరునందు జరిగిన చిత్రకళాప్రదర్శనమందు ఈమె చిత్రరచనా కౌశలము మనోహరమైనదని ప్రశంసింపబడినది. ఆ సమయమున నీమెకు బంగారుపతకము ప్రథమ బహుమానముగా నొసగబడెను. ఈమె చిత్రించిన బొమ్మలలో 'రాణీ మీరాబాయి', 'నిరీక్షణ', 'రాధా వినోదము', 'నీల వర్ణుడు' మున్నగునవి మిక్కిలిసొగసైనవి. ఈమెకు చిత్తరువులు వ్రాయుటయందే గాక, గాంధర్వ కళయందు ప్రావీణ్యము కలదు. జంత్రగాత్రముల సమముగా నీమె మధురమైన గానమాలాపింపగల ధన్యురాలు. ఫిడేలు, వీణియలమీదను, వంగదేశీయమైన ఇస్రాజ్ అను వాద్యముమీదను ఈమె సంగీతము వినిపింపగలదు. ఫిడేలు వాద్యమున నీమెకు గల ప్రావీణ్యము, పాండిత్యము మిక్కిలి ప్రశంసార్హములు, మనోజ్ఞములు. ఇస్రాజ్ పై ఆలాపించుట యీమె శాంతినికేతనమున ఠాకూరు మహాకవి సన్నిధానమున గడిపిన స్వల్పకాలములో నల వరుచుకొన్నది. ఠాకూరుమహాకవి యీమె గానమాధురిని, జంత్రవాద్యమును మెచ్చుకొన్నాడు. ఈమె సహృదయ. ఆంగ్లభాషలో నీమె పట్టపరీక్ష నిచ్చి, ఉపాధ్యాయపట్టము నంది ప్రస్తుతము కాకినాడలో బాలికా పాఠశాలలపై డిప్యూటి యిన్స్పెక్ట్రెసుగా పనిచేయుచున్నది.

—భా. వేం. కృ.



# కీ. శే. గణేశశంకర విద్యార్థి

'విశాలభారత' ఏప్రిలు సంచికయందు శ్రీ శ్రీరామశర్మ (బి. ఏ.) గారు (ప్రతాప పత్రికా సంపాదకవర్గమున నుండినవారు, విద్యార్థిగారి ప్రాణమిత్రము) శ్రీ శ్రీ గణేశశంకర విద్యార్థి పవిత్ర జీవితమును గూర్చి యిట్లు వ్రాసిరి.

గణేశశంకర విద్యార్థి గారి తండ్రి జయనారాయణ గారు హతగామజిల్లా ఫతేహ్ పురమువారు. వారికి పారసీ బాగుగ వచ్చును. ఇంగ్లీషు స్వయముగా నేర్చుకొన్నారు. వారు గ్వాలియరులోని ఆంగ్లో - వర్నాక్యులరు స్కూలులో రెండవ ఉపాధ్యాయులుగా నుండిరి.

గణేశశంకర విద్యార్థి విక్రమ శకము ౧౯౪౭ (క్రీ. శ. ౧౮౯౦-౧) మాతామహ గృహమున జన్మించెను. ఇతడు మాతృగర్భమునుండ నితనిమాతామహి కొకరాత్రి స్వప్నమున నెవరో గణేశవిగ్రహము నొసగిరట. ఆ కారణమున నామె తనకూతునకు మగబిడ్డపుట్టిన గణేశుడనియు, ఆడుబిడ్డ పుట్టిన గణేశియనియు పేరిడ నిశ్చయించెను. దైవానుగ్రహమున కుమారుడే జన్మించెను. అనుకున్నట్టులాశిశువునకు గణేశనామమయ్యెను.

గణేశునిజననము మొదలు నా కుటుంబమున కభ్యుదయ ప్రాప్తి గలిగెను. అతని తండ్రికి వేతన మధికమయ్యెను.

గణేశశంకరుడు అయిదవయేట ఉర్దూ చదువ మొదలిడెను. తొలివిద్య నతడు గ్వాలియరులోనే నేర్చెను. తండ్రియొక్క శిష్టాచార పరత్వము, సత్ప్రవర్తనము, సహృదయత మొదలయిన సద్గుణములు గణేశునకు చిన్ననాటనే చక్కగా పట్టువడెను.

కీ. శే. గణేశశంకర విద్యార్థి

అతడు చిన్ననాటనుండి చాల పట్టుదల గలవాడు.

గణేశుడు మొదటినుండి పత్రికలను మిగుల నాసక్తితో చదువువాడు. ఆసక్తియే కాదు; అతని కది అనుదిన మానసికాహార మయ్యెను.

క్రీ. శ. ౧౯౦౭-వ సంవత్సరమున విద్యార్థి ప్రవేశపరీక్ష ప్యాసయినాడు. మరుసంవత్సరము ఇంటర్మీడియటు పరీక్షకు చదువుటకయి ప్రయాగకేగెను. కాని ధనాభావము, గార్హస్థ్యభారము కారణముగా చదువు సాగమి నటనుండి కాన్పూరునకు మరలివచ్చెను. అక్కడ నుద్యోగమున ప్రవేశించెను. ౧౯౦౭ మొదలు ౧౯౧౩ వరకు అనగా ప్రతాపపత్రిక ప్రారంభకాలము వఱకు నతని జీవితమున నతనికిని, అతనియాత్మకును ద్వంద్వయుద్ధ కాలము.

ప్రయాగనుండి వచ్చి కాన్పూరున కరెన్సీ శాఖయందు విద్యార్థి నౌకరీ చేయుచుండెను. అతనికి వేతనము నెల కిరువది రూపాయలు. కార్యనిర్వహణమున విద్యార్థి కడు కుశలుడు. కాని ఎంతమాత్ర మవకాశము దొరకినను గ్రంథములను జదువుచుండువాడు. కాన ఒకనాడు విద్యార్థి కార్యాలయమున నోట్లకు నిప్పంటించి అవి కాలుచుండగా తాను పుస్తకమును చదువుచుండెను. అపుడు ఆంగ్లేయుడైన పైయధికారి యక్కడకువచ్చెను. అతనికి, విద్యార్థికి వివాదము జరిగెను. అతడు తుదకు 'నాక్రిందపనిచేయువారికి నేను నిరంకుశశాసకుడను' అని చెప్పెను. విద్యార్థియిట్టిపలుకుల నోర్చువాడు కాడు. వెంటనే యానౌకరీకి రాజీనామా యిచ్చెను.

తరువాత, పృథ్వీనాథ హైస్కూలునం దుపాధ్యాయు డయ్యెను. ఆకాలమున 'కర్మయోగి' అను గ్రంథము ప్రవణచక్రమునలె భీతిని గొలుపుచుండెడిది. విద్యార్థి దానిని చదువుచుండువాడు. స్కూలునకు సైతము కొనిపోయి అవకాశము దొరకినపుడెల్ల దానిని జదువువాడు. ఆగ్రంథమును స్కూలునకు కొనిపోకూడదను నియమము లేకుండుటజేసి యొకనాడు క్లాసులేని సమయమున నచటనే కూర్చుండి దానిని జదువుకొనుచుండెను. అపుడు ప్రధానోపాధ్యాయు డక్కడకు వచ్చి చూచెను. వారిరువురకు కొంతవాదము జరిగినపిదప విద్యార్థి యా యుద్యోగమునకు సైతము రాజీనామా యొసగెను. ఇట్లు విద్యార్థి తనప్రకృతికి విరుద్ధమయిన కార్యములను వీడి పత్రికారచన వృత్తిని స్వీకరించెను. తొలుసారి అతడు 'సరస్వతి' యందు సుందరమగు వ్యాసము నొకదానిని ప్రకటించెను. పూజ్యు లగు ద్వివేదిగారు ముగ్ధులయి యాకానున్న సంపాదకుని తమ 'సరస్వతి'కి రప్పించుకొనిరి.

తరువాత, నేడాదికి విద్యార్థి అటనుండి 'అభ్యుదయ' పత్రికకు బోయెను. అచ్చటగూడ తమ పనిని అద్భుతముగా చేయుచుండిరి.

ఇంతలో 'అభ్యుదయ' ఆర్థికస్థితి చెడినది. దానిని విక్రయించు ప్రయత్నము పొడచూపెను. కాని తక్కువ వెలకు పోవునేమో యను సంశయము గలిగెను. విద్యార్థి 'అభ్యుదయ'ను తాను కొనదలచి ప్రియమిత్రులు పి. శివనారాయణమిశ్రగారికి సొమ్ము నేర్పాటుచేయుటకు ఉత్తరము వ్రాసెను. అభ్యుదయ విక్రయము తరువాత నాగిపోయెను.

విద్యార్థి కాన్పూరునందు సర్కారు నౌకరీయందున్నకాలమున మిశ్రగారు బ్రహ్మావర్తమున సనాతన ధర్మమండలికి కార్యదర్శిగా నుండిరి. ఒకనాడు మండలిపక్షమున నొక యుపన్యాసము జరుగుచుండెను. శ్రోతలనడుమనుండి గంభీర ముఖాకృతి గల యొకయువకుడు లేచి 'నేనొకింత మాటలాడవచ్చునా?' అనెను. అతనికి వెంటనే యవకాశము లభించెను. అతని యుపన్యాసము శ్రోతలను మంత్రముగ్ధులను గావించెను. అది మొదలా యుపన్యాసకుడు మిశ్రగారి కాత్మీయుడయ్యెను. ఆయువకుడు విద్యార్థియే. వారి మైత్రి నాడుమొదలు మిగుల పెంపొందెను. ప్రతాప పత్రిక ప్రారంభించిన తర్వాత పెక్కువత్సరములవరకు కాన్పూరునందలి పెద్దలు కొంద రా యిరువుర సోదరులనియే తలచుచుండిరి.

విద్యార్థి 'అభ్యుదయ' ను వదలుకొని ౧౯౧౩ వ సంవత్సరమున ౧౬ పుటలు గల 'ప్రతాప' అను వారపత్రికను ప్రారంభించెను. ప్రతాప పుట్టిననాటినుండి ౧౯౩౧ మార్చి ౨౫-వ తేదివఱకు వారిజీవితము దేశసంపద యయి సార్వజనీన మయ్యెను. ప్రతాపపత్రిక గణేశవిద్యార్థియొక్క ప్రతిబింబము. నెలకు మూడు రూపాయిల అద్దెకుపుచ్చుకొనినయొక జీర్ణకుటీరమున

నది జన్మించినది. విద్యార్థివద్ద కాని, శర్మవద్దకాని ధనములేదు. వీరికి సాయపడువారును లేరు. కాని యీ యిరువురు పవిత్రప్రేమ, నిరుపమానత్యాగము గలవారు. రెండు మూడువందల రూపాయలతోటి పత్రికను మొదలిడిరి. మూడు నాలుగు సంచికలు వెలువడునప్పటికి ముద్రాపకులవలన చాల చిక్కులు వచ్చినవి. వానినన్నిటిని నిశ్చలచిత్తమున విద్యార్థి యెదురుకొనుచు పత్రికను సాగించుచుండెను.

అంతె విద్యార్థి ప్రయత్నించి యెట్లో యొక అచ్చుకూటమును కొనెను. 'ప్రతాప' ప్రకటనము, సంపాదనము, కేవలము మిశ్రవిద్యార్థిగార్ల పయినుండెను. సిరా పూయుటమొదలు అచ్చుకూర్చువరకు కలపనులను మిశ్రగారును, సంపాదనము, వ్యాసలేఖనము మొదలయిన పనులను విద్యార్థిగారును చేయవలెను. చందాదారుల పయివిలాసములను గూడ విద్యార్థి వ్రాయుచుండెను. మిశ్ర ప్రతాప పత్రిక పార్సలులను రైలుస్టేషనునకు మోసికొనిపోవువాడు; పత్రికను స్వయముగ బజారున విక్రయించువాడు. ఈపత్రికకు ౧౫ వేలుచందాదారులేరుపడిరి.

ప్రతాపపత్రికాజననము పత్రికారచన కళయందొక నూతన శకమున కారంభమయినది. భావగర్భితములు, గంభీరములు నగు సంపాదకీయ వ్యాసములు, హృదయాకర్షకములగు ఖండకావ్యములు, పాండిత్యప్రకర్షనుచాటు నితరవ్యాసములు, అత్యాచారములు, అన్యాయ్యములు నగు విషయములను గర్హించు వ్యాసములు మొదలయినవానిచే నిండి ప్రతాపపత్రిక దేశమునకొక నూతనశక్తిని గలిగించెను.

విద్యార్థికి దైవము దివ్యమగు ప్రతిభను ప్రసాదించెను. ఏవిషయమున విద్యార్థిమనస్సు లగ్నమగునో ఆవిషయ మాతనికి గరతలామలకముగ తోడనే విస్పష్టమయ్యెడిది. అతని సంపాదకీయవ్యాసములు లక్షలకొలది అమాయకులు, అన్నపేదలునగు కృషికులకు అత్యంతము సాహాయ్యమును చేయుచుండును. విద్యావంతులగు ప్రజలాంగ్ల పత్రికలను చదివినను ప్రతాపపత్రికనుచదువనక వారికి నిద్ర పట్టునదికాదు. ఇక గ్రామవాసులవిషయమును చెప్పబనియేలేదు. ప్రతాపపత్రిక సమ్మతించిన విషయము సర్వజనసమ్మతమైనది. రైతులకష్టములను తన కష్టములుగ భావించి వానిని తొలగించుటకయి పోరాడుటయే 'ప్రతాప' పత్రికయొక్క ప్రధాన కార్యము. ఇట్లు చేయుటవలన నతనికి ననేకములు చిక్కులు గలిగెను. దాని నాతడు లెక్కింపడయ్యెను.

దేశీయసంస్థానములయందలి ప్రజల కష్టములను పోగొట్టుటకయి నడుముకట్టిన ప్రతాపపత్రికను ఇరువది సంస్థానములవారు నిషేధించిరి. దీనికాతడింతయయిన చలించినవాడు కాడు. ఒక సంస్థానాధిపతి విద్యార్థి నాహ్వానించి చాలమర్యాదచేసెను. తన రాజ్యము విషయమున పొగడకున్నమానె విమర్శింపకున్న చాలు నని సూచించెనట. దీనివలన లక్షరూపాయిలుకూడ విద్యార్థికి లాభించియుండెడివి. కాని ధర్మవీరుడగు గణేశశంకరు డాశాపాశముల బద్ధుడగువాడు కాడు.

విద్యార్థి పత్రికాసంపాదనకళకు నూతనప్రణాళికను కల్పించినవాడు. ఆతనివలె సఫలతగాంచిన పత్రికాసంపాదకు డింకొకడు కానరాడు.

మహాత్ముడు నుడివినటులు విద్యార్థి వ్యక్తిమాత్రుడుకాడు. ఆత డొక మహాసంస్థ. ఒక మహావృక్షము క్రింద నింకొకచెట్టు పెరుగదు. ఒకగొప్పవాడింకొకని గొప్పవానిని చేయనొల్లడు. విద్యార్థియందొక విచిత్రగుణము గలదు. ఇతడు తయారుచేసినంతమంది లేకరులను, సంపాదకులను, అనువాదకులను ఇంకొకరు తయారుచేయలేదు. ఇతరులకు నేర్పుటేతనికొక విశేషగుణము.

జైలునుండి విముక్తిగాంచి పది పండ్రెండు దినములైనవి. కాన్పూరున నల్లరు లారంభమయినవి. ౧౯౩౧ సం॥ మార్చి ౨౫ నాడు, నలుబదియొక్క వర్షముల ప్రాయమున అమానుషికతను, అసజ్జనతను ఎదుర్కొని పోరాడుచు హిందూముసల్మానుల యైకమత్యమను నగ్నికుండమున గణేశశంకరుడు తన్ను ఆహుతిగా నర్పించుకొనినాఁడు.

విద్యార్థికి సంతానమార్గురు. కొడుకులిద్దరు; కూతుండ్రు నలువురు. మిత్రులు, శిష్యులు, ప్రశంసకులు, అనేకులు గలరు. పెద్దకొడుకుపేరు హరిశంకర విద్యార్థి. అతడు సర్వవిధముల తండ్రికి దగినపుత్రుడు. ఇతనివయసు పదునారేండ్లు. అతని తల్లి రుగ్ణ. అవ్వ కడు వృద్ధురాలు.

గణేశశంకరుని మరణవార్త విని మహాత్ముడు "నేను కార్యవ్యగ్రుడనై యుండినకారణమున అతని కుటుంబమునకు ఉత్తరము వ్రాయుటకుగాని, తంతి యిచ్చుటకుగాని అవకాశము దొరకకపోయెను. గణేశశంకరుని మరణమువలన నాహృదయము వ్రణమయినను, మహనీయమగు మరణమునకు నేను సమాశ్వాసము గావింప నిచ్ఛగింపను. నేడు కాకున్నను అతని పవిత్ర మరణ మొకానొకనాడు హిందూముసల్మానుల కైకమత్యమును గలిగింపకపోవదు. కావున విద్యార్థికుటుంబము సమాశ్వాసింపదగినదికాదు. అభినందింపదగినది. దైవమతని మృత్యువును సాంక్రామికముగ జేయునుగాత" అనిరి.

శ్రీరామశర్మగారు తమకు విద్యార్థివలన గలిగిన మహోపకారము నుగ్గడించుచు నిట్లనిరి:

'ప్రతాప' ను ప్రవేశించినపిదప నాకు కళాశాల విద్యవలన గలిగిన గర్వము విధ్వంసమయ్యెను. పుస్తకములపయి నేవకలిగెను. మేట్రిక్యులేషను ప్యాసుజేసిన విద్యార్థివలన నేను కాలేజిలో చదివి నేర్చుకొనిన విషయములకంటె నెక్కువ విషయములను తెలిసికొంటిని. చక్కని చిన్న శీర్షికలు పెట్టుట, సారాంశమును, సంపాదకీయవ్యాసమును వ్రాయుట, ప్రెస్సువారివలన పనిగొనుట వీని నన్నిటిని తనతో పనిచేయువారికి విద్యార్థి నేర్పువాడు. చిన్నతప్పులనుగూడ ఆయన యొప్పుకొనడు. అచ్చుతప్పులు మొదలయినవానిని ఆయన సహింపడు. పనియంతయు ముగిసినపిదప కార్యనిర్వాహకులతో సోదరులతోవలె కలసిమెలసి మెలగువాడు.

ప్రతాప ౧౯౨౦ సంవత్సరమున దినపత్రికయయ్యెను; మంచి వ్యాప్తినిగనెను. ఆఱువేలవఱకు చందాదారులసంఖ్య పెరిగెను. రాయబరేలీ జిల్లా, కృషికులకు సంబంధించిన ఆందోళనమువలన చాల చిక్కులు సంభవించినవి. వెరుతివియక వాని నెదురుకొని విద్యార్థి పోరాడెను. ఆకారణమున ధనవ్యయ మపరిమితమయ్యెను. అతనికి శిక్షయుసంప్రాప్తించెను. కొన్నాళ్లకు దినపత్రికయు ఆగిపోయినది. ఆ దినములలో 'ప్రభ' యను నింకొక పత్రికను సైతము విద్యార్థి సంపాదించుచుండెడివాడు. అదియు బాగుగా వ్యాపించియుండినది. కొలది దినములలోనే ఆగిపోయినది. నేనును ఆర్థిక ప్రతిబంధమువలన 'ప్రతాప'ను వదలితిని. కాని మా వ్యక్తిసంబంధ సౌహార్దములుమాత్రము దినదినమునకు పెరుగుచుండినవి.

గణేశుడు జెయిలున నున్నపుడు (౧౯౩౧ జనవరి ౨౯ నాడు) తన జెయిలు దినపుస్తకమున నిట్లు వ్రాసికొనెను: 'అమానుషికతను, అసజ్జనతను రూపుమాపుటకయి నేను పోరాడుచున్నాను. ముందు ఇట్లు పోరాడుటకు తగిన బలమును ఈశ్వరుడు నాకు ప్రసాదించునుగాక' అని వ్రాసికొనియున్నాడు. ఈ వాక్యమతని జీవితమునకు మూలమంత్రము. జీవితావసానమువరకు అట్లే అమానుషత అసజ్జనతలను ఎదురుకొని పోరాడినాడు. అమానుషికతాసజ్జనతా రూపమున నున్న ఘోరరాక్షసదమనమునకు దన మాంసాస్థులను ధారవోసినాడు. తన మృతిచేత నీ మహామంత్రమును లోకమునకుపదేశించినాడు. ఈ మహనీయునివలన మొలకెత్తిన ఐకమత్యతరువు పల్లవితమయి, కుసుమితమయి సుఫలవంతమగునట్లు సర్వేశ్వరు డనుగ్రహించునుగాక.

## నాట్యకళ

(మృచ్ఛకటిక - సినీమా ప్రదర్శనమున)




౧. శ్రీమతి ఏణాక్షి రామారావు యమ్. ఏ. - వసంతసేన—దైవప్రార్థనము



౨. నలినీ కన్య - వసంతసేన నెచ్చెలి



పామును దాల్చి ఆడు ఆట

శ్రీ షేకు ఇఫ్తైఖర్ రసూల్లు, శ్రీమతి హాస్న జెహార్ కరూర్ కన్య

వీరు భారతీయులు. వీ రిరువురును లండనులో ఎనిమిదడుగుల పొడవుగల జెట్టిపోతును దాల్చి నాట్యము చేయుచున్నారు. వీ రీ పాము ఆటయందు పేరుగన్నవారు



## శ్రీమతి హాథీసింగు నాట్యము

శ్రీమతి హాథీసింగు కుమారి అహమదాబాదు వాస్తవ్యులును, వ్యుత్పన్న కుటుంబమువారు నగు శ్రీ హాథీసింగుగారి కుమార్తె. ఈమె శ్రీయుత నందలాలు బోసుగారియొద్ద భారతీయచిత్రకళ నభ్యసించి అం దాఱితేఱినది. శాంతినికేతనమున గాంధర్వమును, నృత్యమును బాగుగ నభ్యసించెను. కలకత్తానగరమున శ్రీ టాగూరు గారి సంఘమువారితో కూడి నృత్యప్రదర్శనములు గావించి ప్రజల మెప్పు గాంచెను.

ఈమె **1927** వ సం.న జర్మనీదేశమున 'మాంటెసారీ' విధానము నభ్యసింప నేగెను. (మాంటెసారీ విధానమనగా, బాలురకు చదువను వ్రాయను నేర్పి విద్యాభ్యాసములోనికి దింపుట కాక, మనసు నాకర్షించు వేడుకలలో ఇంద్రియజ్ఞానసౌష్ఠవమును, ప్రపంచజ్ఞానమును, క్రమముగా అక్షరాదిజ్ఞానమును కలుగు నటులు తగిన సామగ్రి వారి పరిసరముల రచించి, అవసరమైన సలహాలు ఉపాధ్యాయు లొసగుచు, ఉపాధ్యాయుని ప్రోద్బలముచే గాక, నీతిదాయకము, జ్ఞానదాయకము నగు ఆ పరిసరసామగ్రి ప్రభావము వలననే బాలురకు విద్యగఱపు క్రొత్తవిధానము.) అక్కడ నుండగా నీమె కావించిన నృత్యప్రదర్శనమునకు ప్రముఖు లగు చిత్రకారులు, గాయకులు, కవులు, కళా విమర్శకులును విచ్చేసిరి.

ఈమె యుదాత్తమగు కళాకౌశలమును ఒక బెర్లిను నగరపత్రిక యెట్లు మెచ్చినదో గమనింపదగును.—

"అంగవిన్యాసావళితో, సవ్యశ్చలనములతో, హఠాచ్ఛంగ భ్రమణములతో, ఆమె భావములో భావ మల్లినది. ఒకచిత్తరువు తోచినది; ముఖమున వ్యక్తమైన ఒకభావము దేహ మంతటను ప్రాకిపోయినది; ఏదో దూరపు స్వప్నమున కన్నవ మెఱసిపోయిన ట్లయినది: ఆమె నాట్యము ఏలోతులనుండి ఉట్టిపడినదో మా కవగతమైనది.

"నాట్యవివరణము ముందుగనే కావింపబడెను. కాని కృష్ణుడనియు, మామిడిపూవనియు మన కేమి? అసలు సజీవమైన అనుమేళము సమస్త వైఖరులను మాకు ప్రత్యక్షమైనది; ప్రాగ్భవములైన స్వప్నమయ నృత్యములు పొడగాంచితిమి. ఆధ్యాత్మిక మానసిక సంకోచములవలని ప్రవృత్తి వ్యగ్రమును అనుభవించితిమి. అడుగడుగున వెలయు నూపురశింజితము, ఇత్తడి జాడీలలోని మృదువైన ఘాతములు—వీనివలన ఆకళాశాలిని వర్తనమందు నాట్యకళ ఈశ్వరుని, జగత్తును, ప్రకృతిని ఆరాధించెడి ఒకవ్యక్తి వెలయించు సృష్టిమయ మగు భావ ప్రకటనముగ పొడగట్టినది."

---

## నేటి భారతీయ నాట్యరంగము

సుప్రసిద్ధ నటప్రకాండు డగు శ్రీయుత శిశిర కుమార భాదురీగారు తమ నాట్యమండలితో అమెరికా కేగి, యచట పడసిన తమ అనుభవమును పురస్కరించుకొని యిట్లు నుడువుచున్నారు:—

"నేటి భారతీయరంగము ఎలిజబెతు కాలీనమగు ఆంగ్లరంగమున కనుకరణమాత్రమై యున్నది. సాంప్రదాయికమగు మన కులవిద్యతో దానికి చుట్టఱికము లేదు. ప్రాచీనభారతీయరంగమున 'భిత్తిక' (back-ground) అన్నదానికి తావు లేదు. నటులు పలికెడు మాటలును, వట్టిచలనములును భిత్తిక పని తీర్చెడివి.

"న్యూయార్కు నగరమునకు నేను నా నాట్యమండలిని కొంపోయినపుడు, ఏదో క్రొత్తది, పశ్చిమము నుండి అనుకరించుకొన్నది కాక కేవలము భారతదేశపు మట్టిలో పెరిగిన సొంతమైన దేదో మావలన వారు ఆశించిరి. నాకంటె పూర్వము సంయుక్తరాష్ట్రములకు వచ్చియుండిన జాపానీయులును, చైనీయులు నగు కళాశాలులు సొంతమన్నది కొంత—అది కేవలము అభినయ కళాదృష్టిని నికృష్టమైనదే కావచ్చును—పాశ్చాత్య జనములకు ప్రదర్శించి వారి హృదయపూర్వకమగు ఆదరమును బడసిరి. ఇక మేమో, ఇపుడు పాశ్చాత్యదేశములందు సహా అసమ్మతికి పాత్రమగుచున్న ఒకానొక పద్ధతికి అనుకరణ మాత్రము చూపవచ్చితిమి. మా నెగ్గదలలకు ప్రశంసలు రాలేదనికాదు,—ఆమాటకు వచ్చిన, అట్టివి కుప్పలు తిప్పలుగా తేగలము మాదేశమువారికి చూపుటకు—కాని, పశ్చిమదేశమున వారు ఆశించినట్లు ప్రపంచసంస్కృతికి క్రొత్త దన్న దేదియు కానుక వెట్టజాలకపోయితిమి."

భాదురీగారిట్లు ముగించిరి—

"భారతము స్వతంత్రము కావలెను. తనదారులలో రంగకళను పెంపుచేసికొని ప్రపంచ సంస్కృతి సభ్యతలకు దేదీప్యమానమగు ప్రకరణమును కూర్పవలెనన్నను, స్వతంత్ర మయియే తీరవలెను."

—'సణ్డే టైమ్స్.'

---

## విరహము

నాదెళ్ల వెంకట్రావుగారు

ఎంత చక్కని పాట నీ యంతరమున
నుంచుకొని మూఁగవై పోయి యుంటివకట!
తొల్లి నీనుండి గానంబుఁ దోడుచున్న
కోమలకరాబ్జ మేది? వీణామతల్లి!

వలచి వలపించి రెన్నాళ్లు చెలిమిఁ జేసి
తీయపాటలు నాల్గు పాడించి, యెటకొ?
నిర్దయాబుద్ధి నిను వీడి నిష్క్రమింప
స్తబ్ధవై పోయి యిటులు నిశ్శబ్దవయితె!

దేహమంతయు దుమ్ముచేఁ దేజమెడలెఁ
దొంటి యాకారమే మాఱియుంటివకట!
తిరిగి యెపుడేని ఆపాణి యరుగుదెంచి
మధురగీతులు పాడించి మనుపఁబోదొ?

శాపగతుఁడైన సామీరి చందమునను
నిజమహాశక్తి నెఱుఁగక, నిదుర నుండ,
లీల నిను ముట్టి ముందఱ లేపనేల?
లేపి విడనాడి యీరీతి వేఁపనేల?

---




## మేఘ సందేశమ్

మూలము, మల్లినాథవ్యాఖ్యానము నాగరలిపిని, విద్వద్విరుదభ్రాజమాన జి. జే. సోమయాజి(యం. ఏ.) మహాశయవిరచితానువాదవివరణాదు లాంగ్లమునను ఇందు ముద్రితములు.

మేఘసందేశమునకు, దదసంఖ్యాక వ్యాఖ్యానములలో దాముత్తమముగా బరిగణించినదానిని స్వీకరించి, ఆంగ్లవివరణాదులను రచియించి విద్వద్వతంసము లనేకులు ప్రకటించియున్నారు. ఆంధ్రవివరణము లుండునవియు నొండు రెండు గలవు. పలువురు సహృదయులగు విమర్శకులు మేఘసందేశమునందలి భావసౌందర్యాదులను, అర్థవిశేషాదులను లెస్స చర్చించి యప్పటప్పట నాంగ్లాంధ్రభాషల వ్యాసములరూపమునను బ్రకటించియున్నారు. ఇన్నింటిని పరిశోధించి వానియందు తాము విశేషములుగ దలచిన విషయములకు, మూలమున స్వయము కనిపట్టిన విశేషవిషయములను గూర్చి యీ గ్రంథమును బ్రకటించితిమనియు, ఇందలి తమ వివరణాదులకు ప్రధానముగా మల్లినాథవ్యాఖ్యానమునే స్వీకరించి తత్ప్రతికూలాభిప్రాయములు గల పట్టుల వానినిగూడ వివరించితిమనియు సోమయాజిగారు తమ మున్నుడియందు చెప్పిరి.

గ్రంథాది నిరువదినాలుగుపుటల ప్రవేశిక గలదు. అందు కాళిదాసునికాలము, మేఘసందేశ రచనమున కాదర్శము, ఇతివృత్తము, అందలి కళాకౌశలము, కాళిదాసకృతి గ్రంథపౌర్వాపర్య విచారము, సంస్కృత వాఙ్మయమున కాళిదాసుని స్థానము నను విషయములు విమృష్టములయినవి.

అనువాదమున శైలి కొంత పాటవము మిగిలి మూలమున కుద్దిగ నుండదగినది.

వివరణమునం దన్నిటికన్న ముఖ్యముగ వ్యాకరణవిషయములు, అలంకారవిషయములు విస్తరిల్లినవి. కావ్యమునందలి భావసంపదను బయలువెట్టు పదప్రయోజన ప్రకటన మింతకన్న నధికముగ నుండుట యావశ్యకము. ప్రకాశకులు: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండు సన్సు, చెన్నపురి.

---

## వర్ణాశ్రమ ధర్మపరిణామము

గ్రంథకర్త: శ్రీయుత వల్లూరి సూర్యనారాయణ రావుగారు, ఆంధ్రగీర్వాణ విద్యాపీఠము, కొవ్వూరు, పశ్చిమగోదావరిజిల్లా. ౦-౧౨-౦. క్రౌను సైజు; పుటలు ౧౯౦.

"హైందవసాంఘిక పరిణామశాస్త్రమునకై కొద్ది పరికరములను ధర్మశాస్త్రములనుండి క్రోడీకరించి" వానిని గ్రంథకర్తగారీ చిన్నిగ్రంథమునందు సూచించియున్నారు. సత్యాన్వేషణమే ప్రధానముగా నెంచి, చక్కని విమర్శన నైపుణ్యమును ప్రదర్శించియున్న వీరి నభినందింపదగును.

ప్రపంచములోని వివిధమతములు, మతగ్రంథములు, ఆచారములు మొదలగునవి పరస్పర విరోధములతో నిండినపుడు, వీనిలో నేవియు దైవదత్తములని భావింపకూడదని గ్రంథకర్తగారి యభిప్రాయము. పూర్వాచారములనే యాధునికహిందువులు పట్టుకొని వ్రేలాడవలయుననుట మనోదౌర్బల్యమును సూచించు

ననియు, అందుచే సంఘాభివృద్ధికి భంగము వాటిల్లు ననియు సూచించుచు, గ్రంథకర్తగారు శ్రుతిపురాణేతిహాసములనుండి హైందవసంఘము నేటివరకు పరిణామావస్థను పొందియుండుటను నిరూపించుచు ప్రమాణముల నుదాహరించియున్నారు.

హిందువులలోని సాంఘికాచారములు పూర్వము నుండి నేటివరకు నెట్లు పరిణామము చెందినవో తెలిసికొన్నయెడల నయ్యవి శాశ్వతమతధర్మములు కావనియు, సంఘాభివృద్ధికి వలయు మార్పుల జేసికొనినయెడల మన యాధ్యాత్మికాభివృద్ధి కెట్టి యడ్డంకులు కలుగవనియు నెల్లరు నంగీకరింపక తప్పదు. మానవసౌభ్రాత్రమే గ్రంథకర్తగారి పరమావధి. "సత్యమేవ జయతి" యను టయే సత్యాన్వేషియగు గ్రంథకర్తగారి జయనినాదము. ఈనినాదమే యాంధ్రదేశ మెల్లెడలను ప్రతిధ్వనించునటుల జేయుటకీ యుత్తమగ్రంథము సాధనముగ నుండగలదని తోచును.

చాతుర్వర్ణ్యవ్యవస్థ, ధర్మసూత్రములు, ధర్మశాస్త్రములు, ఆచారకాండ, ఆధునిక సాంఘిక, రాజకీయ చలనములు మున్నగు శీర్షికలతో నీగ్రంథమునందలి ప్రకరణములు విజ్ఞానదాయకములై యున్నవి.

"సత్యాన్వేషి".

---

## నీతిపదవి—రెండుభాగములు

దీనిని గొల్లపూడి శ్రీరామశాస్త్రిగారు రచియించినారు. మొదటిభాగమున పదునారు నీతికథలు గలవు. మంచనమహాకవి విరచితమగు కేయూరబాహుచరిత్రము నందలి కొన్నికథలు వీని కాధారము. రెండవభాగము మూడుపరిచ్ఛేదములయందును కేయూరబాహుచరిత్రము నందలి ప్రధానేతివృత్తమును మున్నిడికొని యాయాతావుల కథాసరిత్సాగరము, శుక్రనీతిసారము, నీతివాక్యామృతము, కలావిలాసము, భారతము మున్నగు గ్రంథములనుండి నీతిని గరపు కథలనేర్చి కూర్చినారు. మూడవపరిచ్ఛేదమున మనుజుడు మనుజుడనబడుటకు అనుష్ఠింపవలసినధర్మములు, నీతులు మొదలయినవానిని విశదీకరించినారు. ఈగ్రంథములు రెంటియందలి విషయములు మానవునికి జీవితయాత్రయందు మిగుల నుపయోగించునవి. వీనిరచనము నిర్దుష్టముగను, ప్రౌఢమధురముగను నున్నది. ఉన్నతపాఠశాలల తరగతులకు మిగుల నుపకరించు గ్రంథములు. ప్రధానములుగా జదువదగినవి.

భా ౧, రు. ౦-౮-౦. భా ౨, రు. ౦-౧౪-౦.

మేనేజరు, విద్యావినోదిని గ్రంథమాల, చిత్తూరు.

---

## The Indian Cotton Textile Industry and Other Essays

("హిందూదేశమున బట్టల పరిశ్రమ")

గ్రంథకర్త: బాబు గోవిందరావుగారు, యమ్. ఏ., బి. యల్., యఫ్. ఆర్. ఇ. యస్., కాకినాడ.

భారతవాణిజ్యసంఘము కార్యదర్శియగు యం. పి. గాంధిగారి గ్రంథమున కిచిన్నిపొత్తము సంక్షిప్తరచనము. ఆదికాలమునుండియు భారతవస్త్రపరిశ్రమ చారిత్ర మిందు చక్కగా సమకూర్పబడినది. రాట్నపురోజులలో మన ఔన్నత్యమును, పశ్చిమఖండమున యంత్రశాల లుద్భవిల్లినవెనుక హిందూదేశపు అగచాట్లును, బ్రిటీషుపాలకుల స్వార్థపరత్వమువలన 60 కోట్ల రూపాయల వెలగల విదేశీవస్త్రమును దిగుమతిసేయు దైన్యమునకు మనము లొంగిపోవుటయును, అందువలన జనుల దారిద్ర్యము హెచ్చుటయు, భారతదేశమున మిల్లుల స్థాపనమును, వాటికి సంరక్షణావసరమును ఈగ్రంథము చదువువారికి కరతలామలకము కాగలదు. గ్రంథకర్త కేవలము యంత్రశాలలే నమ్మికొనుటలేదు. ఖద్దరు పరిశ్రమయు, చేతిమగ్గముల పరిశ్రమయు దేశమున కెట్లవసరములో నిరూపించియున్నాడు. జపాను చీనాదేశములందలి బట్టలమిల్లుపరిశ్రమ చారిత్రమును అనుబంధముగా చేర్చియుండుట మఱింత ఉపయుక్తము. వివాదాస్పదమైన విషయములందుసైతము గ్రంథకర్త చూపిన నిష్పాక్షికదృష్టియు, సరళభావమును కొనియాడ దగినవి.

గోవిందరావుగారిట్టి గ్రంథమును తెనుగునగూడ రచించుచో, ఆంగ్లమెరుగని ఆంధ్రులకు సేవ జేసినవారయ్యెదరు. స్వదేశపరిశ్రమలకిట్టి గ్రంథప్రచారము దోహదమై తనరగలదు.

గు. వెం. సు.

## లక్ష్మీశారదాగీతములు

అను స్త్రీలపాటలు. శ్రీమతులు గిడుగు లక్ష్మీకాంతమ్మగారు, జొన్నలగడ్డ శారదాంబగారు రచించినవి. క్రౌను సైజు, ౧౦౬ పుటలు. వెల ౦-౧౨-౦.

ఇందు స్త్రీల కుపయోగపడుపాటలు వివిధములైనవి కలవు. వరుసలపోలికలును, కొన్నిటికి స్వరములును ఇచ్చియున్నారు. పుస్తకములు వలయువారికి: గిడుగు నరసింహంగారు, పెనుగొండ, ప. గోదావరి.

## Fol kArt: South Indian Kolan—I & II

## దక్షిణఇండియా ముగ్గులపుస్తకములు-౧, ౨

ప్రకాశకులు: దిస్టాన్డర్డు టెక్ట్స్‌బుక్ కంపెనీ, ౭ కోరల్ మర్చెంట్ స్ట్రీటు, జి. టి. మదరాసు. వెల ఒక్కొకటి ౦-౫-౦.

ఇవి పెద్ద డ్రాయింగు పుస్తకాలు. ఒక్కొకటి ౨౦ ఏసి పుటలు. పుట ఎడమ సగములో పైని తీర్చినముగ్గుపట్టు చిత్రము; క్రింద అది రచింపడము నేర్పేసూచనబొమ్మ; కుడిప్రక్కసగము ఆబొమ్మగీసికొనడానికి ఖాళీ. అనేకరకాలముగ్గులు చూపించి ఉన్నవి. ప్రతిచిత్రముక్రింద ఇంగ్లీషున, అరవమున, తెనుగున ఆపట్టుపేరు: బిల్వదళము, రథపీఠము, తామరపువ్వు మొ. ఆడంగులకు చాలా ఉపయోగించే పుస్తకాలు.

## కథాంజలి

కన్నడమాసపత్రిక, ప్రథమసంపుటము: ౧౯౨౯-౩౦. సంపాదకులు: శ్రీ అ. న. కృష్ణరావుగారు. ప్రకాశకులు: టాగూర్ అండ్ కో., బెంగళూరు సిటీ. కథాంజలి మాసపత్రిక పండ్రెండుసంచిక లిట్లు సంపుటమయినది. బైండు అందముగానున్నది.—

## సూర్యనమస్కారములు

or Physical Culture.

ఔంధ సంస్థానాధీశ్వరులైన బాలాసాహేబ్ పంత్ ప్రతినిధిగారిచే ఆంగ్లభాషయందు విరచితమైన దానికి ఆంధ్రానువాదము ఆంధ్రీకర్త: పండిత మై. వెం. శ్రీ. రాఘవేంద్రాచార్లుగారు. ప్రకాశకులు: యస్. యన్. సింహాగారు, పోస్టాఫీసు, బెంగళూరు. రాయలు సైజు, ౭౫ పుటలు, చిత్రములు కాక. వెల ౧-౦-౦.

## ఆంధ్రాక్షరములు

రాజా పానగంటి పార్థసారథిరాయణింగారు రచించిన వ్యాసము. టైపుయంత్రమున కనుకూలించులాగున తెలుగులిపిని సంస్కరించుతీరు తెలిపినారు. కొలది మార్పులతో ఈపద్ధతియే కన్నడమునకును పనికివచ్చునట. అక్షరగణితా సంయోగాదులు తెలుపు పెద్దపట్టిక అనుబద్ధమైనది.

Explanation of the Keyboard of the Typewriter for the Telugu Language

'ఆంధ్రభాషకు టైపుమెట్లనుగూర్చిన వివరణము. (ఆంగ్లము). రాయలుసైజు, ౧౬ పుటలు, రెండు అనుబంధములుకాక. దీనికిని రచయిత: శ్రీ పానగంటి పార్థసారథిరాయణింగారు, పానగల్లుభవనము, కాళహస్తి.

## గీతావళి

గ్రంథకర్త: పంద్యారం వెంకటసుబ్బయ్యగారు, c/o భారతముద్రాక్షరశాల, తెనాలి.

"ఇందలి గీతములు పర్షియాదేశపు కవీశ్వరుడగు, సాదీ అను నాయన రచియించిన 'బుస్తాన్' అను

గ్రంథమునుండి ఆంధ్రీకరింపబడినవి. క్రౌను సైజు, ౫౧ పుటలు. ౧౦౭౪ పంక్తులు గలవు.

ఇందు కథనకావ్యములు, నీతికావ్యములు మున్నగునవి పెక్కు లున్నవి. భావకావ్యములనిచెప్ప దగ్గవియు కలవు. 'కృతజ్ఞత' అన్న కొలుకావ్యము ఆధునికమైన చక్కని భావకావ్యముగా నిలువగల దనుచున్నది. అంతటను మనోహరమగు భావసంపద గలదు. అనువాదకుల శైలి చాల మధురముగ, భావోచితముగ నున్నది. ఇట్టి అనువాదములు అన్యభాషాకవుల పరిచితి మాతృభాషకు తెచ్చుట చాల ఆవశ్యకము ఉత్కృష్టత వెలయు పర్షియను కవిత తెలుగుభాష కవతరించుచున్నది శుభావహము.

## శ్రీరాముని వైరాగ్యము

కర్త: భాగవతుల నృసింహశర్మగారు, వేగుజుక్కగ్రంథమాల, పూడి పెద్దివారివీథి, బరంపురం (గంజాం). పద్యకావ్యము. 'జ్ఞానవాసిష్ఠమునుండి యీభాగము సంగ్రహించి' నారు రచయిత. డెమ్మీసైజు; ౨౯ పుటలు: వెల ౦-౭-౧. 'ఖర్చులు కొనువారే భరించుకొనవలెను' కూడ.

## సురభి

'సామాజిక సారస్వత సచిత్రమాసపత్రిక'. సంపాదకులు: బి. టి. నరసింహాచార్యులుగారు. మొదటి రెండు సంచికలు వెలువడిన డెమ్మీసైజు; నలువదేసి పుటలు గలవు. సం. చందా రు ౧ ౭-౦.

పత్రికోద్యమము పట్ల దేశమున ఆస్థ యున్నను పోషణము తక్కువగ నున్న యీకాలమున సాహసించి రంగమున నవతరించిన దీ పత్రిక. రంజకములైనవియు, విలువగలవియు నగు గద్యపద్యవ్యాసము లీసంచికలందు గలవు. మంచి ఆశయములతో, సర్వమునకు నిలువద్రొక్కుకొని కృతకృత్యు లగుటకు సంపాదకులు ప్రయత్నింతురు గాక.

## వావిళ్ల వాచకపుస్తకము

ఆఱవతరగతికి గ్రంథకర్త: జయంతి గంగన్నగారు, బి ఏ , యల్.టి., ప్రధానోపాధ్యాయులు, వీరేశలింగం హైస్కూలు, రాజమహేంద్రవరము. ప్రకాశకులు: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు, చెన్నపురి. క్రౌనుసైజు; ౧౩౧ పుటలు. వెల ౧-౬-౧.

## కావ్యాదర్శము

దండికవిది. జీవానంద విద్యాసాగరభట్టాచార్య విరచితవ్యాఖ్యా సహితము, వి. నారాయణఅయ్యరు (యమ్. ఏ., యమ్. యల్) గారు రచించిన పీఠికయు, ఆంగ్లానువాదమును గలది. క్రౌనుసైజు: ౩ + ౨౨ ౩ + ౧౧౯; భామహుని రచనయందును, దండిరచనయందును పరస్పర సాదృశ్యముగల భాగములు తుదిని పది పుటలలో పొందించినారు. ప్రకాశకులు: వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు, ౨౯-౨, ఎస్ప్లనేడ్, మద్రాసు. ౧౯౩౦.

## రణతిక్కన

గ్రంథకర్తలు: దేవరం రామబ్రహ్మశర్మగారు; కేసరి సుందరరామశర్మగారు, సంస్కృతకాలేజి, మూలపేట, నెల్లూరు. డెమ్మీసైజు; ౧౨ పుటలు, వెల ౦-౧-౬.

## నాగురువు

"శ్రీ వివేకానందస్వామివారి న్యూయార్కు ఆంగ్లభాషా వుపన్యాసములోని 'My Master' అను; పొత్తమున కాంధ్రీకరణము" అను: పింగళి వెంకటనారాయణగారు. డెమ్మీసైజు; ౪౯ పుటలు. వెల ౦-౪-౦. భీమవరము (ప. గోదావరి): ధనలక్ష్మీవిలాస ముద్రణాలయమునందు ముద్రితము.

## నానారాజసందర్శనము

తిరుపతి వేంకటేశ్వరకవులు రచించినది. రెండవ ముద్రణము: ౧౯౩౧. డెమ్మిసైజు. ౨౨౬ పుటలు. వెల ౨-౦-౦. (అంచెకూలికాక ౧-౧౦-౦.) బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు, శతావధాని, కడియం, తూర్పుగోదావరిజిల్లా అనికాని, దివాకర్ల వేంకటావధానిగారు, దిగుమర్తివారి వీధి, కాకినాడ అనికాని వ్రాసి పడయవచ్చును.

---

## The Age of The Mahabharata War (మహాభారత యుద్ధయుగము)

ఆంగ్లము. గ్రంథకర్త: యన్. జగన్నాథరావుగారు, వకీలు నరసారావుపేట, గుంటూరుజిల్లా. క్రౌనుసైజు; ౧౧, పుటలు వెల .౧.

---

## The Secout's Red Book of "Good Truns" (ఐచ్ఛికభటుల హితబోధ)

ఆంగ్లము, గ్రంథకర్త: ఒక మారుమూలభటుడు. ది ఇండియా సణ్డే స్కూల్ యూనియన్, కూనూరు, దక్షిణ ఇండియా. ౧౯౩౧. క్రౌనుసైజు ౩౬ పుటలు వెల ౦-౮-౦.

---

## శ్రీ వీరేశలింగ సంస్మృతి

గ్రంథకర్త: రాయసం వెంకట శివుడుగారు, యమ్. ఏ., యల్. టి., గుంటూరు.

క్రౌనుసైజు; ౧౬౦ పుటలు. వెల ౦-౪-౦.

---

## భారతవర్ష సంగ్రహ చారిత్రము

'స్వధర్మప్రకాశిని' నుండి పునర్ముద్రితము. గ్రంథకర్త: శ్రీ కల్యాణానంద భారతీమంతాచార్యస్వాములవారు. ప్రకాశకులు: కనుపర్తి మార్కండేయ శర్మగారు, 'స్వధర్మప్రకాశినీ' సంపాదకులు, ౨౨ పూనమల్లి హైరోడ్, బృందావనం, కీల్పాకు పోస్టు, మదరాసు. డెమ్మీసైజు, ౬౮ పుటలు. వెల ౧-౪-౦.

---

## స్తోత్రసంగ్రహము

శ్రీ శ్రీనివాసమాహాత్మ్యమును బోధించెడిది. క్రౌనుసైజు: ౧౨౦ పుటలు. వెల ౦-౪-౦. ప్రకాశకులు: శ్రీ వైఖానస విద్యానిలయమువారు, ఆకులమన్నాడు, గూడూరుపోస్టు, కృష్ణా. గ్రంథములు దొరకు వేఙ్కవిలాసము: అర్చకఆఫీసు, బైరాగిమఠంకోవిల్, జి. టి. మదరాసు.

---

## శివరహస్యఖండము: యుద్ధకాండము

ద్వితీయభాగము గ్రంథకర్త: కోడూరి వేంకటాచలకవి. శైవప్రచారిణీ కార్యాలయము, వరంగల్. రాయల్ సైజు, పుటలు ౭౭ మొదలు ౧౫౨. వెల ౧-౮-౦.

---

## పల్నాడుతాలూకా చరిత్రాత్మక భూగోళము

గ్రంథకర్త: శిష్ట్లా రాధాకృష్ణయ్యగారు; హెడ్మాస్టరు, మాచవరం, పల్నాడుతాలూకా. క్రౌనుసైజు, ౫౮ పుటలు. వెల ౦-౮-౦.

---

## భక్తకల్పద్రుమశతకము

గ్రంథకర్తలు: ఖాద్రి నరసింహ సోదరులు. వెల ౦-౩-౬. వలయువారికి: కదిరి శ్రీనివాసాచార్యులుగారు, కార్యదర్శి, యువకవితాసమితి, కదిరి, అనంతపురంజిల్లా.

---

## బాల్యవివాహనిరసనచట్టము

(శారదాఆక్టు, సవ్యాఖ్యానముగా) సంపాదకులును, ప్రకాశకులును: యమ్. యస్. పార్థసారథిఅయ్యంగార్

వారు, బి. ఏ., బి. యల్, ప్లీడరు, (అఖిల భారత లా జర్నలు సంపాదకులు,) తిరువళ్లూరు. డెమ్మీసైజు, వెల ౦-౮-౦.

---

## ప్రపంచ వినోద కథలు

గ్రంథకర్త: బి. టి. నరసింహాచార్యులుగారు. ప్రకాశకులు: ప్రొప్రైటరు, వాసన్ పుస్తకశాల, ౨౮౮ టంకసాలవీథి మద్రాసు. క్రౌనుసైజు, ౨౬౯ పుటలు. వెల ౧-౦-౦.

---

## దంపతులు

రెండంకాలనాటకము. కర్త: షో. వెం. రంగా రామ్‌గారు. ప్రకాశకులు: అద్దేపల్లి లక్ష్మణస్వామి నాయుడుగారు, సరస్వతీ గ్రంథమండలి, రాజమహేం ద్రవరము. ౧౯౩౧. డెమ్మీసైజు, ౯౯ పుటలు. వెల ౧-౦-౦.

---

## (i) శాసనపద్యమంజరి

సంపాదకులు: జయంతి రామయ్య పంతులుగారు బి. ఏ., బి. యల్. రాయల్‌సైజు; ౧౭౪ పుటలు వెల ౦-౧౨-౦.

## (ii) రసాభరణము

అనంతామాత్యకృతము. రాయల్‌సైజు; ౭౨ పుటలు. వెల ౦-౮-౦.

## (iii) శతకసముచ్చయము

ప్రథమభాగము. అనేకపూర్వకవులచే రచింప బడిన శతకములు. రాయల్‌సైజు; ౧౮౦ పుటలు. వెల ౦-౧౨-౦.

## (iV) సూత్రాంధ్రవ్యాకరణము

పరవస్తు చిన్నయసూరి విరచితము. రాయల్ సైజు. సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణము, ఆంధ్ర శబ్దానుశాసనము: ౩౬ పుటలు; పద్యాంధ్రవ్యాకరణము: ౪ పుటలు. వెల ౦-౮-౦.

## V) కాళిందీ కన్యాపరిణయము

అహోబలపతి కృతము. ఆఱాశ్వాసముల ప్రబం ధము. రాయల్ సైజు.

ప్రథమభాగము: ౧౦౫ పుటలు. వెల రు. ౧.

ద్వితీయభాగము: ౬౭ పుటలు వెల ౦-౮-౦.

ఈ పైగ్రంథములలో 'శాసనపద్యమంజరి' తప్ప తక్కినవన్నియు 'ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక' నుండి పునర్ముద్రితములు. ప్రకాశకులు: ఆంధ్రసాహిత్యపరి షత్తువారు, కాకినాడ.

---

## వైద్యగ్రంథవిమర్శన సమాధానమునకు ప్రతి సమాధానము

భారతీపత్రికా నిర్వాహక వర్గమువారు శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి ఆయుర్వేదౌషధ రత్నాకరము, ఆంధ్రభైషజ్యరత్నావళి అను గ్రంథము లను విమర్శార్థము నాకు బంపిరి. వారు కోరుటచేత, నేను జనేవరి నెలభారతిలో విమర్శము వ్రాసితిని. ఆ విమర్శమును నేను యథాశక్తి శాస్త్రప్రమాణానుసార ముగా వ్రాసితిని. ఔషధములను తయారుచేయుటలో శాస్త్రమర్యాద, సంప్రదాయము, తప్పినచో అమృత ముగా పనిచేయవలసినమందు విషముగా మాఱిపోయి నను పోవచ్చును. ఇట్లు మాఱునని శ్రీ గోపాలాచార్యుల వారి వాక్యము ముందు చూపనున్నాను. వైద్యశాస్త్రము సంగీతసాహిత్యాదిశాస్త్రములవంటిది గాదు. బ్రదుకు చావులను దేల్చునది. ఈ శాస్త్రమునకు సంబంధించిన గ్రంథములు పరమప్రామాణికములై యుండవలెను. అట్టి భయముచేతనే నేను నావిమర్శమున, శ్రీ శాస్త్రిగారి గ్రంథమున అప్రామాణికము లని తోచినపట్టుల గొన్నిం టిని జూపితిని. శాస్త్రసంప్రదాయమును రక్షించుట యును, సంప్రదాయవిరుద్ధౌషధనిర్మాణము తొలగించు టయును మాత్రమే నాపరమార్థములు.

భారతి ఆవిమర్శమును ప్రకటించెను. దాని గుణదోషములకు వైద్యవిద్వాంసులు ప్రమాణము. శ్రీకృష్ణమూర్తిశాస్త్రిగారు దానిపై ఫిబ్రవరి భారతిలో బదులును ప్రకటించిరి. భారతీనిర్వాహకు లిక్కడ కొంతధర్మము తప్పిరని నాతలపు. భారతిలో విమర్శము నా ముచ్చటకై నేను కోరి వ్రాసినది గాదు. ఆ విమర్శము అనుచితముగా నున్నచో వారు దానిని ప్రకటింపకుండ దగును. ప్రకటించిరి. న్యాయమునకు దాని యోగ్యతాయోగ్యతలపై పత్రికానిర్వాహకులకు బాధ్యత కలదన్నమాట; దాని ప్రతి విమర్శము వచ్చినప్పుడు అందేమేని న్యాయమగు సమాధానము గలదా ? యని చూచి న్యాయమగుబదు లున్ననే దానినిమాత్రము ప్రకటించుట ధర్మము. ఆ పత్రికా నిర్వాహకు లట్లు కాక, దండుగ తగవులు పెరుగుటకై వ్రాసిన వ్రాతలను ప్రకటించుట నిజముగా తమధర్మమును తప్పుటే.

ఈ విమర్శ ప్రతివిమర్శ విషయములను ప్రధానముగా వైద్యవిద్వల్లోకమునకే సంబంధించినది గావున ఇక నీ చర్చను వైద్యపత్రికలోనే శాస్త్రసంప్రదాయ ప్రసక్తమైనంతవఱకు జరుపనున్నాను. అయినను భారతిలో శ్రీశాస్త్రిగారు వ్రాసిన ప్రతివిమర్శమునకు ముక్తసరుగా ముగింపు బదులు.—

గ్రంథమునందలి యోగములయొక్క ఆకరములను గూర్చి విజ్ఞాపనలయందు వ్రాసియే యున్నానని శ్రీ శాస్త్రిగా రనుచున్నారు. ప్రతియోగము ఏగ్రంథము నుండి తీసి ప్రకటించినదీ, గ్రంథనామముల నాయా యోగములతోపాటు ప్రకటింపవలెను గాని విజ్ఞాపనయందు ప్రాచీన శిథిలగ్రంథములనుండియు, వ్రాతపుస్తకములనుండియు తీసి ప్రకటించినామని వ్రాసిన జాలదని నే నంటిని.

లోకనాథ రసము :— బసవరాజీయమునందలి యోగముతో భేదించుచున్నదని నేను వ్రాయలేదు. శ్లోకమంతయు ర.యో.ర. యోగముతో పోలుచుకొన్నివాక్యములుమాత్రము భేదముగానుండుటచే అట్లువ్రాసితిని. ఇట్టి చిక్కులు లేకుండుటకే వీ రేయేగ్రంథములనుండి యోగములను గ్రహించుచునదియు తెలిపియుండిన బాగుండెడిదంటిని.

వంటమూర్ఛాన్తి:— వీరు ప్రకటించిన పద్యయోగము 'భేషజదర్పణము' అను తెలుగువైద్య గ్రంథములోనిది. ఇది అముద్రితము; పద్యమంతయు ఆ గ్రంథయోగముతో పోలుచున్నది గాని మార్పులు గలిగి యుండుటచేత భేదముగా నున్నదంటిని.

వసంతకుసుమాకరము:—"ఇందు కేవల రసమునే గాక, రసభస్మనే వేయవలెనని నా అభిప్రాయము కాని రససిందూరాదులను వేయకూడదని నా అభిప్రాయము ఎంతమాత్రము కాదు" అని శ్రీశాస్త్రిగారు వ్రాయుచున్నారు. 'రసభస్మనే వేయవలెనని నాఅభిప్రాయము' అనగా ఇతరముల వేయకూడదని కాదట! అట్లయినచో 'రసభస్మనేవేయవలెను' అని అవధారణార్థకమైన ఏవ కారముయొక్క ప్రయోజనము వివరింపగోరుచున్నాను. వ్యాకరణయుక్తముగను, అర్థసమన్వితముగను ఉండవలెనని 'సూత మభ్రంచ' అను ప్రసిద్ధపాఠమును 'పారదాభ్రంచ' అని మార్చినారట! మార్పుజేసినట్లు అంగీకరించుచున్నారు. ఔషధయోగములలో సంస్కృతభాషను చక్కబరుపజూచుట కంబళిలో వెంట్రుక లేరుట వంటిది. ఒకవేళ మార్చినను ఆమార్పు ఔషధయోగపు ఆయువుపట్టును పాడుచేయదగినదిగా నుండదగునా? వైద్యపరిభాషనుబట్టి సూతశబ్దము రససిందూరమునే చెప్పునుగాని రసభస్మమును దెలుపదను విషయము నిరూపించుచున్నాను—

చూడుడు:

వసంతకుసుమాకర వ్యాఖ్య:—

సూతమ్=పారదసిందూరమ్.

దానికే మరియొక వ్యాఖ్య:—

సూతమ్=సూతసిందూరమ్.

గురువర్యులు శ్రీగోపాలాచార్యులుగారు వసంతకుసుమాకరమునుగూర్చి శ్రీధన్వంతరిపత్రిక సంపుటము ౨ సంచిక 3 లో:—

" ఈ యోగమున 'చత్వార స్సూతమభ్రంచ' అనుచోట సూతశబ్దమునకు పరిభాషల ననుసరించి సూతశబ్దవాచ్యమగు పారదసిందూరము గ్రాహ్యమని యెరుఁ

గక;" మరియు,—"సూతశబ్దమునకు అధికార ఆగమ సంప్రదాయములచే బోధితమగు సూతసిందూర మను అర్థమునెరింగి, సూతశబ్దవాచ్యమగు నావస్తువును ప్రయోగింపక రసగంధకములనువైచి యౌషధమును సిద్ధపరిచిన, నయ్యది రసాయనము గాక, విషముగ బరిణమించును" అని స్పష్టముగా వ్రాసియున్నారు. పెద్దలు వ్రాసిన ఈవిషయములనుబట్టి సూతశబ్దముచే రససిందూరమే గ్రాహ్యమనుట మరింత స్పష్టము. ఇక "మతభేదముచే రససిందూరము గ్రాహ్యము కావచ్చును గాని ఇతరము గ్రాహ్యము కాదు అని వారు చెప్పుటకు వారికి ఎంత మాత్రము అవకాశము లేదని నేను ఘంటాపథముగా చెప్పగలను" అని శ్రీశాస్త్రిగారు వ్రాయుట గురువాక్యమును పాటించుటా?

కాంతవల్లభరసము:— ఇందు 'అయోరజః' అనెడి వివాదగ్రస్త విషయమును నేను సూచించినను గ్రహింపక నేను కొద్దిగనైనను సూచింపలేదనుచు ఎచ్చటనో ఒకచోట పూర్తిగా విమర్శించియే యుందు నని శ్రీశాస్త్రిగారు వ్రాసికొనుచున్నారు. అయో రజః= ఖడ్గలోహభస్మ, అని శ్రీశాస్త్రిగారు టీక వ్రాసినారు. శ్లోకమున 'రజః' అన్నప్పుడు భస్మమును ఎందుకు వేసికోవలెనో శ్రీశాస్త్రిగారు గ్రంథమున వివరింపనక్కర లేదా? ఈయోగమున గోమూత్రశిలాజతును వేయు సంప్రదాయము శ్రీశాస్త్రిగారు క్రొత్తగా కనిపెట్టినారు. ఇదివరకు వైద్యులెవరును అట్లు వేయుట వినియెరుగము. అందును గోమూత్రశిలాజతును కుప్పెలు కట్టుకొనునప్పుడు వేయవలె ననుచున్నారు. యోగకర్త అట్లు వివరింపలేదనిన, దానికి సమాధానము వ్రాయక, "ఇదివరలో చాలమంది కర్పూరశిలాజతును వేయుచున్నమాట నిజమే" యనిరి. అగుచో గోమూత్ర శిలాజతును కుప్పెలు కట్టునప్పుడు కలుపవలెననుట ఎట్లు క్రమమగును?

షడ్గుణబలిజారిత మకరధ్వజము:—దీనికి ఆకరములు కావలసినచో 1922-వ సం. ఆంధ్రపత్రిక-సంవత్సరాదిసంచికలో కలదని శ్రీశాస్త్రిగారు వ్రాసినారు. అందు వీరు తెలిపినవిషయ మేదో చూచి, నేర్చుకొంద మను ఆశతో సంచిక తెరచి చూచితిని. చూడగా నది శ్రీయుత భీమరాజ మాండలిక, వేంకటేశ్వరరావుగారు వ్రాసిన వ్యాసము. రస సంస్కారములు సరిగ చేయలేము గాన, గంధకజారణమైనను చేసిన మహాఫలము గలుగునని, జారణము చేసినతరువాతనే మకరధ్వజము, షడ్గుణ బలిజారితమకరధ్వజము వండవలె నని శ్రీ వేంకటేశ్వరరావుగారు వ్రాసినారు. వారివ్యాసమునే ఇట నుదాహరింతును. శ్రీధన్వంతరిపత్రిక, సంపుటం ౯, సంచిక ౮, 'రసశాల' చూడుడు. షడ్గుణబలిజారణము, షడ్గుణబలిజారణమకరధ్వజము, స్పష్టముగా వివరింపబడియున్నవి. మరియు ప్రసిద్ధులగు ఆంధ్రాయుర్వేద ఫార్మసీవారి ఔషధయోగములు అను పుస్తకములో 150 పేజీ తీసి చూడుడు. బంగాళీసంప్రదాయమున షడ్గుణబలిజారిత మకరధ్వజము నెట్లు తయారుచేయవలెనో వివరించియున్నారు. ఇవన్నియు నావాదమున కాధారములును, బలకరములును. శ్రీశాస్త్రిగారు జారణ జారిత పదముల కర్థము గ్రహింపుడనియు ఏమో వ్రాసిరి. వాటికిబదులు అనవసరము.

కాంతవల్లభరసము:—నేను వ్రాసినట్లు 'కాంతము ప్రధానముగ గలది అనెడిఅర్థము స్ఫురింపవచ్చు'నట కాని కాంతము రెండుభాగములుమాత్రమే హెచ్చుగా కలియుటచేత అట్లు వ్రాయుటకు శ్రీశాస్త్రిగారికి ఇష్టము లేకపోయినదట! అన్ని వస్తువులకంటె కాంతము హెచ్చుగా నున్నప్పటికి, అట్టి అర్థమును వ్రాయుటకు ఇష్టము లేకపోయిననే నేమనగలను?

కాలకూటము:—నేను సూచించిన అర్థము తప్పు టర్థమును, తలతిరుగుడర్థమునట! కాలకూటమనగా నాభి యని నేను భ్రమపడినానట! ఈక్రింది విషయములను చిత్తగింపుడు:—

కాలకూటః=త్రయోదశవిధకన్దవిషాన్యతమవిషే; వత్సనాభవిషే. హే. చం.

(వైద్యకశబ్దసింధు.)

కాలకూటః=నల్లనాభి.

(వనౌషధిశబ్దార్థనిఘంటువు.)

అశ్వవత్సనాభప్రశంసా:—

"......నీలవర్ణం హాలాహలమ్,
పాండురం వత్సనాభంచ కాలకూటమ్."

ఇత్యాది.

(ఆత్రేయభాషిత హారితసంహితా.)

వత్సనాభిపర్యాయపదాలు:—

"వత్సనాభం చామృతంచ గరళం దారదం గరమ్,
కాలకూటం కాలకూటో హరిద్రారక్తశృంగికమ్."

(రస నిఘంటు.)

పైవిషయముల జూచినపిదప నైనను కాలకూట మనగా నాభియనుట తప్పుటర్థముగాని, తలతిరుగుడర్థము గాని కాదని శ్రీశాస్త్రిగారు తెలుసుకొందురు గాక.

ఇక యోగభాగములగూర్చి:—యోగమునందలి భాగముల దెలిసిన వీరు "కొంచె మెచ్చుతక్కువ నాభితో సమానముగ గలియువస్తువు లింపనేకములు గలవు" అని వ్రాయుచున్నారు. కొంచెమైనను హెచ్చుగా కలియు ద్రవ్య మేదైన ఇందు జూపినపుడు గదా వీరివాక్యమునకు విలువ. త్రికటుకములు గలవట! త్రికటుకము లనగా ఒకేవస్తువు గాదని తెలిసిన శ్రీ శాస్త్రిగారి వంటి పండితులు గూడ ఇట్లు వ్రాసినపుడు, నేను దీనినిగూర్చి యెక్కువగా నేమి వ్రాయవచ్చును.

నాభికంటె యోగమునందలి యితర వస్తువు లన్నియు చేరిన అధికముగా గలవే యనిన మరింత బాగుండెడిది. వైద్యమునకు అమరకోశము ప్రమాణమైనది!

బసవరాజాది మహనీయులు, ఇతర పుస్తకముల నుండి విషయములను గ్రహించినను ఆయా గ్రంథనామముల నుదాహరించుచు, వారి స్వానుభవములను గూడ చేర్చి గ్రంథకర్తలైరి. శాస్త్రిగారట్లు చేయలేదు. బసవరాజాదులు వారిగ్రంథములనుండి "ఏయోగములనుగాని, విషయములను గాని, ఇతరులెవ్వరును, ఏవిధముగను ప్రకటింపగూడదు" అని అనలేదు. వీరును అనరాదు. వారి సంప్రదాయమునే నేను పాటింప గోరితిని. వీరి గ్రంథ ప్రాశస్త్యమునకు విక్రయసంఖ్య దెలుపుచున్నారు. "అపూర్వ అత్యద్భుత గ్రంథ"మని ప్రకటింపబడిన శ్రీ శాస్త్రిగారి గ్రంథమునందు ఏవైన ప్రమాదము లున్న యెడల సవరించినచో, ఇంకను వేనకువేలు ప్రతులు అమ్ముడుపోవునుగదా యను నాశతో శ్రీశాస్త్రిగారి శ్రేయము నపేక్షించియే యిట్లు వ్రాసితిని గాని, వీరి గ్రంథములందు లేనిపోనితప్పులు జూపి నేను పేరు ప్రతిష్ఠలు గడించు తలంపుతో వ్రాయలేదు. అందుకనియే వ్యక్తిప్రాధాన్యమున కిష్టపడని 'వైద్యవినోది' నైతిని. రాస్నాతైలమున తిలతైలమే వాడవలెనని శ్రీగోపాలాచార్యులుగారు నోట్సు చెప్పిన నే నంగీకరించుటకు సంసిద్ధుడను. నాకుమాత్రము ఏరండతైల మనియే బోధ. ఆంధ్రాయుర్వేద ఫార్మసీయోగములలోకూడ (124 పేజీ) ఏరండతైలమే కలదు.

"మలబారుదేశస్థులు మొదలగు ననేకమందియొద్ద మద్రాసునందే ఆరుసంవత్సరములు శుశ్రూష జేసి,అనేక వస్తుప్రదర్శనముల జూచి, అనేకమంది సహవాసము జేసి అనేకచోట్ల పనిజేసిన" శ్రీ శాస్త్రిగారును గ్రంథమునందు అశోకమనగా నరమామిడియని వ్రాసి, విమర్శన సమాధానమునందుమాత్రము వైద్యవినోదిగారు "శ్రమపడి చిత్తగించిన అశోకమే వాడవలసినదిగా నా ముఖ్యాభిప్రాయము" అని వ్రాయుచున్నారు. అట్లయినచో వారు తమ ముఖ్యాభిప్రాయమును విడనాడి నరమామిడి అని యేల వ్రాయవలెను? నావిమర్శనమునకు పిదప ముఖ్యాభిప్రాయ మొకటి క్రొత్తగా పొడమినది! అశోకము, నరమామిడి వేరువేరు ఓషధు లను విషయమును స్థలాంతరమున చర్చింపనెంచి యిక్కడ విరమించితిని.*

"వైద్యవినోది."

* ఇక దీని విమర్శ అంతరించినది.— భారతి సంపాదకుడు.



కీ. శే. గోవిందస్వామి పిళ్లైగారు

ఫిడేలు వాయించుటయందు నిరుపమానుడు.

(టి. ఆర్. మహాలింగంగారి పెన్సిల్ వ్రాతచిత్రమునుండి).

# సాభిప్రాయ విశేషములు

గాంధీ-ఇర్విను సంధి ఏర్పడి రెండు మాసములు గతించినవి. కరాచి కాంగ్రెసు ముగిసి అయిదు వారములు గతించినవి. దేశము నందంతటను శాంతికి బదులు సంక్షోభము ప్రవర్ధమానంబగుచున్నది. ఒడంబడికను బ్రిటీషు ద్వీపమునందును, భరతవర్షము నందును వారివారి సంస్కారములకనురూపముగను వ్యాఖ్యానము చేయుచున్నారు. లాంకాషైరు వర్తకులు వారి బట్టల వర్తకము సాగుటలేదని మండిపడుచున్నారు. ఒకరు నిర్బంధములను సాగింపవలయునని కోరుచున్నారు. మరొకరు గాంధిమహాత్ముని లండను నగరమునకు రానీయ జనదని ఘోషించుచున్నారు. వేరొకరు రెండవ రౌండు టేబిలు సమావేశము పనికిరాదని పలవరించుచున్నారు. కాంగ్రెసు ప్రచారకులధికారులు ఇర్విను సంధియొడంబడికను ఆచరణమునందు బెట్టలేదని ఘోషించుచున్నారు. జెయిలులందుగల ఖైదీల నందరను విడుదల చేయలేదు. బోర్సాదు, బార్డోలియందలి రయితుల ఆస్తులను తిరిగి ఇయ్యలేదు. ఉద్యోగస్థుల పనులను తిరిగి ఇయ్యలేదు. పోలీసు లాఠీ ప్రయోగము, దౌర్జన్యములు వాడపల్లి, శ్రీకాకుళము మొదలగు స్థలములందు నిరభ్యంతరముగను సాగుచున్నవి. ఈ కార్యవిధానమంతయును నిరంకుశాధికారుల హృదయమునందు పరివర్తనము గలుగలేదని విశదము చేయుచున్నది. నిరంకుశాధికారుల కార్యకలాపమెప్పటివలెను నిరభ్యంతరముగను సాగుచుండగను కాంగ్రెసు కార్యవిధానమునందు మార్పు గలుగలేదని యాక్షేపించుట నిరర్థకము. పారతంత్ర్య దుఃఖవేదన ననుభవించుచున్న భారతీయుల ప్రతిబంధకములను తొలగించుట మొదటి పని. ఆపని జరిగినపుడు కాంగ్రెసు ప్రచారమే నిలిచిపోగలదు. రెండవ రౌండు టేబిలు సమావేశము జరిగి భారత రాజ్యాంగ సంస్కరణములు నిర్ధారణగానంతవరకును కాంగ్రెసు ప్రచారమును విరమించుట యవివేకమని లోకానుభవము విశదము చేయుచున్నది. పూర్ణస్వరాజ్యము కాంగ్రెసు లక్ష్యము. ఏవిధమైన సంస్కరణములు రాజ్యాంగములందు జరుగక పూర్వము గాంధిమహాత్ముడు సత్యాగ్రహోద్యమమును విరమింపజేసియున్నాడు. ప్రభుత్వమెప్పటివలెనే కాంగ్రెసు ప్రచారమును నిర్బంధించుటకు సాధనసామగ్రిని గలిగియున్నది. ఏక్షణమునందైనను ఆర్డినెన్సులను నిర్మించుటకును లక్షలకొలది సత్యాగ్రహులను నిర్బంధించుటకును సాధనసంపత్తి గలదు. కాంగ్రెసు సత్యాగ్రహోద్యమమును విరమించుటతోడనే కాంగ్రెసు బలము స్తంభించినది. ఇర్విను ప్రభు వవలంబించిన శాంతిమార్గమును

ప్రభుత్వమున కనుకూలముగాని కాంగ్రెసున కనుకూలము గాదు. ఇంగ్లాండు ఇర్విన్ప్రభువున కొసంగిన స్వాగతమును లండను టైమ్సు మొదలగు పత్రికలు తెలిపిన యభిప్రాయములును నీవిషయమును విస్పష్టము చేయుచున్నవి.

*　*　*　*

ఇర్విన్ప్రభువు

ఇర్విన్ప్రభువు శాంతిప్రియు డైనను బ్రిటీషుసామ్రాజ్యాభిమాని. వారిశక్తిసామర్థ్యము లన్నియును శాంతిన్యాయరక్షణవ్యాజమునను బ్రిటీషుసామ్రాజ్యప్రయోజనములకు వినియోగించినవిధము చరిత్రాంశము. ఇర్విన్ప్రభువు సత్యాగ్రహోద్యమమును నిర్మూలము చేయుట కవలంబించిన చతుర్విధోపాయములును నిరర్థకము లైనవి. సత్యాగ్రహోద్యమమును శాంతి మార్గమునను నిర్మూలము చేసినవిధము సామ్రాజ్యాభిమానుల కానందమును గలుగజేసినది.

లండనుటైమ్సు ఇర్విన్ప్రభువునుగూర్చి చేసిన ప్రశంస వారిసామర్థ్యమును విస్పష్టము చేయుచున్నది. "సత్యాగ్రహోద్యమమును తలనుండి క్రిందివరకును భేదించి నూతనపరిస్థితుల నిర్మించిన ప్రతిష్ఠ ఇర్విన్ప్రభువునకు మాత్రమె దక్కినది" అని లండనుటైమ్సుచేసిన వ్యాఖ్యానము బ్రిటీషుప్రజా హృదయమును విశదముచేయుచున్నది. ఇర్విన్ప్రభువు బ్రిటీషు రాజనీతిజ్ఞులం దసామాన్యు డని వారి ప్రసంగములు రాజ్యనీతి విశదముచేసినవి. బ్రిటీషు ప్రజలు చూపిన గౌరవ స్వాగతములు సామ్రాజ్యప్రతిష్ఠకుగాని, ధర్మప్రతిష్ఠకుగా దని పత్రికలయభిప్రాయములు, రాజ్యపక్షనాయకుల ప్రసంగములు విశదము చేయుచున్నవి.

ఇర్విన్-గాంధి సంధి యంగీకరించిన విషయమునను లాంకాషైరువర్తకులును పార్లమెంటు కన్సర్వేటీవుసభ్యులును నిష్ఫలను గ్రక్కుచున్నారు.

*　*　*

పిక్కెటింగు-యువక యువతులు

పిక్కెటింగు వ్యక్తులకును జాతులకును సహజమైన జన్మహక్కు. జార్జిసార్వభౌముడు, యువరాజు, నాయకులు స్వదేశవస్తువులనే వాడుకొనవలయునని బోధించుట యాచారమైనది. డొమినియనులు స్వదేశవస్తువులను రక్షణచేయగల యధికారమునుగలిగి అన్ని రాజ్యములును ఆర్థికస్వాతంత్ర్యమును గలిగియున్నవి. ఆసహజస్వాతంత్ర్యమునె ఇర్విన్ గాంధి సంధి యంగీకరించినది. కాని పిక్కెటింగు రాజకీయసాధనముగాక ఆర్థికసాధనముగ నుండవలయునని నిర్ణయింపబడినది. ఆ నిర్ణయమునె కాంగ్రెసుప్రచారకు లాచరణమునందు బెట్టుటకు ప్రయత్నములను జేయుచున్నారు. ఈ ప్రచారము గాంధి-ఇర్విను సంధికి వ్యతిరేకముగాదని బెన్నుగా రెన్నిసారులు చెప్పినను సర్వాధికారమును చిరకాల మనుభవించిన బ్రిటీషుప్రజలకును అధి

కాపులకును నిది రుచింపదు. పార్లమెంటునందును నితరప్రదేశములందును పికెట్టింగు విషయమై వేసెడిప్రశ్న లన్నియును నిరర్థకము లని బెన్నుగా రంగీకరించుచున్నను లాంకాషైరుప్రతినిధులు వితండవాదములకు బూనుకొనుట యయుక్తము. రౌండుటేబిలు సమావేశము సఫలమై స్థిరముగను శాంతి స్థాపింపబడునంతవరకును పికెట్టింగును నిలుపుట యనుచితము. ఈ స్వల్పావకాశమును సైతము భారతీయులను విడనాడమని కోరుట యన్యాయముగ నున్నది. బ్రిటీషుప్రజలయందన్నిపక్షములవారును భారతీయులకు సమానాదరణమునె చూపుదురని వారిభావములు విశదము చేయుచున్నవి.

* * * *

రాజ్యపక్షములు-పత్రికలు

కన్సర్వేటీవు పక్షనాయకుడు బాల్డువిను గారు స్వరాజ్యనిర్మాణమునందు రక్షణనిషేధములు బ్రిటీషువర్తకపుహక్కులను రక్షించుటకు వినియోగపడవలయుననియును బ్రిటీషు వ్యాపార వ్యతిరిక్తమైన సూత్రము లనాదరణీయములనియును విస్పష్టముచేయుచున్నాడు. లిబరలు పక్షనాయకుడు రీడింగుప్రభువు రక్షణ నిషేధము లన్నియును భారతీయప్రయోజనములకే కావలయుననియును నవి అపరిత్యాజ్యములనియును ఘంటాపథముగ చాటుచున్నాడు. లేబరుపక్షనాయకుడు స్నెలుప్రభువును నూతన రాజ్యాంగవిధాన మల్పసంఖ్యాకుల రాజకీయార్థికస్వత్వములను సంరక్షింపవలయునని పునఃప్రతిపాదనమును జేయవలయు నని నొక్కిచెప్పెను. పత్రికలు ఇర్వినుప్రభువుచూపిన ప్రశాంతస్వభావమును నిగ్రహమును కార్యపరత్వమును మహాబలమును కొనియాడినవి. ఇంతటి మహానుభావుడు రాజప్రతినిధులందు లేడని పొగడినవి. బ్రిటీషుప్రజల లక్ష్యమునందు బ్రిటీషుప్రయోజనములే భారతీయప్రయోజనములుగను గనుపట్టుట సహజము. మానవుల లక్ష్యము ముఖ్యముగాను బ్రిటీషుసామ్రాజ్యాభిమానుల లక్ష్యము స్వప్రయోజనములే భారతీయప్రయోజనములుగ గనుపట్టుట యనుభవసిద్ధమైనది. బ్రిటీషుసైన్యము, బ్రిటీషువ్యాపారము, బ్రిటీషుఉద్యోగులు భారతప్రయోజనములకే కావలయునని ఘోషించుచున్నారు. భారతీయప్రయోజనములను బ్రిటీషుప్రయోజనములను నెవరియిష్టానుసారముగ వారర్థము చేసికొనుటకు లండను రౌండుటేబిలు సమావేశవ్యవహారములు విశదముచేసినవి. ఇర్విను ప్రభువు భారతీయలక్ష్యమును స్వదేశమునందలి సత్యాగ్రహమునుండి విదేశమునందలి రౌండు టేబిలుసమావేశమునందు లగ్నము చేయగలిగిన మాయావి. ఒకపెట్టున భారతీయులకు స్థానబలము ధర్మబలము గల సత్యాగ్రహోద్యమము నిలిచిపోయినది. స్థానబలము ధర్మబలములేని రౌండుటేబిలుసమావేశము బలపడినది. సాంఘికవిభేదములు, దురాలోచనలు, స్వార్థప్రయోజనములు రౌండుటేబిలుసమావేశమునకు కాలయాపనము చేయుట కవకాశములు గలిగినవి. ఈ మాయను గలుగజేసిన

ఇర్విను ప్రభువు సహజముగను బ్రిటీషు ప్రజల సంకీర్తనలకు పాత్రుడుగ నున్నాడు. బ్రిటీషు ప్రభుత్వమునకును ప్రజలకును రెండు టేబిలు సమావేశము భారతీయులకు సమ్మోహమును గలుగ జేయగలవిధమును మొదటి రెండు టేబిలుసమావేశము విశదము చేసినది. ఆ వ్యవహారములందు వ్యక్తమైన విభేదములే కాంగ్రెసు చేరుటవలన ద్విగుణీకృతము లగునని బ్రిటీషు ప్రభుత్వము గ్రహించినది. బ్రిటీషురాజ్యతంత్రజ్ఞుల యభీష్టములను విఫలము చేయవలసిన భారము, చేయగల శక్తిసామర్థ్యములు భారతీయులమీాదను గలవు.

* * *

రక్షణనిషేధములు

రక్షణనిషేధములను వివిధభావలక్ష్యములతో పరిశీలించుటకును నిర్ణయించుటకును గల యవకాశములను దేశమునం దంతటను పర్యాప్తంబులైన వాద ప్రతివాదములు విస్పష్టము చేయుచున్నవి. బ్రిటీషునాయకులు భారతీయనాయకులకును మంచిపాఠము నెప్పటి కప్పుడు నేర్పుచుందురు. రక్షణనిషేధముల విషయములందు బ్రిటీషు ప్రజాప్రభుత్వములు పూనినమార్గము భారతీయనాయకుల కసహ్యమును గలుగ జేసినది. పూర్ణస్వరాజ్యమునందు భారతీయులకు స్వీయస్వత్వసంరక్షణమువలెను పరప్రతిషేధనస్వత్వమును గలదని ప్రతిపాదించుటకు భారతీయనాయకులు పూనుకొనిరి. ఢిల్లీ బొంబయిలయందు కూడిన వర్తకసంఘములు భారతీయులకుగల ప్రతిషేధనస్వత్వములను నిరూపించినవి. శ్రీయుత సేనుగుప్తగారు వారి యుపన్యాసములం దీవిషయమునే విస్పష్టము చేయుచున్నారు. భారతీయుల నన్నిప్రాంతములందును నిరాదరించెడి బ్రిటీషు ప్రజలు భరతవర్షమునందు తమకును నిరాదరణ గలుగునని గ్రహించుట వివేకము. భారత నాయకుల ప్రసంగములు కోపావేశములను గలుగజేసినను భారతీయుల హృదయవేదనను గ్రహించుట కోపోపశమనమునకు సాధనము గాగలదు. ఇర్వినుప్రభువు, బ్రిటీషురాజ్యపక్షములు, బ్రిటీషుపత్రికలు, బ్రిటీషువర్తకులు, బ్రిటీషుప్రజలు బ్రిటీషులక్ష్యములను జూచునటులు, భారతీయలక్ష్యమును ధర్మలక్ష్యమును జూచుటలేదు. రెండుపక్షములందును చెలరేగెడి కోపావేశములు దుర్నిమిత్తములకు మూలమగుచున్నవిధమును గాంధిమహాత్ముని హితోపదేశములు విశదముచేయుచున్నవి.

* * *

గాంధిమహాత్ముడు—ధర్మయోగము

గాంధిమహాత్ముడు మహాత్ముల కనురూపమైనవిధమునను విశ్వకల్యాణమును గోరుచున్నాడు. బోర్సదు రైతులకు, కాంగ్రెసు ప్రచారకులకు, వార్తాపత్రికా ప్రతినిధులకు, అమెరికా ప్రజలకు, బ్రిటీషు ప్రజలకును జేసిన హితోపదేశములు ధర్మప్రబోధమునకు సదర్శనములు. గాంధిమహాత్ముడు భారతీయప్రయోజనములకును బ్రిటీషు ప్రయోజనములకును ప్రతిఘటనము లేదని విశ్వసించుచు ద్వివిధ ప్రయత్నములను సమన్వయము చేయుటకు

విశ్వప్రయత్నములను జేయుచున్నాడు. గాంధి మహాత్మునకు సత్యము, ప్రమాణము. నిందాస్తుతులు, పరద్వేషము, స్వార్థము ప్రమాణములుగావు. పూర్ణస్వరాజ్య విధానమునందు రక్షణనిషేధములు భారతీయప్రయోజనముల కేర్పడవలయుననుట నిర్వివాదాంశము. ఆభారమును నిర్ణయించుటకు ధర్మాత్ముడైన గాంధి మహాత్మునకు గల సంస్కారాధికారములు బ్రిటీషు రాజ్యనీతిజ్ఞులకును భారతీయనాయకులకును గలుగజాలవు. అధికారములేని నిరంకుశాధికారవర్గమువలెనే అధికారము లేని ప్రచారకులు చేసెడి యాందోళనమును దుర్నిమిత్తములకు మూలముగ నున్నది. ఇది శాంతికిని సాహచర్యమునకును సాధనము గాదు. ఇర్విన్‌ప్రభువు "సహనము, సదసద్వివేకము, పరిజ్ఞానము, యథార్థగ్రహణము" దుర్నిమిత్తములను పారద్రోలుటకు సాధనములని తెలిపిన భావములు ప్రశస్తములుగ నున్నవి. ఆ ప్రశస్త భావములను సఫలముచేయగల సంస్కారాధికారములు గాంధిమహాత్మునకు మాత్రమె కలవు. ఇర్విన్‌ప్రభువీసత్యమును గ్రహించియే సత్యాగ్రహోద్యమమును విచ్ఛేదము చేసియును, గాంధిమహాత్ముని లక్ష్యమును రౌండుటేబిలుసమావేశమునందు లగ్నముచేసియును బ్రిటీషుప్రజల మహాస్వాగతమును బడయగలిగెను. భారతీయులును ఇర్విన్‌ప్రభువునకు స్వస్తి వాచకములను చెప్పినను, గాంధిమహాత్ముని సంస్కారాధికారములను సంరక్షించుటకు దుర్నిమిత్తములను నిర్మూలముచేసి స్వార్థపరార్థములను సార్థకము చేయుదురుగాత!

*　　　*　　　*

విల్లింగ్డను ప్రభువు

ఇర్విను ప్రభువర్యుని సింహాసనమున నధిష్ఠించిన విల్లింగ్డను ప్రభువు సామ్రాజ్యాభిమానమునకు శిరోమణి. వారేమి చేయునదియును జోస్యమును గుణించుట కవకాశములు లేవు. గతించిన హిందూ దేశాధికారానుభవము నిరాశను, నవీన కనడాధికారానుభవ మాశను గలుగజేయుచున్నది. గ్రేటుబ్రిటనునందు కన్సర్వేటీవు లిబరలుపక్షనాయకులు లేవదీసిన ప్రతిఘటనధ్వజము నిరాశకు గారణంబైనను గాంధిమహాత్ముని నిగ్రహశాంతములకు ప్రతిఘటనధ్వజములు నిలువజాలవు. సత్యాగ్రహధ్వజమును ఆరోహణము చేయుట యసంగతమైనను పికెటింగువిధానమునందు కాంగ్రెసు ప్రచారకులను కాంగ్రెసు సేవికా సేవకులను నిపుణులను జేయుట విజయమునకు మూలము. కాంగ్రెసుబలమువలనను గాంధిమహాత్మునకు బలమును విల్లింగ్డను ప్రభువునకు పోషణమును గలుగ గలవు నిరంకుశవర్గము కీడు చేసినను, మేలుచేసినను కాంగ్రెసు ప్రచారము మాత్రము మఖండముగను సాగవలసి యున్నది.

*　　　*　　　*　　　*

కాంగ్రెసు ప్రచారము

స్వరాజ్యసాధనము లన్నియును కాంగ్రెసు ప్రచారమునందు పరిపక్వము నొందు

చున్నవి. కాంగ్రెసు ప్రచారము మహా వ్యాపకమును బొందుటకు లక్షలమంది ప్రజలు కాంగ్రెసునందు జేరవలయును. స్వరాజ్య చిహ్నమైన ఖద్దరును వ్యాపింపజేయ వలయును. స్వదేశీయతను దశదిశలంతను వ్యాపింపజేయ వలయును. సత్యాగ్రహులును ప్రజలును వారి యావచ్ఛక్తిని శాంతియుతముగను పిక్కెటింగునకే కాక స్వదేశీయతను వ్యాపింపజేయుటకై పాటుపడవలయును. కాంగ్రెసుబలగౌరవముమీదనె గాంధిమహాత్ముని ధర్మవిజయ మాధారపడియున్నది. గాంధిమహాత్ముని సత్యాగ్రహదీక్షయును కాంగ్రెసు ప్రచారకుల కార్యదీక్షయును విజయమును సమకూర్చగల విధమును శ్రీకృష్ణపరమాత్ముడు విజయునిముఖమునను చేసిన ధర్మప్రతిజ్ఞ విశదము చేయుచున్నది. భారతీయులా ప్రతిజ్ఞ నారాధించి కృతార్థులగుదురుగాత!

యత్ర యోగీశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః,
తత్ర శ్రీర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ.

---

Printed and Published by K. Nageswara Rao, at the Andhra PatrikaPress, No.7, Thambu Chetty St., Madras

వెలువడినది!　　త్వరపడుడు!!　　వెలువడినది!!!

# జీవన ప్రభాతము

ఆంధ్ర గ్రంథమాలయందలి పదునైదవ గ్రంథము

అనువాదకులు: శ్రీ పోలవరపు రామబ్రహ్మముగారు B. A., Murugan the Tiller (మురుగన్ ది టిల్లరు) అను పేరన శ్రీ కే. యస్. వెంకటరమణిగారు ఆంగ్లభాషను రచించిన సుప్రసిద్ధనవల కిది యనువాదము. ఇది రమణీయమయిన సాంఘిక నవల. పాశ్చాత్య విద్యావిధానము, పాశ్చాత్య సంస్కారము, పాశ్చాత్యాదర్శములు మొదలగువానివలన గలుగు కష్టములు ఇందు చక్కగ వర్ణితములయినవి. ఆంధ్రవాఙ్మయమున నిట్టి కథావిధానము గల యీ నవల క్రొత్తది. ఆంధ్రులెల్లరు చదువవలసినది. క్రౌను ౪౨౬ పుటలు. వెల రు. ౧—౮—౦ మాత్రము.

తపాలా ఖర్చు ప్రత్యేకము.

త్వరపడుడు!　　వెలువడినది　　త్వరపడుడు

# భారతీయ చిత్రకళ

గ్రంథకర్త: తలిశెట్టి రామారావుగారు, బి. ఏ., బి. యల్.

ఇది ఆంధ్ర గ్రంథమాలయందు పదుమూడవ గ్రంథము. ప్రాచీనకాలము నుండి భారతదేశమున చిత్రకళ పొందుచువచ్చిన మార్పులు, అభివృద్ధి మొదలయిన విషయములు, హైందవ చిత్రలేఖనోదయము, బౌద్ధకాలమునాటి చిత్రకళ, అజంత విధానము, బాఘువిహారములందలి చిత్రకళ, మొగలు చిత్రకళావిధానము, రాజపుత్ర చిత్రములపై ఖరి, నేటిచిత్రములు మొదలయినవానిని గూర్చిన చరిత్రాదులు వివరముగా నీ గ్రంథమున చర్చింపబడినవి. ఆయాకాలపు చిత్రవిధానమును దెలుపునట్టి త్రివర్ణ ఏకవర్ణచిత్రములు నలువది ఇందు గలవు. చిత్రకారులు, చిత్రకళాజిజ్ఞాసువులు, చిత్ర కళాభిమానులు నగు నాంధ్రులెల్లరు తప్పక చదువవలసిన గ్రంథము. వెల రు. ౧-౦-౦.　　తపాలా ఖర్చు ప్రత్యేకము

మేనేజరు, ఆంధ్ర గ్రంథమాల,

7, తంబుశెట్టివీధి, మద్రాసు.

